# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి.మహానుభావులైన సాధకులు, జిజ్ఞాసువులు జ్ఞాన ప్రచారార్ధం తాము సేకరించిన విలువైన గ్రంధాలను స్క్రిబ్డ్ వెబ్ సైట్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ సైట్(https://archive.org), గూగుల్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్: http://www.scribd.com/
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు:sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు*

స్క్రిబ్డ్ వారి వెబ్ సైట్:

http://www.scribd.com



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సర్వసార పూర్ణోపనిషత్

(భావార్థములు వివరములతో సహా)

అనువాదకుడు
మరియు
వివరముల సంకలనకర్త

**మంత చిన్నయ్య**
ఎమ్.ఏ., బి.యిడి.

పరిపూర్ణప్రబోధ గ్రంథమాల -3

ఓం

శ్రీగురుభ్యోనమః

## సర్వసార పూర్ణోదయం

# సర్వసార పూర్ణోపనిషత్

(భావార్థములు వివరములతో సహా)

అనువాదకుడు
మరియు
వివరముల సంకలనకర్త

**మంత చిన్నయ్య**
ఎమ్.ఏ., బి.యిడి.

2002
శ్రీశ్రీశ్రీ శివరామ దీక్షిత గురూపపీఠము
రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

# సర్వసార పూర్ణోపనిషత్తు

## శ్లోక పాదాను క్రమణిక


| శ్లోక సంఖ్య | స్లోకపాదము | పుట సంఖ్య |
|---|---|---|
| | **అ** | |
| | అథవైకుంఠో నీలకంఠం ప్రణమ్య | 1 |
| 34 | అనావృతేన జీవేశ్వర భావం విసృజ్య | 77 |
| 11 | అప్రమాణ మసంగత్వం తల్లింగమచలం | 20 |
| 37 | అహమన్నం సదానాద మితీహి | 85 |
| 27 | ఆగామి సంచితం చైన ప్రారబ్ధం | 60 |
| 33 | ఆత్మానాత్మ రహిత పరిపూర్ణ | 76 |
| 9 | ఆద్యంత పూర్ణ మచలం పూర్ణమయ్యేవ | 16 |
| | **ఇ** | |
| 67 | ఇతి వేదాంత సిద్ధాంతసారం | 150 |
| 4 | ఇదం పూర్ణం మదఃపూర్ణం పూర్ణాత్పూర్ణ | 10 |
| | **ఉ** | |
| 58 | ఉపాధి ద్వయగ్ం నాస్తి జీవబ్రహ్మ | 130 |
| | **ఎ** | |
| 68 | ఏతచ్ఛ్రవణమాత్రేణ సర్వసిద్ధికరం | 152 |
| 65 | ఏతత్సర్వార్థగ్ సర్వమ్ గురువాక్యేన | 147 |
| | **క** | |
| 63 | కార్యకర్తృత్వగ్ం నాస్తి నాస్తి జ్ఞప్తి | 142 |
| 2 | కాయస్యాంతే బహిశ్చైవ జ్ఞానం నాస్తి | 7 |
| 59 | కింశృణోమి కింద్రష్ట్వా క్వగచ్ఛామి | 133 |
| 15 | ఖండా ఖండ విహీనాత్మా క్షేత్ర | 32 |
| | **గ** | |
| 55 | గురుశిష్యద్వయం నాస్తి ఉపదేశః | 123 |
| | **చ** | |
| 52 | చంద్రోసూర్య ప్రకాశేన భాసతే | 119 |
| | **జ** | |
| 48 | జౌదుంబరే భవేత్పుష్పం జాయతే | 114 |
| | **జ్ఞా** | |
| 41 | జ్ఞానం నాస్తీతి నిశ్శంకం విరామో | 100 |
| 44 | జ్ఞానం త్యక్త్వా జగత్త్యక్త్వా ఆత్మానం త్యజ | 107 |
| 40 | జ్ఞానమధ్యేజగన్నాస్తి పూర్ణమధ్యే | 97 |
| | **త** | |
| 31 | త్యజే ద్విద్యామ విద్యాంచ క్షరమక్షరగ్ం | 69 |
| 22 | తదేవ లింగ మిత్యుక్తం సఏవశివ | 51 |
| 29 | తస్మాత్సర్వం రిత్యజ పూర్ణమేవా | 64 |
| 64 | తూష్ణీమేవస్థితం తూష్ణీం తూష్ణీ భావం | 144 |
| | **ద** | |
| 57 | దృగ్దృశ్యౌచ ద్వయంనాస్తి నాస్తి | 128 |
| 28 | దృష్టిం జ్ఞాన మయీం కృత్వా | 63 |
| 18 | ద్వంద్వహీనం సదా బాహ్యం సాక్షి | 38 |
| 17 | ధ్వాంతతేజోద్వయం హీనం కథం | 36 |
| 14 | ద్వైతాద్వైత విహీనాత్మా ద్వయదోష | 29 |

## న

38 నప్రకృతిః నపురుషోనకూటస్థః 87

32 నిరహంకారేణ చిజ్జడాత్మ కావరణం 72

46 నరశృంగేణాచాకాశం భిద్యతే 112

35 నిర్వికార నిర్దేహ బోధ మవాప్య 80

19 నిర్దేహనిర్మలం పూర్ణం తల్లింగ 41

26 నిర్దేహం సర్వదా నిత్యం నదేహం 58

## ప

12 ప్రజ్ఞానహీన వాక్యాత్మా తత్వమస్యాది 23

13 ప్రణవార్థ విహీనాత్మా లక్ష్యవాచ్య 26

3 పూర్ణమన్యంతరం నాస్తి తద్భిన్నం 9

8 పరిపూర్ణ పరాకాశం దేహమంతస్థితం 16

7 పూర్ణాత్పూర్ణతరం పూర్ణం పూర్ణాత్పూర్ణ 14

50 పాషాణాత్పీత వసనం భవేత్సత్యం 116

## బ

5 బహిరంతర స్సదాపూర్ణం పూర్ణ కుంభో 11

10 భావవాగ్గ్యాంచ నగ్రాహ్యం ద్రష్టదర్శన 17

45 బాహ్యాంభ్యంతరం నాస్తి సత్యంసత్య 109

66 బ్రాహ్మణోక్ష త్రియో వైశ్య శూద్ర 148

54 భేదాభేద ద్వయంనాస్తి క్షరమక్షరగ్ం 120

## మ

53 మత్తపాదం భవేదృష్టం జగదృష్టం 119

36 మూలాభావమిదం జ్ఞాతుం నశరీరంనకిదుస్తి 84

39 మోహకామాది సంబంధ మహం 92

## య

20 యాపత్త్వశ్చే దృగాకారం తదాకారం 45

## వ

60 విద్యావిద్యాద్వయం నాస్తి నాస్తిసాక్షీ 134

25 వ్యోమాంతరేచ మాత్మాన మాత్మమధ్యే 57

21 వ్యోమాతీత మిదం బాహ్యం సర్వకారణ 47

## శ

30 శూన్యం కృత్వాచిదాకాశం మహాకాశ 66

47 శునక శ్శుకవాక్యస్య వదేచ్చే జగదస్తిచ 113

61 శూన్యాశూన్య ద్వయం నాస్తి పూర్ణాత్పూర్ణం 137

23 శివాదన్యం మితిర్నాస్తి త్రిలోకేషు 53

1 శృణుశిష్య మహాశ్రేష్ఠం వేదవేదాంత 6

## ర

49 రవిరభ్యుదితే రాత్రౌ చంద్రోమధ్యాహ్న 115

## ష

43 షడ్భూత రహితంపూర్ణం అష్టావరణ 104

## స

51 సూర్యే తధ్యాం తమస్త్వేవ జగత్సత్యం 118

6 స్వపూర్ణా వ్యతిరేకేన జీవబ్రహ్మమయం 12

16 సర్వత్ర పూర్ణరూపాత్మా సర్వతాత్మ 34

24 సర్వేంద్రియ వినుర్ముక్త జ్ఞానంయత్ర 56

42 సర్వాంతస్థం శివం ధ్యాత్వసర్వ 101

56 స్తుతినిందా ద్వయం నాస్తి అహకారం 126

62 సర్వాధారం చిదాకాశం సర్వప్రాణ 139

ఓం

శ్రీగురుభ్యోనమః

శ్రీమదచలర్షి సాంప్రదాయిక బృహద్వాశిష్ట సిద్ధాంత రామదుగు
శ్రీ శివరామదీక్షిత గురూపపీఠ రాజయోగాశ్రమము మహబూబ్‌నగర్.



# శ్రీ ప్రబోధానంద వెంకటార్య రాజయోగి

రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్య పాదకమల సేవకం ।
ప్రబోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం ॥

శ్రీ గురుభ్యోనమః

# సర్వసారపూర్ణోపనిషత్తు

## అభిప్రాయము

ప్రస్తుత సమాజమున అధికులు పరమార్థాన్వేషణకు మారుగా భౌతిక పదార్థాన్వేషణకై కృషి జరుపుచున్నారు. వీటి వలన నిత్యసత్యమైన సుఖశాంతులు కల్గుననే భ్రాంతిలో యున్నారు. ఇది వట్టి భ్రమయే. మానవుడు నేత్రేంద్రియముచే చూచు వస్తువులు మొదట అందముగా కనబడిననూ, అది అనతికాలములోనే అందవిహీనమగును. ఇంతెందుకు చూచే దేహములోనె యెన్నో మార్పులు కల్గి చివరకు ఈ దేహమే లేకుండ పోవును. అందులకే "యద్దృశ్యం తన్నశ్యం" అనే సూక్తి జగత్ప్ర సిద్ధమైనది.

పూర్వము ఋషులు మరియు తత్త్వ జ్ఞానులు, యితరులకు నిజమైన జ్ఞానము కలుగుటకై యెన్నో శ్రుతి ప్రమాణములను, సూక్తులను గ్రంథస్థము చేసినారు. వీటిని పాఠకులు చదువుచున్ను, వినుచున్నను, తమ స్వార్థ బుద్ధిని వీడి, కొంతైన పరోపకారము చేయలేక పోవుచున్నారు. ఉదాహరణకై స్వాధ్యాయము లేక సత్సంఘము నందు "సర్వేజనాః సుఖినోభవంతు" యని వల్లెవేయుదురు. యది తన వరకు వచ్చినపుడు, చెప్పినట్లు చేయుట సాధ్యమా? అనగా సాధ్యముకాదు. యెందుకనగా తనకు వచ్చేది రాదో లేక తనకున్నది పోవునో యని భయకంపితులగుదురు. భగవద్గీతలో కృష్ణ భగవానుడు "అద్వేష్టా సర్వభూతానాం మైత్రఃకరుణ ఏవచ" యని చెప్పినట్లు, రాగద్వేషములు వదలి, సమబుద్ధి గలవారికి యది సాధ్యమగును. ఇట్లు కలుగుటకై మానవుడు మొదట నిత్యానిత్య వివేక జ్ఞానము పొందవలెను. తన యందున్న అహంకార మమకారములను, వీడుటకై తత్త్వజ్ఞానుల చెంత జేరి, చతుర్విధ శుశ్రూషలు సలుపుట అత్యావశ్యకము.

**శ్లో॥ అజ్ఞాన తిమరాంధస్య - జ్ఞానాంజన శలాకయా ।**
**చక్షరున్మీలితంయేన - తస్మై శ్రీగురవేనమః ॥** గు.గీ॥24॥

అజ్ఞానమనే చీకటిని జ్ఞానాంజనముచే సద్గురువు తొలగించును. సూర్యుడుదయించగనే, చీకటి తొలగి పోయినట్లు, ఆత్మ జ్ఞానోదయము కలిగిన వెంటనే అజ్ఞామనే చీకటి (మోహభ్రాంతి) తొలగి పోవును "స్వప్నవత్ జగత్" యను ఆర్యోక్తి నిజమన్పించును. మాయాప్రపంచము ఇంద్ర జాలికుడు (గారడి) చేయు చేష్టలవంటిది. అనగా అనిత్యమైనది నిత్యమైనదిగా, నిత్య సత్యమైనది భగవత్ తత్త్వము అనిత్యముగా తోచును. అందువలన మానవుడు చిత్రజగతి యందు విషయ పంచీకరణములో చిక్కి జననమరణ చక్రబంధము నుండి విడువడకున్నాడు.

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన - పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం - జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ భ.గీ॥ 4-34॥

భగవద్గీతలో కృష్ణ భగవానుడు సెలవిచ్చినట్టి విధివిధానములో తత్త్వజ్ఞానులు పూర్ణ గురువు చెంత జేరి, సేవించి, ప్రశ్నించి తత్త్వము దర్శించిన పెద్దలచే తత్త్వోపదేశము పొందిన కాని జన్మరహితము కాదు. అ.ప.॥ మంత చిన్నయ్యగారు అచల పరిపూర్ణ తత్త్వజ్ఞాన బోధ దృఢ చిత్తుడై యింతకు పూర్వమే రెండు ఉపనిషత్తులకు "గురువాక్యో పనిషత్తులకు అనంతోపనిషత్తుకు భావార్థములను వ్రాసినారు.

ప్రస్తుతము, సర్వసారపూర్ణోపనిషత్తు యందు గల 68 శ్లోకములకు పదపరిచ్ఛేదన చేయుచు, సందర్భానుసారముగా, మహాత్ముల మరియు సద్గ్రంథముల వాక్యములను తెలుపుచు సులభశైలిలో భావార్థములను తెలిపినారు. దీనికై యెంతో శ్రద్ధతో కృషి సలిపినారు అందుకై ఈ గ్రంథకర్తను మనః పూర్వకముగా అభినందించుచు ఆశీర్వదించుచున్నాను.

ఓం తత్సత్

ప్రబోధానంద వెంకటార్యులు
శ్రీ శివరామదీక్షిత అచలగురూపపీఠము,
రాజేంద్రనగర్, మహబూబ్‌నగర్.

## కీర్తన

ఓ జగద్గురు నాథా। శ్రీ సద్గురు నాథా। పూజాజేసెదమన్నాథా ॥1॥ ఓ
పూజజేసెద పొన్న పొగడల। పారిజాత సుపుష్పచయముల।
రాజిగను కరవీర జాజికదంబ కుసుమము లిడెద కనుగొను ॥2॥ ఓ
మల్లెలు మొల్లాలు। మలయ మారుతములు। యుల్లాము రంజిల్లగా,
కొల్లలేని కలువ పువ్వులు బిల్వ పత్రము తులసిదళములు।
తెల్లగన్నెరు మొగలిపువ్వులు। యెల్ల పుష్పములెలమి జేర్చెద ॥3॥ ఓ
బంతి చేమంతీ గొరెంత సంపెగాలు సంతోశ మొదవాగనూ।
వింతగల నీలోత్పలంబులు। చంపకము వకుళములు కలహార।
మంతనమున అశోక మతశీ। కాంతిగల పుష్పములు లొసంగెద ॥4॥ ఓ
హరిహర సురనర। గురు పూలకెల్లనూ। గురవూ నీవని విందునూ।
సరసముగ సర్వాంగ పూజయు సకల పుష్పము తోడ జేసెద।
వరుసతో శ్రీ రామదాసుకు వరము లిచ్చియు కరుణ జూడుము ॥5॥ ఓ

శ్రీ గురుభ్యోనమః

# "సర్వసార పూర్ణోదయం"

# సర్వసారపూర్ణోపనిషత్తు

# ఉపనిషద్భాషణము

శ్రీ శివరామదీక్షితాచల పరిపూర్ణ సాంప్రదాయకులు, నిజగురు కరుణా కటాక్ష వీక్షణా ప్రభావితులు విద్వద్వరేణ్యులు, శ్రీ మదచలబుషిప్రబోధానంద మల్లువెంకటరెడ్డి దేశికవర్యుల ప్రియశిష్యులు, అ॥ప॥ మంత చిన్నయ్య గారు భావార్థ రూపకంగా వ్యాఖ్యానించిన "సర్వసార పూర్ణోపనిషత్తు" పరిశీలనకు మరియు అభిప్రాయ ప్రకటన కొరకు పరిపూర్ణ బోధనాచార్య అమలా నంద పాటల పండరినాథ స్వాములవారి దివ్యహస్తముల నుండి నాకందజేయబడినది. ఈ గురుతర భాగ్యమును, పరిశీలనా భారమును నాపై యుంచినందులకు స్వాములవారికి నేనెంతయో కృతజ్ఞతను వెల్లడి చేయుచున్నాను.

**"సదేర్ధా తోర్వి శరణ గత్యవసాధ నార్థస్య। ఉపని పూర్వస్య, క్విప్ ప్రత్యయాంతస్య రూప మిదం ఉపనిషత్"** అని శ్రుతి వాక్యం. విశరణము, గతి, అవసాధనమను నర్థముగల సద్ ధాతువునకు వెనుక 'ఉప' 'ని' యను ఉపసర్గలు ముందు క్విప్ అను ప్రత్యయము చేరి ఉపనిషత్ అను రూపమేర్పడెను. (భవ=బీజమును) విశరణ=శిథిల మొనర్చి అచల పరిపూర్ణపరబ్రహ్మమును గతి= అపరోక్ష మొనరించి (జనన మరణాదులను) అవసాధనము = నాశముగావించు సామర్థ్యము గలది ఉపనిషత్తు అని శ్రుత్యర్థము.

సర్వసారపూర్ణోపనిషత్తు అను నీ మహనీయోపనిషత్తు గూడా అష్టోత్తరశతోపనిషత్తులలో చేర్చబడలేదు. "సర్వసారోపనిషత్తు" అను యుపనిషత్తు గలదు. ఇది 108 ఉపనిషత్తుల జాబితాలో చేర్చబడి యున్నది. ఈ సర్వసారోపనిషత్తు కేవలం సృష్టికారణ బ్రహ్మను గూర్చి అద్వైత సిద్ధాంత ధర్మమును చాటుచున్నది. కాని సర్వసారపూర్ణోపనిషత్తు మాత్రం కేవలం సచ్చిదానందాతీతమగు అచలపరిపూర్ణ పరబ్రహ్మను దర్శింపజేస్తు పూర్ణబోధను చాటుచున్నది. ఇందులోని ప్రతి యొక్క శ్లోకము స్వయం ప్రకాశ సచ్చిదానంద బ్రహ్మను నిరసిస్తూ తద్రహితమైన అచల పరిపూర్ణమును ప్రబోధించి అపరోక్షముగావించుచున్నది. అంతేగాక జన్మరాహిత్యమును ప్రసాదించు షోడశాక్షర మహామంత్రం యీ ఉపనిషత్తులోనే అంతర్భాగమై యున్నది.

షోడశాక్షరి

**"మూలాభావ మిదం జ్ఞాతుం నశరీరం నకిమస్తి"**

తా॥ మూలము లేని దీనిని తెలియుటకు శరీరంలేదు. ఏమిలేదు. అని తాత్పర్యం.

అష్టోత్తర శతోపనిషత్తుల యందు చేర్చబడని ఈ ఉపనిషత్తు నందు శుక్లయజుర్వేదీయశాంతి మంత్రమగు **"పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే। పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవా2వశిష్యతే"**॥ అను మంత్ర పూరితమై యుండుట వల్ల ఇది శుక్లయజుర్వేదీయ సంబంధితమైనదని రూఢియగుచున్నది. పై శాంతి మంత్రమును మంత్రార్థమగు అచల పరిపూర్ణ సూచనను,మహామహుడగు యాజ్ఞవల్క్య

మహర్షిసూర్యభగవానుని యనుగ్రహమున అధ్యయనం చేసినట్లు మనకు యాజ్ఞవల్క్య మహర్షి చరిత్ర తెలుపుచున్నది. శుక్లయజుర్వేదీయ సంబంధితమైనయీ ఉపనిషత్తును వ్యాఖ్యాత పై ఆధారములతో నుడివి యుండుట యత్యంత ముదావహమై యున్నది. మరియు ఇటీవల ఆధునిక వేదాంతదిగ్గజములైన మహాపండితుల పరిశోధనలో ఉపనిషత్తుల సంఖ్య 108 మాత్రమే కాదని, పరిశోధనలో 200 ఉపనిషత్తులు బయల్పడినవనీ లోకమునకు చాటి యున్నారు. వీరిలో ప్రముఖులు కైలాస ఆశ్రమ అధ్యక్షస్వామి శ్రీ విద్యానందగిరిస్వాములవారు. అందులో నీ ఉపనిషత్తుతోపాటు అనంత, గురువాక్యోపనిషత్తులున్నవేమో తెలుసుకొన దగియున్నది. ఏమి యేమైనను అనంత, సర్వసార పూర్ణోపనిషద్వయమునకు వేద ప్రమాణము సిద్ధించి యుండుట సమంజసము హర్షనీయమునయి యున్నది.

ఈ ఉపనిషత్తు పరమశివుడగు దక్షిణామూర్తి శ్రీమహావిష్ణువునకు ప్రబోధించి నటుల ప్రారంభ శ్లోకమున వెల్లడియైనది.

**శ్లో॥ "అథవైకుంఠో నీలకంఠం ప్రణమ్య స్వామిన్ సర్వలోకైక నాథ! బ్రహ్మైవాహం భ్రాంతి నాశం కురుష్వ......"** అను వాక్యంలో విష్ణువు పరమశివునకు ప్రణమిల్లి స్వామీ! సర్వలోకములకు ప్రభువైన వాడా! "బ్రహ్మను నేనైతిని" అన్న మూల భ్రాంతిని నివారణ చేయుము అని సాష్టాంగ దండప్రణామము లాచరించి గురు శిష్యన్యాయ పద్ధతిని పూర్ణబోధను అమ్మహాదేవుని సంపూర్ణ కృపకు పాత్రుడై బడసెనని పై శ్లోకము గానము చేయుచున్నది. అంతే గాదు పునర్జన్మకు మూల కారణమగు "అహం బ్రహ్మాస్మి" యను మూల భ్రాంతిని సంపూర్ణముగా నాశనము గావించుమని ప్రార్థిస్తు గరు శిష్య న్యాయమును ఆదియందే లోకమునకు చాటుచుండుట కదు ప్రశంసనీయము శిరోధార్యము అయియున్నది.

పరమశివుడు దక్షయజ్ఞానంతరం అవమాన భారంతో యోగాగ్ని కాహుతియై పోయిన సతీదేవికై దక్షయజ్ఞమును ధ్వంస మొనర్చి దక్షిణామూర్తియను నామధేయమున వటవృక్షమూలమున నాసీనుడై తన స్వరూపమున (శుద్ధ చైతన్యము) కతీతమై సర్వకాలాల యందు సర్వలోకాల యందు, నిండి నిబిడీకృతమై, సర్వకాల సర్వావస్థల యందు అచలమై ములుగ్రుచ్చ సందులేక త్రికాలాబాధ్యమై యున్న అచలపరిపూర్ణమును దర్శించి అందులో చలన రూపమై యున్న తన స్వరూపమునకు మూలముగాని స్థానంగాని లేదని తెలుసుకొని తద్భావనారూప ప్రబోధను మహా విష్ణువునకు ప్రబోధించి నట్లుగా శాస్త్రాధారములు సైతం లభించుచున్నవి.

ఇచట తాత్త్విక దృష్టితో పరిశీలించిన, ఒక మహత్తర సాంప్రదాయ రహస్యము బోధ పడగలదు. దక్షిణామూర్తి ఉపనిషత్తు నందు ఈ విధంగా వున్నది :

**శ్లో॥ శేముషీ దక్షిణా ప్రోక్తా సాయస్యా భీక్షణేముఖమ్।**
**దక్షిణాభిముఖః ప్రోక్తఃశివోసౌ బ్రహ్మవాదిభిః॥**

దక్షిణామూర్తి యనగా శేముషీ స్వరూపుడు. అనగా శుద్ధస్ఫటిక సన్నిభమగు స్వయం ప్రకాశ బ్రహ్మమని అర్థం. ఈ స్వరూపము సృష్టికి పూర్వమున్న శుద్ధలింగ స్వరూపం. **"లయ నాత్ లింగముచ్యతే"** అన్నట్లు సమస్త విశ్వాన్ని లయం చేసుకొని తన గర్భమందు నిమిడ్చు కున్న శుద్ధ బ్రహ్మమే లింగము. ఇదియే పరమాకాశస్వరూప దక్షిణామూర్తి అవతార స్వరూపం. శబ్దగుణ సమన్వితమైనది భూతాకాశం. శబ్ద గుణరహితమైనది పరాకాశం. ఈ పరాకాశమే దక్షిణా మూర్తి స్వరూపం. అనగా చలాచల ద్వంద్వరూపమయిన అఖండ

ఎరుకయే. శుద్ధలింగమగు పరమాకాశమే విశ్వస్సృష్టికామన కలిగి వ్యాపకమై పంచాకాశరూపము నొంది జగదాకారమై విస్తరించినపుడు "విష్ణువు" అని అభివర్ణింపబడినది.

**"వేవేతివ్యాప్నోతి ఇతి విష్ణుః"** వ్యాపకతా లక్షణం కలిగిన తత్త్వమే విష్ణుతత్త్వం. వ్యాప్య వ్యాపకము లేక రూపమే ఎరుక రూపమే. వీటికి అచలపరిపూర్ణ మందు మూలము లేదని గురు వాక్యం. వీటిని అనగా వ్యాప్య వ్యాపకములను గూర్చియే శ్రీకృష్ణదేశిక ప్రభువులు కంద పద్యములలో యిట్లు గానం చేసియున్నారు.

**కం॥ "లింగము విక్షేపంబను నంగం బావరణ మనిన నగునీ రెండే లింగ శరీరము దీనికి భంగము తన మూల మరియ బడినప్పుడగున్"॥** (శు.ని.త.కం॥241)

లింగమనగా విక్షేపరూప శుద్ధలింగము. వ్యాప్యము శివ స్వరూపం. అంగమనగా ఆవరణం. వ్యాపకం విష్ణు స్వరూపం. ఈ ఏకైక ద్వంద్వ స్వరూపమగు ఎరుకకు భంగము పరిపూర్ణ దర్శనములో సంభవించును అని ఋజువు పరచియుండుట గమనింపదగ్గ విశేషం.

దీని నుద్దేశించియే శ్రీ అమలానంద తైదల కొమరయ్యస్వాముల వారు తమ విరచితమగు "జన్మ రాహిత్యాచల పూర్ణబోధ" యనుగ్రంధము నందు :

కం॥ శివుడే ద్వాదశమే గురు స్వరూపము, షోడశమే విష్ణు స్వరూపము మాయ యని శ్రుతులెన్న అర్థమరయని, శుష్క ప్రియవాదులెన్నో మతములేర్పరచే, మతి భ్రష్టులై దుర్గతులేర్పరచే, భవ నాశములు బాపె శ్రీహరి భావమెరుగని బేలా.........." అని కీర్తించినారు.

శివుడే ద్వాదశీ స్వరూపుడు. విష్ణువు షోడశీ స్వరూపుడు. వీటి యథార్థమెరుగక మతకర్త లెన్నెన్నో మతము లేర్పరిచి భ్రాంతిలో ముంచినారు అని యెల్గెత్తి చాటుచున్నారు. వీటి పూర్తి వివరణ అనగా శివుడు (వ్యాప్యం) విష్ణువు (వ్యాపకం) నిజ గురుచరణ సన్నిధిని గ్రహించవలసి యున్నది. ఇది సాంప్రదాయ గురు గోప్యమై యున్నది.

ఇక ఉపనిషద్వ్యాఖ్యాన శైలిని గూర్చి చర్చిద్దాం. వ్యాఖ్యాత సమంజనమైన సర్వామోద యోగ్యమైన సరళిలో వ్యాఖ్యానించి యున్నారనుట నిస్సందేహము. మచ్చునకు 13వ శ్లోక వివరణ **"ప్రణవార్థ విహీనాత్మ లక్ష్యవాచ్య వివర్జితః శుద్ధ చైతన్య హీనాత్మా సర్వభాస వివర్జితః"।**

పై శ్లోకమునకు వ్యాఖ్యానాన్నందిస్తూ వ్యాఖ్యాత ప్రణవమగు 'ఓం' కారమును గూర్చి చక్కగా వ్యాఖ్యానించారు అకార, ఉకార, మకార, అరమాతృకల విశేష వివరణ ఆమోద యోగ్యమై అనుభవ శీలమై సర్వసమ్మతమై యున్నది. అకార, ఉకార, మకార అర్ధమాతృకల విశ్లేషణలో జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థల విశ్లేషణము గావించబడియున్నది. ఈ త్రివిధమాతృకలు, అరమాతృకయగు శుద్ధలింగ ప్రతిఫలిత చైతన్యములే. వీటి యథార్థ దర్శనము వస్తు నిశ్చయ పూర్వకముగా గురు సన్నిధిని దర్శించ వచ్చును. చతుర్విధ మాతృకల స్వరూపమే నిక్షిప్తపరిచి:

గురుర్బ్రహ్మా, గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః ॥ గురుగీతలో పై శ్లోకమున నిక్షిప్తపరచబడియున్నది.

| | | | |
|---|---|---|---|
| బ్రహ్మ= | జాగ్రదావస్థ | "అ" కార మాత్రృక | విశ్వుడు |
| | | స్థూలశరీరం | విరాట్టు |
| విష్ణువు = | స్వప్నావస్థ | 'ఉ' కార మాత్రృక | తైజస |
| | | సూక్ష్మ శరీరం | హిరణ్యగర్భులు |
| మహేశ్వరః | సుషుప్త్యవస్థ | 'మ' కార మాత్రృక | ప్రాజ్ఞ |
| | | కారణ శరీరం | అవ్యాకృతులు |
| పరబ్రహ్మ | తురీయావస్థ | అరమాత్రృక | ప్రత్యగాత్మ |
| | | మహాకారణ శరీరం | పరమాత్మలు |

ఇది యింకనూ కొంత విస్తృత వివరణం. మొత్తం 68 శ్లోకాలలో పూర్ణమై యున్న ఈ ఉపనిషత్తునకు, ప్రతి వాక్యమునకు వ్యాఖ్య భావపరిపుష్టి గలిగి, ప్రపూర్ణ భావనా శోభితమై సాంప్రదాయ బద్ధమై పాఠకుల మానస సరసీరుహమును తదేకదృష్టితో నాకర్షించి వికసింపజేయ గల సామర్థ్యమును గలిగి యున్నది. ఈ యధార్థ విషయములను పాఠకులే గ్రహింతురు గాక. గ్రంథ విస్తరణభీతిచే ప్రతి శ్లోక వ్యాఖ్యాన శైలిని ఉదాహరించుట లేదు. విజ్ఞులైన పాఠక మాహాశయులే ఈ వ్యాఖ్యాన రమ్య పరిమళము నాఘ్రాణింతురు గాక.

ఇక ఈ ఉపనిషత్తు నందు కీలక మంత్రమగు షోడశాక్షరీ మహామంత్ర మహిమను గూర్చి ప్రస్తావించుట ముఖ్య కర్తవ్యము. షోడశీ మంత్రం ఉపనిషత్తులో 35వ శ్లోకము తదుపరి ప్రస్తావించుట జరిగినది.

## షోడశీమహామంత్రం

**"మూలాభావ మిదం జ్ఞాతుం నశరీరం నకిమస్తి"**

పై మంత్రమునకు వ్యాఖ్యాతచే వివరణం యిలా యివ్వబడినది.

| | | |
|---|---|---|
| మూలాభావం | = | మూలంలేని |
| ఇదం | = | దీనిని |
| జ్ఞాతుం | = | తెలియుటకు |
| నశరీరం | = | శరీరము లేదు |
| నకిమస్తి | = | ఏమియు లేదు |

తా॥ మూలం లేని దీనిని తెలియుటకు శరీరం లేదు ఏమియు లేదు. వ్యాఖ్యానం సంప్రదాయాను గుణ్యంగా పూర్ణభావోపేతమై యున్నది.

ఈ షోడశాక్షరీ మంత్రాన్ని మరి యొక విధంగా వ్యాఖ్యానించ వచ్చును గూడా.

మూలా భావం = జగదుపాదానకారణము అధిష్ఠానము అగు చేతన బ్రహ్మము

ఆధారం లేనిది కావున,

ఇదం జ్ఞాతుం = ఈ గుర్తెరిగే శరీరమున్నూ

కిము నాస్తిహి = లేనే లేదుగదా.

తెలియజేయు ఈశ్వర చైతన్యము నిరాధారం కనుక లేనిదైనది. అందువల్ల గుర్తెరిగే పిండాండ ప్రత్యగాత్మ చైతన్యమునూ లేనిదే యగును. అని ద్వాదశీ, షోడశీ మహామంత్ర ద్వయము వల్ల అటు ఈశ్వరచైతన్యం (బ్రహ్మాండాధిష్ఠానం) ఇటు జీవచైతన్యం

.(పిండాండాధిష్ఠానం) రెండునూ నిరసింపబడి అచల పరిపూర్ణము నందు ఆభావమై ఉనికి గోల్పోవుచున్నది. అందువల్ల శ్రీ కృష్ణదేశిక ప్రభువులు 229 కందార్థము నందు.

**"ఇది తప్ప యేమి లేదని। మొదటిది మొరబెట్టుచుండు ముదమున వినుమా! యిదియేమి లేదు పొమ్మని। వదలక రెండోది లెస్స। వదురూ చుండునురా। బయలెరుకాల నిది నిశ్చయమురా।"** అదిగాన నీ రెంటి నరసి నీ విప్పుడు విదితాముగా రెంట్ని విడరా మంత్రము, లిట్లు। వదురూ చుండునురా। బయలెరుకాల నిది నిశ్చయమురా॥" అని ఉద్ఘాటించి యున్నారు.

అనగా అచల పరిపూర్ణము తప్ప ఉత్తది యగు ఎరుక ఏమి లేదని ద్వాదశీ మంత్రము. ఈ గుర్తెరిగే శరీరం ఏమీ లేదని షోడశీమంత్రం వివరించుచున్నది. కనుక గురు ముఖంబున పరమాణు స్వరూపమగు జగదధిష్ఠాన బ్రహ్మమునూ, దీనిని గుర్తెరిగి **"అహం బ్రహ్మాస్మి" "అయ మాత్మాబ్రహ్మ"** అని అనుభవం పొంది బ్రహ్మతాదాత్మ్యము పొందు పిండాండ గత ప్రత్యగాత్మ చైతన్యం గూడ ఏమి లేదు యని తెలుసుకొని, పై రెంటినీ అనగా క్షరాక్షరపురుషస్పర్శలను, శక్తి ద్వయదోష మాలిన్యమును వదలి యుండుమని కందార్థము నందు ఉద్బోధింపబడి యున్నది.

ద్వాదశి నాల్గు పద్ధతులుగా విభజనమై పరాకాశ రూప శుద్ధ చైతన్యమును ప్రతిపాదించు అవాంతర వాక్య చతుష్టయమును నిరసించునట్లుగా, షోడశియూ నాల్గు మార్గములుగా విభజనమై జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించు మహావాక్య చతుష్టయమును నిరసించుచున్నది. ఇక శేషించునది అచల పరిపూర్ణ పరబ్రహ్మమే.

**అవాంతర వాక్య చతుష్టయం**

1. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ
2. సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ
3. సర్వం ఖల్విదం బ్రహ్మ
4. నేహనానాస్తి కించన

**మహావాక్య చతుష్టయం**

1. ప్రజ్ఞానం బ్రహ్మ 2. అహం బ్రహ్మాస్మి
3. తత్త్వమసి బ్రహ్మ 4. అయమాత్మబ్రహ్మ

మహాయోగి వేమన గురుపుంగవుడు ద్వాదశి షోడశాక్షరి మంత్రముల గూర్చి ఈ విధంగా వాఖ్యానించియున్నారు.

తే॥గీ॥ ద్వాదశాక్షరి మంత్రంబు । ధర్మమెరిగి,
ఈ శరీరంబునకు మూల మెన్నరాని ।
సరణి మరిగిన నిత్యమౌ పరము గల్గు ।
విమల గుణరాజయోగీంద్రవేమనార్య ॥

తా॥ సర్వమునకు మూలకారణమైన, స్వయంప్రకాశ స్వరూపమైన ఎరుకనే బట్టబయలు అని మతకర్తలు నిర్ణయించి యున్నారు. కానీ ఈ ఎరుకయే మిథ్యా స్వరూపమైనది. కనుక అచల ఋషులు ఆ ఎరుకనే బట్టబయలుకు ఉత్త అని ముందు చేర్చినారు. అచలపరిపూర్ణము నిజ బట్టబయలు. కావున అచలపరిపూర్ణమునందు ఎరుక శూన్యము కావున **"ఈ ఉత్త బట్ట బయలు ఏమీ లేదు"** అని సిద్ధాంతీకరించి యున్నారు అచలఋషులు. ఇక ఉన్నది

అచల పరిపూర్ణబ్రహ్మమే నని ఈ మహామంత్రము పరోక్షంగా నిర్ధారించుచున్నది. ఈ విధంగా ద్వాదశాక్షరీ మహామంత్రము యొక్క ధర్మము (జాడ) తెలిసికొని ఈ గుర్తెరిగే శరీరమునకు మూలంగానీ, స్థానంగానీ లేదని ఆ అచలపరిపూర్ణబ్రహ్మము యొక్క స్థితిని తెలసికొనిన నిత్యమైన పరము గల్గునని వేమనార్యుడు ప్రబోధచేయు చున్నాడు.

## షోడశాక్షరీ మంత్రం

ఆ॥వె॥ షోడశాక్షరముల శోధించి మదినెంచి
గూఢ భావమూని కుదియబట్టి
వేడుకలర ముక్తి విన్నంది చూడరా
విశ్వదాభిరామ వినురవేమ

క్షేత్రక్షేత్రజ్ఞుల కలయికయే ఈ గుర్తెరిగే శరీరం. ఇది వున్నట్లు భ్రమ మాత్రమేగానీ వస్తువునకు నిజంగా ఉనికి లేదు. సర్వత్రా నిండి నిబిడీకృతమై వున్నది అచల పరిపూర్ణపరబ్రహ్మ మొక్కటే. ఈ గుర్తెరిగే శరీరమునకు మూలం లేదు. మరియు శూన్యమైనది. కనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమి లేదు అని వేమన యోగి నిర్ణయం.

అధర్వణ వేదమునందు అధిష్ఠాన చేతన పరబ్రహ్మమును ప్రతిపాదించు షోడశాక్షరీ మహా మంత్రము గలదు. ఈ మంత్ర నిరసనమునకే సర్వసారపూర్ణోపనిషత్తు నందు సచ్చిదానంద బ్రహ్మను నిరసించు షోడశాక్షరీ మహా మంత్రము వెలసినది. ఈ గురు గోప్య విషయం నిజగరువుల చరణ సన్నిధిని గ్రహించవలసి యున్నది.

ఈ సందర్భములో సచ్చిదానంద పగడాల వెంకటేశ్వర అవధూత స్వాముల వారి మహాద్వైత కందార్థములలో పరిపూర్ణ లక్షణం అను శీర్షికను 3వ కందార్థం "**క్షరమన యిరువది నాలుగు అక్షరమన యిరువదియున్నైదు, క్షరముకు అక్షరముకు పరమయి ఎప్పుడు పరతత్వము యిరువదారై పరిపూర్ణముగనూ। కదలక నుందూ గురుతూనెరుగ కనూ।.............**" అన్న కందార్థమును మరియు 71వ కందార్థము నందు.

నీ నిజరూపమె అచలము।
నీ నిజరూపంబె బయలు నిజముగా నెపుడు౯
నీ నిజరూపమె పూర్ణము
నీ నిజరూపంబె బ్రహ్మ నీ వెరుగవయ్యా।
నీ నిజరూపం నీవు గాదయ్యా।
నీవే విశ్వరూపం నీవే భ్రమరూపం।
నీవే మాయ రూపమని నీ వెరుగవయ్యా" అను

పద్య నిజార్థమును మరియూ 63 కందార్థము నందు "తానే పరిపూర్ణుండై లేనిది ఈ ఎరుక మరుపు లేకను ఎపుడున్, స్వానుభవాతీతుండై తాననకను ఉండవలయు ననే తలపులు లేకా..."

అన్న పద్య భావమును నిజగురు సన్నిధిని నెరుంగిన ద్వాదశీ షోడశీమంత్ర భావములు సంపూర్ణంగా ద్యోతకం కాగలవు. మరియూ

"బట్ట బయలే తాను, తానే బట్ట బయలు (ద్వాదశి భావం) అన్న శివరామ దీక్షితీయ వాక్యార్థమును నెరుంగ వలసి యున్నది. గ్రంథ విస్తరణ భీతిచే విశద పరచలేనైనది.

"ఇరవై అయిదోది అయిన ఎరుక అను అహంకారమే ఆత్మశరీరం. కనుక అహంకారము లేని వారు ఇరవై ఆరోది అయిన అత్యంత విలక్షణులు. వారే శ్రియఃపతి. వారే శరీరము నందు అహంకారం లేక వున్నవారు. వారే అశరీరులు" అన్న దీక్షి తీయ వాక్యం కూడ ద్వాదశీ షోడశీ మంత్ర భావముల మర్మములను చాటుచున్నది.

ద్వాదశాక్షరీ షోడశాక్షరీ మహామంత్ర ద్వయముల కాధారభూతములగు అనంతోపనిషత్తు సర్వసారపూర్ణోపనిషత్తులకు సాహసోపేతమైన వ్యాఖ్యల నందించిన అ॥ప॥ మంత చిన్నయ్య గారి కృషి మిక్కిలి శ్లాఘనీయము. గురు కృప కత్యంత పాత్రులైతే తప్ప యిలాంటి బృహత్కార్యము సాధ్యము కాదు. పరిపూర్ణ బోధకు మూలమంత్రములైన ద్వాదశీ షోడశాక్షరీ మహామంత్ర రాజముల కునికి పట్టయిన శ్రీ మదనంతోపనిషత్తు సర్వసార పూర్ణోపనిషత్తులకు సువర్ణ వ్యాఖ్యానము నందించిన అ॥ప॥ మంత చిన్నయ్య గారి కృషి అభినందనీయము, మార్గదర్శకము. వీరు యింతే గాక సంప్రదాయ సంప్రదాయ గురువాక్యోపనిషత్తునకు కూడా వ్యాఖ్య వెలయించినారు. ఇది పాఠకుల హృదయాభి రుచిని సంతరించుకొన్నది.

ఉపనిషత్ వాఙ్మయహారానికి మణి పూసల లాంటివి ఈ ఉపనిషత్త్రయము.

1. అనంతోపనిషత్తు
2. సర్వసార పూర్ణోపనిషత్తు
3. గురువాక్యోపనిషత్తు

ఈ ఉపనిషత్త్రయ వాఖ్యలు పండితులకు, సాహిత్యాభిమానులకు ముఖ్యంగా దీక్షితీయ అచల ప్రబోధ సాంప్రదాయ భక్త మండలికి జనసామాన్యానికి స్ఫూర్తి దాయకము కాగలదని విశ్వసిస్తున్నాను.

అ॥ప॥ మంత చిన్నయ్యగారు ఇంకనూ పరిపూర్ణప్రబోధ మౌలిక సూత్రముల వెదజల్లు తేజోబిందూపనిషత్తు, నిరాలంబోపనిషత్తు మొదలగు ఉపనిషద్రాజములకు గాఢముగా పరిశ్రమించి వ్యాఖ్యానములు వ్రాసి అట్లే నిజగురు కృపా విశేషం చేత తన కబ్బిన పాండిత్యానుభవంతో కొన్ని సద్గ్రంథములు వ్రాసి అచల పీఠమునకు, సాంప్రదాయమునకు వన్నె చేకూర్చి అందరి మన్నలకు పాత్రులగుదరని ఆశిస్తున్నాను.

కం॥ చిన్నయ వాఖ్యానము బహు॥
మిన్నగఁ గన్పట్టు ఎరుక మృగతృష్ణయనన్
ఉన్నట్టి బయలు నందున
సున్నాయౌ ఎరుక జాడ సూటిగ జదవన్.

శ్రీరాజయోగి గురవేనమః

అనంతపురము
1-6-2002

ఇట్లు
గురుపద సేవా నిరతుడు,
**సత్యశోధనాచార్య,**
**నిత్యానంద కురుబ సుబ్బరాయుడు**

శ్రీ గురుభ్యోనమః

# సర్వసారపూర్ణోపనిషత్తు

## పీఠిక

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరంబ్రహ్మా తస్మైశ్రీ గురువేనమః

శ్లో॥ అస్మద్గురు సమారంభాం। కృష్ణసాందీపమధ్యమాం
శ్రీమహావిష్ణు పర్యంతాం। వందేగురుపరంపరాం॥

శ్లో॥ పరిపూర్ణానంద నర్సింహార్య పాదకమల సేవకం।
ప్రబోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం॥

సృష్టిలోని సమస్త చరాచరములందు మానవునికి విచక్షణ జ్ఞానముండుట వల్ల శ్రేష్ఠుడన బడుచున్నాడు. విజ్ఞానాభివృద్ధికి మనోవికాసాభివృద్ధికి కృషిచేయాలనె జిజ్ఞాస కలవాడు మానవుడొక్కడే. ఆ జిజ్ఞాస మానవునకు ఆరవ ప్రాణము. ప్రకృతిలోని ప్రతి విషయాన్ని పరిశీలించి విశ్లేషించి శోధించి తన నిత్య జీవితములో అత్యంతానందమును పొందుటకు శాస్త్రజ్ఞుడు కృషి చేస్తే, మానవ జీవితానికి అర్థమేమిటో గుర్తించి మనోవికారములను నియంత్రించి అంతరంగమును వశపరుచుకొని తన తొలిరూపమైన పరమాత్మ రూపమును అపరోక్షము చేసుకొనుటకు ప్రయత్నించుటయేగాక జననమరణములకు మూలమైన హృదయగ్రంథిని నాశనమొనర్చుకొని తిరిగి జన్మలేకుండ చేసుకొనుటకు అనగా జన్మరాహిత్యరూప మోక్షమును పొందుటకు తోడ్పడువాడు తత్వవేత్త. జన్మరాహిత్యరూపమోక్షమును పొందుటయే మానవ జన్మయొక్క పరమలక్ష్యము. పుట్టినందులకు చేయవలసిన కర్తవ్యము కూడ యిదే. కావున దుర్లభమైన మానవోపాధి లభించినందులకు జన్మరాహిత్యరూప మోక్షము పొందుటకు ప్రయత్నించని జన్మ వ్యర్థము. ఎందుకనగా జన్మరాహిత్యమును సాధించుట కేవలం మానవ జన్మయందు మాత్రమే సాధ్యము. పశు, పక్షి, క్రిమికీటక జన్మలందు, మరియు దేవతా జన్మలందు కూడ జన్మరాహిత్యరూప మోక్షము సాధ్యము గాదు. అట్లు జన్మరాహిత్య రూపమోక్షమును పొందుటకు తోడ్పడు ఏకైక మరియు అత్యంత సులభమైన బోధ పరిపూర్ణబోధ. ఇట్టి బోధలోని మర్మధర్మములను తెలుసు కొనుటకు, అందు ఆరూఢత చెందుటకు వేద శిరస్సులనబడు 1108 ఉపనిషత్తులలో తలమానికములైనవి కేవలము
రెండే రెండుపనిషత్తులు అవి : **1. అనన్తోపనిషత్తు 2. సర్వసారపూర్ణోపనిషత్తు.** ఉపనిషత్తు అనగా, ఉప+ని+షత్తు, యను మూడు పదముల కూడిక. ఉపయనగా సమీపము. ని యనగా చక్కగా, సత్ అనగా పొంద బడినది అర్థము. ఉపనిషత్తులను వేదాంతములని, వేదశిరస్సులని, రహస్యములని చెప్పబడుచున్నవి.

ఈ సర్వసారపూర్ణోపనిషత్తు నందు 68 శ్లోకములున్నవి. అన్ని ఉపనిషత్తులసారముతో పాటు పరిపూర్ణమును తెలియజేయు భావములు కూడ కలవు. ఈ భావమునే 67వ శ్లోకమునందు స్పష్టముగా జెప్పబడినది. "ఇతివేదాంత సిద్ధాంతసారం వేదాంత డిండిమః" అనగా మొత్తము ఉపనిషత్తంత వేదాంత పరముగా సిద్ధాంతము జేయబడిన సారమని ఢంకా

బహిరాయించి చెప్పునట్లు పొందుపరచబడినది. ఇందు అన్ని ఉపనిషత్తుల సారమున్నట్లు దీని పేరు వల్ల మనకు స్పష్టముగా చెప్పకనేచెప్పినట్లయినది.

**2 సర్వసారపూర్ణోపనిషత్తు – షోడశీ మహామంత్రము :** ఈ ఉపనిషత్తునందు పరిపూర్ణ బోధకు సంబంధించిన షోడశీ మహామంత్రము 35వ శ్లోకము తర్వాత పొందుపరచబడియున్నది. అంతేగాక "ఇతి సదాజపేత్" అని చెప్పుటలో ఈ మహామంత్రమును సదాజపించవలయునని సూచిస్తున్నది. అంటే ఈ మహామంత్రమును నిదుర వచ్చేదాక, చచ్చేదాక జపించవలయునని పెద్దలు చెబుతుంటారు. అట్లు జపించుటవల్ల ఎరుక దరిజేరదు.

**3. సర్వసారపూర్ణోపనిషత్తు – శాంతి పాఠము**

సర్వసారపూర్ణోపనిషత్తునకు ప్రారంభమున మరియు చివర శాంతి పాఠము కలదు :

శ్లో॥ పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే
పూర్ణస్యపూర్ణమాదాయ పూర్ణమేవా2వశిష్యతే

అనగా ఆ పరోక్షము పూర్ణము, ఈ ప్రత్యక్షము పూర్ణము. ఈ పద్ధతిని వివరించి చూడగా ప్రత్యక్ష పూర్ణము ఎండమావుల జల రూపకముగా లేకుండ పోవుచున్నది. పరోక్షపూర్ణమే శేషించి యుంటూ వున్నది. కనుక యిందు నిర్ణయించిన శాంతి ప్రత్యక్ష పూర్ణశాంతి కొరకు గాని ఆధ్యాత్మిక, ఆధిభౌతిక ఆధిదైవిక యితర విఘ్నముల శాంతి కొరకు కాదు. అనగా వాఙ్మేమనసిశాంతి, సహనావవత్విత్రుతి శాంతి, అప్యాయంతుత్యాతి శాంతి, భద్రం కర్ణేభిద్యాతి శాంతి యను ఈ నాలుగు విధ శాంతులు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక యితర విధముల శాంతి కొరకు నిర్ణయించినారు. 'పూర్ణమదః' ఈ శాంతి జనన మరణ రూప ప్రత్యక్ష పూర్ణశాంతి కొరకు నిర్ణయించినారు. ఎందుకనగా జననమరణరూప ప్రత్యక్ష పూర్ణము సప్తవిధచైతన్య పద్ధతులుగా ఉపాధుల స్థానముల యందు జనన మరణ రహిత పరిపూర్ణ పరబ్రహ్మమే యుండును గాని జనన మరణ రూప చేతనబ్రహ్మము ఎండమావుల వంటిదని దాని శాంతి కొరకు ఈ శాంతి ఏదు పూర్ణమనుపదములతో కూర్చబడి యున్నది. కనుక ఆగమ నిగమ ఉపనిషత్సాగర మథితార్థమవలిది, జనన మరణములు పొందనిది, అచల పరిపూర్ణపరబ్రహ్మమని నిర్ణయము.

ఈ శాంతి పాఠము శుక్లయజుర్వేదీయ శాంతి పాఠము. కావున సర్వసారపూర్ణోపనిషత్తు ప్రారంభమున మరియు చివర ఈ శాంతి పాఠముండుటచే ఈ ఉపనిషత్తు శుక్లయజుర్వేదీయాంతర్గత మైనదని తెలియుచున్నది.

ఉపనిషత్తుల పఠనమునకు శాంతి పాఠముల నిర్ణయించినారు. కనుక ఈ ఉపనిషత్తు చదువుటకు ప్రారంభమున మరియు చదువుట పూర్తి అయిన పిదప పైన పేర్కొన్న శాంతి పాఠమును తప్పక పఠించవలయుననెడి నియమము కలదు. ఎందుకనగా అట్లు పాఠము పఠించని వారికి ఉపనిషత్పఠన శ్రవణము యొక్క శ్రమయే మిగులునని, ఫలముండదని నిర్ణయము. కావున శాంతి పాఠము నందలి నిర్ణయ విధానమును తెలుసుకొని ఆ పద్ధతిగా ఆచరించుట ముముక్షువుల ధర్మము.

**4 సర్వసార పూర్ణోపనిషత్తు – వేదముల ఆశయము:**

వేదములెంత సనాతనమో పరిపూర్ణబోధ అంత సనాతనమని చెప్ప వచ్చును. అందుకు వేదాంగములనబడు ఈ సర్వసారపూర్ణోపనిషత్తు మరియు అనన్తోపనిషత్తులే నిదర్శనములు.

సర్వసారపూర్ణోపనిషత్తున షోడశీమహా మంత్రము, అనన్తోపనిషత్తు నందు ద్వాదశీ మహామంత్రము జెప్పబడినవి. పరిపూర్ణబోధ యొక్క మూల బీజములు వేదములందు ఉపనిషత్తులందు నిక్షిప్తమై యున్నవి. మానవుడు తన జ్ఞానముచే తర్కించి శోధించి సమస్త విషయములు తెలుసుకొంటు సర్వజ్ఞత్వమునకు చేరువగుచున్నాడు. కాని వాక్కుల కందని పరిపూర్ణపరబ్రహ్మమును అట్లు తెలుసుకొనుటకు సాధ్యము గాదు. పరిపూర్ణ పరబ్రహ్మమును సర్వజ్ఞత్వలక్షణములు గల ఎరుక కూడ తెలుసుకొనజాలదు. గురుముఖతః తెలుసుకొనవలసి యుండును. "గురోర్ముఖేనజ్ఞాతవ్యం నాన్యథాగ్రంథ కోటిభిః"

ఈ ఉపనిషత్ద్వయముననే గాక ఇతర ఉపనిషత్తులందు పరిపూర్ణమును తెలియజేయు శ్రుతులు, వాక్యములున్నను, ఇతర మతవాదులు వానిని తమ తమ మతసూత్రములకు అనుకూలముగా మలుచుకొని వ్యాఖ్యానములు జేసిరి.

'వేదోఖిలోధర్మ మూలం' అని 'సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి' అని చెప్పబడినది ఎందుకనగా వేదములు ఒక వ్యక్తిచే రచించబడినవి కాక పోవడమే. అనేక మహర్ష్యాదులు వారి వారి అనుభవాలను పరిశీలనా ఫలితాలను వెల్లడించడములో వివిధత్వము గానవస్తుంది. కనుకనే శూన్యవాద సహితముగా అన్ని వాదముల సూత్రములు వేదములలో గానవస్తాయి. వాటిలో మనోవాక్కుల కందు భావములను నేరుగా జెప్పినారు. కాని వాక్కుకు మనస్సుకు అందని పరిపూర్ణపరబ్రహ్మము సూటిగా చెప్పబడలేదు. అచల ఋషులు జనన మరణ రహిత విధానము ఈ పరిపూర్ణబోధయందే గలదని తెలుసుకొని దానిని గోప్యంగా నుంచి తమను ఆశ్రయించిన శిష్యులకు ప్రశిష్యులకు ప్రసాదిస్తు పరిపూర్ణ భావమును కాపాడినారు.

దశోపనిషత్తులను నిశితముగా పరిశీలించినట్లయితే ముఖ్యంగా అద్వైత భావము బలపడును. "జీవోఽబ్రహ్మైవనాపరః" "సర్వంఖల్విదం బ్రహ్మ" వంటి శ్రుతులు అద్వైత సిద్ధాంతమునకు తలమానికముగా నున్నవి. ఈ దశోపనిషత్తులందు అక్కడక్కడ పరిపూర్ణ భావమును ప్రకటపరుచు శ్రుతులున్నవి. మచ్చునకు రెండిచట పరిశీలనార్థము నుదాహరించబడినవి.

1. యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహా ॥తైత్తిరీయోపనిషత్తు॥

తా॥ మనస్సు వాక్కున్ను దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణపరబ్రహ్మము.

2. నైవ వాచా నమనసా ప్రాప్తుంశక్యోన నచక్షుషా అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే ॥కఠోపనిషత్తు 2-3-12

తా॥ వాక్కు మనస్సు చక్షువులకు ప్రాప్తింప రానిది. ఉన్నదని చెప్పుటకు వినాగా మరొక రీతిగా దాని యుపలబ్ధి కాజాలదు.

3. అప్రాణోహ్యమనః శ్శుభ్రోహ్యక్షరాత్ పరతఃపరః ॥ముండకోపనిషత్తు॥

తా॥ మనః ప్రాణములు లేనిది, అమృత స్వరూపుడగు అక్షర పురుషుని కంటే పరుడగు పురుషోత్తముని కంటే పరమైనది (క్షర అక్షర, పురుషోత్తములకు పరముగా నున్నది)

**4. సర్వసారపూర్ణోపనిషత్తు – సంవిధానము :**

ఈ ఉపనిషత్తులోని ముఖ్యవస్తువును క్లుప్తంగా జెప్పాలంటే పరిపూర్ణ పరబ్రహ్మమును, ఎరుకను యెరిగి, యెరుకను వదులుట. అంటే :

1. పరిపూర్ణపరబ్రహ్మమే అంతటయున్నది శాశ్వతమైనది.
2. లేనిఎరుక లేనిది అశాశ్వతము
3. నేను లేననుట ఎరుక యందలి భ్రాంతి రహితము.

పంచ తన్మాత్ర రహితముగా అచల పరిపూర్ణపరబ్రహ్మమును గురుమూర్తి దర్శింపజేసినాడు గనుక ఆ దర్శన భాగ్యమున కర్మత్యాగము, కర్మఫలత్యాగముగా గాక కర్తృత్వరహితముగా కర్మ ఆచరించిన, వేయించిన విత్తనము మరల మొలకెత్తనట్లు భ్రాంతి రహిత మగును. **భ్రాంతిరహితమే మోక్షము.** ఇదే జన్మకు రాని పద్ధతి. ఇట్లు **కర్తృత్వరహితముగా కర్మచేయుటయే ఎరుకలేక సేవించదగునని నిర్ణయము.** స్థావర జంగమ జీవోపాధులందు శ్రుతి॥ "దుర్లభం మానుషం దేహం" అనున్యాయమున మానవోపాధికి వచ్చి పరిపూర్ణ గురువులను బడసి పరిపూర్ణ బోధను వస్తు నిశ్చయముగా నెరిగి జన్మరాహిత్యము పొందుటయే మానవ జన్మ యొక్క పరమ లక్ష్యముగా గుర్తించ వలసినదిగా ప్రార్థిస్తున్నాను.

**5 సర్వసారపూర్ణోపనిషత్తు – వేదాంత సిద్ధాంతసారము :**

అన్ని వేదాంతముల సారమంతయు సిద్ధాంతము జేసి ఈ ఉపనిషత్ద్వయములందు పొందుపరచబడినది. అందుకుగాను ఈ ఉపనిషత్తు నందుగల 67వ శ్లోకమును మీ పరిశీలానార్థము దిగువ పేర్కొనబడినది.

"ఇతివేదాంత సిద్ధాంతసారం వేదవేదాంత డిండిమః" అని ఢంకా బజాయించి చెప్పినట్లు చాటబడినది. ఇతర ఉపనిషత్తులందు కేవలం సచ్చిదానంద లక్షణములు గల అధిష్ఠాన చేతన బ్రహ్మమును గూర్చి వర్ణించబడినది గాని ఈ ఉపనిషత్ద్వయము యింకా కొంత ముందుకు పోయి సచ్చిదానంద లక్షణములు గల అఖండ యెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలముగాని స్థానముగాని లేదని దృష్టద్రాష్టాంతములతో వివరించి సిద్ధాంతము జేయబడినది. అధిష్ఠానచేతన బ్రహ్మమేనిత్యమై సత్యమైనదని అంతే గాక అంత కంటె మరొకటి లేదని తెల్పె ఇతర ఉపనిషత్తులలోని విషయము నంతను నిరసిస్తూ, నిర్ద్వంద్వ, నిరపేక్ష సర్వలక్షణ విలక్షణమై సత్యమై, నిత్యమైనది, అంతటనిండి నిబిడీకృతమై యున్న పరిపూర్ణ పరబ్రహ్మమును గూర్చి సంపూర్ణముగా వివరిస్తు సిద్ధాంతము జేయబడినది. అన్నిటిని తెలుపుతు పరిపూర్ణమును గూర్చి తెలుపుట వల్ల ఈ ఉపనిషత్తులు సమగ్రమై సంపూర్ణమైనవిగా జెప్పవచ్చును. అందుకే ఈ ఉపనిషత్తు సర్వసారముతో పాటు పూర్ణమును జోడించి సర్వసారపూర్ణోపనిషత్తని పేరు బెట్టుటవల్ల ఆపేరు దానికి సార్థకమైనది.

ప్రస్తుతము లభ్యమయ్యె 1108 ఉపనిషనిషత్తులలో 'సర్వసారోపనిషత్తు' అనుపేరుగల ఉపనిషత్తు గలదు. అందు అఖండ యెరుక రూపు గల అధిష్ఠానచేతనబ్రహ్మము యొక్క స్థాన, స్వరూప, స్వభావముల గూర్చి వివరించబడినది. వాటి యందు పరిపూర్ణమును గూర్చి చెప్పబడలేదు. కనుక అది అసమగ్రము అసంపూర్ణము. అంతేగాక వాటి లక్ష్యములు పరిశీలించిన యెడల ఎంతో తేడా కనిపించును.

సర్వసారోపనిషత్తు ఇంతకు పూర్వము వివరించినట్లు అఖండ యెరుకను గూర్చి చెప్పును. అదే హృదయ గ్రంథి. ఈ హృదయ గ్రంథిని ఛేదించిననే జన్మరాహిత్యము. ఇందలి మోక్షమున కర్థము తిరిగి జన్మకుదెచ్చు సాలోక్య, సారూప్య సానిధ్య, సాయుజ్య వంటి ముక్తులు. ఇవి తిరిగి జన్మకు వచ్చు పద్ధతిని సూచించును.

సర్వసారపూర్ణోపనిషత్తు యొక్కలక్ష్యము తిరిగి జన్మకురాని మోక్షమే లక్ష్యము. ఇందు అఖండ యెరుకను క్షుణ్ణంగా యెరిగించి, అదికానిది అది లేనిది, దానిని మీరినది పరిపూర్ణ పరబ్రహ్మమని, దానిని ఎరుక లేక సేవించవలసినదిగా పరిపూర్ణబోధ వివరించును. కావున జన్మరాహిత్యము కోరు మానవుడు తప్పక పరిపూర్ణబోధను బడసి ఆరూఢత చెందవలసినదే. అట్టివారికి బోధ ఆరూఢపరుచుటకు జన్మరాహిత్యమునకు తోడ్పడునవి ఈ ఉపనిషత్ద్వయములుగా గుర్తించవలయును.

**సర్వసారపూర్ణోపనిషత్తు - ఒక పారాయణ గ్రంథము :**

భారతీయ జీవనమును ప్రతిబింపజేసే చతుర్వేదములు, 1108 ఉపనిషత్తులను అధ్యయనము జేయవలెనన్న ఒక మానవ జీవితకాలము సరిపోదు. మానవ జీవితకాలము శతసంవత్సరములని నిర్ణయము. అందు బాల్యము, వృద్ధాప్యము పోను మిగిలిన కాలమున ఒక్క వేదమునుగాని కొన్ని ఉపనిషత్తులనుగాని సంపూర్ణముగా అధ్యయనము జేయుటకు కూడ సరిపోదు. కావున అన్ని వేదాంతములసారముతో నిండి సంపూర్ణమైన ఈ సర్వసారపూర్ణోపనిషత్తులోని సారమును ఒక జీవిత కాలమున గురుముఖత విని అందలి మర్మధర్మములు తెలుసుకొని జన్మసాఫల్యమును పొందుటకు సానుకూలముగా నున్నదని చెప్పవచ్చును. కావున దీనిని నిత్యపారాయణ గ్రంథముగా నెన్నుకొని అధ్యయనముజేసి ముప్పురిగొను మృదువాక్యములందు ఆరూఢత జెందిన ఎరుక లేనే లేదనెడి విశ్వాసము కలుగును. ప్రతి రోజు యిందులోని అన్నిటిని గాని, కొన్నిటిని గాని, ఒక్క శ్లోకమును గాని చివరకు అర శ్లోకమునుగాని పారాయణము జేసిన "అనగననగరాగ మతిశయిల్లుచు నుండు తినగ తినగ వేము తియ్యనుండు" అనున్యాయముగా బోధయందు దృఢత చేకూరును. పరిపూర్ణమును, ఎరుకను ఎరుగుటకు కృషిచేయుటయే ఈసాంప్రదాయములో సాధన. కావున దీనిని పారాయణము జేసుకొని సాధన జేసిన అందలి భావములు దృఢపడి జన్మరాహిత్యమునకు తప్పక తోడ్పడునని ప్రగాఢ విశ్వాసము.

**6. ఉపనిషత్రయమును అనువదించి వివరములు కూర్చుటలో గురు ఋణమును తీర్చుకొనుటయే ధ్యేయము.**

వేదములు వేదాంగములు లోక కళ్యాణప్రదములు. వీటిని తెలుగువారి కందుబాటులోకి దెచ్చి సర్వమానవసౌభాతృత్వము, అన్యోన్య సహకారము, ఐహికాముష్మిక పురోభివృద్ధికి తోడ్పనట్లు సార్వజనీనముగా జేసి జన్మ సాఫల్యమును పొందుటకు దోహపడునట్లుగా జేయుటయే ముఖ్యోద్దేశము.

యోగ్యత అధికారములను బట్టి చూచినచో ఈ బృహత్కార్య నిర్వాహణకు పూనుకొనుట దుస్సాహసమే యగును. ఉపనిషత్రయములను అనువదించి, వివరములు కూర్చుట అంతా గురుకృపనే. ఈ మహాయజ్ఞమ : తుదముట్ట పూర్తి జేయించినది వారే. వారి వల్ల పొందిన జ్ఞానమును వినియోగించి అట్టి జ్ఞానమును ఇతరులకు పంచుటకై తెనుగించి, వివరములు కూర్చి ఆత్మోపలబ్ధికే గాక జన్మరాహిత్యమునకు తోడ్పడునట్లు తీర్చిదిద్దుట కేవలం మద్గురు ఋణము తీర్చుకొనుట కొరకేనని సవినయముగా మనవి చేయుచున్నాను. ఇంత వరకు ఈ ఉపనిషత్రయమునకు వ్యాఖ్యానములు వ్రాసినట్లు దాఖలాలు లేవు.

**7. కృతజ్ఞతలు :**

వీటిని రూపొందించుటలో గురుపుంగవుల, పెద్దల గ్రంథములను పరిశీలించి వారి

భావములను గ్రైకొని ఆయా ఉపనిషత్తులలోని శ్లోకములకు సరిపడునట్లు ఏర్చి కూర్చి పొందు పరిచి పరిపూర్ణ భావమునకు లోపము కలగకుండ తగు జాగ్రత్త వహించబడినది. అయినను తప్పులు దొర్లిన దొర్లియుండవచ్చును. కావున విజ్ఞులు, జేజేలు, పెద్దలు గురుపుంగవులు, బంధు జనులు యిందులోని తప్పులను ఒప్పులుగా జేసుకొని చదువుకొన గలరని, పెద్దమనస్సుతో మన్నించ గలరని ప్రార్థించుచున్నాను.

పూజ్యులు శ్రీశ్రీశ్రీ అచలర్షిదయానంద పొన్నాలరాజ యోగిగారి రచనలు, మరియు శ్రీ పరిపూర్ణ దర్శనాచార్య సదానంద యిలపకుర్తి వీరవెంకరామచంద్ర రావు గారి రచనలు, శ్రీ కడివేటి నరసారెడ్డి గారి అనువాదములు మరియు ఇతర పెద్దల రచనలు వివరములు కూర్చుటలో చాల వరకు తోడ్పడినవి. అందులో కొన్ని ఉన్నవి వున్నట్లుగా మరి కొన్నిటిని మాగురు కృపవల్ల కలిగన జ్ఞాన సంపత్తిద్వార తెలిసినంత వరకు శ్లోకములలోని భావములకు సరిపడునట్లు కూర్చితిని. అట్టి అచలఋషులకు నేనెంతో ఋణపడి యున్నాను. వారందరికి కృతజ్ఞతా పూర్వక సాష్టాంగదండప్రణామములు అర్పించుచున్నాను.

ఈ ఉపనిషత్ద్వయములను పెద్దలచే పరిశీలింపజేసి, అభిప్రాయములు వ్రాయించ వలయుననెడితలంపు మాసత్సంఘ సభ్యులైన అ॥ప॥ చెన్నయ్య గారికి గాఢముగా కలగడము వారి ప్రయత్నము వల్ల శ్రీ ఈద లక్ష్మయ్య గారి ద్వార మధుర కవి శ్రీశ్రీ అమలానంద పాటల పండరీనాథ స్వాముల వారి సన్నిధికి పంపడము జరిగింది. స్వాముల వారికి అనివార్య కార్యములుండుట వల్ల ఈ పని భారమును శ్రీశ్రీ సత్యశోధనాచార్య నిత్యానంద కురుబసుబ్బరాయ దేశిక ప్రభువుల వారికి అప్పజెప్పిరి. ఎన్నో పనులున్నప్పటికి కడుశ్రమకోర్చి ఈ రెండుపనిషత్తులను పరిశీలించి తమ సత్యశోధనలో కనుగొన్న సత్యములను జేర్చి ప్రమాణముల యుక్తముగా నిర్మాణాత్మకముగా ఉపనిషద్భాషణములను పేర, అనన్తోపనిషత్తునకు **"అనంత దర్శనము"** అని సర్వసారపూర్ణోపనిషత్తునకు **"సర్వసార పూర్ణోదయం"** వాటికి తగినట్లుగ పేర్లను కూర్చి వారి అభిప్రాయములను వెల్లడించి, ఉన్న భావములకు వన్నె బెట్టినారు. కావున శ్రీ నిత్యానంద కురుబ సుబ్బరాయ దేశికప్రభువులకు నేనెంతో ఋణపడియున్నాను. వారికి కృతజ్ఞతా పూర్వకముగా సాష్టాంగదండ ప్రణామము లర్పించుచున్నాను. అట్లే ఇందుకు తోడ్పడిన మధరకవి శ్రీశ్రీ అనులానంద పాటల పండరీనాథ దేశికప్రభువులకు, వారి ప్రియశిష్యులైన శ్రీ ఈద లక్ష్మయ్య గారికి సాష్టాంగదండప్రణామములు.

ఈ ఉపనిషత్తులను వ్రాయుటలో తగిన సలహా లిచ్చి ప్రోత్సహించి నందులకు మా సత్సంఘ సభ్యులైన మద్గురు శిష్యులైన అ॥ప॥ చెన్నయ్య గారికి, శ్రీశ్రీ ముత్యాల కొండయార్యుల శిష్యులైన అ॥ప॥ శ్రీ విశ్వనాథాచారి గారికి, అచ్చు వేయుటకు శుద్ధప్రతిని వ్రాసి యిచ్చిన శ్రీ మిట్టె రామలింగము గారికి, కృతజ్ఞాతాభివందనములు అర్పించుచున్నాను. అట్లే మద్గురు చ్ఛాయా చిత్రమును తీయించి యిచ్చిన కుబేరా ఫోటో స్టూడియో యజమాని అ.ప. నర్సప్ప గారికి కృతజ్ఞాతాభివందనములు.

అంతేగాక కోరిన వెంటనే ఆర్థికముకముగా సహాయము చేసిన మా యొక్క సోదరులైన **మంత ఎల్లయ్య,** Retired Asst. Engineer., గారికి కృతజ్ఞతాభి వందనములు మరియు **కీ॥శే॥ మంత మల్లయ్య** Rtd. Dy. Executive Engineer గారి కుమారులు **చి॥ మంత** ఎల్లప్ప మరియు **డా॥ చంద్రశేఖర్,** మా సహోదరులు అ॥ప॥ **మంత బాలరాజు, చి॥ మంత** **మల్లయ్య చి॥ చంద్రమౌళి, చి॥ మంత శంభు లింగము** మరియు సగోత్రీకులు సోదరులైన

**కీ॥శే॥ గంగాపురము మంత పెద్ద చిన్నప్ప ఎంకమ్మ గారి పుత్రుడు చి॥ మంత చంద్రప్ప,** మరియు **కీ॥శే॥ గంగాపురము మంత చిన్నయ్య గారి కుమారులు చి॥ మంత గణేష్** కూడ ముద్రణనిమిత్తము ఆర్థిక సహాయము చేసినందులకు వారందరిని నిండు మనస్సుతో ఆశీర్వదిస్తున్నాను. మద్గురువులు వీరందరికి ఆయురారోగ్యములు ఐశ్వర్యము ప్రసాదించునట్లు ప్రార్థించుచున్నాను. వారందరు గరు కృపకు పాత్రులై తరింతురుగాక!

**8. కృతి సమర్పణము :**

గడచిన జన్మజన్మాంతరములలో చేసిన పాపపుణ్యఫల స్వరూపముల వల్ల యేర్పడిన సంస్కారముల బలముచే ప్రారబ్ధము ననుభవించుటకు నాకీ తనువునొసంగి విద్యాబుద్ధులు చెప్పించి నన్నింత వానిగా జేసి, తొలిగురువులనబడు మాతృ పితృదేవులైన **కీ॥శే॥ మంత చిన్మమ్మ ఎల్లప్పగారల పాదపద్మములకు** ఈ సర్వసారపూర్ణోపనిషత్తు అనువాదము మరియు కూర్చిన వివరము పూజాపుష్పముగా సమర్పించుచున్నాను.

పుట్టువారలెవరు? పుట్టినవారెవరు?
పుట్టి గిట్టనట్టి పురుషులెవరు?
పుట్టి పుట్టనట్లు బోధించిచూడరా
విశ్వదాభిరామ వినురవేమ

తా॥ ఆగామి సంచిత ప్రారబ్ధములనె కర్మత్రయము నాశనము కానంత వరకు జీవులు మళ్ళీ మళ్ళీ పుట్టుచుందురు. కర్మత్రయము నాశనము చేసుకొన్న వారికి పుట్టుక యక యుండదు. ఇప్పుడు పుట్టి యుండి పుట్టుక లేకుండ చేసుకొనుటకు పరిపూర్ణ గురువుల నాశ్రయించి పూర్ణబోధబడసి కర్తృత్వరహిత కర్మాచరణ విధానమున సకల కర్మల చేసుకొనె వారికి ఆగామి కర్మఫలమంటదు. సర్వకర్తయగు అఖండనెరుక నెరిగి అది పరిపూర్ణ మందు పుట్టలేదని యెరిగిన వారికి సంచిత రాశి యంతయు అఖండ జ్ఞానాగ్నిచే దగ్ధమగును. ఇక ప్రారబ్ధము అనుభవించుటచే నశించిన కర్మత్రయము నాశనమై వేయించిన విత్తనము నందలి అంకురము నాశనమైనట్లుగా జన్మరాహిత్యము సిద్ధించును. అట్టి పరిపూర్ణ బోధయందు ప్రవేశించుమని వేమన ఉద్బోధించుచున్నాడు. కావున దుర్లభమైన మానవోపాధికి వచ్చి అతిదుర్లభమైన పరిపూర్ణబోధ అచలగురువుల ద్వార పొంది జన్మ చరితార్థము చేసుకొనగలరని ప్రార్థించుచున్నాను.

ముద్రణకు అనువుగా తప్పులు లేకుండ సరిచూచియిచ్చిన స్థానిక ప్రభుత్వ డిగ్రీ కళాశాల తెలుగుశాఖ రీడర్ డా॥ బుక్కా బాలస్వామి గారికి కృతజ్ఞతాభివందనములు.

ఈ తెలుగు అనువాదము, వాటి వివరములు పరిపూర్ణ భావమును తెలుసుకొనవలెననెడి ముముక్షువులకు, భక్త జనులకు ఏ కొంతైన ఉపయోగపడిన నేను కృతార్థుడను, మా గురు ఋణము తీర్చుకొన్నవాడనగుదును.

మద్గురు పాదరేణువు
**మంత చిన్నయ్య**

తేది 22-04-2002
1-7-183/30 ఎ,
హనుమాన్‌నగర వీధి
మహబూబ్‌నగరము

సర్వం శ్రీగురుచరణారవిందార్పణమస్తు

ఓం
శ్రీగురుభ్యోనమః

# సర్వసార పూర్ణోపనిషత్

శాన్తి పాఠః
పూర్ణమదఃపూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే

**అథ వైకుంఠో నీలకంఠం ప్రణమ్య స్వామిన్ సర్వలోకైక నాథ! బ్రహ్మైవాహం భ్రాన్తి నాశం కురుష్వ। ఈశ ఏతద్వ్యాపోవ్యాపరాత్పరం పూర్ణముపైతి నాథో। విష్ణోర్భక్త్యా సమాదరా త్పంచవక్త్ర ఉవాచ.**

వైకుంఠనిలయముగా గల విష్ణుదేవుడు నీలకంఠునికి ప్రణమిల్లి స్వామి! సర్వలోకములకు ప్రభువైనవాడా! "బ్రహ్మను నేనైతిని" అనే భ్రాంతిని నాశనము చేయుము. ఓ పరమేశ్వరా! పరమాత్మకంటె పరమై శ్రేష్ఠమైన ఆ పరిపూర్ణపరబ్రహ్మము ఏ విధముగా వ్యాపించియున్నదో, అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును పొందుదునా? యని యడుగగా, విష్ణుభక్తికి మెచ్చి సమాదరణతో పంచముఖుడైన నీలకంఠుడు యిట్లు చెప్పుచున్నాడు.

**వివరములు :**

1. అథ = ఇప్పుడు
2. వైకుంఠో = వైకుంఠమే స్థానముగా గలవాడు విష్ణువు.
3. నీలకంఠం = హాలాహల పానమున నల్లని కంఠము గలవాడు = శివుడు
4. ప్రణమ్య = గురు దైవములకు భక్తులు చేయు సాష్టాంగ నమస్కారము. సాష్టాంగము అనగా ఎనిమిది అంగములు. 2 చేతులు 2. పాదములు 2. భుజాగ్రములు 1. రొమ్ము1. నొసలు భూమికి తగులు నట్లుగా జేసెడి నమస్కారము. ఈ నమస్కారమును గురించి గురుగీత యిట్లుగానము చేసినది.

శ్లో॥ దోర్భ్యాం పద్భ్యాంచ జ్యానుభ్యామురసాశిరసా దృశా
మనసా వచసాచేతి। ప్రణామోఽష్టాంగ ఉచ్యతే॥గురుగీత శ్లో. 180

అనగా గురుపాదములపై శిరమునుంచి తన భుజములు, పాదములు, మోకాళ్ళు వక్షస్థలము నేల కంటునట్లు కఱ్ఱవలె చాచి బోరగిలపరుండి గురుపాదమును కంటితో చూచుకొనుచు, వాక్కుచే నమస్సులర్పించుచూ, మనస్సుచే సర్వార్పణబుద్ధి బూని, దృఢభావనతో ధ్యానించుచు చేయు నమస్కారమని, శరణాగతియని యనవచ్చును.

పాదములకే ఎందుకు నమస్కారము చేయవలెననగా చేతివేళ్ళకొనలు, పాదాంగుష్టములు శరీరము యొక్క కొసభాగములు వాటి ద్వార శరీరమునందలి ప్రాణశక్తి విద్యుత్ప్రవాహమువలె ప్రసరించుచుండును. ఆ పవిత్రశక్తిని గ్రహించి తనశరీరమందు పూరించుకొనుటకే పాదనమస్కారము నిర్ణయించబడినది. పాదములను తాకకుండగనే

---

వైకుంఠము = విష్ణువుండెడిస్థానము, వైకుంఠుడు = ఒక జన్మమున వికుంఠయను నామెకు జనించిన వాడు = విష్ణువు.

దూరముగ సాష్టాంగ నమస్కారము చేయుటవల్ల ఈ ప్రయోజనము చేకూరదు.

**"సాధునాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనం"** అని చెప్పబడినది. అందుచే గురు పాదములను శిష్యుడు స్పృశించుట, గురువు శిష్యునికి హస్తమస్తక సంయోగము చేయుట ఇదియే స్పర్శ దీక్ష.

సాష్టాంగ నమస్కారములో ఆత్మార్పణ మెట్లు యిమిడి యున్నదో "లమిత్యాది పంచపూజ" లలో గురుగీత యందు ప్రసిద్ధముగా జెప్పబడినది. ఇందు సర్వము గురునికి శిష్యుడు అర్పించుకొనుచున్నాడు. అంటే బ్రహ్మాండమందలి పంచభూతములు, వాని వాని స్థూల, సూక్ష్మ, కారణ రూపములతో సహా అర్పణ యగుచున్నవి. పిండాండము, పిండాండ మందలి అహము అర్పణ యగుటలేదు. అంగడిలోని బెల్లము ఆలయములోని లింగమునకు నివేదన చేసినట్లున్నది. అందువల్ల తనకేమి లాభము లేదను సంశయము కలుగువచ్చును. కాని బ్రహ్మాండము నుండి పిండాండ ముత్పత్తి అయ్యెనని తెలుసుకొన్నవారికి ఈ అనుమానము కలుగదు. కారణమునే అర్పించుకొన్నప్పుడు కార్యమును మిగుల్చుకొనునా? బంగారు వుంగరములో బంగారము యిచ్చివేసి వుంగరమును దాచుకొనగలదా? బ్రహ్మాండమును అర్పించునపుడు పిండాండము సహితము అర్పణజేసి యున్నాడన్నమాట.

"ల మిత్యాది పూజలు మానసికములే అయినను,

"లం" పృథివ్యాత్మనే గంధ తన్మాత్రా, ప్రకృత్యానందాత్మనే, శ్రీగురుదేవాయ నమః పృథివ్యాత్మకం గంధం సమర్పయామి. అన్నప్పుడు మంచిగంధము అర్పించుట క్రియారూపము గాదు. సాష్టాంగముగ ప్రణమిల్లుచు రెండు చేతులు గురుమూర్తి పాదాంగుష్ఠముల క్రిందికి చేర్చి గంధమును గుర్తెరుగునది ఘ్రాణేంద్రియము గనుక తన నాసికము (ముక్కు)చే గురుమూర్తి అంగుష్టములను తాకవలెను. తన స్థూలశరీరమందలి పృథివ్యాంశ గుణములగు నరములు, అస్తులు, చర్మ, నఖ, రోమ, మాంసాదులను తన సూక్ష్మశరీర మందున్న గంధతన్మాత్రవలన కలిగిన కర్మేంద్రియ పంచకమును తన కారణశరీర మందలి లం బీజరూపమగు ప్రాణచలనమును గురుమూర్తి కర్పించుచున్నానని భావించవలెను.

అట్లే స్థూలశరీరమందలి ఆకాశ, వాయు, అగ్ని, జల భూతముల యొక్క స్థూలాంశ గుణములను, సూక్ష్మశరీరమున ఆయా తన్మాత్రలచే గలిగిన యింద్రియములను కారణ శరీరమున ఆయా బీజ సంబంధమగు ప్రాణచలనమును అర్పించుచున్నాని భావించవలెను.

ఆకాశము నర్పించునపుడు శబ్దమును గ్రహించు చెవులు, వాయువు నర్పించునపుడు స్పర్శను గుర్తించు త్వగింద్రియ చిహ్నములుగా చెంపలు, అగ్నినర్పించునపుడు రూపమును గుర్తించు నేత్రములు, జలము నర్పించునపుడు రసమును గుర్తించు పెదవులు గురుమూర్తి పాదాంగుష్టములకు తాకించవలెను. "సం" సర్వాత్మనే సర్వతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే, శ్రీగురుదేవాయ నమః, సర్వాత్మకాన్ సర్వోపచారాన్ సమర్పయామి" యన్నప్పుడు పంచ తన్మాత్ర స్వరూపమైన ప్రత్యగాత్మ పరమాత్మల రూపముగా నున్న అఖండాత్మ స్వరూపమునే అర్పించవలెను.

ఈ విధముగా తన యందలి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరముల నాల్గింటిని ఏమియు మిగుల్చుకొనకుండ అర్పించు భావన ప్రధానమైనది. అప్పుడు గురుమూర్తి అంగుష్ఠముల క్రింద నుండి చేతులు కూడ తీసివేసి ఏ పట్టులేక తన బ్రహ్మరంధ్రముచే తన గురుపాదాంగుష్ఠములను తాకించుచు సర్వమును విస్మరించి యుండుట శరణాగతి. కావున

సాష్టాంగనమస్కారము ఇట్టిమహత్తర భావోపేతమైనదని గుర్తించవలయును.

సాష్టాంగనమస్కారము వలన స్థైర్యము (చంచలత్వములేని స్థితి, భయ రాహిత్యము, దృఢత్వము గలిగి నీ స్వరూపమునే పొందు అనుభవము) అభిమాన అహంకార రాహిత్యము కొరకు సాష్టాంగనమస్కారము విధింపబడినది. అభిమాన అహంకారముల వీడిన వానికే పూర్ణబోధ. కనుకనే శ్రీకృష్ణదేశికప్రభువులు శరణాగతి ప్రాముఖ్యతను తమ కందార్థములలో క.ద. 22॥ "తన పుణ్యోదయమున గురునిగాంచి యురుతర భక్తిన్ శరణని మ్రొక్కి" అని క.ద. 25॥ "చరణధూళిని రెండు కరముల గొని తన శిరమున ధరియించి శరణాని యాశిష్యు దెరిగించు మనెనూ" అని మరియు "శరణన్నవారి మస్తకమందు చెయి బెట్టి తిరముగ యెరుకను దీసివేయని వాడు ఎందు కోయన్నా" అని చెబుతు వచ్చినారు.

సాష్టాంగ నమస్కారయుతమగు ఈ శరణాగతి కింత ప్రాముఖ్యత ఎందుకీయవలెనంటే నవ విధభక్తులలో కడపటి దగు ఆత్మనివేదనమనగా నిదే. ఏమి మిగుల్చుకోకుండ సర్వార్పణము చేయు విధానమిదే.

**5. స్వామిన్ :** గురువు నెడల భక్తి కలిగి పరమాత్మస్వరూపుడే నన్న భావము శిష్యునికి దృఢ పడవలెను. గురువును శిష్యుడు ఎట్లు సంబోధించవలయునో గురుగీత చక్కగా వర్ణించినది:

శ్లో॥ ప్రభో! దేవ! కులేశానాం స్వామిన్! రాజన్! కులేశ్వర!
ఇతి సంబోధనైర్భీతో గురుభావేన సర్వదా॥ గు॥ గీ॥ 126

గురువు యెడల భీతి కలిగి తనకన్న యెన్నో రెట్లు గొప్పవాడైన పరమాత్మ స్వరూపుడనే భావము యేక్షణమందు మరువక గురుమూర్తిని పరమాత్మను సంబోధించిన రీతిగానే ప్రభో! దేవ! స్వామి! రాజ! కులేశ్వర! అని సంబోధించవలయును. అట్లు సంబోధించుట వల్ల తనవంటి మానవ మాత్రుడే అను భావము పూర్తిగా నశించి పోవును.

స్వామిన్ అనగా యజమాని, అధికారి, దేవుడు, భర్త, ఆచార్యుడు అని నానా అర్థములు గలవు. గురు శిష్యుల న్యాయములో స్వామి భృత్య సంబంధము తీసుకొనవలెను. ఏల ననగా ద్వైత సిద్ధాంతములో భగవంతునికి భక్తునికి గల సంబంధము, భగవంతుడు ప్రభువుగా, భక్తుడు కింకరుడుగా నుండు సేవా భావమే భక్తిగా కొనియాడబడినది. ఆంజనేయుని భక్తి ఈ కోవకు చెందినది. నేను నీ వాడను అను భక్తి భావములో నీ అంశ స్వరూపుడను. కనుక నీ ప్రేమకు అధికారిని అనుకొను అహమున్నది. నీవే నేనను అద్వైత బుద్ధిలో యీ అహమున్నది. కాని స్వామి భృత్య సంబంధములో తనకు బాధ్యతలే గాని హక్కులు లేవు. ఏ యాపేక్షలేకుండ ఎట్టి జీత భత్యములు లేకుండ స్వామి ఆజ్ఞలను ఆంజనేయునివలె పాలించుటయే ఇందలి భావము.

కుల శేఖరాళ్వార్ ముకుంద మాలలో చెప్పుకొన్నట్లుగా తాను "భృత్యస్య భృత్య పరిచారక భృత్య" భృత్యుడుగా గురువును యెట్టి అహంకారము లేక సేవించుట ధర్మము. గురువును "స్వామి" అని సంబోధించుట యెంతయో యుక్తముగా నున్నది.

**6. సర్వలోకైక నాథ :** అన్ని లోకములకు నాథుడైన వాడు శివుడు.

**7. బ్రహ్మైవాహం భ్రాంతి నాశం కురుష్వ :** అనగా **"నేను బ్రహ్మనైతిని"** అను భ్రాంతి నాశనము చేయుము అని కోరెను. "నేను బ్రహ్మ" నైతిని అనుట ఎట్లు భ్రాంతియో తెలుసుకొందము. యజుర్వేద బృహదారణ్యక ఉపనిషత్ నందలి "అహంబ్రహ్మాస్మి" అను

మహా వాక్యమున అహం = నేను, బ్రహ్మ =బ్రహ్మను +అస్మి =అయితిని అను మూడు పదముల లోను "అహం" పదము ముఖ్య వృత్తిచే జడమైన అహంకారమును, గౌణవృత్తిచేత, లక్షణా వృత్తిచేత బుద్ధి సాక్షిగా నుండి "నేను" అని స్ఫురించు ప్రత్యగాత్మను సూచించుచున్నది. వాచ్యార్థమైన జడమగు అహంకారమును త్రోసివేసి, లక్షణావృత్తిచే కూటస్థ చైతన్యమునే గ్రహించవలసియున్నది. స్వతః పూర్ణమై యున్న పరమాత్మయే బ్రహ్మము పదమునకు లక్ష్యార్థము. బుద్ధి వృత్తులకెల్లను సాక్షియైయుండు కూటస్థాత్మయగు నేనే బ్రహ్మను "అస్మి" అనగా అయితిని అని "అహం బ్రహ్మాస్మి" యను మహావాక్యమునకు లక్ష్యార్థము. నేను బ్రహ్మనైతిని యని నెరుగుటయే తొలి భ్రాంతి. ఇందు **"నేను"** అను అహంకారము మిగిలి యున్నది.

తాను బ్రహ్మ మయుడగుట యననేమి?

**"ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం"** అనగా కానవచ్చేది, తోచి వచ్చేది సమస్తము పరమాత్మ స్వరూపమే. "బ్రహ్మణోన్యం నకించన" అనగా ఆ బ్రహ్మము కంటే అన్యమైనది కొంచమైనలేదని శ్రుతులు ఘోషించుచున్నవి. అపుడింక బ్రహ్మమయుడగుట అంటే ఏమిటి? ఇదివరకు బ్రహ్మమై యుండక పోతే క్రొత్తగా బ్రహ్మము కావలసి యుండును. ఇదివరకే బ్రహ్మవైయుండియు అది విస్మరించి నేను బ్రహ్మముగా మారి పోవలెనని కోరుట అజ్ఞాన కార్యమే. దీనికే "ప్రాప్త ప్రాప్తవ్యము" అని శాస్త్రజ్ఞులు పేరిడిరి. ఇందుకు "కంఠచామీ కరవత్" అనగా మెడలోనే హారమున్న సంగతి మరచి దాని కొరకై వెదుకులాట వంటిదని దృష్టాంత మిచ్చియున్నారు.

మానవుడు ఉపాధి గతుడై తన నిజరూపమును మరచి దేహ తాదాత్మ్యము చెంది తనను గూర్చి పరిపరి విధములుగా చెప్పుకొనుచున్నాడు.

నేను సన్నగా, తెల్లగానున్నాను అని స్థూలదేహముతో తాదాత్మ్యము చెంది పలుకుచున్నాడు.

సుషుప్తియందు నేనేమి ఎరుగను అని సూక్ష్మదేహముతో తాదాత్మ్యం చెంది పలుకుచున్నాడు.

నేను పండితుడను, పారమార్థికుడను, అజ్ఞానిని అని కారణదేహముతో తాదాత్మ్యము చెంది పలుకుచున్నాడు. కాని

మహాకారణ శరీరముతో తాదాత్మ్యము చెంది 'అహంబ్రహ్మాస్మి'. నేను బ్రహ్మనైవున్నాను అని యదార్థ దృష్టిని పూని యుండుటలేదు. అట్టి ఆత్మదృష్టితో ప్రాపంచిక వ్యవహారములు అసలే జరుపుటలేదు. కాని **బ్రహ్మతాదాత్మ్య స్థితిలోనుండి జీవయాత్ర సాగించినచో తాననే వ్యష్టి దృక్పథము నశించి నిస్వార్థపరుడై యొప్పారును. అట్టివానికి బుద్ధ్యాది సమస్తము మాత్రమే గాక తన శరీరమనకు బయట తోచబడే సమస్తము కూడ బ్రహ్మమే అను అఖండాత్మ దృష్టియుండును. ఇదే బ్రహ్మమయమగుట.** అపుడు ఆతని చిత్తము బ్రహ్మాకారవృత్తియని అనతగును. అపుడు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయరూపమగు త్రిపుటి భేద మంతరించి "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అనె శ్రుత్యర్థము సార్థకమగును. అఖండ బ్రహ్మాకార వృత్తి కేవలం గురుకృపవల్ల సాధ్యపడును.

**8. భ్రాంతి నాశనం కురుష్వ :** భ్రాంతి నాశనము చేయుమని కోరెను. అట్లు కోరుటలో ఏ భ్రాంతి నాశనము చేయుమని కోరెను? అనగా ఏది భ్రాంతి చెందుచున్నది.

"ఏకమేవాఽద్వితీయం(బహ్మ" అని కొనియాడబడిన వస్తువునకు (అధిష్ఠానచేతన (బహ్మమునకు) "బహుస్యాం (ప్రజాయేయేతి" అని సంకల్పము కలుగుటయే తొలి (భాంతి. ఆ (భాంతియే "అన్నియు తానైనది" తానై సమస్తము నందు భేదబుద్ధి బూని అవి తనకంటే వేరని తానువేరని (భాంతి చెంది రాగద్వేషములకు లోనగుచున్నది. ఆవిధముగా (భాంతి, (భాంతి చెందే వస్తువు, (భాంతి కలిగించే వస్తువు తానై (త్రిపుటి రూపముగా నున్నది. అఖండ జ్ఞాన స్వరూపమయ్యును (భాంతి చెందనేల? అంటే అది కేవలం జ్ఞాన స్వరూపముగా లేదని, ఆ యెరుకయే మరుపు రూపమైన అజ్ఞానము చెందుచున్నదని సులభముగా అర్థము చేసుకొనవచ్చును. ఏలననగా జ్ఞానము వల్ల ఉన్నది వున్నట్లుగా గోచరించదు. దీనినే అన్యదాఖ్యాతి అందురు. ఉన్నది వున్నట్లుగాక అన్యవస్తువుగా గోచరించుట విక్షేపము. తాడే గోచరించక పోవుట ఆవరణ దోషము. తాడు తాడుగా కాక పాముగా గోచరించుట విక్షేపము. విక్షేపమే (భాంతి. ఎరుకయే (భాంతికి కారణము.

**9. ఈశ ! :** ఈశ్వరుడు, (ప్రభువు, సంబోధక పదము.

**10. ఏ తద్వ్యాపో వ్యాప పరాత్పరం పూర్ణం :** ఆ పరాత్పరమైన పరిపూర్ణము ఏవిధముగా వ్యాపించియున్నది అని అర్థము. పరమాత్మకు పరమైనది పరిపూర్ణము. అట్టి పరిపూర్ణము ఎట్లు వ్యాపించి యున్నది తెల్పుమని శివుని విష్ణువు అడిగెను.

**11. ఉపైతినాథో :** ఉపైతి అనగా సమీపించ తగినది. పొంద దగినది పరమాత్మ కంటే పరమైన పరిపూర్ణ పర(బహ్మమునకు దగ్గరగుట యనగా పరిపూర్ణపర(బహ్మము అపరోక్ష మగునా? అని పశ్నించినారు. పరిపూర్ణము (ప్రత్యక్షము గాదు, పరోక్షముగాదు. అది పరిపూర్ణ గురువు చేత అపరోక్షము కావలసి యున్నది. అనగా దగ్గర గావలసి యున్నది. అపరోక్షము అనగా యథాతథముగా అనగా ఉన్నది వున్నట్లుగా తెలియుట. పరిపూర్ణము లేనెరుక యను రెంటిలో పరిపూర్ణపర(బహ్మమే సత్యమై, నిత్యమై, చలించక ఏకమై అంతట నిండి నిబిడీ కృతమైయున్నది. అది వస్తువుగా ఎన్నడు మారలేదు. లేనెరుకే సర్వముతానే అయినది. అట్టి ఎరుక పరిపూర్ణమందు లేదు గనుక లేనెరుక యని పేరొందినది. కనుక లేనిదే. పరిపూర్ణమే యున్నది అని పరిపూర్ణబోధచే తెలిసి భావించుటపరోక్షజ్ఞానము. లేని యెరుకతో దానిని కనిపెట్టుట (ప్రత్యక్షము. లేని ఎరుక లేకుండ పోవుటయే అపరోక్షము లేక పరిపూర్ణమునకు దగ్గరగుట. పంచతన్మాత్రరహితమందే పరిపూర్ణపర(బహ్మము యొక్క నిశ్చయము. లేనెరుక యగు తాను లేకుండ పోవుటయే పరిపూర్ణ బోధయందు అపరోక్షమని తెలియవలయును. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు ఈ అర్థములోనే క.ద. 209 "అపరోక్షమౌనె మనుజుల। కు పరోక్షంబైన బయలు గురుకృప లేకన్ । అపరోక్షమౌను మనుజుల। కు పరోక్షంబైన బయలు గురుకృపగలుగా। కీలిదే లేని। యెరుకతా తోలుగా" ॥ అని గానము జేసియున్నారు.

**12. విష్ణోర్భక్త్యా :** శివుడు విష్ణు భక్తికి మెచ్చి.

**13. సమాదరాత్ :** అనగా సగౌరవముతో అని అర్థము. సాధారణముగా గురువులు తమ శిష్యుల యెడ ఆదరముతో (ప్రవర్తించెదరు. శిష్యులను కన్నకొడుకులవలె జూతురు. పుత్రుని పై వాత్సల్యము చూపినట్టుగనే గురుడు తన శిష్యునిపై జూపును. శిష్యుని సంబోధించునపుడు గురుడు శిష్యుని సమాదరముగా అబ్బీ, ధన్యచరిత్రా, తండ్రీ, మాన్యచరితా, బంగరుకొండ, పావన చరితా, పావనశీల అని మరెన్నో రీతుల సంబోధింతురు. అట్లే

శివుడు కూడ శిష్యుడైన విష్ణువు భక్తికి మెచ్చి సగౌరవముగా పరిపూర్ణమును గూర్చి చెప్పదొడగెను.

**14. పంచవక్త్ర ఉవాచ :** ఐదుముఖముల గలశివుడు యిట్లు చెప్పదొడగెను. పంచవక్త్ర యనగా ఐదుముఖములు గలవాడు శివుడు. శివునకు ఐదుముఖములు గలవు అవి :

1. సద్యోజాత (పశ్చిమ) ముఖము. ఆవిర్భవ నకార ప్రధానము.
2. వామదేవ (ఉత్తర) ముఖము. ఆవిర్భవ మకార ప్రధానము.
3. అఘోర (దక్షిణ) ముఖము. ఆవిర్భవ శికార ప్రధానము.
4. తత్పురుష (తూర్పు) ముఖము ఆవిర్భవ వకార ప్రధానము.
5. ఈశాన (ఊర్ధ్వ) ముఖము ఆవిర్భవ యకార ప్రధానము.

శ్రీశంకర పూజ్యపాదులు "కుహరే పంచముఖోఽస్తి మే కుతోభీః" అని శివానందలహరి 44 వ శ్లోకములో సదాశివుని ప్రార్థించియున్నారు. అనగా ఐదుముఖములు గలవాడు అగు సాంబసదాశివుడు సహాయకునిగా నామనస్సునందు గలడు. కావున నాకు భయములేదు. స్వరూప జ్ఞానము నొంది "అహంబ్రహ్మాస్మి" అని అనుభవపూర్వక జ్ఞానము నొందిన జీవుడు బ్రహ్మమే యగును. అప్పుడు అద్వైతికి భయమేమి యుండదు. ఇట్టి పంచముఖుడు యిట్లు చెప్పదొడగెను.

**శృణుశిష్య మహచ్ఛ్రేష్ఠం। వేదవేదాంత నిశ్చితమ్**
**తత్సర్వం కృపయా వక్ష్యే శృణు సద్భక్తి మానసః** ॥౦॥

శిష్యుడా! మహత్తరమై మహాశ్రేష్ఠమైన ఆ పరిపూర్ణపరబ్రహ్మము వేదము లందును, వేదాంతము లందును, అనగా వేద శిరస్సులనబడే ఉపనిషత్తు లందు నిశ్చయమైన దాని నంతయు దయతో చెప్పెదను. సద్భక్తి మనస్సుగలవాడవై వినుము అనెను.

**1. శృణు శిష్య :** శిష్యా! వినుము అని సంబోధించుటలో నీలకంఠుడు (దక్షిణామూర్తి, ఆదిగురువు) తన శిష్యుడైన విష్ణువును శిష్యాయని సంబోధించినాడు. గురుస్థానమున నుండి తన శిష్యుడైన విష్ణువునకు ఈ విధముగా చెప్పుచున్నాడు.

**2. మహచ్ఛ్రేష్ఠం వేదవేదాంత నిశ్చితమ్ :** మహాశ్రేష్ఠమైన పరిపూర్ణపరబ్రహ్మమును గూర్చి వేదము లందు, వేదాంతములనబడే ఉపనిషత్తులందు నిశ్చయముగా జెప్పబడినది.

పరిపూర్ణమును గురించి ముఖ్యముగా వేదములందు, వేదాంతములనబడే ఉపనిషత్తులందు బహు చక్కగా జెప్పబడినది. మానవునకున్న విశేషవిజ్ఞానముచే ప్రాపంచిక విషయములనే గాక పారమార్థిక విషయములను గూడ తర్కించి, విమర్శించి, పరిశోధించి సమస్త విషయములను తెలుసుకొంటు సర్వజ్ఞత్వమునకు దగ్గరగుచున్నాడు. కాని వాక్కుల కందని పరిపూర్ణభావము అట్లు తెలియుటకు వీలులేదు. ఎందుకనగా పరిపూర్ణపరబ్రహ్మమును సర్వజ్ఞత్వ లక్షణములు గల అధిష్టాన చేతనబ్రహ్మము అనగా ఎరుకకూడ తెలసికొన జాలదు. ఆ పరిపూర్ణ మందు ఎరుక లేదు. కనుక తెలియరాని పరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్య, లక్ష్యార్థ రూపములో ప్రచురపరుచుట వేదముల, వేదాంతముల ముఖ్యోద్దేశము. మిగత విషయముల గూర్చి వేదములు, ఉపనిషత్తులు తెలుపనక్కర లేకనే తెలుసుకొనగలడు. ఏలననగా ప్రత్యక్షముగా జీవ జగత్తులు తెలియబడుచున్నవి. వీని స్థితి, లయముల కాధారమగు సగుణ నిర్గుణరూపమగు బ్రహ్మమును కూడ అనుమాన ప్రమాణములచే నూహించి అతీంద్రియబుద్ధిచే గ్రహించవచ్చును. మనోవాక్కుల కందనిది, నిరపేక్షమైనది,

నిష్ప్రతియోగికమైనది, శుద్ధ నిర్గుణమైనది, ఆత్మాతీతమైనది ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును తెలుపుటయే వేదముల పరమ ఆశయము. వేదములందు ఉపనిషత్తులందు అక్కడక్కడ, పరిపూర్ణ భావమున్నను యితర మతముల వారలు తమ మతానికి అనుకూలంగా వాటిని మలుచుకొని అన్వయించినారు. ప్రస్తుతము తెలుగు అనువాదముతో పాటు వివరము సమకూర్చునటు వంటి అనన్తోపనిషత్తు, మరియు సర్వసారపూర్ణోపనిషత్తులు సంపూర్ణగా పరిపూర్ణ భావమునే ఉద్ఘాటించుచున్నవి. మహత్తరమైన శ్రేష్ఠమైన వేదములందు, ఉపనిషత్తులందు నిశ్చయించబడిన పరిపూర్ణ భావమును గూర్చి దయతో చెప్పెదను. సద్భక్తి మనస్సుగలవాడవై వినుమని శివుడు విష్ణువునకు యిట్లు చెప్పదొడగెను.

**3. తత్సర్వం :** పరిపూర్ణమునకు సంబంధించిన సర్వమును అని అర్థము.

**4. కృపయావక్ష్యే :** దయతో చెప్పెదను.

**5. శ్రుణు సద్భక్తి మానస :** భక్తి మనస్కుడవై వినుమని శివుడు విష్ణువునకు జెప్పదొడగెను.

**కాయస్యాం తేబహిశ్చైవ జ్ఞానం నాస్తీతి నిశ్చితం**
**బ్రహ్మాండ వ్యాపితం పూర్ణం పూర్ణమంతర్బహిస్థితం** ॥౨॥

శరీరమునకు లోపల వెలుపల జ్ఞానము లేదనుట నిశ్చయము. పరిపూర్ణపరబ్రహ్మము బ్రహ్మాండ మంతట వ్యాపించియున్నది. అది బ్రహ్మాండము లోపల వెలుపల స్థిరముగానున్నది.

**1. కాయస్యాం తే బహిశ్చైవ, జ్ఞానం నాస్తీతి నిశ్చితం :** అనగా శరీరమునకు లోపల వెలుపల జ్ఞానం లేదనెడిది నిశ్చయము.

**జ్ఞానం :** జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్రజ్ఞానము వస్తుజ్ఞానమును సంపాదించును. విశేషార్థమేమనగా బ్రహ్మ చైతన్యము, బ్రహ్మాకారవృత్తి, స్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తానుతానై యున్నస్థితి. ఇట్టి జ్ఞానము శరీరమునకు లోపల వెలుపల లేదనుట ఎట్లో పరిశీలింతము .

మన శరీరము ఒక జగత్తు. కనుక ఈ శరీరము జడరూపములో నున్నప్పుడు శరీరమునకు లోపల వెలుపల జ్ఞానము ఏ కొంచమైన లేదు. తాను శరీరముగా యేర్పడి అందు అనుప్రవేశము గావించిన వెంటనే అందు చేతనము కలిగి జ్ఞానముద్భవించినది. మళ్ళీకాయము వదిలినప్పుడు ఈ జ్ఞానము శరీరమున లేకుండ పోవుచున్నది. ఈ విధముగా సృష్టికి మొదట జ్ఞానము లేదు. సృష్టి అయినప్పుడు జ్ఞాన మేర్పడినది. ప్రళయమందు ఈ జ్ఞానము శరీరమందు లేకుండ పోవుచున్నది. అంటే జ్ఞానము శరీరమునకు లోపల వెలుపల ఎప్పటికి యేకరీతిగా వుండుట లేదనుట సత్యము. కావున జ్ఞానము కాయమునకు లోపల వెలుపల లేదనుట నిశ్చయము. క.ప. 123. "ఎరుగుట జ్ఞానము దానను। జరిగెపని కర్మమనుచు। జనులెన్నిరియా। ఎరుకయు కర్మములేనిదె" అని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. **"సత్వాత్ సంజాయతే జ్ఞానం"** అనగా సత్వగుణోద్భవమైనది జ్ఞానమని శ్రీకృష్ణభగవానుడు అర్జునునికి ప్రబోధించియున్నాడు. కనుక జ్ఞానమునకు జన్మాదులు కలిగియున్నవనుట యదార్థము. క.ప. 125 **"పుట్టింది గిట్టు జ్ఞానము"** ప్రకారము జ్ఞానమునకు గిట్టుట యున్నదని అనడములో సందేహములేదు. పుట్టుక గల జ్ఞానమును 'ప్రజ్ఞానం బ్రహ్మ' యని "అహం బ్రహ్మాస్మి" యని "తత్వమసి బ్రహ్మ" యని "అయమాత్మబ్రహ్మ"

యని వార్తీకపద్ధతి ప్రకారము బ్రహ్మమే తాననుకొని నంత మాత్రమున జనన మరణ భ్రాంతి తొలగదు. పై వివరముల ద్వార ఎరుకైన జ్ఞానము పుట్టింది గిట్టుతుంది, కనుక లేనిది. కావున జ్ఞానము శరీరము వెలుపల లోపల లేదనుట నిశ్చయము.

**2. బ్రహ్మాండ వ్యాపితం పూర్ణం, పూర్ణమంతర్బహిస్థితం :** అనగా పరిపూర్ణము బ్రహ్మాండమంతట, లోపల వెలుపల స్థిరముగానున్నదని అర్థము. బ్రహ్మాండమనగా స్వర్గ, మర్త్య పాతాళలోకములని లోక నిర్ణయము గలది. మరియు బ్రహ్మాండమనగా బ్రహ్మము దానికి యావరణ రూపమైన శరీరతుల్యమగు ఆకాశము ఈ రెండింటితో కూడినది బ్రహ్మాండమున కర్థము.

కాయమందు (శరీరమందు) చతుర్దశలోకములు గలవని శ్రీ పరుశురామ నరసింహదాసుగారు తమ భద్రాది శతకము నందు వివరించియున్నారు.

31. సీ॥ అతలంబు పాదముల్ వితలంబు గుల్బముల్ జంఘలు సుతలంబు జానులందు... సత్యలోకంబు నీ నివాస్థలంబు ॥రమ్య॥

అనగా అతలము పాదములు, వితలము గుల్బలములు, సుతలము జంఘలు, తలాతలములు జానువులు, మహాతలము ఊరువులు, రసాతలముగుహ్యము, పాతాళము కటి, భూలోకము నాభి, భువర్లోకము ఉదరము, స్వర్గలోకము హృదయము, మహర్లోకము వక్షము, జనలోకము గళము, తపోలోకము భ్రూమధ్యము, సత్యలోకము మూర్ధ్నియని జెప్పియున్నారు. కనుక శరీరము బ్రహ్మాండమే. ఆ బ్రహ్మాండమునకు లోపల వెలుపల పరిపూర్ణమే వ్యాపించి స్థిరమై యున్నది. ఈ భావమునే శ్రీకృష్ణదేశిక ప్రభువులు 147 కందార్థదర్పు నందు :

**"ఏ పరిపూర్ణ మేనికి । లోపల వెలినిండియుందు । లోపము లేకన్। ఆ పరిపూర్ణమె జగతికి । లోపల వెలినుందు దాని । లోనే వున్నవిరా । పై రెండెవ్వి లేని వెన్నకురా । యీ పరిపూర్ణ బోధచే । పై ప్రపంచ శరీర రూపము । లెడబాపు । మీ పట్లనె । "**
అనగా ఏ పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల నిండి నిబిడీకృతమై యున్నదో ఆ పరిపూర్ణమే జగతికి లోపల వెలుపల నిండి యుండును. దాని యందే ఈ శరీరము జగము రెండు తెలియుచున్నవి. ఇవి లేనివే కనుక వీటిని తలువకుము. అచలపరిపూర్ణ బోధచే పై ప్రపంచ శరీరముల రూపములను (చక్షురేంద్రియ గోచర స్వభావము) ఈ క్షణమే విడువుమని శిష్యునికి హితవు పలికినారు. మరియు క.ద. 34. నందు **"ములు గ్రుచ్చ సంధి లేకను । కలిగున్నది బట్టబయలు । గదరామాయన్నా।"** అంటే అంతట ములుగ్రుచ్చుటకు సందులేకుండ పరిపూర్ణమే నిండియున్నది.

బ్రహ్మాండమున్నదనుటయే భ్రాంతి. ఎట్లనగా వటవృక్షమునకు బీజము అణుమాత్రముగా నుండును. వాతావరణము అనుకూలించిన అది మహా వృక్షమగును. అగ్ని వలన ఆవృక్షము బూడిదగును. వాయువు వీచగా ఆ బూడిద కూడ లేకుండ పోవును. ఇంత వృక్షము ఎచట నుండి వచ్చెను, మరి యెచటికి పోయెనో తెలియదు. కాని గుర్తు మాత్రముండును. ఎరుకైయున్నంత వరకు ఆ గుర్తుండును. మరుపునందు ఆ గుర్తు లేకుండ పోవును. గనుక బ్రహ్మాండ మున్నదనుట భ్రాంతియని సిద్ధాంతము. దీనివలన తేలినదేమనగా బ్రహ్మాండము లేనిదే. ఉన్న దొక్క సత్యమే. అదే పరిపూర్ణము. అది

అంతట నిండి యున్నదంటే తోచే విశ్వమునకు లోపల వెలుపల స్థిరమై యున్నది.

**పూర్ణమన్యంతరం నాస్తి తచ్ఛివం సదుపాస్యసి**
**నేతి నేతీతి నేతీతి శేషితం పూర్ణ ముచ్యతే** ॥3॥

పరిపూర్ణపరబ్రహ్మము తప్ప ఇతరమైన దంతయు లేనిది. ఆ సద్వస్తుదార్థమైన శివమును ఉపాసింపుము. అతద్వ్యావృత్తి లక్షణముచే అనగా యిదికాదు, యిదికాదు, యిదికాదు అంటూ నామరూపము లన్నిటిని నిషేధించగా మిగిలినదేదో అదే పరిపూర్ణమని చెప్పబడినది.

**వివరములు :**

**1. పూర్ణమన్యంతరం నాస్తి :** పరిపూర్ణమందు అన్యమేమిలేదు. పరిపూర్ణము తప్ప తదన్యమంతయు ఎరుక స్వరూపమే. ఆ లేనెరుక దానందు యీషణ్మాత్రము లేదు. పూర్ణము గుర్తించు యెరుక పరిపూర్ణమందులేదు. కనుక అది గుర్తింపబడజాలదు. అట్లని అది శూన్యం కాదు. అది యేకైక ఆస్తిక్యతగలది. దానిని తెలుసుకొనే తెలివిలేదు. ఇంద్రియ రూపముగాను అతీంద్రియ రూపము గాను వున్నదెరుకే. పరిపూర్ణమట్టి అతీంద్రియ రూపమైన ఎరుకచే గూడ గుర్తింపరానిది. దాని యందు పంచతన్మాత్రలు లేవు. కనుక అది దేనికిని విషయము కాజాలదు. ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు 54 క.ప॥ **"పరిపూర్ణ మొకటి దక్క। నితరమైన ప్రపంచ మెల్ల దగదెలియుము। నీ వెరుకేనని మది లోపల"** । అని సెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణ పరబాహ్య మొకటి దక్క ప్రపంచమంతయు యెరుకయే యని మనుసులో యెరుగుమని వక్కాణించియున్నారు. కావున పరిపూర్ణ పరబ్రహ్మమందు అన్యమైన వస్తువు లేదనుట రూఢి యగును.

కారణములేని కార్యము విశ్వములో యేదియును లేదు. ఉండుట అసంభవము. కనుక సృష్టికారణమైన బ్రహ్మమునకు ఉనికి లేదు. కలయందు తోచిన శరీరము వలెనే కలయందు మాత్రమే వున్నట్లు తోచబడును గాని మేల్కొనిన పిదప ఈషణ్మాత్రము ఎట్లులేదో అట్లే గుర్తెరిగే శరీరమునకు "ఆకాశం శరీరం బ్రహ్మ" అనునట్లుగా మనస్సునకు గోచరించు మహాకాశమే శరీరము గానున్నదో, దానికి పరిపూర్ణపరబ్రహ్మమందు స్థానముగాని మూలం గాని లేదు.

**2. తచ్ఛివం సదుపాస్యసి :** మంగళకరమైన శివము అనగా పరిపూర్ణపరబ్రహ్మమును ఉపాసించుము అని అర్థము. పరిపూర్ణము తాను గానిది. తాను గాని దానిని ఎట్లు ఉపాసించవలయును.

అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమునకు "మ్రొక్కేరితర జేజేలు" అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారి కందార్థము. ఆత్మస్వరూప నిశ్చయ జ్ఞానపరులే యితర జేజేలు. అట్టి వారి కన్యమై, వారిచే సేవించదగినది ఈ పరిపూర్ణపరబ్రహ్మమే. సేవ లేక ఉపాసన అనుటతోనే 'సేవ్యవస్తువు' 'సేవ' 'సేవకుడు' లేక ఉపాస్యవస్తువు, ఉపాసన, ఉపాసకుడు అనె త్రిపుటి సిద్ధమగుచున్నది బ్రహ్మమే కాదు. "నేదం యదిదముపాసతే" అని కేనోపనిషత్ ప్రవచనము. కనుక శ్రీకృష్ణదేశిక ప్రభువులు క.ద. 32 **"ఎరుక లేక సేవింపదగు"** నన్నారు. ప్రత్యగ్బ్రహ్మైక్య రూపమగు తనకు దశదిశల యందున్నది ఆపరిపూర్ణపరబ్రహ్మమే.

శ్లో॥ పూర్ణమేవ నిరాలంబం అగ్నేయో నిర్గుణం తథా

..........................................................

అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః ॥

ఇందు దశదిశలే గాక అంతర్బహిశ్చయని చెప్పబడుటచే దేని ప్రాతిపదికగా ఈదశ దిశలు అంతర్బాహ్యములు చెప్పబడినవో అది పరిపూర్ణమందు వుండుటకెంత్రమాత్రము వీలులేదు. కనుకనే దానికి లేనెరుకయని శ్రీకృష్ణదేశికేంద్రులవారు పేరిడిరి. క.ద.66 లేనికల కలిగినప్పుడు। దానికి దశదిశల యందు తగమొదట కొనన్ తానంటకున్న మేల్కను। లేనికలే చూచెనేని లేకపోవుగదా" అంటూ దృష్టాంత మిచ్చియున్నారు. ఎరుకను అధిగమించి దాని ద్వాదశ స్థానములందున్న పరిపూర్ణ పరబ్రహ్మమునకు నమస్కారమంటే? ఎరుకను విడుచుటయే నమస్కారము. **ఎరుక లేక సేవించుటయే పరిపూర్ణమును ఉపాసించుట.** కనుక ఎరుక లేక సేవించుమంటుంది ఈ ఉపనిషద్వాక్యము.

**3. నేతి నేతీతి నేతీతి శేషిత పూర్ణముచ్యతే :** అనగా ఇదికాదు, ఇదికాదంటు నామరూపములన్ని నిషేధించగా శేషించినదేదో అదే పరిపూర్ణపరబ్రహ్మమని చెప్పబడినది. నేను అనేకంగావలె. శ్రుతి "అహం బహుస్యాం" అని జీవేశ్వర జగద్రూపంగా తానేవ్యాపించియున్నను సూర్య చంద్రాదులు, నక్షత్రములు, కాలత్రయములుగా తానే వ్యాపించియున్నను ఎక్కడికక్కడ పరిమిత రూపములోనే యున్నవి. దీపమొక్కచోటనే యుండినను దాని ప్రకాశము కొంత వరకు వ్యాపించి యుండునట్లుగా అహం అను గుర్తు ఒక చోట యుండినను దాని విషయావరణము ఆపాదమస్తకము వ్యాపించి మితమయ్యును పూర్ణముగా యున్నది. ఈ అహంకారమునకు మూలం అహమే కాని పరోక్షముగా నున్న పరిపూర్ణబ్రహ్మముకాదు. ప్రత్యక్ష పూర్ణమే సర్వకారణము. ఇట్టి కారణబ్రహ్మము కంటే యేది లేదని యితరులంటారు. ఈ కారణ బ్రహ్మము నీరంధ్రమైన శుద్ధ మనస్సుకు గోచరమై నేనే బ్రహ్మనని యన తగియున్నది అట్టి కారణబ్రహ్మము అచల పరిపూర్ణపరబ్రహ్మము ఎన్నడు కానేరదు. కనుక కారణబ్రహ్మమైన ప్రత్యక్ష పూర్ణము అతద్వ్యా వృత్తి లక్షణముచే నిరసించదగినదే. అతద్వ్యావృత్తి లక్షణమనగా "నేతి నేతీతి నేతీతి హోవాచ" అనగా న+యితి= ఇదికాదు ఇది కాదు ఇది కాదు, యిది కాదు అంటూ నామరూపములన్నిటిని నిషేధించగా శేషించునదేదో అది ప్రత్యక్షపూర్ణమును అతిక్రమించి యుండు పరోక్షపూర్ణము. అదే కేవల పరిపూర్ణపరబ్రహ్మమని నిర్ణయము.

**ఇదంపూర్ణ మదఃపూర్ణం పూర్ణాత్పూర్ణ ముదీర్యతే**
**పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే** ॥౪॥

ప్రత్యక్షముగా కనబడు ఈ వ్యష్టిరూపమగు నీవు నేను పిండాండము జీవేశ్వరజగత్తు పూర్ణముగా నున్నది. అపరోక్షరూపమగు సమిష్టిరూపముగా నున్న బ్రహ్మాండము, పరమాత్మ పూర్ణము గానే యున్నది. పూర్ణము నుండి పూర్ణమును విచారించగ "యద్దృశ్యం తన్నశ్యం" అనునట్లు ప్రత్యక్ష పూర్ణమైన ఈ జగత్తు లేనివస్తువే అయిపోవుచున్నది. పరోక్షముగా నున్న పరిపూర్ణమే మిగులును.

**వివరములు :**

సకలదేశములందు, సర్వకాలముల యందు సమస్తవస్తువుల యందు నిండి

నిబిడీకృతమై సూదిమోపుటకైనను సందులేక చలించక ఏకరీతిగా నున్నదేదో ఆ పరిపూర్ణము దేనిచేత తెలియరాక పరోక్షముగా నున్నది.

కార్యరూపముగానున్న జగత్తునందు కారణరూపముగా ఉన్న పరమాత్మ బంగారు నగల యందు బంగారము వలె సంపూర్ణముగా నిండియుండుటచే యిదియును పూర్ణము గానే యున్నది. విచారించి చూడగా ప్రత్యక్ష పూర్ణమగు ఈ జగత్తు (కారణ బ్రహ్మతోసహా) "యదృశ్యం తన్నశ్యం" అనె న్యాయంగా లేని వస్తువే అయిపోవుచున్నది. పరోక్షంగా నున్నపరిపూర్ణమే శేషించి సత్యస్వరూపమై మిగిలి యుండును. కనుక దానికి వ్యవహారార్థము పరిపూర్ణమని పేరు వచ్చినది. అతద్వ్యావృత్తి లక్షణముచే నామరూపములన్నిటిని నిషేధిస్తుపోతే శేషించునదేదో అది ప్రత్యక్షపూర్ణమును అతిక్రమించి యుండు పరోక్షపూర్ణము. అదే కేవలం పరిపూర్ణ పరబ్రహ్మము.

**బహిరంః స్సదాపూర్ణం పూర్ణకుంభో జలేయథా**
**అంతర్బహిశ్చతత్పూర్ణం జగతోస్తి తథాధృవం** ॥౫॥

సముద్రపునీటి యందు మునిగి యున్నకుండకు దానిలోపల వెలుపల అంతట ఎల్లప్పుడు నీరు పూర్ణముగా వ్యాపించియుండునట్లుగానే పరిపూర్ణ పరబ్రహ్మము జగత్తునకు లోపల వెలుపల నిండి నిబిడీకృతమై యున్నదనుట అనుమానము లేకుండ నిశ్చయముగానున్నది.

**వివరములు :**

**1. బహిరంతస్సదాపూర్ణం పూర్ణకుంభోజలే యథా :** అనగా సముద్రము నందు కుండను ముంచిన సముద్రము నీరు ఆ కుండ యందు చేరుటయేగాక వెలుపల ఆవరించి కుండకు అన్నిదిక్కుల మరియు క్రింద మీద లోన బయట వ్యాపించియుండును. అట్లే పరిపూర్ణము ఈ జగతికి లోపల బయట క్రిందమీద సర్వదేశాల యందు, సర్వకాలాలయందు ఆది మధ్యాంతములు లేక నిండి నిబిడీకృతమైయున్నది. సూది మోపుటకు కూడ తావులేకుండ వ్యాపించియున్నది. దానికెట్టి పరిమితి లేదు. కేవల మఖండముగాయున్నది. భద్రాద్రి రామశతక కర్త కేవల పరిపూర్ణ పరబ్రహ్మమును వర్ణించిన విధము బహుచక్కగా యున్నది.

88 సీ॥ సృష్టికి పూర్వంబు సృష్టికి పరమందు సృష్టియున్నప్పుడు సృజన లేక
సకల దేశంబుల కాలంబుల సకల వస్తువుల చంచలములేక
ప్రాగ్దక్షిణంబుల పశ్చిమోత్తరముల నాల్గుమూలలమీద నడుమక్రింద
అచలమై సత్యమై యాద్యంత శూన్యమై పూర్ణమై బట్టబయలుగాను
యేకమయ్యుండు యాద్యంత శూన్యమై అట్టి వస్తువు కేవలాత్మనగబడును
॥రమ్య॥

ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థ దర్పులందు 34 క.ద.॥ పలుకున బలుకరాకను । తలపోయుద మనిన మదికి దగులక యెపుదున్ । ములుగ్రుచ్చ సంధి లేకను । కలిగున్నది బట్ట బయలు । గదరామాయన్నా" । అని సెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణపరబాహ్యం వాచ్యార్థములకు గాని, లక్ష్యలక్ష్యార్థములకు గాని అందునట్టిది గాదు. ములు గ్రుచ్చుటకు కూడ సందులేక అంతట నిండి నిబిడీకృతమై వున్నది. అదే ప్రకారము"సంతతా మొకరీతి సకల దేశములా యందంతటా నిండున్న దదుగో పరిపూర్ణము" అన్నారు. అంటే పరిపూర్ణము విశ్వమునకు లోపల వెలుపల అంతట నిండి యున్నదని

దృఢపరుచుకొనవలెను.

**2. అంతర్బహిశ్చ తత్పూర్ణం జగతోస్తి తథాపూర్ణం :** జగత్తునకు లోపల వెలుపల పరిపూర్ణము స్థిరముగా నున్నదని ధృవపరచనైనది. శ్రీకృష్ణదేశికేంద్రుల వారు ఈ భావమునే 147 క.ద॥ **"ఏ పరిపూర్ణమేనికి । లోపల వెలినిండి యుండు । లోపము లేకన్ । ఆ పరిపూర్ణమె జగతికి । లోపల వెలినుందుదాని । లోనే వున్నవిరా । పై రెండెవ్విలేని వెన్నకురా । యీ పూర్ణబోధచే । పై ప్రపంచశరీర రూపము । లెడబాపు । మీపట్లనె".** అనగా ఏ అచల పరిపూర్ణ పరబ్రహ్మము శరీరముల బాహ్యాభ్యంతరముల గలదో ఆ కేవలాత్మనే జగత్తు యొక్క లోపల వెలుపల నిండి యున్నది. ఈ శరీరము జగత్తులు లేనివి. కనుక వీని రూపము నామము, క్రియలు గలవని యెన్నకుమని కందార్థసారము. ఈ భావము దిగువ ఉపనిషద్వాక్య మందుగలదు.

**యస్యకించిద్బహిర్నాస్తి। కించి దంతః కియచ్చన**
**యస్యలింగం ప్రపంచంవా। బ్రహ్మైవాత్మ నసంశయః ।**

అనగా బాహ్యాంతరములనే వ్యవహారము లేక ప్రపంచమనే చిహ్నము లేక పరిపూర్ణ పరబ్రహ్మమే అచల పరిపూర్ణపరబ్రహ్మమని చెప్పబడును. ఇందుకు సందేహము లేదని అర్థము.

**3. ధృవం :** ధృవం అనగా ఉన్నదో లేదో అనే అనుమానము లేకుండ నిశ్చయముగా నున్నదని అర్థము. అంటే పరిపూర్ణము ఉన్నదో లేదో యనె అనుమానము లేకుండ నిశ్చయముగా ఉన్నదని ఆరూఢపరుచుకొనవలెను.

**స్వపూర్ణా వ్యతిరేకేన జీవబ్రహ్మ మయంజగత్**
**నాస్తి మాయా సదాబ్రహ్మ నాస్తినాస్తి విధీయతె** ॥౬॥

వినుము! స్వపూర్ణమునకు జీవబ్రహ్మమైన జగత్తు వ్యతిరేకము కానిది. మాయ లేదు. ఎల్లప్పుడు బ్రహ్మములేదని దృఢమగుటకు రెండేసి పర్యాయములు లేదులేదని చెప్పబడినది.

**వివరములు :**

**1. స్వపూర్ణ వ్యతిరేకేన జీవబ్రహ్మ మయం జగత్ :** జీవబ్రహ్మముతో కూడిన జగత్తు స్వపూర్ణమునకు వ్యతిరేకము కాదు. ఇచట పూర్ణము అనగా నిండుకొని యున్నదని అర్థము. దేనిని నిండుకొని యున్నదని అనగా తన ఆవరణ నందది పూర్తిగా నిండుకొని యున్నది. బ్రహ్మాండ భాండములన్నియు ఆ యెరుక యొక్క ఆవరణ యందుండుటచే వాని యన్నిటి బాహ్యాభ్యంతరముల యందు ఆ యెరుక పూర్ణమై యున్నదేకాని, తన యావరణ ఎంత పెద్దదయినా "మహతో మహీయాన్" అని చెప్పబడియున్నా దాని కొక మితియున్నది. సూర్యచంద్ర నవగ్రహ నక్షత్రాదుల ప్రకాశమెంత గొప్పదైన అవి అన్నియూ నొక మితి కలిగి యున్నవని విజ్ఞానశాస్త్రము చెప్పుచున్నది. అవన్నియు వాటి వాటి స్థానములలో పూర్ణమే. కావున జీవబ్రహ్మమైన జగత్తు పూర్ణమునకు వ్యతిరేకము కాదని చెప్పవచ్చును.

**2. జీవబ్రహ్మమయం జగత్ :** అనగా జీవ బ్రహ్మముతో కూడినదే బ్రహ్మము యని అర్థము. **"సోఽ కామయత బహూస్యాం ప్రజాయేయేతి"** అనగా తానే అనేకము కావలెనని

పరమాత్మ కోరెను. అట్టి కోరిక ననుసరించి ఆ సంకల్పానుసారము యెనుబది నాలుగు లక్షల జీవరాసులు ఆయన నుండియే ఆవిర్భావము చెందెను. **"తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్"** వాని సృజన అయిన పిదప వానియందు తానే జీవ రూపముగా అనుప్రవేశము గావించెను. ఈ విధముగా జీవకోటి యేర్పడెను. అంటే బ్రహ్మమే జీవేశ్వర జగత్తుగా మారెను. మరియు జగత్తంతయు బ్రహ్మమే. మాయ అవిద్య చేరికతో పరబ్రహ్మము సోపాధికమై జీవేశ్వర నామములను చెందుచున్నదని సిద్ధించుచున్నది. కనుక జీవేశ్వర బ్రహ్మలకు పారమార్థిక భేదము మృగ్యము. కనుకనే "జీవోబ్రహ్మైవ నాపరః" అనగా జీవుడు జగత్తు బ్రహ్మమే యితరము కాదని అద్వైతవాదము జెప్పుచున్నది. ఈ జీవేశ్వర జగత్తు నందు బ్రహ్మ కారణము, జగత్తు కార్యముగా నున్నది. కారణరూపముగా నున్న బ్రహ్మము కార్యరూపముగా నున్న జీవజగత్తు వేటికవే తమ తమ స్థానములందు పూర్ణముగా నున్నవని చెప్పవలయును.

**3. నాస్తి మాయ :** అనగా మాయలేనిదని అర్థము. శ్రీ సదానంద వీరవెంకట రామచంద్రరావుగారు మాయావిద్యలను గూర్చి పరిపూర్ణదర్శనము నందు యిట్లు పేర్కొనియున్నారు. "శుద్ధ బ్రహ్మమును ఆశ్రయించుకొని యుండి దానినే ఆవరించుకొని అనగా మరుగు పరచుచునుండు నొక యనిర్వచనీయమగు అనగా ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలుకాని విచిత్ర వస్తువునకు మాయ యని పేరు". వివేకచూడామణిలో శ్లో॥ సన్నాప్య సన్నాప్యు భయాత్మికానో, భిన్నాప్య భిన్నాప్యు భయాత్మికానో, సాంగాప్య సంగా ప్యుభయాత్మికానో, మహాద్భుతాఽ నిర్వచనీయరూపా॥ యని చాటినారు. ఇది కూడ అనాది యనియు సాంతమనియు చెప్పబడెను. ఎట్లనగా మాయకు శుద్ధమును నిర్వికారమును అగు బ్రహ్మమునందు కాని మాయకార్యమగు జీవేశ్వర జగములందుకాని ఉత్పత్తి చెప్పుట విరుద్ధము.

ఉత్పత్తిలేనిది గనుక అనాది యని చెప్పబడినది. కాని బ్రహ్మజ్ఞానముచే బాధింపబడును. కనుక మాయకు మాత్రము అంతముగలదు.

ఈ మాయ సత్తుగాదు అసత్తు కూడ కాదు. బ్రహ్మజ్ఞానముచే బాధింపబడునది కనుక త్రికాలా బాధ్యమైన సద్పదార్థము కాదు.

అవస్థాత్రయములందు మాయాకార్యము ప్రకటమగుటచే అసద్పదార్థమని చెప్పవలనుపడదు.

బ్రహ్మమును ఆశ్రయించికొనియే యుండును కావున బ్రహ్మము కంటే అది భిన్నమని జెప్పరాదు. బ్రహ్మమును మరుగు పరుచుచున్నందున అభిన్నమని యనరాదు. దీపము కంటే దీప ప్రకాశము భిన్నమని గాని అభిన్నమని గాని చెప్పరాని యట్లు బ్రహ్మము కంటే మాయ భిన్నమనిగాని, అభిన్నమని చెప్పుటకు వీలుపడదు.

బీజముననున్న అంకురమువలె ఈ మాయ సావయవము కాదు, నిరవయవము కాదు. జీవుని యందు వ్యష్టిరూపము గాను ఈశ్వరుని యందు సమష్టి రూపముగాను యున్నందున దీనిని వ్యష్టి అని గాని సమష్టియని గాని చెప్పతగదు. కాని సర్వద్వంద్వములు తానే అయివున్నది. కనుక మాయ అనిర్వచనీయమని శంకరుల అభిప్రాయము.

మాయా కార్యములు కూడ మిథ్యయే కనుక యా మా సా మాయా అనగా యేది లేనిదో అది మాయాయని నిర్వచనము జేసి యున్నారు. కనుక నాస్తి మాయా యని

యిచట జెప్పబడినది.

**4. సదాబ్రహ్మ నాస్తినాస్తి విధీయతే :** ఎల్లప్పుడు బ్రహ్మము లేనిదని రెండు పర్యాయములు జెప్పబడినది. ఎందుకనగా బ్రహ్మము (ఎరుక) లేదని దృఢ మైతేనే పరిపూర్ణము స్వతసిద్ధము. బ్రహ్మలేని దెట్లో తెలుసుకొందము.

సృష్టి అంతయు (విశ్వము) మాత్రమేగాక సృష్టికర్తయైన బ్రహ్మము కూడ అశాశ్వతమే అని చెప్పవలసి యుండును. ఎవరికెప్పుడు యేది తెలియబడునో అది యంతయు శ్రీకృష్ణదేశికేంద్రులవారి భాషలో "ఎరుకే" అనగా అసత్యము, అశాశ్వతము అయివున్నది. ఈ విశ్వములో ఖండాఖండమగు వస్తుజాతమంతయు వేర్వేరుగా తోచబడినను "ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ" "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని ఎరుక నానా విధములుగా చెప్పబడినది. మాయకు మరొక నిర్వచనము ప్రకారము **"మీయతే అనేన యితి మాయ"** అనగా మాయ లేక ప్రకృతి పరిణామము చెంది జగద్రూపము వహించినపుడు ఆ జగత్తు నందలి పదార్థములు అణుప్రమాణము, మధ్య ప్రమాణములేక మహత్ ప్రమాణము చెందుచున్నవి. ఇందేప్రమాణములో నున్నా అది మితి లోనిదే. సృష్టికి పూర్వము మాయకేప్రమాణములేదు. కాని సృష్టి యనంతరము ఆ మాయ యే అనేక రూపములు వహించుచున్నది. అమితమని చెప్పబడె బ్రహ్మ పదార్థమును మితిగలిగిన జగద్రూపములోనికి తెచ్చుచున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతా బ్రహ్మమయమే. కనుక వస్తుతః జగత్తు కూడ బ్రహ్మ స్వరూపమే. ఐతే ఆ బ్రహ్మశక్తి యగుమాయ బ్రహ్మమును ఒక ఆవరణలోనికి తెచ్చి చూపుచున్నది. అంతేగాక మాయ బ్రహ్మములు బొమ్మ బొరుసువలె ద్వంద్వైక రూపము. సర్వద్వంద్వములు అసత్యములు, అశాశ్వతములు కావున మాయా బ్రహ్మములు నాస్తి నాస్తి యని దృఢమగుటకు రెండేసి పర్యాయములు జెప్పబడినది.

తృణాది బ్రహ్మపర్యంతము కార్యకారణములను చెప్పుకుంటు పోవచ్చును గాని బ్రహ్మకు కారణము గానరాదు. కనుక దానికి మూలము లేదన్నారు. మూలము లేని వస్తువు సత్యమెట్లగును? అన్నిటికి బీజరూపమైన బ్రహ్మమునకు బీజములేదని తేలినది. కనుక ఆ బ్రహ్మము సత్య వస్తువు కాజాలదు. కనుక మిథ్యయే.

**పూర్ణాత్పూర్ణతరం పూర్ణం పూర్ణాత్పూర్ణ ప్రకాశతే**
**పూర్ణేన పూరితంసర్వం స్థితంపూర్ణేన పూరితః** ॥2॥

పరిపూర్ణపరబాహ్యము పూర్ణము కంటే పూర్ణమైన దాని కంటెను అన్యముగా నున్నది. పూర్ణము పూర్ణము వలననే ప్రకాశించుచున్నది. సర్వము పూర్ణము తోనే నిండి యున్నది. పూర్ణముతోనే పూరించబడియున్నది.

**వివరములు :**

**1. పూర్ణాత్పూర్ణతరం పూర్ణం :** పరిపూర్ణపరబాహ్యము పూర్ణము కంటే పూర్ణమైన దాని కంటే అన్యముగా పూర్ణమైయున్నది. అనగా మనకు తెలియబడు విశ్వాకారమగు పరబ్రహ్మము విశ్వగతమును, విశ్వాతీతమును అయి పూర్ణముగా వస్తువు యొక్క లోపల వెలుపల ఆకాశము వలె సర్వవ్యాపకమై నిండుకొని యున్న దని ఇతరులందురు. దీనిని ప్రత్యక్షపూర్ణమని చెప్పవచ్చును. ఏలననగా అంతా నిండుకొని యున్నట్లు గానవచ్చుచు

ఎండమావులందు నీరు ఎట్లులేదో అట్లే పూర్ణముగా గానవచ్చినను ఎరుక బ్రహ్మము సకలదేశములందు నిండి యున్నట్లు తోచుచు నిజముగా నిండియే లేదు. ప్రత్యక్షముగా సూర్య నక్షత్రములు భూమికంటే ఎన్నో రేట్లు చిన్నవిగా గానవస్తున్నవి. కాని యథార్థముగా ఎన్నో రేట్లు పెద్దవై యున్నవి. శాస్త్రజ్ఞులు ప్రత్యక్ష ప్రమాణములను అంగీకరించలేదు. అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతట నిండియున్నట్లు కానవచ్చినా ఏకదేశీయమైయున్నది. వాక్కుకు, కంటికి మనస్సుకు ఎంత మాత్రము గోచరించని పరిపూర్ణపరబ్రహ్మమే సకల దేశాలయందు సమస్త వస్తువులందు నిండి పూర్ణమైయున్నది. ప్రత్యక్ష పూర్ణవస్తువు అయిన యెరుక కంటే పరోక్షమైన పరిపూర్ణపరబ్రహ్మము పూర్ణమై యున్నది. అనగా సర్వము పూర్ణముతో నిండియున్నది.

**2. పూర్ణాత్పూర్ణ ప్రకాశతే :** పూర్ణాత్పూర్ణమైన ఆత్మనే ప్రకాశించుచున్నదని అర్థము. పూర్ణము అనగా నిండుకొని యున్నదని అర్థము. దేనిని నిండుకొని యున్నదంటే తన ఆవరణము నందది పూర్తిగా నిండుకొని యున్నది. బ్రహ్మాండ భాండములన్నియు ఆ యెరుక యొక్క ఆవరణ యందుండుటచే వాని యన్నిటి బాహ్యాభ్యంతరము లందు ఆ యెరుకయే పూర్ణమైయున్నది.

సర్వమునకు సత్తాయిచ్చునది, సర్వేంద్రియములను ప్రకాశింపజేయుచున్నది పూర్ణాత్ పూర్ణముగానున్న పరబ్రహ్మమే (జ్ఞానమే). దానిని ప్రకాశింపజేయునది మరొకటిలేదు. కనుకనే స్వయం ప్రకాశమన్నారు. తన్ను తాను ప్రకాశింపచేసుకొనుటయే గాక తనవలననైన, అనగా తానే అయిన సమస్తమును ప్రకాశింపచేయును. ఇందుకు దీపమే దృష్టాంతము, తాను తనను చూచుకొనుటయే గాక తన ప్రకాశావరణము నందున్న సమస్తమును దీపమెట్లు చూచునో అట్లేనని తెలియవలెను. సర్వమును గుర్తెరిగేది యగుటచే దానిని జ్ఞానమని, తన జ్ఞానముచేత తనను తానే (అనగా తన ఆవరణమునే) ప్రకాశింపజేసుకొన్నప్పుడు జ్ఞేయమని పిలువబడును. సర్వమును ప్రకాశింపచేయు కర్తయగుటచే దానిని జ్ఞాత యని చెప్పనగును. సర్వము బ్రహ్మసర్వరూపమే. అదే పూర్ణాత్పూర్ణమై స్వయం ప్రకాశమై తన ఆవరణము నందున యున్నవాటి నన్నిటిని ప్రకాశింపజేయుచున్నది. జ్ఞాత, జ్ఞాన, జ్ఞేయములు గానట్టి పరిపూర్ణపరబ్రహ్మము స్వయం ప్రకాశములేనిది. ఇతరములను ప్రకాశింపజేయదు.

**3. పూర్ణేన పూరితం సర్వంస్థితం పూర్ణేన పూరితః:** సర్వము పూర్ణముతోనే నిండియున్నదని, పూర్ణములోనే పూర్ణించబడి యున్నదని అర్థము. అనగా జగత్తంతా పరమాత్మ మయమని చెప్పవచ్చును. పరిపూర్ణ సిద్ధాంతము నుద్ధరించిన శ్రీ శివరామదీక్షితుల వారు పరిపూర్ణమును క్రింది విధముగా వివరించియున్నారు.

"పుట్టనిది – చావనిదీ, రాకడపోకడలేనిది, సకల దేశాల యందు మొదలుకొనలేక, చలించక, ఒక్క తీరుగా తనకు తానే స్వతసిద్ధమైయున్నది. అన్నిటి యందు నిండి నిబిడీకృతమైయున్నది. మరియు శ్రీకృష్ణదేశికేంద్రుల వారు "సంతాత మొకరీతి సకల దేశములంతాట యందు తాట నిండున్నదదిగో పరిపూర్ణము" అని "బయలన నొక్కరీతి నుండు బ్రహ్మాండములో" అని శెలవిచ్చియున్నారంటే పరిపూర్ణపరబ్రహ్మము ఎక్కడలేదు. దేనియందు లేదు? అంటే అది లేనిచోటంటు లేదని నిర్ణయము. వస్తురూపమున తోచబడే వాని అన్నిటి బాహ్యాభ్యంతరమలందు పరిపూర్ణపరబ్రహ్మమే నిండి యున్నది.

పరిపూర్ణపరాకాశం దేహమంతః స్థితం బహిః
ఆదిపూర్ణంచాంత్యపూర్ణం మధ్యపూర్ణం సపూర్ణకమ్ ॥౫॥
అద్యంతపూర్ణమచలం పూర్ణమయ్యేవ శిష్యతే
పరిపూర్ణపరాకాశే నిరాకాశావశిష్యతే ॥౬॥

పరిపూర్ణ పరాకాశమైన ఆత్మ (ఎరుక) దేహమునకు లోపల వెలుపల వ్యాపించియున్నది. అచలము (తాను తానుగా నున్న పరబ్రహ్మస్థితిలో) ఆదిపూర్ణం, మధ్య పూర్ణము, అంత్యపూర్ణము, సపూరకముగా, అద్యంతం పూర్ణమయమై యున్నది. పరిపూర్ణమైన పరాకాశము నిరాకాశమై (పరిపూర్ణపరబ్రహ్మమే) శేషించుచున్నది.

**వివరములు :**

**1. పరిపూర్ణపరాకాశం :** అనగా సంపూర్ణముగా నిండిన పరాకాశము. పరిపూర్ణ పరాకాశమనగా ఆకాశమునకు పరమైనది శ్రేష్ఠమై గొప్పదైనది పరాకాశము అని అర్థము. ఆకాశము ఆత్మనుండి పుట్టినది. ఈ విషయమునే శ్రీ పరుశురామ నరసింహదాసుగారు తమ భద్రాద్రిరామ శతకము నందు 7. సీ॥ ఆత్మయందున ఏక మాకాశముదయించె ఆకాశమం దనిలంబు బుట్టె...." అని తేట పరిచినారు. కావున ఆకాశమునకు పరమైనది ఆత్మయని, పరిపూర్ణపరాకాశమనిన ఆత్మ లేక పరమాత్మ యని అర్థము గ్రహించవలయును. ఈ పరాకాశమే అన్నిటికి అధిష్ఠానమైనది, ఆధారమైనది, అంతఃకరణముపై ప్రభావము జూపును. శ్రీ అచలర్షి దయానంద పొన్నాల రాజయోగి గారు తమ నిజప్రబోధ విధానము నందు, సృష్టినిర్ణయము – బ్రహ్మాండ నిర్ణయమునందు పరాకాశమును ఉత్తమపురుషుడని, స్వయం ప్రకాశమని, చేతన బ్రహ్మమని చెప్పియున్నారు.

**2. దేహమంతః స్థితం బహిః :** పరాకాశము (చేతనబ్రహ్మము) కూడ పూర్ణముగా నుండి దేహమునకు లోపల వెలుపల వ్యాపించియున్నదని అర్థము. ఆత్మవిశ్వగతమై యున్నదని భద్రాద్రిరామశతక కర్త యిట్లు వివరించియున్నారు.

66. సీ॥ధరణిలో తిలలందు తైలముండినరీతి దారువందున్న దహనురీతి ।
నాణెమౌ దధియందు నవనీత మున్నట్లు పుష్పమందున గంధమున్నయట్లు ।
రంజిల్లు ఫలమందు రసము గలిగిన భంగి చేలమందున్నట్టి నూలు భంగి ।
తారహారాదుల దారముండిన రీతి యిసుక రాళ్ళందున్న యినుమురీతి ।
అఖిల జగముల సకల దేహంబులందు। నిండియున్నావు యీరీతి నిజముగాను
॥రమ్య॥ అనగా పరమాత్మ దేహమునకు వెలుపల లోపల నిండుగా నిండియున్నది.

**3. ఆదిపూర్ణం చాంత్య పూర్ణం మధ్యపూర్ణం సపూర్ణకమ్ :** పరాకాశము ఆది అంత్యమున, మధ్యలో పూర్ణముగా ఎట్లునిండియున్నదో గమనింతము. ఆది అనగా మొదటిది అనీ, కారణవస్తువని అర్థము. పరమాత్మ మొట్ట మొదటిదై సృష్టికంతటికి కారణ వస్తువై యున్నది. కొలతకు లోబడు వస్తువునకు ఆది మధ్య అంతములుండును. బ్రహ్మము గొప్పలేక పెద్ద స్వరూపము. "అణోరణియాన్ మహతో మహీయాన్" అని చెప్పబడు ఆత్మ స్వరూపము ఎంత మహత్ప్రమాణమైనా అదియు నొక ప్రమాణము కలిగి యున్నది. అది అంతట నింతట నుండునదే గాని అంతటా లేదు. ఎంత పెద్ద ఆవరణమైనా దానికి మితి అంటూ వుండనే వుండును. గనుక దానికి మొదలు తుది వున్నవి. ఆది అనేది వుంటే, అంతమూ

వుండును. ఇట్లు పరమాత్మ ఆదిలో పూర్ణముగా అంత్యములో పూర్ణముగా, మధ్యలో పూర్ణముగా నుండి పూర్తిగా పూర్ణముగా నున్నది. అద్యంతములున్న వస్తువు శాశ్వతము కాదు. ఆదిమధ్యాంత రహితమైన దొక్క పరిపూర్ణపరబ్రహ్మమే. మిగిలినవన్నియు అశాశ్వతములు. అహంపదార్థము పరిపూర్ణమందు ఒకప్పుడు తోచి మరొకప్పుడు ఆ అహం లేకుండ పోవుచున్నది. కనుక దానికి ఆదిమధ్యాంతములున్నవని జెప్పక తప్పదు. పోతే ఆత్మ ఆదిలో పూర్ణముగా అంత్యమున పూర్ణముగా యున్నప్పుడు మధ్యన కూడ పూర్ణముగా యుండి సపూరకముగా యున్నది.

పరాకాశము (ఉత్తమ పురుషుడు) సృష్టికి పూర్వము తోచినది అని మాత్రము మనము జెప్పవచ్చును. కాని అహ ముదయించేటి వరకే అది (అనగా పరిపూర్ణపరబ్రహ్మము) వున్నది కదా అనియు "నేదీని వెనుక కదా" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారన్నారు. కనుక పరాకాశము (యెరుక) మధ్యలోనే తోచినది మరి మధ్యలోనే పోవుచున్నది. వస్తు మత్రహితమగు పరిపూర్ణమందు తోచబడిన ఆది (మొదటి) వస్తువు యెరుకే. అది ఏకవస్తువై "ఏకం అనేకం భవతి" అయి నట్లు అనేక మార్పులు చెంది నానాత్వమునకు కారణమై నామరూపాత్మక విశ్వరూపము వహించినది.

**4. ఆద్యంత పూర్ణమచలం :** పరాకాశముని చెప్పబడు చేతనబ్రహ్మము సృష్టికి పూర్వము తాను తానైన స్థితిలో అనగా పరబ్రహ్మ స్వరూపముగా నున్నప్పుడు చలనము లేక అచల స్థితిలో నుండెను. సృష్టికామన కలుగుటయే అందు చలనమేర్పడి ఈ జీవేశ్వర జగత్తుగా మారి విశ్వాకారమైనది. ఆ స్థితిలో ఈ విశ్వాకారము (లేక చలనము) బీజరూపములో యుండుట వల్ల అచల స్థితిలో యున్నది. మధ్యలో సృష్టి యేర్పడి చలనము కలిగినది. అంత్యములో ఈ జీవేశ్వర జగత్తంత తిరోభావము చెంది అనగా ప్రళయానంతరము ఆ బ్రహ్మాండములో చేరినప్పుడు మళ్ళి అచలరూపము వహించినదని చెప్పవచ్చును. ఈ విధముగా ఆదిలో అచల రూపములో నున్నది, మధ్య చలనమేర్పడి విశ్వాకారమైనది, అంత్యములో అనగా ప్రళయకాలమున ఎచ్చటి నుండి ఆవిర్భవించినదో అచ్చట చేరినది. అంటే ఆద్యంతములందు అచలముగా నున్నది.

**5. పూర్ణమయ్యవశిష్యతే పరిపూర్ణపరాకాశే నిరాకాశావశిష్యతే :** అనగా పరిపూర్ణపరాకాశము నిరాకాశమైన యెడల పరిపూర్ణపరబాహ్మమే శేషించునని యర్థము. పరాకాశము అనగా ఎరుక. ఎరుకను లేనెరుకయన్నారు. ఎందుకనగా పరిపూర్ణ పరబ్రహ్మమునందు ఈ ఎరుకకు నిలిచే అందుకుస్థానము లేదు. ఇట్టిలేనెరుక లేనేలేదని గురు వాక్యముద్వారా దృఢ మయ్యేనేని అప్పుడు పరాకాశము నిరాకాశమగును. అనగా ఎరుక లేకుండపోవును. ఎరుక రహితమందే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము. పరాకాశము నిరాకాశమయినప్పుడు మిగిలేది పరిపూర్ణపరబ్రహ్మమే.

**భావవాగ్భ్యాంచనగ్రాహ్యం ద్రష్టృదర్శన వర్జితమ్**
**శుద్ధపూర్ణంనిరాధారం పూర్ణాత్పూర్ణం పరాత్పరమ్** ॥౧౦॥

ఎరిపూర్ణపరబ్రహ్మము భావము చేత వాక్కుచేత తెలియరానిదైయున్నది. ద్రష్ట (చూచువాడు) దర్శన (చూపు) శూన్యమైనది. శుద్ధమైన పూర్ణము నిరాధారమైనది. అది పూర్ణము కంటే పూర్ణమైనది. పరముకంటే పరమైనది.

**వివరములు :**

**1. భావవాగ్భ్యాంచన గ్రాహ్యం :** అనగా పరిపూర్ణ పరబ్రహ్మము భావము చేత, వాక్కుచేత తెలియరానిదై యున్నది. అది అవాఙ్మానసగోచరమై యున్నది. భావము అనగా తలంపు, ఆలోచన యని సామాన్యార్థము. విశేషార్థములో సత్-అస్తిత్వము (ఉనికి) కలిగియున్న పదార్థములన్నియు భావపదార్థములు. నిజమగు ఉనికి లేని పదార్థములన్నియు అభావ పదార్థములు. ఇచట భావము చేగాని, వాక్కుచేగాని గ్రాహ్యం కానటువంటిది అచల పరిపూర్ణపరబ్రహ్మము. ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రుల వారు 34 క.ద.॥ **పలుకున బలుకగ రాకను । తలపోయుదమనిన మదికి దగులక యెపుడున్ । ములుగ్రుచ్చ సంధి లేకను । కలిగున్నది బట్టబయలు । గదరామాయన్నా।"** అని సెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణపరబ్రహ్మము వాచ్య వాచ్యార్థములకు, అందునట్టిది గాదు. లక్ష్యలక్ష్యార్థములుగా మదిలో దానిని తలపోయుదమనిన మనసుకు సాధ్యపడదు. అనగా మనస్సుకు తగలదు. మాటలచేత చెప్పుటకు ఎందుకు సాధ్యముగాదనిన, పరిపూర్ణ పరబ్రహ్మము రూపము లేనిది. రూపము లేనిదానిని వర్ణించి చెప్పుటకు సాధ్యముగాదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు మనస్సు తోచుచున్నదిగాని మనస్సునందు పరబాహ్యములేదు. కనుక మననము చేయుటకు సాధ్యపడదు.

కేనోపనిషత్తు నందు ఈ విషయమును "నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి నోమనః, నవిద్మో నవిజానీయో యథైవ తదను శిష్యాదన్య దేవతద్విదితా దథో అవిదితా దధి యితిశ్రుమ పూర్వేషా యేనస్తద్వ్యాచ చక్షిరే" అనగా వాక్కుకు అందదు, మనస్సుకు కంటికి అందదు; జ్ఞానమునకు కూడ తెలియరానిదేదో, అది తెలిసినదానికంటెను, తెలియరాని దాని కంటెను వేరుగానున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యులకుపదేశించిరి.

శ్రుతి ॥ **యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహా॥** తైత్తిరీయోపనిషత్తు

అనగా మనస్సు వాక్కు దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణపరబ్రహ్మము.

శ్రుతి॥ నైవచా నమనసా ప్రాప్తుం శక్యోన నచక్షుసా అస్తీత బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే॥ కఠోపనిషత్ 2-3-12. అనగా వాక్కు, మనస్సు, కండ్లకు ప్రాప్తింపరానిది. ఉన్నది అని చెప్పుటకు వినా మరొక రీతిగా దాని యుపలబ్ధికాజాలదు.

**2. ద్రష్టృ దర్శన వర్జితమ్ :** పరిపూర్ణపరబ్రహ్మము ద్రష్ట (చూచువాడు) దర్శన (చూపు) లేనిది. ఏది కనిపించుచున్నదో అది అంతయు దృశ్యము. జ్ఞానరూపమై తెలుసుకొనునట్టిది యెదో అది దృక్కు, అదియే బ్రహ్మము. కేవలం జ్ఞాన మార్గ వస్తువగు దృక్కే సర్వదేశ, సర్వకాల, సర్వవస్తువులయందు పరిపూర్ణముగా నిండి (నువ్వులలో నూనె రీతిగానిండి) సర్వాధిష్ఠానమై సర్వాధారమై వెలుగుచుండుట వల్ల మరియు దానియందుండు సర్వ చరాచర జంతుజాలములు పుట్టుచు గిట్టుచు మహాప్రళయమున దాని యందు ప్రవేశించి లయ మొందుటవల్ల ఆదృక్కేబ్రహ్మమనబడును.

బ్రహ్మము దృక్కనియు, సంవిత్తనియు (తెలివి) చిత్తమనియు, జ్ఞాపకమనియు బోధయనియు, చైతన్య మనియు, ఎరుకనియు పలువిధములైన శబ్దములచే వాడబడుచున్నది. ఆ పరబ్రహ్మమగు దృక్కు సచ్చిదానంద రూపమైనది. అనగా సత్తు, చిత్తు ఆనందములే

స్వరూపమైనది. దృక్కుయనగా జీవ సంబంధమైన జ్ఞానము. దృశ్యమనగా జీవున కెరుకైనట్టి సకల ప్రపంచము. దృక్కు, దృశ్యము, ద్రష్ట త్రిపుటి. ఇందు ఏది లేకున్న తక్కినవి రెండు లేనివే. కనుక దృగ్దృశ్య వివేకమని అధిష్టాన చేతనబ్రహ్మమని మత కర్తలు నిర్ణయించినారు. ఈ పద్ధతి తెలిసినవారికి జన్మ రాహిత్య మగునని మానవ లోకమును భ్రాంతిలో ముంచుచున్నారు.

ఈ దృగ్దృశ్య వివేక నిర్ణయము సత్తు, చిత్తు, ఆనందరూప బ్రహ్మము. జననమరణ పద్ధతి గల ఉపాధి ప్రళయమెందునది గాని, జనన మరణములు, ఉత్పత్తి ప్రళయములు లేని, త్రిపుటిగాని పరిపూర్ణపరబ్రహ్మము గాదు. కనుక ద్రష్టృదర్శన వర్జితమైనది పరిపూర్ణపరబ్రహ్మమని తెలియవలయును.

**3. శుద్ధ పూర్ణం :** పరిపూర్ణపరబ్రహ్మము శుద్ధమైనది. అనగా తెల్లనిది, స్వచ్ఛమైనది, దోష రహితమైనదని నానార్థములు గలవు. తెల్లనిది అనగా తెలుపు రంగు గలది. సూర్య కిరణములను విశ్లేషిస్తే వచ్చు ఏడు రంగులలో తెలుపు ఒక వర్ణముగాదు. కాని అన్ని వర్ణముల యొక్క సంశ్లేషము నందు కలుగు వర్ణము తెలుపుగా వర్ణింపబడినది. అయినను సూర్య కిరణము యొక్క ప్రకాశము మల్లెపూవు వలె తెల్లగా నుండదు. అది స్వచ్ఛమైనది అనగా దాని యందితర వర్ణములులేనట్లుగా తోచిన దాని యందు యితర రంగులు ఉండనే యున్నవి. అట్లే పరమాత్మ స్వరూపము శుద్ధమైనది లేక స్వచ్ఛమైనది అని వర్ణించిన సమస్త వర్ణాత్మకమగు ప్రపంచము బీజరూపముగా ధరించియున్నది. అట్లే దానియందు దోషములు లేక మహాపవిత్రముగా తోచబడిన ఉపాధులను పొందే దోషము మాత్రము దాని స్వభావమై యున్నది. క్షరాక్షరోపాధి యను ఉపాధి ద్వయంగా పరిణమించే దోషము దాని యందే గర్భీకృతమైయున్నది. "నిర్దోషంహి సమంబ్రహ్మ" అని చెప్పినపుడు కేవల దోషరహితమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు సెలవిచ్చియున్నారు. శ్లో॥ "యధానాహం తథా శుద్ధం, తస్మాచ్ఛుద్ధేన నిర్ణయః" అని భ్రాంతి రహిత శ్లోకము జెప్పుచున్నది. అనగా నేను లేకుంటే ఎట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణముండును. **నేను లేకుండుట చేతనే అది శుద్ధం అని వర్ణించబడినది.**

**4. నిరాధారం :** పరిపూర్ణపరబ్రహ్మము నిరాధారమైనది. అంటే దానికి ఏది ఆధారము గాలేదు. అది దేనికి ఆధారముగాదు. ఆధారమనగా మూలము, ఆశ్రయమని అర్థములు. నిరాధారమంటే పరిపూర్ణ పరబ్రహ్మము దేనికి ఆశ్రయమివ్వదు. దానికి ఆశ్రయమిచ్చేదింకొకటి లేదు. అన్నిటికి ఆశ్రయము, మూలము అయినది పరమాత్మనే, ఎరుకనే. ఈ చేతన బ్రహ్మమే అన్నిటికి ఆధారము ఆశ్రయము మరియు మూలము, అధిష్టామునైయున్నది. ఈ విషయమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు కందార్థ దర్పులలో 164 కం॥ యెరుకే యెరుకకు కొడుకులు । యెరుకే తలిదండ్రి యెరుక । కెరుకే యితరుల్ । యెరుకే యెరుకకు మూలము । యెరుకకు మూలంబు బయలంచెట్లందు నోయీ ।" అని సెలవిచ్చియున్నారు. అనగా యెరుకనే యెరుకకు కొడుకులు, యెరుకనే తలిదండ్రులు. యెరుకకు యెరుకే యితరులు, యెరుకకు యెరుకనే మూలమని యెరుగుము. ఎరుకకు అచలపరిపూర్ణ పరబయలు మూలమని చెప్పరాదు అని వివరించియున్నారు. అది దేనికి ఆధారముకాదు. జీవేశ్వర జగత్తు పరిపూర్ణమందులేదు. అందుకే దానిని లేనెరుకయని

అన్నారు. ఈ లేనెరుక పరిపూర్ణమందు ఎండమావులలో నీరువలె తోచుచున్నది. ఎండమావులందు నీరెట్లు లేదో, పరిపూర్ణమందు జీవేశ్వర జగత్తు పుట్టనేలేదు. అంటే పారమార్థికముగా లేదు. వ్యవహారికముగా యున్నదని చెప్పవలయును. పరిపూర్ణము పుట్టించదు, గిట్టించదు. యెరుక యొక్క జాడ తెలియక చట్టువలె కదలకుండ యున్నది. కనుక పరిపూర్ణపరబ్రహ్మము నిరాధారమైనది.

**5. పూర్ణాత్ పూర్ణం :** అనగా మనకు తెలియబడు విశ్వాకారమగు బ్రహ్మము విశ్వగతమును, విశ్వాతీతమును అయి పూర్ణముగా, వస్తువు యొక్క వెలుపల లోపల ఆకాశము వలె సర్వవ్యాపకమై నిండుకొని యున్నదని యితరులందురు. దీనిని ప్రత్యక్ష పూర్ణమని జెప్పుదురు ఏలననగా ఇది అంతటా నిండుకొని యున్నట్లు గానవచ్చుచు నిజముగా నిండియే లేదు. ప్రత్యక్షముగా సూర్యనక్షత్రములు ఎన్నో రేట్లు చిన్నవిగా గానవస్తున్నవి. కాని యదార్థముగా ఎన్నో రేట్లు పెద్దవైయున్నవి అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతటా నిండి యున్నట్లుగా కానవచ్చిన ఏక దేశీయమైనది. ప్రత్యక్షవస్తువు అయిన ఎరుక కంటే పరోక్షపూర్ణమైన పరిపూర్ణ పరబ్రహ్మము పూర్ణము కంటే పూర్ణముగా నున్నది.

**6. పరాత్పరం :** పరముకంటే పరమైనందున పరాత్పరమని చెప్పబడును. తనకు సన్నిహితముగా నున్నది తన శరీరము. ప్రతివాడు వ్యవహారములందు శరీర తాదాత్మ్యము (శరీరము తాననే బుద్ధి) తోనే కార్యము లొనర్చు చున్నాడు. అట్టి తనకు పరంగా నున్నది పంచభూతాత్మకమగు బ్రహ్మాండము, దానికి పరముగా నున్నది ఈశ్వరుడు. ఈశ్వరునికంటే పరముగా నున్నది బ్రహ్మము అనగా అన్నిటికి పరమైనది పరమాత్మ, పరమాత్మకంటే పరమై శ్రేష్ఠమైనది పరిపూర్ణపరబ్రహ్మము. కనుకనే పరిపూర్ణ పరబ్రహ్మము పరాత్పరం అని అన్నారు.

**అప్రమాణ మసంగత్వం తల్లింగ మచలం భవేత్**
**సర్వకారణహీనోహి సఏవపరమశ్శివః ॥౧౧॥**

పరిపూర్ణ పరబ్రహ్మము యేప్రమాణములచే తెలియరాదు. అది అసంగత్వమనగా దేనిని అంటనిది. అటువంటి లింగమే అచలమైయున్నది. అదియే పరమశివుడు. అతడు సర్వకారణహీనుడు.

**వివరములు :**

**1. అప్రమాణ మసంగత్వం తల్లింగమచలంభవేత్ :** ఆ లింగము (నిరవయువమైనది) అచలము అప్రమాణము, అసంగత్వం గలది మొదట అప్రమాణమంటేమిటో తెలుసుకొందము.

**1. అప్రమాణము :** మానవులు ప్రమాణపద్ధతుల చేతనే సత్యాసత్యములను తెలసి కొనగలరు. సత్యపదార్థమును గమనించుటకు ప్రమాణపద్ధతి తప్ప యితర మార్గములు లేవు. నవవిధ పదార్థ సహజ విరోధ పద్ధతులు తెలియుటకు నిర్ణయింపబడినది. ప్రమాణ పద్ధతిని తెలుసుకొన్నవారులు తత్వవేత్తలు వారు ముక్తిని పొందగలరని అందురు.

అనుమాన ప్రమాణమనియు, ఉపమాన ప్రమాణమనియు, శబ్దప్రమాణమనియు, అర్థాపత్తి ప్రమాణమనియు జెప్పబడినవి ప్రత్యక్ష ప్రమాణము యొక్క భేదములు. ఇవి కొంత ప్రత్యక్షమగు పిమ్మట మిగత వీని నిర్ణయము జరుగుచున్నది.

**1. అనుమాన ప్రమాణ నిర్ణయము :** ఏదైన నొక వస్తువును ఒకప్పుడు ప్రత్యక్షముగా చూచి యింకొకప్పుడు దానికి సంబంధమగు వస్తువునుజూచి పూర్వవస్తుజ్ఞానము కలుగుట

అనగా కనబడని పదార్థ జ్ఞానము గలుగుట అనుమాన ప్రమాణమనబడును.

ఈ అనుమాన ప్రమాణము మూడు విధములు :

అ) పూర్వవత్ (ఆ) శేషవత్ (ఇ) సామాన్యతోదృష్టము.

**అ) పూర్వవత్** : కారణమును చూచి కార్యజ్ఞాన మూహించుట అనగా మేఘములనుచూచి వర్షజ్ఞానము కలుగుట. చదువు చుండిన విద్యార్థిని జూచి పాండిత్య నిర్ణయము చేయుట వివాహమును చూచి సంతాన నిర్ణయము చేయుట. ఈ మూడు నిర్ణయములు పూర్వవత్తను దాని అనుబంధములు.

**ఆ) శేషవత్** : కార్యమును చూచి కారణ జ్ఞానమూహించుట. అనగా నదీ ప్రవాహమును చూచి వర్షనిర్ణయము, కుమారుని చూచి తండ్రి నిర్ణయము, సుఖదుఃములను చూచి పూర్వజన్మ కర్మ నిర్ణయ మొనర్చుట. ఈ త్రివిధ పద్ధతులు శేషవత్వనుబంధ నిర్ణయములని తెలియవలెను.

**ఇ) సామాన్యతోదృష్టము** : ఇంటి నుండి బయలు దేరనిదే ఇతర చోటికి పోవలెనను నిశ్చయము సామాన్యతోదృష్టము.

**2) ఉపమాన ప్రమాణ నిర్ణయము** : ఊరనుండు ఆవును చూచి అడివిలో నుండు ఆవు ఇదేవిధముగా నుండునను నిర్ణయము, ఉపమాన ప్రమాణ మనబడును.

**3) శబ్దప్రమాణము** : యదార్థ పదార్థజ్ఞానము గలిగించునది శబ్ద ప్రమాణ మనబడును.

**4) అర్థాపత్తి నిర్ణయము** : మేఘము లున్నచో వర్షము లుండునట్లు కారణమున్నచో కార్యము గలుగుట అర్థాపత్తి ప్రమాణ మనదును.

పై పేర్కొన ప్రమాణములలో దేనిచే కూడ పరిపూర్ణ పరబ్రహ్మము తెలియబడదు. కనక దానిని అప్రమాణ మన్నారు.

**2. అసంగత్వము** : అసంగత్వమనగా కూడనిది, పొసగనిది, సంగము లేనిదని అర్థము. పరిపూర్ణపరబ్రహ్మము దేనితో కూడుకొని లేదు. అది ఏకైక అస్తిత్వత గలది. ఏకమైయున్నది. ఆకాశము సమస్త వస్తువుల బాహ్యాభ్యంతరములందు వ్యాపించియున్నను, వస్తువునుగాని వస్తుధర్మమునుగాని అంటక వానిచే యేవిధంగాను వికారము చెందక అసంగమై యున్నట్లుగానే పరిపూర్ణపరబాహ్యము అన్నిటి బాహ్యాభ్యంతరములందు నిండి యున్నప్పటికిని వాటి నంటక వాని ధర్మముల నంటకుండ యున్నది. ప్రపంచీకుడు తెలివి, తెలవికి తెలియబడేది సత్యమే నని భ్రాంతి జెంది కాంక్షతో (కోరికలతో) కర్మలు చేస్తాడు. పరిపూర్ణభావజ్ఞుడు యెరుక లేదనే సత్యమును ఆరూఢ పరుచుకొని ఆ విషయము లేకుండనే సకల క్రియలు చేస్తాడు. అనగా ఎరుకలేక సేవించును.

ఎరుక లేనే లేదని నమ్మితే కర్మ ప్రవృత్తి పోత్సహించు త్రిపుటిగాని, కర్మ చేయు త్రిపుటిగాని లేవని అపుడే నమ్మకము కలుగును. అనగా దృఢమగును. ఎట్లనగా ఎండ మావులందు నీరు లేనే లేదని గట్టిగా తెలుసుకొన్న తర్వాత నీళ్ళవలె కానవస్తున్న నీళ్ళు లేవనెడి నిశ్చయముండునుగదా!

జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత్మ యని త్రిపుటి కర్మను పోత్సహించును. ఎందువల్లననగా గుర్తెరుగకుండ యెవ్వరు యేకర్మ చేయరుగదా? కర్త, కర్మ, కరణము (పనిముట్లు) అనే త్రిపుటిచే కర్మ జరుగుచున్నది. **జ్ఞాతయే కర్త, జ్ఞానమే కరణము, ఈ రెండులేనే లేవని**

దృఢ నిశ్చమై కర్మచేస్తే **అకర్మ చేసియు, చేయకనే చేయుట. ఇదేవినకనే వినుట, కనకనే కనుట ఈ రెండు** త్రిపుటులు లేనే లేవని నిశ్చయమైన వానికి కర్మ ప్రవృత్తి కవసరమగు కాంక్ష (ఫలాసక్తి) గాని కర్తృత్వాహంకారముగాని ఉండదు. అంటే కర్తృత్వ రహితముగా కర్మాచరణ జరుగుచున్నది. అది బంధకారణము కాజాలదు.

**3. తల్లింగ మచలం భవేత్ :** అలింగమే అనగా ఏ ప్రమాణముల కందని పరిపూర్ణపరబ్రహ్మము అచలమైయున్నది. **అచలము అనగా ఎప్పుడు చలించనిది, ఎట్టికదలిక లేనిదియని అర్థము.** పరబ్రహ్మకు సృష్టికి పూర్వము ఎట్టి చలనము లేదు. బాహ్యమున గానవచ్చు స్థితి యందు గలుగు కదలిక మాత్రమే చలనము గాదు. అంతరమందు మార్పు కూడ చలనమే. నిస్సంకల్ప స్థితిలో నున్న బ్రహ్మమునకు సంకల్పము కలుగుటయే చలనము "కీ" లేని గడియారమందు ఎట్టి చలనము లేదు "కీ" ఇస్తే అంతా చలనమే. మరియు స్థితి కలిగి యున్నదానికి గతి (చలనము) యుండును. గతిలేనప్పుడు స్థితి, స్థితి లేనప్పుడు గతి. బ్రహ్మకు కూడ ఈ స్థితి గతులున్నవి. అచలమని వర్ణించిన, పూర్ణమని వర్ణించిన కేవలాచలము గాదు.

ఏ స్థానమందు చూచిన, పిండ బ్రహ్మాండములందు గాని అఖండాత్మ స్వరూపమందుగాని కేవలాచలస్థితి లేదు. ప్రత్యగాత్మ సమాధియందు నిశ్చలముగా నున్నదని చెప్పినా తదనంతరము చలనరూపము వహిస్తున్నది. కనుక చలాచల స్థితులు రెండు కూడ ప్రత్యగాత్మ పరమాత్మలకు రెంటికి యున్నవని చెప్పితీరవలసినదే. ఈ రెండింటి యొక్క అఖండత్వము నందున్న చలాచల స్థితులు రెండు వున్నవని అనాలి. కనుక **"అచలోయం సనాతనః"** అని చెప్పబడిన మాట కేవలం అచల స్వరూపముగానుండి చలన మెన్నడు యెరుగని పరిపూర్ణ పరబ్రహ్మ యొక్కదానికే చెల్లును. దాని యందు శక్తి రూపమునగాని, తెలివి రూపమునగాని యెరుక యెన్నడులేదు. కనుక అలింగమే (పరిపూర్ణపరబ్రహ్మమే) అచలమై యున్నదని తెలియవలయును. ఇచట లింగమనేపదము పరిపూర్ణపరబ్రహ్మమునకు పర్యాయ పదముగా వ్యవహారార్థము వాడబడినదని గమనించవలెను.

**6. సర్వకారణ హీనోయి :** పరిపూర్ణపరబ్రహ్మ స్వకారణములు లేనిది. ఏవస్తువు లేనిచో మరియొక వస్తువు తోచబడదో అది కారణవస్తువు. అనగా "యతోవాయిమాని భూతాని జాయంతే, ఏన జాతాని జీవంతి, యంత్ప్రయంత్యభిసంవిశంతిః తద్విజిజ్ఞాసస్వతద్బ్రహ్మేతి సతపోఽతప్యత ॥తైత్తిరీయోపనిషత్॥ అనేడి శ్రుత్యర్థము ప్రకారము బ్రహ్మ నుండియే అన్ని వస్తువులు పుట్టుచున్నవి. కనుక బ్రహ్మకారణ వస్తువు.

"ఏకం అనేకం భవతి, అనేకం ఏకం భవతి" అనే రీతిగా ఏకానేకములుగానుండు కార్యకారణ రూపముగా అధోర్ధ్వపరిణామములు చెందుతు వుండు అఖండవస్తువే యెరుక. ఉత్పత్తి స్థితి లయములు దానియందే జరుగుచున్నవి. దాని కదే కారణము గాని దాని కన్య కారణం లేదు. అదే స్థూల సూక్ష్మముగా నుండు జీవేశ్వర జగత్తు నంతటికి ఆధారము అధిష్ఠానము అయియున్నది. ఈ నేకానేకములకు అత్యంత భిన్నమై నిజంగా అవాఙ్మానస గోచరమై ఎప్పుడు ఎట్టి మార్పులు ఎట్టి చలనము లేనిదై సర్వత్రా నిండి నిబిడీ కృతమై యున్నదని అచల ఋషులు ప్రతిపాదించుచున్న పరిపూర్ణపరబహ్మ యొక్కటి మాత్రమే **"కార్యకారణ విరాహిత్యం తల్లింగ మచలంధ్రువం"** అని చెప్పబడిన కార్యకారణరూపములను మీరియున్నది. అదొక్కటే నిరపేక్షక శాశ్వతత్వము కలిగియున్నది. అది నిశ్శక్తి నిర్మలము

మరియు శుద్ధమైనది. కావున అందు సర్వకారణ వస్తువైన బ్రహ్మము లేదు.

**7. సఏవ పరమశ్శివ :** పరిపూర్ణపరబ్రహ్మమే పరమశివుడు (తల్లింగం) ఇచట శివుడనగా చలనముతో కూడిన పరమాత్ముడు. అనగా సృష్టికామన కలుగక పూర్వపు స్థితి పరమాత్మ స్వరూపము. ఆ పరమాత్మ స్వరూపమునకు పరమై, శ్రేష్ఠమైనదే పరమశివుడు. వ్యవహారార్థము యిచట పరిపూర్ణపరబ్రహ్మను పరమశివుడని వ్యవహరించబడినది.

**ప్రజ్ఞానహీనవాక్యాత్మా తత్వమస్యాది వర్జితమ్**
**బ్రహ్మోహం భావహీనాత్మా అయమాత్మేతి వర్జితమ్** ॥౧౨॥

పరిపూర్ణపరబ్రహ్మము మహావాక్యములుగా జెప్పబడిన ప్రజ్ఞాన వాక్యాత్మ లేనిది. తత్త్వమసి (తత్ +త్వం +అసి) అను మహావాక్యము లేనిది. అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మనైతిని) మరియు అయమాత్మ బ్రహ్మ (ఈ ఆత్మయే బ్రహ్మము) యను వ్యవహారము లేనిది.

**వివరములు :**

**1. ప్రజ్ఞానహీన వాక్యాత్మ :** పరిపూర్ణ పరబ్రహ్మము "ప్రజ్ఞానంబ్రహ్మ" యను మహా వాక్యములేనిది. ఈ మహావాక్యము ఋగ్వేదాంతర్గత ఐతరేయోపనిషత్‌లోని అనుభవ వాక్యము. ఇది విధి వాక్యముగా నున్నది, సాక్షాత్కారవాక్యముగా నుండి అనుభవమునకు రానిదైయున్నది.

**ప్రజ్ఞానంబ్రహ్మ అను వాక్యార్థ నిర్ణయము :** జ్ఞానేంద్రియముల ద్వారా విషయ పంచకము నెరిగి, కర్మేంద్రియముల ద్వారా వచన, దాన, గమన, విసర్జనానందములగు బాహ్యాంతర విషయంబులు దేనిచేత తెలియబడు చున్నవో అది జ్ఞానమని చెప్పబడుచున్నది. జాగ్రదవస్థయందలి జ్ఞానము విషయ పంచకము నందలి విషయముల నెరిగి విషయాదులకు దాసుడైయుండు వానికి గలుగుచున్నది. ఇది సామాన్య జ్ఞానమని చెప్పబడును. అవస్థాత్రయ బాహ్యాంతర విషయంబులగు సకల వ్యవహారంబుల నెరిగి వాని యధిష్ఠాన పద్ధతి తనదని యే జ్ఞానము వలన దెలియబడుచున్నదో ఆ జ్ఞానము ప్రజ్ఞానమని చెప్పబడును. ఇట్టి జ్ఞానము స్థావర జంగమాత్మకములగు జీవోపాధులందును నియమిత దైవములందును నుండి సకలము తెలియునట్లు చేయుచున్నది. కావున తెలియజేయునట్టిదియు తెలియునట్టిదియు నేకము గానున్నది. అందుచే ప్రజ్ఞామని చెప్పబడినది.

**2. అయం బ్రహ్మోస్మి :** ఈ మహావాక్యము యజుర్వేదాంతర్గత బృహ దారణ్యకోపనిషత్తు నందు గలదు. దీని వలన అనుభమునకు వచ్చును.

**అహం బ్రహ్మోస్మి యొక్క నిర్ణయము :** బ్రహ్మవిద్యకు యోగ్యమైన మానవోపాధి యందు బుద్ధికి సాక్షిగా నున్న ప్రత్యగాత్మకు బ్రహ్మప్రకాశము వల్లనే నాది, నేనను అహం వృత్తి కలుగుచున్నది. అందువలన అహం బ్రహ్మత్వ నిర్ణయము సిద్ధించుచున్నది. "అస్మి" అనగా అయితిని అని అర్థము. ప్రత్యగాత్మ అధోపరిణామము పొందుటచే జీవోపాధులందు చేరుచున్నది. బ్రహ్మ నిర్ణయము తెలిసి ఊర్ధ్వపరిణామము చెందునపుడు తానే బ్రహ్మమగుచున్నది. కావున అహంబ్రహ్మోస్మియనగా నేను బ్రహ్మనైతిని అను నిట్టి నిర్ణయము సార్థక మగుచున్నది.

**3. "తత్త్వమసి బ్రహ్మ" :** ఈ మహావాక్యము సామవేదాంతర్గత చాందోగ్యోపనిషత్

నందలిది. లక్షణత్రయము చేత అనగా జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణముల చేత ఉపదేశక్రమము తెల్పబడును.

**తత్త్వమసి బ్రహ్మ నిర్ణయము :** "తత్త్వమసి" యను వాక్యమున మూడు పదములు గలవు: 1) తత్ = అది, ఈశ్వరుడు 2) త్వం = నీవు, జీవుడు 3) అసి = అయితివి. అది నీవైతివి.

## 1. తత్ పదము :

**ఎ) వాచ్యార్థము** = మాయ + మాయయందలి చిదాభాసము +అధిష్ఠానబ్రహ్మము =ఇవన్నిచేరి ఈశ్వరుడు తత్పదమునకు వాచ్యార్థము.

**ఈశ్వరుని ధర్మములు =** 1. సర్వజ్ఞత 2. సర్వశక్తిత్వము 3. వ్యాపకత 4. ఏకత 5. స్వతంత్రత 6. సమర్థత 7. పరోక్షత 8. మాయోపాధి = ఈ యెనిమిది ఈశ్వర ధర్మములు.

**బి) లక్ష్యార్థము =** ఈ సర్వధర్మముల సహితముగా మాయ + మాయ యందలి చిదాభాసము +మాయాధిష్ఠానమైన బ్రహ్మము = **ఈశ్వరుడు,** తత్పదము యొక్క లక్ష్యార్థము.

## 2. త్వం పదము :

**ఎ) వాచ్యార్థము :** అవిద్య + అవిద్యయందలి చిదాభాసము + కూటస్థుడు = ఈ మూడును చేరి జీవుడు త్వంపద వాచ్యార్థము

**జీవుని ధర్మములు :** 1. అల్పశక్తి 2. అల్పజ్ఞత 3. పరిచ్ఛిన్నత 4. అనేకత 5. పరాధీనత 6. అసమర్థత 7. అపరోక్షత 8. అవిద్యోపాధి ఈ ఎనిమిది జీవధర్మములు.

**బి) లక్ష్యార్థము :** భాగ త్యాగ లక్షణముచే సహపరివారముగా అనగా సకల జీవధర్మ సహితముగా అవిద్యయందలి చిదాభాసమును పరిత్యాగము చేసినచో పరిశేషమైన **కూటస్థాత్మయే** త్వం పదమునకు లక్ష్యార్థము.

## 3) అసి పదము :

అసి పదమునకు అయితిని అని అర్థము. అసి పదము 'తత్' 'త్వం' పదములకు ఐక్యతను కల్పించుచున్నది.

తత్త్వమసి అనువాక్యమునకు "అది నీవైతివి" అనువాక్యార్థము. కించజ్ఞత్వ అపరోక్షత్వాది ధర్మములు గల జీవుడు సర్వజ్ఞత్వ పరోక్ష్యాది వ్యతిరేక ధర్మములు గల ఈశ్వరుడెట్లగును? కనుక ప్రసిద్ధార్థము (వాచ్యార్థము) అంగీకరించినచో వాక్యార్థము సమన్వయమగుట లేదు. విరుద్ధ ధర్మములు గల రెండు తత్త్వములకు ఏకత్వమెట్లు పొసగును? పొసగదు. కావున :

వాచ్యార్థము విరుద్ధము ప్రసిద్ధమై యున్నందున లక్షణా వృత్తిచే విచారించిననేగాని ఈ విరోధము పరిహారమగును.

మహావాక్యము నన్వయించు పట్ల జహల్లక్షణముగాని అజహల్లక్షణముగాని ప్రయోజనకారి కాజాలదు. ఏలననగా జహల్లక్షణముచే తత్పద వాచ్యార్థమైన ఈశ్వరుని, త్వంపదవాచ్యార్థమైన జీవుని పూర్తిగా విడిచిన యెడల ఐక్యత ఎవరికి? అపుడు జీవేశుల అసజ్జడ దుఃఖరూపదేహ ప్రపంచములను గ్రహించవలసి యుండును. కనుక జహల్లక్షణము వర్తించదు.

అజహల్లక్షణమందు వాచ్యార్థము నందేమియు త్యాగముగాక పోవుటచే తత్, త్వం పదములందలి విరోధార్థములు పరిహారముగాక యట్లే నిలిచియుండును. అనగా జీవేశ్వరుల

విరుద్ధ ధర్మములైన సర్వజ్ఞత్వ పరోక్ష అపరోక్షములు కూడ విడవబడక పోవుటవలన వాక్యమునకు సమన్వయము కుదురదు. కనుక మహావాక్యము నందు జహదజహదల్లక్షణము చేతనే పదద్వయమునకు ఐక్యత సిద్ధించును. ఎట్లనగా "తత్" "త్వం" పదము లందలి విరోధ భాగమునకు త్యాగమున్ను అవిరోధ భాగమునకు గ్రహణమున్ను అగుటవలన పదార్థములైక్యత చేకూరును.

1) కనుక "తత్పద" వాచ్యార్థమైన ఈశ్వరుని యందు:

అభాస సహితమాయ + మాయవలన కలిగిన సర్వజ్ఞత్వ సర్వశక్తులను వదులవలెను.

2) అట్లే "త్వంపద" వాచ్యర్థమైన జీవుని యందు :

అభాససహిత అవిద్యాంశమును + అవిద్యవలనకల్గిన అల్పశక్తి అల్పాజ్ఞానాది ధర్మములను త్యజిచవలెను.

3) ఇక జీవేశ్వరులయందలి **అధిష్ఠానచేతనాంశమొక్కటే** గ్రాహాంశమై యున్నది.

జీవేశ్వరుల యందీ యధిష్ఠాన చేతనమే సమానధర్మమైయున్నది. సమానమనగా రెండుగాదు. ఏకమే నని తత్త్వమసి వాక్యము బోధించున్నది.

శ్రీకృష్ణదేశికేంద్రులవారు 45వ కందార్థములో యిట్లు వివరించినారు. క.దు॥ **"పింద బ్రహ్మాండములు రెం।డును యా రెంటిలోని రెండహములు యా। ఖండములు నాలుగు కూడి। అఖండంబగు ఎరుక రూపు॥ గనరా మా తంద్రి। యిది దెల్పిన ఘనుడే తలిదంద్రి"** అనగా ఆ పాదమస్తక పర్యంతము తెలియుచున్న వ్యష్టి ప్రాణము పిండము, దాని యందలి వ్యష్టి మనస్సు అహమని; పృథ్వి ఆకాశము వరకు తెలియుచున్న సమిష్టి ప్రాణము బ్రహ్మాండమని, దాని యందలి సమిష్టి మనస్సు అహం అని నిర్ణయము. ఈ పిండ బ్రహ్మాండమలు వీటి అహములు నాలుగును కూడి అఖండమగు యెరుక యనబడును. ఈ ఎరుక యొక్క వాస్తవ లక్షణమును దెల్పెడి సద్గురువే తల్లిదంద్రియని యన్నారు. ఈ భావమును :

1. పిండము + అందలి అహం = **త్వం పదము.**
2. బ్రహ్మాండము + అందలి అహం = **తత్ పదము.**
3. పిండము+అందలి అహం+బ్రహ్మాండము+అందలి అహము=ఈ నాలుగు కలసి అఖండ ఎరుక రూపే = **అసిపదము.**

వీటిని వస్తు నిశ్చయముగా తెల్పిన గురుడే తల్లిదంద్రి అని తెల్పినారు. తత్త్వమసి వాక్యములో చెప్పబడిన అర్థమునే గాక యింకను విశేషరూపముగా అఖండార్థమునే ఈ కందార్థములో చెప్పబడినది. ఎట్లనగా మహా వాక్య విచారణలో జహదజహల్లక్షణము (భాగత్యాగ పద్ధతి) చే తత్, త్వం అను పదములందలి విరుద్దార్థములను త్యాగము చేస్తేనే మహా వాక్యార్థము అవగత మగునన్నారు. ఆవిధముగా యే విరుద్దార్థములను త్యాగము చేయకుండ గనే శ్రీకృష్ణదేశిక ప్రభువులు అఖండార్థమును ప్రతిపాదించినారు. అంతేగాక పిండ బ్రహ్మాండములు రెండు కూడితేనే గాని అఖండంబగు యెరుక రూపుగాదని ప్రతిపాదించిరి. ఈ రహస్యమును తెలిపిన గురువే తల్లిదంద్రియని తెల్పినారు.

**4. "అయమాత్మబ్రహ్మ"** అధర్వణ వేదాంతర్గత మాండూక్యోపనిషత్ లోనిది. దీనితో సమాప్తము చేయబడినది.

**అయమాత్మ బ్రహ్మనిర్ణయము :** ప్రజ్ఞానం బ్రహ్మ, అహంబ్రహ్మాస్మి, తత్త్వమసి

బ్రహ్మాయను నీ వాక్యత్రయమువలన యే ఆత్మ తెలసి నిర్ణయింపబడినదో ఆ యాత్మ బ్రహ్మమని నిర్ణయమగుచున్నది.

బీజము నందు అణగివున్న వృక్షము బీజాకారముగా నుండి వృక్షాకారము పొంది వృక్షమునకు కలుగు ఫలము నందు వృక్ష ఉపాధికి కారణమగు బీజము నిర్ణయమగునట్లు వార్తీక పద్ధతి యందు జన్మకు కారణమైన గుర్తు నిలిచియుంటూ వున్నది. కనుక జనన మరణ రహితమునకు ఈ సాధన యొనర్చిన మనుజునికి కలిగిన ఫలము జన్మహేతువునకు కారణముగా నున్నది.

ఈ మహావాక్యములందు "నేను", అహం (ఎరుక) మిగిలియున్నది. **"నేను లేనప్పుడే అది"** ఈ అహం లేకుండ పోతేనే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము. నేనుంటే పరిపూర్ణ పరబ్రహ్మము శుద్ధముగాదు. క్రింది భ్రాంతిరహిత శ్లోకమును పరిశీలనార్థము యిచట పొందుపరచనైనది.

**శ్లో॥ యథానాహం తథాశుద్ధం తస్మాచ్ఛుద్ధేన నిర్ణయ :**
**జగదస్తీతి కోవేద నాస్తికోనచనిర్ణయః** ॥భ్రాంతి రహిత శ్లోకము॥

అనగా నేను లేకుండ వుంటే యెట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణముండును. నేను లేకుండుట చేతనే అది శుద్ధమని నిర్ణయము. నేను లేనిచో జగత్తున్నదని తెలసికొనువారెవరు? నాస్తికులు గాని, యేనిర్ణయము గాని వుండుట పొసగదని అర్థము.

"నేను లేకుండా పోతే" అనగా విచారణ చేత, శాస్త్రవిచారణము, గురువాక్యము అనుభవము, యుక్తి మొదలగువానిచే పరిపూర్ణమందు ఈ అహంపదార్థము లేనేలేదని ఆరూఢ పరుచుకొంటే అని అర్థము 'అహం' అనే ఎరుక అదృశ్యమైపోతే యని అర్థముగాదు. ఎండమావులుండ గానే అనగా చూపులకు అందలి జలము గానవస్తున్న అచట ఒక చుక్కైన నీరు లేనేలేదని నిశ్చయ జ్ఞానము కలిగినట్లు ఎరుక యుండగానే ఎరుక విశ్వములు లేనేలేవని ఆరూఢులైన వారికి అనగా "నేను" లేకుండ పోయిన వారికి జన్మ రాహిత్యము కరతలామలకము. అంతేగాని వారి కెట్టి కోరికలుండవు. కామ్య బుద్ధి, కర్తృత్వబుద్ధి గాని యుండదు. రాగద్వేషములు, సుఖదుఃఖములు, పాపపుణ్యములు, సంస్కారములు వారి అంతః కరణమును అంటజాలవు.

మహావాక్యములను గూర్చి తెలుసుకొన్నాము. వాటివల్ల ముక్తి కలుగును, గాని జన్మరాహిత్యము సిద్ధించదు. జన్మరాహిత్యము సిద్ధించవలయునన్న మహావాక్యములవల్ల తాను బ్రహ్మనని తెలుసుకొన్న తెలివి భ్రాంతితో కూడుకొన్నది. అదే తొలి భ్రాంతి. ఈ భ్రాంతి రహితము కావలసి యున్నది. పరిపూర్ణ పరబ్రహ్మము ఈ మహావాక్యములను మీరినది. మహావాక్యములు వర్జితమైనప్పుడే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము అని గుర్తించవలయును.

**ప్రణవార్థవిహీనాత్మా లక్ష్యవాచ్య వివర్జితః**
**శుద్ధచైతన్యహీనాత్మా సర్వభాస వివర్జితః** ॥౧౩॥

పరిపూర్ణపరబ్రహ్మము నందు ప్రణవార్థము అనగా ఓంకారము లేదు. అనగా ఉనికి లేదు అది లక్ష్యలక్షార్థములకు, వాచ్యవాచ్యార్థములను వదిలినది. మరియు శుద్ధ చైతన్యము కూడ లేనిది. అన్నిటి ప్రకాశింపజేయునటువంటిది కాదు.

**వివరములు :**

**1. ప్రణవార్థావిహీనాత్మ :** పరిపూర్ణపరబ్రహ్మము ప్రణవార్థము అనగా ఓంకారము లేనిది. ప్రణవమనగా ఓం కారము. ఈ ఓంకారము వలన శబ్దవిస్తీర్ణమైన ప్రపంచము పుట్టినది. ఈ విషయమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు 122 క.ద.॥ **"పంచాదశక్షరముల । ప్రపంచము తానుద్భవించె। ప్రణవాక్షరమం।దంచు శ్రుతులెన్నె । దాన్నెరుకంచని నీ వెరిగి । యెరుగు మచలాము దీనన్ । నిల్వకు మెరుక నచలాములోనన్।"** అని శెలవిచ్చియున్నారు. అనగా యేబది అక్షరములచేత శబ్దవిస్తీర్ణమైన ప్రపంచను పుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. "ప్రణవోయీ పరం బ్రహ్మ, ప్రణవశ్చపరస్మృతః" అనగా ఓంకారము నిశ్చయముగా పరబ్రహ్మము. ప్రణవమే పరమాత్మ యని చెప్పబడుచున్నది. కనుక వాచ్యమగు బ్రహ్మమునకు వాచకమగు ఓం కారము వేరుకానందున ఓంకారము ఏబది యక్షరములకు మూలమని నిర్ణయము.

"ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ" భగవానుడు ప్రబోధించగా, నారదమహర్షి దీనిని త్రిమాతృకగా వివరించిరి. కాని యాజ్ఞవల్క్యుల వారు దీనిని చతురాక్షరిగానే వర్ణించిరి. శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రుల వారు దీనిని చతురాక్షరి గానే స్వీకరించి తమ ప్రణవార్థ ప్రకాశిక యందు దానిని బలపరిచిరి. కావున అకార, ఉకార, మకార, అర్థమాతృక స్వరూపమైన ఈ ప్రపంచమాయెను. అదెట్లనగా :

**'అ'** కారము లయము పొందగ భూమి, అగ్ని, ఋగ్వేదము, భూలోకము, బ్రహ్మము ఆవిర్భవించిరి.

**'ఉ'** కారము లయము పొందగ అంతరిక్షము, యజుర్వేదము, భువర్లోకము, సనాతనమైన విష్ణువు ప్రభవించెను.

**'మ'** కారము వలన ద్యులోకము, సూర్యుడు, సామవేదము, స్వర్లోకము, మహేశ్వరుడు నుద్భవించిరని శాస్త్రములు ఘోషించుచున్నవి.

**1) 'అ' కారార్థము :** శోత్రాది పంచ జ్ఞానేంద్రియములు, వాగాది పంచ కర్మేంద్రియములు మనస్సు అంతఃకరణ చతుష్టయమగు 24 తత్త్వములు చేరి స్థూల శరీర మాయెను. దీనికి జాగ్రత్త-అవస్థ, విశ్వుడు - అభిమాని, క్రియ - శక్తి, రజస్సు - గుణము, నేత్రము - స్థానము, యుక్తము - భోగము వీనితో కూడిన ఆత్మ జీవాత్మయనబడును. వీడు వ్యవహారిక జీవుడనబడును. ఇది అకారార్థము. ఇదే ఋగ్వేదము, ప్రజ్ఞాన బ్రహ్మయను విధి వాక్యమునకు మూలస్థానము.

**2) 'ఉ' కారార్థము :** జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములు ఐదు, ప్రాణేంద్రియము లైదు, మనో బుద్ధులు రెండు కూడి (17) తత్త్వములతో అంతరాత్మయైన లింగమే హిరణ్యగర్భము. ఇదే సూక్ష్మశరీరము. దీనికి స్వప్నము - అవస్థ, తైజసుడు - అభిమాని, ఇచ్ఛా- శక్తి, సాత్వికము -గుణము, కంఠము-స్థానము, స్వేచ్ఛ-భోగము అను వీనితోకూడి వ్యాపించిన ఆత్మ, అంతరాత్మయనబడును. వాడే ప్రాతిభాసిక జీవుడు. ఇదే ఉకారము, యజుర్వేదము అహంబ్రహ్మాస్మి; అనుభవ వాక్యమునకు నిలయమయ్యెను.

**3) 'మ' కారార్థము :** ముందు చెప్పబడిన స్థూల సూక్ష్మ శరీరముల రెంటికి కారణమగుటను బట్టి కారణశరీర మనబడును. అవ్యాకృతమైన మహదహంకారమే కారణ శరీరము. అదే త్రిగుణగర్భము. దీనికి సుషుప్తి - అవస్థ, ప్రాజ్ఞుడు - అభిమాని, ద్రవ్యము

– శక్తి, తామసము–గుణము, హృదయము – స్థానము, ఆనందము – భోగము, అను వీనితో కూడి వ్యాపకమైన ఆత్మ పరమాత్మ యనబడును. సామవేదము తత్త్వమసి బ్రహ్మ యను ఉపదేశవాక్యము, మకారము వలన ఉద్భవించినవి.

**4) అర్ధమాత్రుక :** అనగా అరసున్న (c) దీని వలన శుద్ధలింగమని పిలువబడు సమిష్టి మహాకారణ శరీరము మరియు వ్యష్టి మహాకారణ శరీరము. ఈ రెంటికి సంబంధించిన ప్రత్యగాత్మ పరమాత్మలను–అభిమానులు, తురీయావస్థలు– ప్రధాన గుణము, పరాశక్తియు, సదాశివుడు వారి వలన ప్రాప్తమగు మోక్షమును దాని కాధారమగు అఖండ ఎరుక లేక పరాఎరుకకు ఆధారమని స్పష్టమగుచున్నది. దీనికి స్థానము మూర్ధ్ని, అధర్వణవేదము, అయమాత్మ బ్రహ్మమనబడు సమాప్తవాక్యమునకు స్థానమని సువ్యక్తమగుచ్నుది. అనగా ఓంకారము సగుణ నిర్గుణములకు సాకార నిరాకారములకు, అధిష్ఠానచైతన్యమునకు దానినుండి ప్రకటమైన మాయాజగత్తులకు ఆధారము ఆధేయముగ నున్నదని స్పష్టమైనది.

ప్రణవము ప్రణవార్థమును గూర్చి తెలుసుకొన్నాము. పరిపూర్ణ పరబ్రహ్మమందు ప్రణవము లేని దెట్లో తెలుసుకొందము. ప్రణవము కూడ ఎరుకనే యంటున్నారు శ్రీకృష్ణదేశికేంద్రుల వారు 47 క.ద।। **"ఎరుకే విద్యా విద్యలు। ఎరుకే ప్రణవంబు నాద। మెరుకేకళయున్ యెరుకే బిందువు చిత్సత్తెరుకే ఆనందమివి నీ వెరుగు సద్బుద్ధీ। నామాట లెరుకె నిబద్ధీ యెరుకే నిర్గుణ సగుణా। లెరుకే యెరుకకు యంత। యెరుకో నేనిది యంత యెరుకజేసితి"** అని శెలవిచ్చియున్నారు. అనగా విద్యా విద్యలు, ప్రణవము, నాద, బిందు, కళయును, సత్తు చిత్తు, ఆనందమును ఎరుక యొక్క పరిణామములని నీవు తెలుసుకోమని ప్రబోధించినారు. ఎరుకను అచల ఋషులు లేనెరుకయని అన్నారు. ఎందుకనగా ఎరుకకు పరిపూర్ణ పరబ్రహ్మమందు స్థానము లేదు. కనుక దానిని లేనెరుక యన్నారు. ప్రణవము ఎరుక స్వరూపము. కనుక ప్రణవమునకు (ఎరుకకు) పరిపూర్ణపరబ్రహ్మమందు నిలచేయందుకు, స్థానము మూలము లేదని నిశ్చయముగా జెప్పవచ్చును. కనుక ఈ సాంప్రదాయమందు ప్రణవ రహితమునకు గుర్తుగా "ఌఓం" అని వ్రాయుట మన మెరిగి యున్నదే.

**2. లక్ష్యవాచ్య వివర్జితః :** పరిపూర్ణపరబ్రహ్మము వాచ్యవాచ్యార్థములకు, లక్ష్య లక్ష్యార్థములను విడిచినది. అనగా అది మనస్సునకు గాని, మాటలకుగాని అందనిది. అందుకే దానిని అవాఙ్మానసగోచరమైనదని చెప్పబడినది. అందుకే శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద.।।34 **"పలుకున బలుకగరాకను। తలపోయుద మనినమదికి దగులక యెపుడున్"** అని సెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణ పరబ్రహ్మము వాచ్యవాచ్యార్థములకు, లక్ష్యలక్ష్యార్థములుగా తలపోయుడ మనిన మనస్సుకు సాధ్యముగాదు. అనగా పరిపూర్ణపరబ్రహ్మము మాటలచేత వర్ణించుటకు వీలు కాదు. ఎందుకనగా దానికి రూపము లేదు. రూపము లేనిదానిని ఎట్లు మాటలచే వర్ణించగలము. రూపముంటే ఈ విధంగా యున్నది ఆ విధంగా యున్నదని మాటలచే వర్ణించవచ్చును. అందుకే పరిపూర్ణమపరోక్షమైన వానికి పలుకుటకు తానే లేదు మాటలెక్కడివి. మాటలుడుగిన అయ్యవారే పరిపూర్ణులు.

**3. శుద్ధ చైతన్య హీనాత్మ :** పరిపూర్ణ పరబ్రహ్మము శుద్ధ చైతన్య హీనమైనది. చైతన్య మనగా సకల ప్రాణులందు, సకల వస్తువులందు బాహ్యాభ్యంతర భేదము లేకుండ

వ్యాపించియున్నదానిని చైతన్య మందురు. అదే ఆత్మ, బ్రహ్మమని రెండు శబ్దములచే వ్యవహరింపబడుచున్నది. సృష్టికి పూర్వము అచల స్థితిలో నుండి నిస్సంకల్ప స్థితిలో నున్నప్పుడు శుద్ధ చైతన్యమును బ్రహ్మమని అన్నారు. "ఆకాశ శ్శరీరంబ్రహ్మ" యని శ్రుతిజెప్పుచున్నది. కావున ఈ బ్రహ్మము నిరావరణము కానేకాదు. ఏలననగా సృష్టిరూపము దాల్చు అపరిమితి సంకల్పశక్తి బ్రహ్మము నందే బీజరూపకముగా నుండి ఆవరణాత్మకమైన ఆకాశాది భూతములుగా పరిణమించి ఈశ్వర జీవజగత్తులుగా విజృంభించె నని చెప్పితీర వలసినదే. అంటే తొలుత చిద్ఘన స్థితిలో నున్న బ్రహ్మము తన యందు నిగూఢముగా నున్న త్రిగుణాత్మక శక్తిచే శరీరాత్మలుగా ద్వయదోష దూషితము లాయెను. అంటే సృష్టికి పూర్వం చిద్ఘనమైనది శుద్ధచైతన్యమని, సర్వ శరీరస్థమైనప్పుడు ఆత్మ యని పేర్కొనబడినది. అట్టి కారణమే కార్యమై తిరిగి కారణ వస్తువుగా సంచర ప్రతిసంచర పద్ధతులచే మార్పు చెందుతుంది బ్రహ్మము. ఇట్టి మార్పు చెందే కార్యకారణ రూపమైన వస్తువు పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. అందుకే యిచట శుద్ధ చైతన్య హీనమైనదే పరిపూర్ణ పరబ్రహ్మమని చెప్పబడినది.

**4. సర్వభాసవివర్జితః :** అంతట ప్రకాశించునట్టి, ఉనికి కలిగియున్నట్లు తోచుచున్నట్టి బ్రహ్మను కూడ వదిలినట్టిది పరిపూర్ణపరబ్రహ్మము. పరిపూర్ణపరబ్రహ్మము అంతట నిండి నిబిడీకృతమైయున్నను అది స్వయం ప్రకాశము కానిది. ఇంకేదానిచే అది ప్రకాశించదు. దానిచే మరొకటి ప్రకాశవంతము కాదు. కనుక అది సర్వలక్షణ విలక్షణమైనది. సర్వమునకు యెరుకేమూలము. దానికి మాత్రము మూలము లేదు. సృష్టికి కారణ వస్తువుగా ఏ బ్రహ్మము యితరులు ప్రతి పాదించిరో అదే ఎరుక. ఏ వస్తువు ప్రారంభముగా తీసుకొని కారణ పరంపరను విచారిస్తుపోయిన చివరకు అత్యంత మూలకారణ వస్తువు ఎరుకేనని తేట తెల్లమగును. ఉదా॥ ఒక కుర్చీ తీసుకొంటే దానికి మూలం కఱ్ఱ, కఱ్ఱకు మూలం చెట్టు, చెట్టుకు మూలం పృథ్వి జలం, అగ్నివాయువు ఆకాశము చివరకు ఆత్మ (ఎరుక) . ఇట్లు కారణ పరంపరగా గోచరిస్తూంది. ఆత్మనుండి వరుసగా యివన్ని పుట్టాయంటే ఆత్మకు కూడ పుట్టుక యుండి తీరాలి. ఎందుచేతనంటే పుట్టని దాని నుండి యితరము పుట్టజాలదు. కనుక ఆత్మయనబడె ఎరుక దేనినుండి పుట్టుచున్నది? అంటే ఉన్నవి రెండే. ఒకటి పరిపూర్ణ పరబ్రహ్మము. రెండవది లేనెరుక. పుట్టని పరిణామము నుండి యేది పుట్టదు. దాని యందెట్టి కారణ బీజములు లేవు. పుట్టించే సత్తాకలిగినది పుట్టేది కూడ బ్రహ్మమే, ఎరుకనే. కనుక ఎరుకకు ఎరుకనే కారణమనాలి. అందుకే బ్రహ్మను స్వతః కారణమని, లేక స్వయంప్రకాశమని, స్వకారణమని, స్వయంభూయని ఈ బ్రహ్మనే వర్ణించబడినది లేక ప్రకటనమైనది అని అనాలి. పరిపూర్ణపరబ్రహ్మము స్వయంప్రకాశము కాదు. ప్రకాశింప జేయునదిగాదు. అందుకే సర్వభాసవివర్జిత అని అన్నారు.

**ద్వైతా ద్వైత విహీనాత్మా ద్వయదోష వివర్జితః**
**దృశ్యాదృశ్య విహీనాత్మా ద్రష్టాదృక్చ వివర్జితమ్.** ॥౧౪॥

పరిపూర్ణ పరబ్రహ్మ ద్వైతాద్వైతములు గానిది. ద్వయదోషములు అనగా ఆవరణ విక్షేప దోషములను వర్జించినది. దృశ్యాదృశ్యములు లేనిది. దృక్కుద్రష్టకూడ లేనిది.

**వివరములు :**

**1. ద్వైతాద్వైత విహీనాత్మా :** పరిపూర్ణ మందు ద్వైత, అద్వైత సిద్ధాంతములు లేవు.

**1) అద్వైతులు :** అద్వైతమతకర్త పూజ్యపాదులు ఆదిశంకరులు. ఈ సిద్ధాంతము ప్రకారము జీవేశ్వరులకు ఏకత్వము ప్రసాదించబడింది. ఎట్లనగా అఖండానంద రూపమగుచైతన్యము ఒక్కటే సత్య పదార్థము. అదియే బ్రహ్మము, సకల ప్రపంచమునకు సాక్షి భూతము. నిర్వికారమగు బ్రహ్మము నందు జగద్భ్రాంతి, అవిద్యా (అజ్ఞానము) ప్రభావమున గలుగుచున్నది. అవిద్యను, మాయను ప్రకృతి యనబడును. మాయ యగు సత్వగుణమునందలి చేతన ప్రతిబింబము, చేతనము, మాయ ఈ మూడు గూడి ఈశ్వరుడు. అవిద్యయగు రజో గుణము యందలి ప్రతిబింబము, చేతనము, అవిద్య ఈమూడు గూడి జీవుడు. మాయా అవిద్యోపాదులగు జీవేశ్వరులను తీసివేయగ చేతన బ్రహ్మము శాశ్వతమని నిర్ణయముకలవారు అద్వైతులు.

1. మాయ యగు సత్వగుణము నందలిచేతనప్రతిబింబము + చేతనము + మాయ = మూడుకూడితే ఈశ్వరుడు.
2. అవిద్యయగు రజోగుణమందలి చేతన ప్రతిబింబము + చేతనము + అవిద్య = ఈ మూడు కూడితే జీవుడు.

మాయ అవిద్యోపాధులను తీసివేయగ చేతన బ్రహ్మము శాశ్వతము.

**2) ద్వైతులు :** ఈమతము ప్రతి పాదించినవారు మధ్వాచార్యులు. ద్వైతులనగా జీవేశ్వరులు వేరులగుదురు గాని ఏకము గాదు. ఎట్లనగా తేజోంధకారములు ఏకము గానట్లు, మరియు జీవుడు కించిద్గుణములు గలవాడు, ఈశ్వరుడు సర్వజ్ఞగుణములు గలవాడు. కనుక వీరలకు ఐక్యము పొసగదు. అయినా ఈశ్వరుడు వరములిచ్చువాడు, జీవుడు వరముల ననుభవించువాడని ద్వైతుల నిర్ణయము.

ద్వైతాద్వైతులను జెప్పిన తర్వాత విశిష్టాద్వైతులను గురించి జెప్పుట అసమంజసమేమి కాదు.

**3) విశిష్టాద్వైతులు :** ఈ మతాచార్యులవారు రామానుజులవారు.

విశిష్టాద్వైతులనగా ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి ఈమూడు సనాతనములు శాశ్వతములు. ఇందు యేవి నశ్వరములు అనగా నాశనమయ్యేటివి కావు. ప్రకృతి ప్రళయ కాలమందు తన స్థూలరూపము విడిచి సూక్ష్మరూపము జెందునుగాని నశించదు.

జీవుడు ఈశ్వరుడు భిన్నులే. జీవు డనాదివాసనల వలన జనన మరణములు జెందుచుండును. ఈశ్వరసేవవల్ల వైకుంఠ ప్రాప్తి కలిగి ఈశ్వరకైంకర్యము చేయుచు దివ్యదేహము ధరించి శాశ్వతముగా వైకుంఠమున నుండుట వీరల జీవన్ముక్తి యని, విశిష్టాద్వైతుల నిర్ణయము. 119 క.ద. ద్వైతాద్వైత విశిష్టులు । సైతురు । విని సైసరెపుదు । సైసక పిదపన్ । సైతురు క్రమమున వేరన । నాతతి మతి జీవశివులనవి వినబోకూ । నేబోధించినది విడబోకూ । ” అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చియున్నారు. అనగా ద్వైతులు, అద్వైతులు విశిష్టాద్వైతులు జీవేశ్వరులు వేరని, వేరుకారు ఒక్కటే యని, ఈశ్వరుడు చిదచిద్విష్టుడని ఎల్లప్పుడు పలు విధముల వాదించుకొనుచుందురు. అట్టి మిథ్యావాదముల వినకుము. నేను నీకు బోధించిన పద్ధతి విడిచి పెట్టకుము. పరిపూర్ణ పరబయలును గురు కటాక్షముచేనెరిగి ద్వైతా ద్వైత విశిష్టాద్వైతుల ప్రబోధలను మానుమని భావము.

భూమానంద వాక్యత్రయమున శ్రీ మందిప్పల హనుమంత దేశికేంద్రుల వారు : **“ద్వైతమన్నది లేనిది । అద్వైత మన్నగ రానిది । ద్వైతాద్వైతముల మీరియు । దోషరహితంబైనది”** పరిపూర్ణపరబ్రహ్మమని ఒక తత్త్వము నందు గానము జేసియున్నారు.

కావున పరిపూర్ణ పరబ్రహ్మ ద్వైతా ద్వైత విహీనమైనది యని తెలియవలయును.

**2) ద్వయదోష వివర్జితః :** ద్వయదోషములను విడిచినది పరిపూర్ణపరబ్రహ్మము. "ద్వితీయాద్వై భయం భవతి" అనగా ద్వయముంటే భయము తప్పదు. సూర్య చంద్రాదులందేగాక అధిష్టాన చేతన బ్రహ్మమందు కూడ ద్వయదోషమున్నది. కేవల యేకత్వమనేది మృగ్యం. యాగాది క్రతువు లొనర్చి యోగాభ్యాసపరులు చంద్రలోకమునకు పోవుదురనియు, కేవల జ్ఞానమార్గీయులు సూర్యలోకమును పొందుదురనియు మరి కొందరు చెప్పుచున్నారు. కాని ఆయా లోకములందు సైతము సుఖదుఃఖములకు హేతువులైన ద్వంద్వలక్షణములున్నవి. కేవలత్వము అనునదొక్క పరిపూర్ణపరబ్రహ్మము **"సర్వద్వంద్వ విరాహిత్యం తల్లింగం"** అని అందుచేతనే కీర్తించబడుచున్నది.

మాయకు ఆవరణ, విక్షేపములను రెండుదోషములు కలవు :

**1) ఆవరణలక్షణము :** బ్రహ్మరూపమును మరుగుపరచి స్వరూపజ్ఞానము కలుగు కుండ చేయుటయే ఆవరణ లక్షణము. ఆవరణ కార్యము మరుపు. రజ్జువును దర్శించక అడ్డుపడిన అజ్ఞానము ఆవరణ.

**2) విక్షేపలక్షణము :** భ్రమాజ్ఞానము కలిగించి దానియందు సత్యత్వబుద్ధిని కలిగించుటయే విక్షేపకార్యము. ఉన్న పరబ్రహ్మమును మరుగుపరిచి లేనిదానిగా జేసి వేయుట, లేని పదార్థమున్నట్లుగా భ్రమరూపజ్ఞానము కలిగించుట అను అపూర్వ శక్తి సామర్థ్యములు గలుగుట చేతనే ఈ మాయా అఘటనఘటనా పటీయసీయని పేర్కొనబడినది. మనస్సు యొక్క చాంచల్యమే విక్షేపము. ఆవరణ రహితమునకు సత్కర్మానుష్టానము, అంతఃకరణశుద్ధి అవసరము. గురువాక్యము వలన ఆవరణ తొలుగును. విక్షేపము తొలుగుటకు ఉపాసన కావలయును ఆవరణం విశ్వం, విక్షేపం ఎరుక. ఆవరణము కార్యరూపము, విక్షేపము కారణరూపము. కారణం పోతే కార్యము పోవును, కావున విక్షేపం పోతే ఆవరణం పోవును.

పరిపూర్ణపరబ్రహ్మము సర్వలక్షణ విలక్షణమైనది. అందు ద్వయదోషములుండడానికి వీలులేదు. కావున పరిపూర్ణమందు ద్వయదోషములు లేవు. అందుకే కృష్ణదేశికేంద్రులవారు తాము వ్రాసిన కందార్థములకు" శక్తి ద్వయనిరాసకంబైన శుద్ధ నిర్గుణ తత్వకందార్థ దర్పులు" అని నామ కరణము చేసినారు.

**3. దృశ్యాదృశ్య విహీనాత్మా :** పరిపూర్ణపరబ్రహ్మము దృశ్యాదృశ్యములు లేనిది. దృశ్యాదృశ్యములు కూడ ద్వంద్వములు. ద్వయ దోషములు కూడ ద్వందములు. కనుక లేనివే. శాశ్వతమైన పరిపూర్ణమందు అశాశ్వతమైన దృశ్యాదృశ్యములు లేవు. "దృశ్యం మాయా" దృశ్యరూప ప్రపంచమంతయు ఇంత ప్రత్యక్షముగా గోచరించుచు మానవుని సుఖదుఃఖములకు కారణమగు చున్నదానిని మాయ అని ఎట్లనవలయును. శబ్ద స్పర్శాది గుణములతో గూడి వస్తు సముదాయము శబ్దాది విషయములు (జ్ఞానేంద్రియములు) శరీరమును ధరించు భరించు ప్రాణపంచకము, యింద్రియముల ద్వారా బహిర్గతమయ్యే వస్తుసముదాయమును ప్రకాశింపజేయు అంతఃకరణ ప్రకాశము ఈ అన్నిటిని 'నేను' 'నాది' అని అభిమానించు అహంకారము, ఇవన్నియు దృశ్యములే. ఇదియును గాక నా కన్యమై బ్రహ్మాండము నందుండి దానిని ధరించు భరించు సమిష్టి ప్రాణము, సూర్య చంద్ర నవగ్రహ నక్షత్రాదులు పంచ భూతములు యివన్నియు నాచే గుర్తించబడి దర్శింపబడుచున్నందున "ద్రష్టుర్ యోగ్యం

దృశ్యం" అనే న్యాయంగా దృశ్యకోటిలో చేరిపోవుచున్నవి. "యద్దృశ్యం తన్నశ్యం" యను న్యాయముగా దృశ్యములన్ని నాశనమయ్యేటివే. అశాశ్వతమైనవే. కనుక పంచతన్మాత్ర విషయములగు శబ్ద, స్పర్శ, రస, రూప, గంధములు అశాశ్వతములే. అట్లే జ్ఞానమునకు తెలియబడే దంతయు దృశ్యకోటిలో చేరును. కనుక జ్ఞానమునకు విషయమగు విషయములు కూడ అశాశ్వతమే. అట్లే సర్వత్రిపుటులు అశాశ్వతమే. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు, ద్రష్ట దృక్కు దృశ్యములు అనే త్రిపుటియందు ఒకదాని కొకటి సాపేక్షికములు, కనుక లేనివి, కనుక దృశ్యాదృశ్యములు లేనివి. దృశ్యాదృశ్యములు సాపేక్షిక పదములు దృశ్యమునకు అదృశ్యము ప్రతియోగ పదము. ఈ రెండు ద్వంద్వములు. కనుక లేనివే. ద్వంద్వ రూపములో నున్న దృశ్యా దృశ్యములు పరిపూర్ణమందు లేవని నిరసించవలసినదే.

**4. ద్రష్టాదృక్చ వివర్జితమ్ :** ద్రష్ట దృక్కు కూడ లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. ద్రష్టయనగా సమస్తమును గాంచువాడు జీవుడు (చూచువాడు) దృక్కుయనగా చూపు జీవ సంబంధమైన జ్ఞానము. త్రిపుటిని గైకొన్న ద్రష్ట, దృక్, దృశ్యము కలసిత్రిపుటి. త్రిపుటి యందు యే ఒక్కటి లేక పోతే తక్కిన రెండు లేకుండును. ఇచట దృశ్యము గురించి ముందు గానే చెప్పబడినట్లు "యద్దృశ్యం తన్నశ్యం" యను న్యాయంగా దృశ్యము లేనిదే యగుచున్నది. దృశ్యమే లేనప్పుడు ద్రష్ట, దృక్కులేనివే యగుచున్నవి. ద్విపుటిగా ద్రష్టదృక్కును పరిగణనలోకి తీసుకొన్న యెడల ఈ రెండు సాపేక్షక పదములు, ద్వంద్వములో చేరిపోవును. సర్వ ద్వంద్వములు లేనివే పరబ్రహ్మమందు వాటికి స్థానము లేనందున లేనివే యగుచున్నవి.

**ఖండాఖండ విహీనాత్మా క్షేత్రక్షేత్రజ్ఞ వర్జితమ్**
**బ్రహ్మార్థవాచ్య హీనాత్మా ఆత్మశబ్దార్థ వివర్జితమ్** ॥౧౫॥

పరిపూర్ణ పరబ్రహ్మము ఆత్మవలె ఖండఖండములుగా (చరాచరము లందున్నట్లుగా) మరియు బ్రహ్మమువలె అఖండముగా లేనిది. క్షేత్రము (దేహము) క్షేత్రజ్ఞునిగా (ఆత్మవలె) లేనిది వాచ్యార్థముగా జెప్పబడు బ్రహ్మము, లక్ష్యార్థముగా జెప్పబడు ఆత్మయు లేనిది. పైన జెప్పినవన్ని పరిపూర్ణ బ్రహ్మమందులేవు.

**వివరములు :**

**1. ఖండాఖండ విహీనాత్మా :** పరిపూర్ణపరబ్రహ్మము ఖండములుగా కాలేదు అది అఖండముగా నున్నది. ఖండమనగా ముక్క తునక లేక ఒక భాగము. అఖండము అనగా ముక్కలు తునకలు భాగములు గానిది. మొదట అసంఖ్యాకములగు ఖండములుండి పిదప అవన్నియు కూడి అఖండరూపము పొందినవా? లేక అంతయూ ఒకే ఒక అఖండరూపముగా నుండి పిదప ఖండములైనవా? అంటే **"ఏకమేవాఽద్వితీయంబహ్మ"** ఏకము అనేక మాయెను అని తెలియుచున్నది. పిదప మరల సంచర ప్రతిసంచర పద్ధతిలో అనగా ఊర్ధ్వపరిణామములో ఆ **"అనేకం ఏకం భవతి"** అయ్యేనని శ్రుతి జెప్పుచున్నది. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు 82 క.ద॥ **"ఎరుకైన భూతముల । నీ వెరుగుము ఆకసము గాద్పు । యింగలమును। నీళ్ళిరవంద నేలయని । నే నెరిగిన పద్ధతిని నీకు । నెరిగించినానూ । ముజ్జగము లయ్యేను వీట్లతోను।"** అని సెలవిచ్చియున్నారు. అనగాఎరుకే పంచభూతములచే కలిగిన దన్నారు. కనుక తొలుత అఖండ వస్తువు ఒకదాని నుండి మరొకటి ఉద్భవించినవి (అంటే ఆత్మనుంచి ఆకాశము, ఆకాశమునుండి గాలి అట్లే ఇతరములాయెను అని చెప్పుట

న్యాయముగానున్నది). సృష్టి యుంటేనే ప్రళయము చెప్పనగును గాని సృష్టి లేనిదే ప్రళయము చెప్పరాదు గదా! క్రమముగా సృష్టి కలిగినదని శాస్త్రములు జెప్పుచున్నవి. యుగ సృష్టియనగా అన్నియు ఒకేసారి సృష్టియైనవనుట అంగీకరించలేము. అట్లే ప్రళయములో కూడ భూమి జలములో, ఆరెండు అగ్నిలో అట్లే వరుసగా వాయవు ఆకాశము, ఆకాశము ఆత్మలో లయమగునని చెప్పబడినది గాని, మొత్తము పంచభూతములు ఒకేసారి ఆత్మయందు లయమైనవని చెప్పరాదు. ఏవిధముగా చూచిన తొలుత అఖండముగా నున్నవస్తువు క్రమముగా అనేక ఖండము లాయెనని చెప్పుట యుక్తము.

అఖండమనగా తెంపులేనిది. అది మధ్యాంతరరహితమగు వస్తువని కూడ, నిరావరణమైనదని కూడ చెప్పవచ్చును. ఈ అర్థములో కేవలం అఖండమగునది. పరిపూర్ణపరబ్రహ్మ మొక్కటి మాత్రమే. అది నిరపేక్షక అఖండము. అనగా పరిపూర్ణమని చెప్పినపుడు ఖండ వస్తువు యొక్క ప్రసక్తిలేదు. ఎరుక సృష్టికి పూర్వము అఖండము గాను, సృష్ట్యనంతరము ఖండ ఖండములుగా మారుచుండుటచే అది సాపేక్షిక ద్వంద్వ స్వరూపము. గనుక లేనిది.

**2. క్షేత్ర క్షేత్రజ్ఞవర్జితమ్ :** పరిపూర్ణ పరబ్రహ్మము క్షేత్ర, క్షేత్రజ్ఞవర్జితమైనది. క్షేత్రమనగా కేవలమొక స్థూల దేహమే కాదు. సమస్త దృశ్యములు క్షేత్రమే. స్థూల సూక్ష్మ పంచభూతములు, మనస్సు, బుద్ధి, అతి సూక్ష్మమగు అవ్యక్తము (మూల ప్రకృతి) కూడ క్షేత్రము క్రిందికే లెక్కకు వచ్చును. మనస్సు బుద్ధికూడ క్షేత్రమునకు చెందినవే. కావున వాని వృత్తులగు ద్వేషాది దుర్వృత్తులు, ధృత్యాది సద్వృత్తులు కూడ క్షేత్రము క్రిందనే లెక్కవేయబడినవి. దృశ్యరహిత నిసంకల్పాత్మ స్థితి యందు అద్వేర్యాది సదసద్వృత్తులను కూడ దాటి పోవలసి యుండును.

ఈ జడమైన శరీరమును చైతన్యవంతమైన ఒక శక్తి తెలుసుకొనుచున్నది. ఆ ప్రజ్ఞానరూపమగు వస్తువే క్షేత్రజ్ఞుడందురు. క్షేత్రమగు శరీరమును తెలుసుకొనువాడు క్షేత్రజ్ఞుడు. అతడే ప్రత్యగాత్మ. క్షేత్రముననుండు (ఉపాధియందు, పంచకోశములందు) సాక్షి రూపముగా వెలుగొందు ఏ ప్రత్యగాత్మ (జీవాత్మ) కలదో అది పరమాత్మకంటే వేరుగాదని తెలియవలయును. క్షేత్రమును (ఉపాధిని) తెలుసుకొనువాడైన ప్రజ్ఞానరూపుడగు చైతన్యము అనగా క్షేత్రజ్ఞుడు ఎవడు కలడో వాడే శివుడు.

అధిష్ఠాన చేతన బ్రహ్మమే అయిన అఖండ ఎరుకకు పృథ్విపాదములు, జలముకటి, అగ్ని హృదయము, వాయువు కంఠము, ఆకాశము శిరస్సు, ఇది క్షేత్రమనబడును. దీని సూక్ష్మాంశమగు చేతనబ్రహ్మము అనగా కూటస్థుడు క్షేత్రజ్ఞుడనబడును. ఈక్షేత్రజ్ఞుడు కాలనిర్ణయానుసారము ఉత్పత్తి స్థితి, లయ, విస్తీరణ, ఆకర్షణలు చేయుచుండును. పరిపూర్ణ పరబ్రహ్మమునకు క్షేత్రజ్ఞునికి సంబంధములేదు. క్షేత్ర క్షేత్రజ్ఞులు ద్వంద్వములు. సర్వద్వంద్వములు అశాశ్వతములు శాశ్వతమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. క్షేత్ర క్షేత్రజ్ఞులు అశాశ్వతములని నిరసించనైనది.

**3. బ్రహ్మార్థ వాచ్యహీనాత్మ ఆత్మశబ్దార్థవివర్జితమ్ :** బ్రహ్మమునకు వాచ్యార్థమేమనగా దేవమానవ పశు పక్షి క్రిమి కీటకాది సకల చరాచర జంతువులు, ఆకాశాది పంచభూతములు దేని యందుండి పుట్టునో, దేని సత్తామాత్రముచేత జీవించుచుండునో, మరల మహాప్రళయమున సకలము దేని యందు ప్రవేశించి లయించునో ఆవస్తువే బ్రహ్మము

"బృంహి = వృద్ధౌ" అనుధాతువు నుండి బ్రహ్మ శబ్దము వ్యుత్పత్తియైనది. బ్రహ్మము అనగా అత్యంత పెద్ద వస్తువు. సత్తు చిత్తు ఆనందములే స్వరూపలక్షణముగా జెప్పబడినది. "సత్యజ్ఞానమనంతం బ్రహ్మ, నిత్యం విజ్ఞానం ఆనందము బ్రహ్మ" యని శ్రుతులు దానిని అభివర్ణించినాయి.

ఆత్మను గురించి చెప్పాలంటే సకల శరీరములందు హృదయముల లోపల బుద్ధియనెడు గుహ లోపల వసించుచు (అహమహమని) అనగా నేను నేను అని స్ఫురించుచుండు కేవల జ్ఞాన మాత్ర స్వరూపమైన వస్తువే ఆత్మయనబడును.

అధిష్ఠానచేతనబ్రహ్మమును అఖండయెరుక, ఉపాధియందాత్మయని చెప్పబడును. ఆత్మ ప్రథమమున సృష్టియందు ప్రాణమును సృష్టించి దాని వలన పంచభూతములు, పంచీకృత పంచభూతములు సృష్టించి, వాని యందు తాను మనోరూపమున నివసించి సృష్టి స్థితి లయములు పొందుచుండును. కనుక సకలోపాధులందు నుండు నట్టి ఆత్మ దాని కారణ మగు బ్రహ్మమును నిరసన జేయబడినది. సృష్టికారణ మగు బ్రహ్మమునకు ఆ బ్రహ్మమే ఉపాధిగతమైనప్పుడు ప్రత్యగాత్మయైన ఆత్మకు ఉనికిలేదు. ఎండమావులలో జలమున్నట్లే కానవచ్చిన అక్కడ నిజముగా నీరు లేదు. అట్లే పరిపూర్ణమందు బ్రహ్మము వాచ్యార్థమగు ఆత్మకు స్థానముగాని మూలముగాని లేదు అని తెలియవలయును.

**సర్వత్ర పూర్ణరూపాత్మా సర్వతాత్మావ శిష్యతే**
**అన్యైర్నభాసితం పూర్ణం సర్వప్రకాశం సదానహి** ॥౧౬॥

అంతట పూర్ణముగా ఆత్మ ఉన్నది. ఆత్మరూపాత్మగా నున్న ఉపాధిని త్రోసివేయగ సర్వత్వాత్మ లేక అన్నిటి యందు గల సూత్రాత్మయే మిగులును. పరిపూర్ణ పరబ్రహ్మము ఇతరులచేత ప్రకాశించదు మరియు స్వప్రకాశము గూడ కాదు.

**వివరములు :**

**1. సర్వత్రపూర్ణ రూపాత్మా :** అంతటగల ఆత్మ పూర్ణముగా అన్నిటి యందు నిండి యున్నది. ఆత్మ బ్రహ్మము అని చెప్పబడె వస్తువు ఒక్కటియే గాని వేరుగాదు. మరియు అవస్థాత్రయములందలి సంగతులను శరీరము జ్ఞానములేని జడపదార్థమగుట వలన యెరుగ జాలదు, చెప్పజాలదు. కాబట్టి దేహము కంటెను వేరుగా ఒక జ్ఞాన స్వరూపమగు వస్తువు యీ శరీరము నందుండి సకల విషయముల నెరుగుచు చెప్పుచున్నది. అట్టి జ్ఞాన స్వరూపమగు వస్తువే ఆత్మ యనబడును. శ్రీ పరుశురామ నరసింహదాసు భద్రాది రామశతకమున ఆత్మ అన్నిటి యందు పూర్ణముగా ఎట్లునిండి యున్నదో తెల్పియున్నారు

66.సీ॥ ధరణిలో తిలలందు తైలముండినరీతి దారువ యందున్న దహనుగీతి ।
నాణెమౌదధియందు నవనీతమున్నట్లు పుష్పమందున గంధమున్నయట్లు ।
రంజిల్లు ఫలమందు రసము గల్గిన భంగి చేలమందున్నట్టి నూలు భంగి ।
తారాహారాదుల దారముండినరీతి, యిసుక రాళ్ళందున్నయినుము తీరు ।
అఖిల జగముల సకల దేహంబులందు । నిండియున్నావు యీరీతి నిజముగాను ॥ర॥

నూగులందుతైలము, కట్టెలో అగ్ని, పెరుగుయందువెన్న, పూవునందు గంధము ఫలమందు రసము, గుడ్డయందు నూలు, ముత్యములపేరు నందు దారమున్న రీతిగా ఆత్మ సకల జగములందును సకల దేహములందును నిండి యున్నదని వివరించిరి.

సృష్టికి పూర్వము "సదేవసోఽమ్యేఽదమగ్ర అసీత్" సృష్టికి పూర్వము ఆ

బ్రహ్మము సత్ పదార్థముగా నుండెను. అనంతరము "ఏకం అనేకం భవతి" ఆ ఒక్కటియే అనేక మాయెను. తత్సృస్ట్వా తదేవాఽను ప్రావిశత్" పిమ్మట తానే అందు అనుప్రవేశము గావించెను ఇట్లు అను ప్రవేశము గావించుటవల్ల అన్ని వస్తువు లందు పూర్ణముగా పైన జెప్పినట్లు ముత్యాల హారమునందు ముత్యములు కనబడుచున్నను అందలిదారము సూత్రాత్మగా కనబడక ఆ దండకు ఆధారము, అధిష్ఠానమైనట్లు ఆత్మ ఈ జీవేశ్వర జగత్తులోని సమస్త వస్తువులందు, సకల ప్రాణులందు నిండి యుండుట వల్ల అన్ని వస్తువుల రూపము తానే దాల్చి సర్వత్రాపూర్ణరూపాత్మగా నున్నది.

**2. సర్వతాత్మా వశిష్యతే :** అంతట ఆత్మయే శేషించి యున్నది. అతద్వ్యా వృత్తి లక్షణము చేత యిది కాదు, యిదికాదు, యిది కాదు అంటూ యింద్రియ గోచరమగు సమస్తమును నిషేధించుచు పోగా మిగిలినదే ఆత్మ. ఆత్మయింద్రిములకు గోచరము గాకున్నను, మనోగోచరమైయున్నది. శ్రుతి ॥ **"ఆత్మవారే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసితవ్యః"** బృహదారణ్యకోపనిషత్. ఆత్మయే చూడదగినది, వినదగినది; మననచేయదగినది; ధ్యానముచే పొందదగినది. అనగా మనస్సుచే తెలియదగినదిగా నున్నది. భద్రాది రామశతక కర్త 70 నుండి 72 సీస పద్యములందు "నేతి నేతి నేతీతి హోవాచ" యను మహావాక్యమును వివరిస్తూ

సీ॥ అష్ట తనువులుగా వష్టాత్మలునుగావు అష్టాంగ యోగాది నిష్టగావు ।
అష్టమూర్తులుగావు అష్టపురంబులుగా వష్టమదములుగావు నీవు ।
అష్టాబ్దములుగావు యష్టపాశంబులు యష్టస్థలంబులు నరయగావు ।
దశరంధ్రములు గావు దశనాడులునుగావు దశవాయుగుణ సమస్తములుగావు ।
పంచశక్తుల గావాది ప్రకృతికావు సర్వచైతన్య పరిపూర్ణ సాక్షి వీవు ॥రమ్య॥

అని శెలవిచ్చియున్నారు. మరి సచ్చిదానంద రూపాత్మ సాక్షివీవు యని వర్ణించియున్నారు. అన్నిటిని అనాత్మగా త్రోసివేసిన చివరకు మిగిలేది ఆత్మయే యని తెలియవలయును.

**3. అన్యైర్న భాసితం పూర్ణం స్వప్రకాశం సదానహి :** అనగా పరిపూర్ణ పరబ్రహ్మము ఇతరములను ప్రకాశింపజేయదు. తాను స్వయంగా ప్రకాశింపదని అర్థము. సృష్టికర్తయైన బ్రహ్మము లేక చైతన్యము స్వయం ప్రకాశము కలిగి యితర వస్తువులను ప్రకాశింపజేయును. ఇదే విశ్వమునకు ఆధారము అధిష్ఠానమై తాను ప్రకాశించుచు సర్వమును ప్రకాశింపజేయుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మము అట్లుగాదు. ఎందుకనగా పరిపూర్ణమునకు ఆదిమధ్యాంతములు లేవు. సర్వత్రా నిండి నిబిడీకృతమైయుండి సూది మోపుటకు తావులేక నిండి యున్నది. దాని కెట్టి పరిమితి లేదు. కేవల మఖండమైయున్నది. దాని యందు జ్ఞానముగాని యింద్రియములుగాని కర్మచేయుటకు వలయు ప్రాణశక్తి గాని యింద్రియములు, వానిని నడిపించు అధిష్ఠానదేవతలు గాని అన్యమేమిలేదు. **"నిశ్శక్తి నిర్మలంపూర్ణం"** అది తప్పరెండవది లేనిది. అందు తోచబడు అన్యమేదైన యున్నది అంటే అది ఎండమావులలో నీళ్ళవలె, సురస్వపన్నమువలె లేనిచే యగును. కనక సృష్టికారణ వస్తువే సృష్టిగా మారినది. ఈ కారణకార్యములు రెండు ఎండమావులలోగల నీళ్ళవలె తోచుటేగాని నిజముగా లేనేలేవు. కనుక యింద్రియ గోచరమగు సమస్తము, శుద్ధ మనస్సుకు గోచరించు బ్రహ్మవస్తువు లేనేలేదు.

కావున పరిపూర్ణ పరబ్రహ్మము తాను స్వయంగా ప్రకాశించదు, ఇతరముల దేనిని ప్రకాశింపజేయదు.

**ధ్వాంతతేజోద్వయం హీనం కథందృశ్యతి నిశ్చితమ్**
**దృశ్యంనశ్యతి సత్యంచ తథాశూన్యం సదానహి** ॥౧౭॥

పరిపూర్ణ పరబ్రహ్మమందు ధ్వాంతమనగా చీకటి, తేజమనగా ప్రకాశము లేక వెలుతురు లేదు. చీకటి వెలుగు లేనిది గనుక అది యితర వస్తువులను ఎట్లు చూచును? దృశ్య మెప్పుడును నశించునదియనుట సత్యము. అట్లే శూన్యము సదా లేనిదియే.

**వివరములు :**

**1. ధ్వాంత తేజోద్వయం హీనం :** ధ్వాంతమనగా అంధకారము లేక చీకటి, తేజమనగా ప్రకాశము లేక వెలుతురు. ద్వయం అనగా రెండు. అనగా చీకటి వెలుగులు పరిపూర్ణ పరబ్రహ్మమందు లేవు. ధ్వాంతతేజములు ప్రతియోగి పదములు, ద్వంద్వములు కనుకలేనివి. ఇవి పరిపూర్ణపరబ్రహ్మమందు లేవు. అంధాకారమనునది యొకటి, తేజస్సు ననునది మరొకటియని రెండు వస్తువులు లేవు. ఇవి రెండు ఒకే వస్తువు యొక్క వేర్వేరు రూపములు.

అవకాశ రూపమైన ఆకాశము నందు వెలుగునకు కారణమైన భూత జ్యోతిస్సులు అనగా సూర్యచంద్ర నక్షత్రాదులు విద్యుత్ మొదలగువాని ప్రకాశము వ్యాపించును. అట్లు వ్యాపించుటలో మధ్య అవరోధముగా నున్న వస్తువు యొక్క నీడ వస్తువు యొక్క పృష్ఠ భాగమున (వెనుక భాగమున) ఏర్పడుచున్నది. ఆ నీడనే మనము చీకటి అనుచున్నాము. కనుక ఈ తేజోంధకారములు ఆ ప్రకాశవస్తువు యొక్క రెండు రూపములే. వస్తువు అడ్డులేనప్పుడు ప్రకాశమందురు.

ఈ విధముగా చూచిన తేజోంధకారములు సాపేక్షిక ద్వంద్వములు ద్వంద్వములన్ని నశ్వరములే. ఇవి సత్య పదార్థములు గావు. నిత్యమై సత్యమై అన్యమేమి లేని పరిపూర్ణ పరబ్రహ్మమందు ద్వంద్వైక రూపమైన తేజోంధకారములు లేనివని తెలియవలయును.

**2. కథం దృశ్యతి నిశ్చితమ్ :** తేజము అంధకారము లేని పరిపూర్ణపరబ్రహ్మము ఎట్లు చూచును? ఏదేని వస్తువును చూడవలయునన్న కన్నులుండవలయును. ఏ వస్తువును మనము చూచెదమో ఆవస్తువు నుండి వెలువడిన కిరణములు కన్నుల పడవలయును. అప్పుడు మనస్సు కన్నుయనే పరికరము ద్వారా చూచును. అంటే మనస్సు, చూచిన వస్తువు యొక్క ఆకారము దాల్చును. అప్పుడే ఆవస్తువు కనబడును. అంటే వస్తువు కనబడుటకు ద్రష్ట, దృష్టి, దృశ్యము యనుత్రిపుటి అవసరము. ఈ మూడింటిలో యే ఒక్కటి లేకున్న తక్కిన రెండులేవు. పరిపూర్ణ పరబ్రహ్మము ఈ త్రిపుటిగాని ద్విపుటిగాని లేనిది. కావున అది దేనిని చూడలేదు. 39 క.ద॥ **"లేదనకు మున్నదదిగో౹ నేదెలసితి ననకు దీన్ని నీ వెరిగేవా౹ కాదది నీచే తెలియును । యేదిర తన్మాత్ర సమితి యీ బట్టబయట దీనికి సాటిదేది యెచ్చోటా । వాదేల లేనెరుకతో దీన్ని కనిపెట్టి । పోదోలు మెరుక నింకేది బట్టదు చాలు యీ బట్టబయటా"** అని శుద్ధనిర్గుతత్వ కందార్థ దర్పు ప్రబోధించుచున్నది. అనగా పరిపూర్ణ పరబ్రహ్మమందు పంచతన్మాత్రలైన శబ్ద స్పర్శ రూప రస గంధములులేవు. కనుక అది అవాఙ్మానసగోచరము "ఆత్మవాఽరే ద్రష్టవ్య శ్రోతవ్యో,

మంతవ్యో నిధి ధ్యాసి తవ్యః" అని బృహదారణ్యకోపనిషత్తు వాక్యము. అనగా ఆత్మయే చూడదగినది వినదగినది, మననము చేయదగినది, ధ్యానముచే పొంద దగినది. మరియు "మనసైవాను ద్రష్టవ్యం మనసైవాను శ్రోతవ్యం" మనసుచే ఈ బ్రహ్మను చూడతగినది.కాని పరిపూర్ణపర బ్రహ్మము అట్లుగాదు. **"నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నోమనః"** కేనోపనిషత్, అదివాక్కునకు అందదు, మనస్సు కన్నుకు అందదు. అది జ్ఞానమునమునకు కూడ తెలియరానిదని ఉపనిషద్వాక్యము. కనుక చూచేది వినేది అనేది కారణ బ్రహ్మమునకే వర్తించును. పరిపూర్ణపరబ్రహ్మమందు ఎరుగునట్టి ఎరుకలేదు. అది ఏది కానిది. ఏది లేనిది కావున అది ఎట్లు చూచునని ఈ ఉపనిషద్వాక్యము ప్రశ్నించుచున్నది.

**3. దృశ్యం నశ్యతి సత్యంచ :** అనగా దృశ్యమునశించుట సత్యము. కళ్ళకు మాత్రమే గోచరించునది దృశ్యముగాదు. జ్ఞానేంద్రియములగు శోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వాఘ్రాణములను, ప్రాణేంద్రియములలో వ్యానమును, అంతరేంద్రియములలో జ్ఞానమనోబుద్ధులున్ను వస్తువును తెలుసుకొనుటకు సాధనములే. గోచరమను శబ్దము ఎట్టిదో దృశ్యమను శబ్దము అట్టిదే. కంటికి కానవచ్చేది మాత్రమే దృశ్యము కాదు. ఏ యింద్రియములకు గాని లేక మనస్సుకు తెలియబడినను అది దృశ్యమనవలెను. "మనషష్టానింద్రియాణి" అంటూ మనస్సుకూడ ఒక యింద్రియమని చెప్పబడింది. "యద్దృశ్యం తన్నశ్యం" అనగా పై విధముగా కానవచ్చే సమస్తము దృశ్యకోటిలోకి చేరినవే. ఏది దృశ్యమాన మగుచున్నదో, అదినశించునదే, లేక అశాశ్వతమైనది. కనుక పంచతన్మాత్ర విషయములగు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అన్ని అశాశ్వతములే. అట్లే జ్ఞానమునకు తెలియబడే దంతయు దృశ్యకోటిలోనికే చేరును. కనుక జ్ఞానమునకు విషయమగు విషయము కూడ అశాశ్వతమే. సర్వత్రిపుటులు అశాశ్వతములైయున్నవి.

ఈ విధంగా విచారించినచో సృష్టి అంతయు మాత్రమేగాక, సృష్టి కర్తయు కూడ అశాశ్వతవేే, ఎవరికి ఎప్పుడదేది తెలియఃబడునో అది అంతయు అనగా భాగవతకృష్ణదేశికేంద్రుల వారి పరిభాషలో **"ఎరుకకు ఎంత ఎరుకో అది అంతయు ఎరుకే అయివున్నది"**. అనగా అసత్యము, అశాశ్వతము అయియున్నది. కనుక దృశ్యం నశించుననుట సత్యము.

**4. తథా శూన్యం సదానహి :** అనగా అదేవిధముగా పరిపూర్ణ పరబ్రహ్మ మందు శూన్యము లేదు. శూన్యమనగా లేనిది, ఉత్తది, అభావమైనది, గోచర అగోచరమైనది. ఎరుక శూన్యమనగా ఎరుక పరిపూర్ణమందు లేనిది "ఆకాశం గగనం శూన్యం" అన్నట్లుగా నామమేగాని రూపము లేనిది. శబ్ద స్పర్శాది గుణములు లేక పోవుటవలన యింద్రియములచే గుర్తింపరాని దయ్యు మనస్సుచే గుర్తింప దగియున్నది. ఎట్లనగా ఇది శూన్యగృహము అన్నప్పుడు ఆశూన్యత్వమును (ఏమి అందులేకపోవుటను) గుర్తించుచున్నాము. ఇంద్రియములను శబ్దాదులను గుర్తించినట్లే శబ్దాదుల లేమిరికమును గుర్తించుచున్నది. ఎట్లనగా శోత్రింద్రిముచే శబ్దమును గుర్తించినట్లే నిశ్శబ్దమును కూడ గుర్తించుచున్నాము. అట్లే స్పర్శ రూప రస గంధములను, అవి లేని స్థితిని గూడ ఆయా యింద్రియములచే గుర్తించుచున్నవి. వస్తువుండుట లేకుండుట కూడ మన యింద్రియ సన్నికర్షణజ్ఞానము చేతనే గుర్తించుచున్నాము. **"శూన్యమన్యత్ స్థానం పూర్ణ మన్యస్థానం"** అని చెప్పబడినది.

కనుక శూన్యమునకును, పూర్ణమునకు అన్యమైనది పరిపూర్ణము. శబ్దస్పర్శాదులున్న చోటు మరియు శూన్యమైన చోటున్ను కూడ ఎరుకే. ఏలననగా శూన్యమును కూడ గుర్తెరుగుచున్నాము. కనుక రెండును యెరుకే. అస్తినాస్తుల కతీతమైనది పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే. కనుక ఎరుక శూన్యమన్నారు. **ఉన్నదాని యందు లేని దేదో అది శూన్యమున జెల్లును.** కనుక ఉన్న పరిపూర్ణమందు లేని ఎరుకను శూన్యమనవలెను. కనుక పరిపూర్ణము తప్ప తక్కిన దంతయు యెరుకే 54 క.ద. "పరిపూర్ణము దక్క। నితరమైన ప్రపంచమెల్ల దగదెలియుము। నీ వెరుకేనని మదిలోపల" అని కందార్థము. కావున పరిపూర్ణ మందు తోచినదెల్ల ఎరుక లేనిదని, ఎరుక శూన్యం గనుక పరిపూర్ణమందు శూన్యము లేదని తెలియవలెను. **గురుదు అంతట పరిపూర్ణమున్నదని దృఢ పరిచినతర్వాత ఎరుకెక్కడిది, శూన్య మెక్కడిది.**

**ద్వంద్వహీనం సదాబాహ్యం సాక్షిహీనంచ సర్వదా**
**తమశూన్యం ప్రభాశూన్యం ఆత్మశూన్య మనామయమ్** ॥౧౮॥

ఎల్లప్పుడు బాహ్యం ద్వంద్వ హీనమైనది, సాక్షిహీనమైనది, చీకటి లేనిది వెలుతురులేనిది (జ్ఞానా జ్ఞానములేనిది) ఆత్మలేనిది, అనామయమనగా ఎట్టి వ్యాధులు లేనిది.

**వివరములు :**

**1. ద్వంద్వహీనం సదాబాహ్యం :** అనగా పరిపూర్ణపరబాహ్యము ద్వంద్వములు లేనిది. ద్వంద్వ మనగా జత, సాపేక్షికపదములు "యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ॥ తైత్తిరీయోపనిషత్. అనగా మనస్సు వాక్కు దేనిని తెలుసుకొనుటకు అసమర్థములై వెనుకకు మరలెనో అది పరిపూర్ణపరబ్రహ్మము. పరిపూర్ణ పరబ్రహ్మను గూర్చి యింతకంటే సమగ్రంగా చెప్పడం కష్టము. చివరకు "అస్తీత్యేవోపలబ్ధవ్యః" అని దానిని అస్తి పదార్థమనడానికి వీలులేదు. ఎందుకంటే అది నాస్తి అనే పదాన్ని అపేక్షిస్తుంది. కనుక అస్తి నాస్తులు కానిది. అయినను "అస్తీతి బ్రువతోఽన్యత్రకథం తదుపలభ్యతే" అస్తి అని చెప్పుటకంటే అనగా వున్నదని చెప్పుట కంటే మరొక విధముగా ఎట్లు ద్యోతక పరచాలి? సాపేక్షిక పదమైన మరొక గతిలేక అస్తి అని వాడినారన్నమాట. అట్లే సదసత్తులు, విద్యావిద్యలు, అమృతమృత్యువులు, ప్రకాశాప్రకాశములు, జ్ఞానాజ్ఞానములు, దృక్దృశ్యములు, చిజ్జడములు, క్షేత్ర క్షేత్రజ్ఞులు, ధర్మాధర్మములు యిత్యాది ద్వంద్వములు. అట్లే త్రిపుటులు – జ్ఞాతృ జ్ఞాన, జ్ఞేయములు, ద్రష్టా, దృక్దృశ్యములు, కర్తా కర్మ క్రియములు మొదలగునవి అధిష్ఠానబ్రహ్మమునకే గాని పరిపూర్ణ పరబ్రహ్మము నందు ఎల్లప్పుడు ఏమిలేనిది అని తెలియవలెను.

**2. సాక్షిహీనంచ సర్వదా :** సాక్షియనగా గుర్తెరుగువాడు, చైతన్యస్వరూపిణి శ్రీకృష్ణదేశికేంద్రులవారు 146 క.ద॥ **ఏవస్తువు చేతను। తానావిర్భవమొందు దేహమను తరువరయన్। ఆ వస్తువే దానికి విత్తైవెలయును। దాన్నె సాక్షి ద్రష్టని కనుమీ। యెరుక యిదే స్పష్టము వినుమీ।".** అని శెలవిచ్చియున్నారు. అనగా విచారించి చూడగ ఏ వస్తువుచేత శరీరమనెడి చెట్టు గలిగెనో ఆవస్తువువే శరీరమునకు విత్తనముగానున్నది. ఆవిత్తనమే సాక్షి యని ద్రష్టయని తెలుసుకొనుమన్నారు. ప్రత్యగాత్మయగు తనను బ్రహ్మముగా నిశ్చయించుకొను సమస్తమునకు సాక్షి నగును. కనుక ఎరుక సాక్షియనబడును.

బ్రహ్మము సాక్షి రూపములో కర్తృత్వరహితమై వున్నట్లు ఇతరులు చెప్పుచున్నారు. కాని యిది సరిగాదు. సృష్టికిపూర్వము తాను తానుగా నున్న స్థితిలో కూడ బ్రహ్మము

కేవలం నిర్గుణము కాదు. ఆ బ్రహ్మమందు సృష్టికారణమగు సత్వ, రజో, తమోగుణములు మూడున్ను బీజరూపముగా నున్నవి. కనుక బ్రహ్మ సృష్టికి అత్యంత మూల కారణమై యున్నది. భద్రాది రామశతక కర్త "నీకు ఏ గుణములు లేవు నిర్మలుడవు" అని వర్ణించిన ఆ త్రిగుణములు కార్యరూపము వహించని స్థితిలో పైకి గానవచ్చుటలేదు. అంతేగాని అసలే లేవని గాదు. సృష్టికి పూర్వము ఆ బ్రహ్మయే తనయందు బీజ రూపముగానున్న త్రిగుణవిజృంభణచే నామరూపాత్మకమగు జీవేశ్వర జగద్రూపము వహించినదని తెలియవలెను. కనుక సాక్షిగా నున్నది బ్రహ్మమే. పరిపూర్ణపరబ్రహ్మము ఎల్లప్పుడు సాక్షిహీనమైనది.

సాక్షియనగా చూచువాడు, చేయువాడు కాదు. సృష్టికి పూర్వమున్న పరమాత్మనే "ఏకం అనేకం భవతి" అని శ్రుతి చెప్పిన విధంగా అన్నిరూపములు తానే వహించినది .క.ద.॥50 "అన్నియు తానైతనకవి । పన్నుగ వేరనుచు నోట బల్కుచు" మరియు క.ద.॥80**"వినుమితరులు। ఎరకను సాక్ష్యని పల్కిరి । నేను సాక్షి నహమని నీతోవిన జెప్పితి । నింతియే వెరనకూడదు । రెంటి నొక్కటని తెల్సుకోరా। మాటల భేదమని కనుక్కోరా । అనరాని వినరాని కనరాని బయలందు తనకై తానరుదెంచి । తనకై తాజనును సాక్ష్యని తెల్సుకోరా।"** అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. నాటకమునకు పూర్వము, నాటక కాలమందు, నాటకానంతరము నాటకశాలయందలి దీపము వూరక వెలుగుచునే యున్నట్లు పరమాత్మ జగన్నాటకమునకు కేవలం సాక్షిగా యున్నాడని చెప్పుచున్నారే గాని అది సరిగాదు. నాటక దీపము జడము. తెలివి లేనిది. పరమాత్మ జ్ఞాన ఘనుడు. నాటకదీపము నాటకమాడుటకు కేవలం సహాయకారణము మాత్రమే. పరమాత్మ ప్రధాన కారణము, సహాయకారణము, సర్వకారణములు లేక నిష్కామముగా యెట్టి ప్రయోజనమున్ను ఆశింపకనే వున్నాడు కనుక ఆయన సాక్షియనదగును. ఇట్టి సాక్షికూడ లేనిది పరిపూర్ణము.

**3. తమః శూన్యం ప్రభా శూన్యం :** పరిపూర్ణము నందు తేజోంధకారములు లేవు. మొదట అంధకారము గూర్చి విచారింతము. మొదట్లో అంతా అంధకారమే. ప్రకాశము దాని యందు పరివ్యాప్తమగుచున్నది. అప్పుడు అంధకారము మరుగై ప్రకాశము తోచుచున్నది. ప్రకాశ ముపసంహరించినపుడు అంధకారమే. ఎక్కడి అంధకారమక్కడనే యున్నది. కాని పైన రంగువేసినట్లుగా ప్రకాశము అలుముకొన్నది. అంధకారమునకు ప్రత్యేక వునికి లేక స్వతంత్ర సత్తా యున్నట్లు సిద్ధించుచున్నది.

ప్రభాయనగా, భాసయన్ అనగా ప్రకాశింపజేయుట. ఆయా వస్తువులు తెలియబడునట్లు జేయుట. ప్రకాశించుట యనగా తన్నుతాను తెలియపరచుకొనుట. ప్రకాశము అనగా వెలుగు అని అర్థము చేసుకొనరాదు. తెలయుట తెలియజేయుట అనేమాటలు తెలివి లేక జ్ఞానమునకు సంబంధించిన వగుటచే ప్రకాశమనే శబ్దమునకు జ్ఞానమని అర్థము గ్రహించవలయును. జ్ఞానా జ్ఞానములు, తేజోంధకారములు ద్వంద్వములు, సర్వద్వంద్వములు లేనివే. పరిపూర్ణమందు ఈ తేజోంధకారము లేనివే యని నిరసించనైనది. "తమోవాఇద మగ్ర ఆసీదేకమ్" మైత్ర్యుపనిషత్ మనుస్మృతిలో "ఆసీదిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్, అప్రతర్క్యమవిజ్ఞేయం ప్రసుప్త సర్వతః (మను 1-5-8) ఈ సమస్తము దొలుత తమస్సుచే (అంధకారముచే) వ్యాప్తమైనందున భేదా భేదములు నెరుంగుటకు యోగ్యము

కామిచే నగమ్యమగు నిదురించు నట్లుండును. పిదప దానియం దవ్యక్త పరమాత్మ ప్రవేశించి జలమును ప్రారంభమున సృజించెను అని సృష్ట్యారంభమున వర్ణించబడినది.

నాసదీయసూక్తము : ఋగ్వేదం దశమమండలం 129 సూక్తంలో.

నాసదాసీన్నో స దాసీత్తదానీం। నాసీద్రజోనోవ్యో మోపరోయత్।
కిమావరీవః కుహకస్యశర్మ। న్నంభః కిమాసీ ద్గహనం గభీరం॥

తా॥ సృష్టికి పూర్వం సదసత్తులు లేవు. అంతరిక్షాకాశములు లేవు. అపుడు దేనిని, ఎవరు, ఎక్కడ ఎవరిసుఖము కొరకు, ఆవరించిరి? గహనం, గంభీరం, అయిన అంభస్సు మాత్రం అపుడెక్కడనుండెను? ఈ సూక్తం పరిపూర్ణపరబ్రహ్మమునకు సంబంధించినది. చీకటి వెలుగులు పరిపూర్ణమందు లేవు.

**4. ఆత్మ శూన్యం :** అవస్థాత్రయము నందలి సంగతులను శరీరము జ్ఞానములేని జడపదార్థమగుట వలన యెరుగజాలదు. కాబట్టి దేహము కంటెను వేరుగా ఒక జ్ఞాన స్వరూపమగు వస్తువు ఈ శరీరము నందుండి సకల విషయముల నెరుగుచు చెప్పుచున్నది. అట్టి జ్ఞాన స్వరూపమగు వస్తువే ఆత్మయనబడును.

నేననేవృత్తి జడములైన మన ప్రాణములకు ప్రత్యగాత్మ యొక్క ప్రకాశములేనిచో కలుగ జాలదు ఈ అహంవృత్తిసహితముగా సర్వవృత్తులు అంతఃకరణమునకే గలుగుచున్నవి. ఆ వృత్తులు కలుగుటకు సత్తాయిచ్చునది ప్రత్యగాత్మ ప్రకాశము. ప్రత్యగాత్మ తాను స్వయముగా గుర్తింపకున్నను అంతఃకరణమునకు గుర్తించు శక్తి నిచ్చుచున్నది. నేనను అహంవృత్తికి అత్యంత మూల కారణము ప్రత్యగాత్మయే. నేను కాని దేహేంద్రియ మనః ప్రాణములు కాదు. ప్రత్యగాత్మ "శివోహం" ఇదియే ఆత్మభావము. దేహేంద్రియ విశిష్ఠమైనప్పుడు ప్రత్యగాత్మ, నిరుపాధికమైనపుడు అదియే పరమాత్మలేక బ్రహ్మము. బ్రహ్మమనగా బహుపెద్దది. అంతకంటే పెద్దది లేదన్న మాట. అది జగద్రూపముగా గనబడుచున్నది, తాత్వికముగా బ్రహ్మమే. నేను నాకు తోచబడే ఈ దృశ్యరూపమగు జగత్తు మొత్తమంతయు కృత్స్నము, పూర్ణమగు బ్రహ్మమే.

ఇట్టి ఆత్మ (బ్రహ్మము) నిరపేక్షక కేవల పరిపూర్ణపరబ్రహ్మము గాదు. అది నేను (ఆత్మ) కానిది. నేనులేనిది. నాకు దానికి ఏలాంటి సంబంధములేదు.

**5. అనామయమ్ :** అమయమనగా వ్యాధి. అనామయమనగా వ్యాధులు లేనిది. పరిపూర్ణపరబ్రహ్మమునకు ఎటువంటి వ్యాధులు లేవు. పరమాత్మకున్నవని అనవలసి వచ్చును. పరమాత్మకు శరీరము లేదు గదా అని కొందరనవచ్చును. అది సరి గాదు. "ఆకాశ శ్శరీరంబ్రహ్మ" అని శ్రుతి. ఆకాశము అసంగము, అచలము, నిష్క్రియము అయివున్నది గదా దాని యందు వ్యాధు లెట్లు కలుగును? కాన వచ్చును? అనగా ఆకాశము జడ ప్రకృతి రూపముగా నున్న, అదియే పరమాత్మతో కూడి మిగతా నాలుగు భూతములుగా పరిణతి చెంది, సర్వమునకు తావిచ్చుటయే దానికి ముఖ్య వ్యాధి. ఆకాశమునకున్న వ్యాధులు మనకున్న వాత, పిత్త, శ్లేష్మ సంబంధములు కావు. కాని అవి సత్వ, రజో, తమోగుణ సంబంధములగు వ్యాధులని తెలియవలయును. ఈ గుణత్రయప్రకృతిని బీజరూపముగా తన యందే యిముడ్చుకొని తానుతానై యున్న కేవల బ్రహ్మస్థితి యందు మాత్రమే ఆ పరమాత్మ నిరామయుడు. ప్రకృతితో కూడిన సగుణ రూపుడగు పరమాత్మకు ఆ

నిరామయశబ్దము వర్తింపదు. "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయేతి" అని "ఇచ్ఛామాత్ర ప్రభు సృష్టి" అని తదైక్షత్" అని చెప్పుచున్న శ్రుతి వాక్యయములలో ఇచ్ఛా, ద్వేష, ప్రయత్నాది సర్వగుణత్రయ వ్యాధులు గానవచ్చుచున్నవి. కాని పరిపూర్ణ మందెట్టి వ్యాధులు లేవు.

**నిర్దేహం నిర్మలంపూర్ణం తల్లింగ మచలంభవేత్**
**మాయాపివందితం బాహ్యమ్ తధ్యానం కురుసర్వదా ॥౧౯॥**

శరీరము లేనిదై నిర్మలమైనది పరిపూర్ణపరబయలు. ఆ లింగమే (గుర్తు లేక సంజ్ఞ) అచలము. మాయచే వందనము చేయబడునది పరబాహ్యమే. అద్దానినే ఎల్లప్పుడు ధ్యానించవలయును.

**వివరములు :**

**1) నిర్దేహం నిర్మలం పూర్ణమ్ :** పరిపూర్ణ పరబ్రహ్మము దేహములేనిది. దేహము కానిది. శరీరముల వివరములకై దిగువ పట్టికను పరిశీలించుము :

| శరీరములు | అవస్థలు | అభిమానులు | ఇంద్రియములు | స్థానము | వ్యవహారము |
|---|---|---|---|---|---|
| 1. స్థూలశరీమ | జాగ్రదావస్థ | విశ్వుడు | 25 | నేత్రము | క్రియారూపము |
| 2. సూక్ష్మశరీరము | స్వప్నావస్థ | తైజసుడు | 17 | కంఠము | భావనారూపము |
| 3. కారణ శరీరము | సుషుప్తి | ప్రాజ్ఞుడు | జీవుడు, ప్రాణము ప్రత్యగాత్మ | హృదయము | ప్రాణరూపము |
| 4. మహాకారణ శరీరము | తురీయము | ప్రత్యగాత్మ | ప్రాణము ప్రత్యగాత్మ | మూర్ధ్ని | సర్వాత్మకము |

ప్రత్యగాత్మ స్థూల శరీరమందభిమానము కలిగి తన కొరకు ఒక జీవన విధాన మేర్పరుచుకొని జీవించవలయుననెడి గాఢమైన కాంక్ష అనగా శరీరమనకు శాశ్వతముగా అంటిపెట్టుకొనవలెననెడి కోరిక గలవాడు జీవుడు.

**ఈశ్వరతనువులు :** ఈశ్వరతనువులేవనగా పంచభూతాత్మకమై గానవచ్చు ఈ విశ్వమంతయు ఈశ్వరుని స్థూల శరీరము, 84 లక్షల జీవోపాధుల యొక్క సూక్ష్మ శరీరము. ఇంద్రియాధిష్టాన దేవతలచే ఈశ్వరుని యింద్రియములన్నారు. కనుక ఈశ్వరుని సూక్ష్మ శరీరము, అధిష్టాన దేవతలచే యేర్పడినదని చెప్పవచ్చును. అజ్ఞానమే జీవుల కారణ శరీరము కనుక వ్యష్టి అజ్ఞానముల సమిష్టి అనగా మాయలేక అవ్యాకృతమే ఈశ్వరుని కారణశరీరము. ప్రత్యగాత్మయే జీవుని మహాకారణ శరీరము. పరమాత్మయే ఈశ్వరుని మహాకారణశరీరము. ఇంకా వివరములకై (21) వ శ్లోకము చూడుము.

జీవుల యొక్క గాని, ఈశ్వరుని యొక్కగాని శరీరము లేనప్పుడు బ్రహ్మ మొక్కటియే శేషించును. ఇదియే కైవల్య శరీరము. ఈ స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ కైవల్య శరీరములు ఏవియు పరిపూర్ణపరబ్రహ్మమందు లేవని తెలియవలెను.

**2. నిర్మలం పూర్ణం :** పరిపూర్ణపరబ్రహ్మము నిర్మలమైనది. నిర్మలమనగా మలినము లేనిది. మలినమనగా మలం. వేదాంత శాస్త్రమందు మలములు మూడు గాను, ఐదు గాను నిర్ణయించబడినవి. మలత్రయము: 1.అణవమలము, 2. మాయామలము, 3 కార్మిక

మలము. ఎన్ని మలములు జెప్పిన ఈ మలము లన్నియు వ్యష్టిరూపమైన అంతఃకరణకు జెప్పబడినవి. వ్యష్టి సమిష్టిరూపమైన అంతఃకరణముగా పరమాత్మ పరిణమింపకపూర్వము ఈ మలము లుండుటకు తావులేదు. అనేక పూర్వజన్మకర్మవాసనలు అంతఃకరణములో క్రమశః ఘనీభవించి ప్రాణుల యొక్కశీల సంపదయు వారి ప్రవృత్తియు నేర్పడి జీవులను నూతన కర్మలకు ప్రేరేపించున్నవి. ఈ ప్రేరణకు పై విధముగా పరమాత్మ యొక్క బాధ్యత యేమిలేదు. "బుద్ధికర్మాను సారిణి" అను న్యాయముగా ఈ ప్రేరణలకు జీవుల అంతఃకరణములేకారణము. కనుక ప్రళయ కాలమందు సకల జీవోపాధులయొక్క కర్మవాసనలు పరమాత్మ స్థానమందే బీజరూపముగా యుండుటవలన వానికి పరమాత్మయే కట్టకడపటి శరణాలయమై యున్నది. అయినను తనయందే యున్నప్పటికి పరమాత్మ వానిని అంటక వానివల్ల బాధింప బడక నిర్వికారముగానుండును. కనుక పరమాత్మ "నిత్యశుద్ధ పవిత్రోసా" అని కీర్తింపబడుచున్నాడు.

సృష్టికి పూర్వము పూర్వాపూర్వ సృష్టుల యందలి సంస్కారములన్నియు పరమాత్మయందే నిక్షిప్తమై యుండి ఉత్తరోత్తర సృష్టుల యందు ఎవరి సంస్కారములు వారు గైకొని జీవులు మరల మరల జన్మించుచుందురు. సృష్టియందు తోచు వైవిధ్యమంతయు పరమాత్మయందే అణిగి యుండి సృష్టిలో నామ రూపాలు దాల్చు చుండును. ఈ విధముగా చూచినచో పరమాత్మ కేవలం నిర్మలుడు కాదు. సృష్టిలో నున్న సమస్తమునకు ఆ పరమాత్మయే జీవరూపుడుగా నున్నాడు. బీజము నందు వృక్షమంతయు యిమిడి యున్నట్లే కార్యరూపమగు సృష్టి యంతయు పరమాత్మ యందు యిమిడి యున్నందున పరమాత్మ శుద్ధ నిర్మలుడనుటకు వీలులేదు. సాపేక్షికముగా మాత్రమే సృష్టియందలి మలినాంతఃకరణములతో పోల్చినప్పుడు మాత్రమే నిర్మలమని చెప్పబడును. కావున పరిపూర్ణపరబ్రహ్మమే నిర్మలమైనది

**3. తల్లింగం అచలం భవేత్ :** అచలం అనగా ఏ కాలము లోను కదలనిది. నిరపేక్షకమైనది పరిపూర్ణము. సాపేక్షికమైనది ఎరుక. చలనమున్నదని అంగీకరిస్తే చలనములేనిది మరొకటివుండి వుండాలి అని చెప్పవలసి వస్తుంది. కదిలేది వున్నప్పుడు కదలని దాన్ని గురించి ఆలోచన వస్తుంది. ఆత్మతో సహా జీవజగత్తంత కదిలేదే. కదలనిది వీటికన్నిటికి అతీతముగా నున్నది.

కదలనిదానికి అచలం అని, పరిపూర్ణమని మరెన్నో పేర్లు మనము పెట్టుట చేతనే కలిగినవి. 38 కం.ప॥ "పేరచలమనుచు బయలని। పేరెప్పుడు లేదు మనము బెట్టుటచాతన్ । పేరాయె బయలు కిప్పుడు । పోరా నీవునేను మృషని పోతే జాలున్" ॥ అని శెలవిచ్చియున్నారు. అవయవములు లేనిదగుటచే లింగమును కూడ అచలమునకు పర్యాయ పదముగా వాడినారు. బాహ్యమున గానవచ్చు స్థితి యందు కలుగు కదలిక మాత్రమే చలనముగాదు. అంతరమందలి మార్పుకూడ చలనమే. పరబ్రహ్మము తాను తానై నిసంకల్ప స్థితిలో సంకల్పము కలుగుటయే చలనము. స్థితి కలిగియున్న ప్రతి దానికి గతి (చలనము) యుండును. గతియున్నదానికి స్థితి యుండును. ఏ ద్వంద్వమును తీసుకొన్న, సచ్చిదానంద స్వరూపము నందుగాని అఖండాత్మ స్వరూపములో గాని చలనమే. పిండాండమందుషట్కోశములు బ్రహ్మాండ మందు షట్కోశములు వెరసి పన్నెండు (12) ఎక్కడ చూచిన ఎంత సూక్ష్మ పరిశోధన జేసిన ఏమి లేదు - 12 కోశములందు యేమిలేదనెటందుకే పరిపూర్ణబోధకు ద్వాదశి. పన్నెండు కోశములందున్నది ఏది? ఏ

కోశమందు లేనిదేది? చలనం తప్పఏమిలేదు. ఈ వ్యష్టి సమిష్టి కోశములందు అచల స్థితి యేకోశాన లేదు. పరిపూర్ణమొక్కటే ఎప్పుడు చలనములేదు. ఎందుకనగా పరిపూర్ణపరబ్రహ్మము సూదిమెన మోపుటకు సందు లేని విధమున అంతట నిండి నిబిడీకృతమైయున్నందున అది కదులుటకు వీలులేదు. అందుకే అచలం అని వ్యవహారార్థము నామకరణము చేసియున్నారు. సందులేని పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుకకు స్థానములేదు. ద్వాదశ కోశములు పరిపూర్ణపరబ్రహ్మమందు లేవు. ఇదే అచలము.

**4. మాయాపి వందితం బాహ్యామ్ :** పరిపూర్ణపరబ్రహ్మము మాయచే వందితమైనది. మాయ యనగా శుద్ధ బ్రహ్మమును ఆశ్రయించుకొని యుండి దానిని ఆవరించుకొని అనగా మరుగుపరుచుచు నుండు నొక అనిర్వచనీయమగు అనగా యిదమిద్ధమని నిర్ణయించుటకు వీలుకాని విచిత్ర వస్తువునకు మాయ యని పేరు. ఈ మాయా బ్రహ్మములలో మాయ అనిత్యము, బ్రహ్మ నిత్యమని అనరాదు. ఎటొచ్చి ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మమందు ఆవిర్భావ తిరోభావములు చెందుచున్నవే గాని బ్రహ్మమున కన్యదేశమునలేవు. బ్రహ్మమున కన్యదేశమున యే కొంచము కూడ లేదని "సర్వం ఖల్విదంబ్రహ్మ" అని "బ్రహ్మణోన్యం నకించన" అని శ్రుతులుఘోషించు చున్నవి. కనుక మాయా బ్రహ్మములు రెండు బ్రహ్మము యొక్క రూపాంతరములే ఒక నాణెము యొక్క బొమ్మ బొరుసులాంటివి. బ్రహ్మము నందీ దైవాత్మక శక్తి లేక బ్రహ్మశక్తియే మాయా శబ్దముతో చెప్పబడినది. (వివరములకు (6) శ్లోకము చూడుము)

పరిపూర్ణమందు ఎరుకలేదు. దాని కహంవృత్తిలేదు. కనుక యేనిర్ణయము చేయదు, ఉపాసింపదగినది కాదు. ధ్యానించదగినది. కూడ కాదు. "తదేవ బ్రహ్మత్వం విద్ధినేదం బ్రహ్మ యదిద ముపాసతే" అని కేనోపనిషత్ చెబుతుంది అనగా ఉపాసింపబడేది బ్రహ్మము (పరిపూర్ణము) కాదని తెలుసుకో అని తాత్పర్యము". "భూమా నమిత్యుపాస్స్వ" అని "ఆత్మాన మిత్యుపాస్స్వ", "ఓ మిత్యుపాసీత"చాంద్యోగోపనిషత్. "ఆత్మవాఽరే ద్రష్టవ్యో శ్రోతవ్యో, మంతవ్యో నిధిధ్యాసతవ్యః" కనుక ద్రష్టవ్యము, శ్రోతవ్యము మంతవ్యము, నిధి ధ్యాసితవ్యము, ధ్యాతవ్యము, ఉపాసితవ్యము అని చెప్పబడ్డ బ్రహ్మము అనగా ఆత్మ ప్రణవాది యిత్యాది నామములచే ప్రసిద్ధిమగు అధిష్టానచేతన బ్రహ్మమని తెలియవలయును.

పరిపూర్ణబ్రహ్మమునకు మ్రొక్కేరితర జేజేలు అని శ్రీకృష్ణదేశికుల వారి కందార్థము. ఆత్మ స్వరూపనిశ్చయ జ్ఞాన స్వరూపులే యితర జేజేలు. అట్టివారి కన్యమై వారిచే సేవింపదగినదీ పరిపూర్ణపరబ్రహ్మము. సేవ లేక ఉపాసన అనుటతోనే సేవ్యవస్తువు, సేవ, సేవకుడు లేక ఉపాస్య వస్తువు, ఉపాసన, ఉపాసకుడు అనే త్రిపుటి సిద్ధించుచున్నది. పరిపూర్ణపరబ్రహ్మము ఉపాస్యము కాదు. ఉపాసింపదగినది బ్రహ్మమేకాదు. **"నేదం బ్రహ్మ యదిద ముపాసతే"** అని కేనోపనిషత్ ప్రవచనము కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "ఎరుక లేక సేవింపదగు" అని అన్నారు. ఎరుక లేక సేవించుట యనగా 'నేను' అహం లేకుండ సేవించుట. ఈ విషయము తమగురువుల నుండి తెలుసుకొనవలసియున్నది.

ప్రత్యగ్బ్రహ్మైక్యరూపమగు తనకు దశదిశలందున్నదా పరిపూర్ణ పరబ్రహ్మమే. ఈ విషయము

ఈ పరిపూర్ణ అచలధ్యానము వలన తెలియును.

శ్లో॥ పూర్ణమేవ నిరాలంబం। ఆగ్నేయే నిర్గుణం తథా।దక్షిణే నిత్యశుద్ధంచ। నైఋత్యేనిరుపద్రవం ॥

పశ్చిమే నిష్కళం చైవ। వాయవ్యేచ నిరంజనం ఉత్తరేచ నిరాకాశ। మీశాన్యే నిర్మలోభవేత్॥

ఊర్ధ్వమేవ నిరాకారం। అధశ్చ నిర్వికారకః ।అంతర్బహిశ్చ సర్వత్ర। అచలోయం సనాతనః ॥

ఇందు దశదిశలేగాక అంతర్బహిశ్చ అని చెప్పబడుటచే దేని ప్రాతిపదికగా ఈ దశదిశలు అంతర్బాహ్యములు చెప్పబడినవో అది ఆపరిపూర్ణ పరబ్రహ్మమందుండుటకే వీలులేదు. కనుక దానిని లేనెరుక యని లేని కలయని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు పేరిడి క.ద. 66, "లేని కల కలిగినప్పుడు । దానికి దశదిశల యందు తగమొదటకొనన్ । తానంటకున్న మేల్కను । లేనికలే జూచె నేని। లేక పోవుగదా।". అంటూ దృష్టాంతమిచ్చినారు. **ఎరుకను అధిగమించి దాని ద్వాదశ స్థానములందున్న పరిపూర్ణ పరబ్రహ్మమునకు నమస్కారములేక వందితము అంటే అర్థమేమనగా ఎరుకను విడుచుటయే వందితమని గ్రహించలయును.** అట్లే మాయాపి వందితం బాహ్యాం అంటే, మాయ బ్రహ్మములు రెండు వేర్వేరు కావు, రెండు ఒక్కటే ఈ మాయాబ్రహ్మలకు పరిపూర్ణపరబ్రహ్మమందు మూలము గాని నిలిచే అందుకు స్థానముగాని లేదని అఖండాత్మదృష్టి అలవడినపుడే (అంటే స్వరూప జ్ఞాన మారూఢమైన తర్వాత) నీవెవరో నీకు తెలసినది. "సోఽన్వేష్టవ్య స్సజిజ్ఞాసితవ్య" అనగా వెదుక తగినది. జిజ్ఞాస చేయతగినది ఏదో అది నీవు తెలుసుకొంటివి. శ్రవణమనన నిధిధ్యాసలచే తెలియదగినది నీవు తెలుసు కొంటివి. శ్రవణ మనన నిధి ధ్యాసలచే తెలియదగినది నీకు ద్రష్టవ్యమైనది. కాని **"నైవచా నమనసా, ప్రాప్తుంశక్యోవ చక్షుషా..."** అని కఠోపనిషత్తు. **"సఏషనేతి నేత్యాత్మాఽగృహ్యోనహిగృహ్యతే...."** అంటూ బృహదారణ్యకోపనిషత్తు చెప్పుచున్నది. ఎరుకచే (మనోబుద్ధ్యాదులచే) తెలియబడదని చెప్పే పరిపూర్ణపరబ్రహ్మము నీ స్వరూపమునకు అన్యము గానున్నదిగదా! దానియందు నీ స్వరూపమునకు, పరమాత్మ స్వరూపమునకు మూలంగాని నిలిచే అందుకు స్థానంగాని లేదు. అది ఎరుక మీరినది. ఎరుక లేనిది. దానిని ఎరుకలేక సేవింపవలెను. ఎరుక లేక సేవించిటయే పరిపూర్ణమునకు వందితము అని తెలియవలెను.

**5. తద్ధ్యానం కురుసర్వదా :** తత్ అనగా దానిని, అనగా పరిపూర్ణపరబ్రహ్మమును ఎల్లప్పుడు ధ్యానము చేయుమంటుంది ఈ ఉపనిషద్వాక్యము. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు క.ద. 32 ॥ పుట్టుట గిట్టుటలేకను । పుట్టేగిట్టేటి యెరుక పోడిమెరుగకన్ । చట్టువలె కదలకుందును। బట్టబయల్ యిట్టిదెరిగి । భావింపదగునూ । యెరుకలేక సేవింపదగునూ ।" అని శెలవిచ్చియున్నారు. **ఎల్లప్పుడు యెరుక లేక సేవించుటయే పరిపూర్ణమును సేవించుటయగును.** పుట్టుట గిట్టుటలేక ఎల్లప్పుడు శాశ్వతముగా నుండునది పరిపూర్ణపరబ్రహ్మము. పుట్టి చచ్చేది అశాశ్వతమైనది ఎరుక. ఈ రెంటిని గురించి సద్గురువు ద్వారా వస్తు నిశ్చయముగా తెలుసుకొని, పంచ తన్మాత్రరహితమగు అచల పరిపూర్ణపరబ్రహ్మమును గురుమూర్తి దర్శింపజేసినాడు. కనుక ఆదర్శన భాగ్యమున కర్మత్యాగము, కర్మఫలత్యాగము గాక, కర్తృత్వరహితముగా కర్మ ఆచరించిన యెరుక లేకుండ

పోవును, అట్లు చేయుటయే ఎరుక లేకుండ ధ్యానము చేయుట. "స్వయం బ్రహ్మమయో భూత్వా తత్పరం చావలోకయేత్" అని గురుగీతగానం చేసింది. ఎరుక లేక సేవించుట అనగా నీవు దానిని అతిక్రమించి (విడిచి) నీ నిజస్వరూపుమగు పరమాత్మస్వరూపుడవై నీకుపరంగా నున్న పరిపూర్ణపరబాహ్యమును చూడు మంటుంది. అదినీవుకాదు. నీ వదికాదు. **"నేను లేనిది అది"** అని నీయందలి బ్రహ్మభ్రాంతిని వదిలి నపుడుగాని నీకు సర్వభ్రాంతి రహితముగాదు. ఈ విషయము లన్నిటిని సాంప్రదాయ గురువు ద్వారా తెలుసుకొని ఆరూఢత నొందిన వాడు ఎల్లప్పుడు పరిపూర్ణమును ధ్యానించినవాడగును.

**యావత్పశ్యే దృగాకారం తదాకార మచింతయా**
**యావత్పశ్యే మహాకాశం తదాకాశం నచింతయా** ॥౨౦॥

చూడబడేదంతా దృక్కు (చూపు) యొక్క ఆకారమే. అట్టి దృశ్యాకారము గురించి చింతించకుము. చూచేదంత మహాకాశము. ఆమహాకాశమును గురించి చింతించకుము.

**వివరములు :**

**1. యావత్పశ్యే దృగాకారం తదాకారమచింతయా :** చూడబడే దంతా దృక్కు (బ్రహ్మాకారమే) అట్టి బ్రహ్మాకారమును గురించి చింతించకుము. సర్వేంద్రియముల ద్వారా బహిర్గతమై శబ్దాది విషయములను గుర్తించునది అంతఃకరణ ప్రకాశము. సుషుప్తి యందీ అంతఃకరము సహితము అవిద్యయందు మరుపురూపము చెందుచున్నది. కాని యేది నిద్రించిన తాను నిద్రించక ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము మాత్రము ఒక యంత్రమువలె పనిచేయుచున్నది. ఈ యంత్రమునకు సత్తాయిచ్చుచూ పనిచేయునది ఆత్మలేక ద్రష్టా అనగా చూచువాడు. ఇతరేంద్రియముల ద్వారా వ్యవహరించునపుడాతడే శ్రోత, మంత, యిత్యాది యితర నామములను చెందుచున్నాడు. ఏ యింద్రియములద్వారా విషయములు దెలుసుకొన్నప్పటికి మొత్తము మీద అన్నిటిని తెలుసుకొన్నవాడితడే. ఇతనిని ఒక్కమాటలో జ్ఞాత అని పిలువదగును. లేక వ్యక్తి భావన విడిచినచో యతనినే దృక్ అని పిలువ నగును. అపుడు 'దృక్' చే తెలియబడుదానికి దృశ్యమని పేరిడిరి.

శ్లో॥ దృగ్దృశ్యౌద్వౌ పదార్థౌతౌ పరస్పర విలక్షణౌ
దృగ్బ్రహ్మ దృశ్యం మాయేతి సర్వవేదాంత నిశ్చయః ॥

తా॥ దృక్కు, దృశ్యము అనే రెండు పదార్థములు. అవి రెండు పరస్పరభిన్నములైయున్నవి. అందు దృక్కు బ్రహ్మము, దృశ్యము మాయా అని వేదాంత నిశ్చయము. సర్వేంద్రియముల ద్వారా విషయ గ్రహణము చేయు అంతఃకరణము ఆ యింద్రియములకు ద్రష్టగా చెప్పబడినది గాని ఆ అంతఃకరణమునకు కూడ నేనే ద్రష్టను. అంతఃకరణ సాక్షిని గూడనై నున్నాను. కనుక నేనే సర్వసాక్షిని, నాకు మరొక సాక్షియున్నాడని చెప్పుటచే అనవస్థ దోషము సిద్ధించును. కనుక నా యునికిని సర్వరూపమును గూడ తెలుసుకొను వాడను నేనే. ఆకాశము వలె సర్వత్రా బాహ్యాభ్యంతరములందు నేనే యున్నాను. గాని ఆ ప్రపంచవికారములు ఏవి నున్న బాధించవు. నేను సచ్చిదానంద స్వరూపుడను. "సఏషనేతి నేత్యాత్మా" అను శ్రుత్యానుసారముగా మూర్తామూర్తములన్నిటిని సర్వనిషేధావధి రూపముగా నేతి నేతి (అనగా న+ఇతి=లేదు) అని నిషేధించుచుపోగా చిన్మాత్రముగా ఏజ్ఞానము శేషించునో అదియే దృక్ స్వరూపముగా నిర్ణయించి దృగ్బ్రహ్మాయన్నారు.

"దృశ్యం మాయా" ఇంత ప్రత్యక్షముగా గోచరించు మానవుని సుఖదుఃఖాదులకు కారణమైన దృశ్యరూప ప్రపంచ మంతయు మాయ యని ఎట్లు విశ్వసించవలయును? శబ్దాది స్పర్శ గుణములతో కూడిన వస్తుసముదాయము శబ్దాది విషయములు వానిని గుర్తించే సాధనములైన యింద్రియములు (జ్ఞానేంద్రియములు) శరీరములను ధరించి భరించు ప్రాణ పంచకము, యింద్రియముల ద్వారా బహిర్గతమై వస్తుసముదాయమును ప్రకాశింపజేయు అంతఃకరణ ప్రకాశము యీ అన్నిటిని "నేను" "నాది" అభిమానించు అహంకారము ఇవన్ని దృశ్యములే. ఇదియేగాక నా కన్యమై బ్రహ్మాండము నందుండి దానిని ధరించి భరించు సమిష్టి ప్రాణము సూర్యచంద్ర నవగ్రహ నక్షత్రాదులు, పంచభూతములు ఇవన్నియు నాచే గుర్తించబడి దర్శించుచు వున్నందున 'దృష్టుర్ యోగ్యం దృశ్యం' అనే న్యాయంగా దృశ్యకోటిలో చేరి పోవును. ఇవన్ని మాయనేనా? అంటే సృష్టికానేలేదు, సృష్టిలేనే లేదు. ఉన్నట్టు తోచబడుట మాత్రమే అందురు. దీనికే వివర్తవాదమని పేరు. వివర్తనము అనగా యదార్థముగా నిలిచియున్న ఒక వస్తువునందు యెట్టి మార్పు కలుగకున్నప్పటికి తాను గానట్టి మరొక వస్తువుగా భాసించుట వివర్త మనబడును. తాటి యందు పాము నిజముగా యెన్నటికి లేదు. ఒకప్పుడు తోచినట్లే బ్రహ్మమునందు ఏకాలంమందులేని యీ ప్రపంచము తోచబడినదని చెప్పుదురు. విచారణా ప్రారంభము నందు ఆరోపించి వాదనార్థము జగత్తును అంగీకరించి చివరకు జగత్తులేనే లేదని స్థిరపరుతురు. ఇది అధ్యారోపాపవాదము అనబడును. జగత్తునందు తోచబడు సకల పదార్థములు ఏకదేశీయములు, మిత పరిమాణములు, క్షణికములు, అనృత జడదుఃఖరూపములు, నామ రూపాత్మకములు అయివున్నందున యివి పారమార్థికమగా లేనేలేవు. గనుక మిథ్య. "యా మా సా మాయా" అను నిర్వచనానుసారము దృశ్యం మాయే అని చెప్పబడినది. మూర్తామూర్తములన్నియు బ్రహ్మమే "సర్వం ఖల్విదంబ్రహ్మ" యనెడి శ్రుతి మాటే మిటి?

"మీయతే అనేన మాయ" అనగా మితిలోనికి తెచ్చునది మాయ. ఈ నిర్వచనము ప్రకారము సర్వము బ్రహ్మరూపమే అయినప్పుడు ప్రతీతియగుచున్న అన్యవస్తువుల నామరూపాలు మాత్రము పారమార్థికముగా లేవు అని అనవలసియున్నది. "యా మా సా మాయా" అనగా యేదిలేదో అదిమాయ అన్నప్పుడు నామ రూపాలే ఆయాశబ్దములకు వర్తించును. వస్తువు మిథ్యగాదు. అది బ్రహ్మమే కాని దాని నామరూపాలు మాత్రము సత్యమని అనరాదు అని సిద్ధించుచున్నది. కనుక దృశ్యం మాయా యనవలసి వచ్చినది. అంతేగాక "యద్దృశ్యం తన్నశ్యం" కనుక అవి అన్నియు నశ్వరములు, దృశ్యములు మారుచుండును గనుక అట్టి అశాశ్వతమైన దృశ్యములను గూర్చి చింతించకుమని ఈ ఉపనిషద్వాక్యము హితవు పలుకుచున్నది.

**2. యావత్పశ్యే మహాకాశం తదాకాశం నచింతయా :** చూడబడే మహాకాశమును గురించి చింతించకుము. ఆకాశములు ఐదు 1. భూతాకాశము 2. సూర్యాకాశము 3. నిరవయాకాశము 4. దహరాకాశము 5. పరాకాశము. వీటి యొక్క స్థాన స్వరూప స్వభావములు దిగువ పేర్కొనబడినవి :

| పంచాకాశములు | స్థానము | స్వరూపము | స్వభావము |
|---|---|---|---|
| 1. పరాకాశము | అధిష్ఠానము | స్వప్రకాశము రాత్రింబవళ్లు అనే నిర్ణ యము లేదు. | తెలిసికొనుట తెలియజేయుట తాను తానుగానుండుట |
| 2. దహరాకాశము | అవ్యక్తము (సమిష్టి అంతఃకరణము) | ప్రాతః సంధ్యారూపము చీకటి నశించి వెలుగు కుదారి | స్ఫురణ సోఽకామయుత బహుస్యాం |
| 3. నిరవయాకాశము | దిక్కులు (పరాప్రకృతి) | సాయంసంధ్యా రూపము వెలుగు నశించి చీకటికి దారి | కర్మఫల దాత |
| 4. సూర్యాకాశము | సూర్యుడు | ప్రకాశము | కర్మప్రేరకత్వము |
| 5. భూతాకాశము | భూతసముదాయము | చీకటి | పంచీకృతమైవిశ్వ రూపము దాల్చుట |

చూడబడే దంతామహాకాశము. ఆ ఆకాశమును గురించి చింతించకుమని అర్థము. కంటికి కనబడే దంతా మహాకాశమే. "బ్రహ్మణోన్వనకించిన" అనే న్యాయంగా ఆ పరమాత్మ యొక్కటేకదా! ఈ దృశ్యమాన మగునది నిజంగా బ్రహ్మమేకాని జగత్తుకానే కాదు. మహాకారణ శరీరముతో తాదాత్మ్యము చెంది వ్యవహరించువాడు అంతా బ్రహ్మముగానే చూచును. రజ్జువునందు తోచబడు సర్పము రజ్జువేకాని సర్పము కాదన్నట్లు మన భ్రాంతి వలన లేక అజ్ఞానము వలన దానిని జగత్తుగా జూచుచున్నాము. కాని యేభ్రాంతి కలుగుటకైనను దాని కొక అధిష్ఠానము, లేక ఆధారముండి తీరవలెను. అనగా ఆ దేశకాలముందు నిజముగా ఒకవస్తువుండనిచో భ్రాంతి కాధారమే యుండజాలదు. ఆ అధిష్ఠాన వస్తువు బ్రహ్మమే. ఆ విధంగా బ్రహ్మము నందు జగదీశ్వరులకు అధిష్ఠాన స్వరూపమైన బ్రహ్మము వినా ఉనికి లేదు. సర్వము భేదమే, మిథ్య అని అద్వైత సిద్ధాంతము "సర్వము ఖల్విదం బ్రహ్మ" ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ" యిత్యాది శ్రుతుల తాత్పర్యము నిశ్చయముగా అద్వైతమే.

సర్వకారణమును సర్వాధిష్ఠానమును స్వయంప్రకాశమును అగు బ్రహ్మమొక్కటే పారమార్థిక సత్యము. దాని యందు జగములేకుండియు నున్నట్లు కనబడుచున్నది. ఉత్పత్తి స్థితిలయములుగా మార్పుజెందు-దేనికిన్ని పారమార్థిక సత్యత్వములేదు. నామ రూపములే తారతమ్యముగాని, ఏ వస్తువు బ్రహ్మము కంటే భిన్నము కాదు. సర్వవస్తువుల యొక్క బాహ్యాభ్యంతరములందు ఆ బ్రహ్మమే ప్రకాశించుచున్నది. ఈ అధిష్ఠానబ్రహ్మమే మహాకాశమని అందురు. అట్టి మహాకాశమును గూర్చి చింతించకుమని ఈ ఉపనిషద్వాక్యము యొక్క అర్థము. ఈ మహాకాశమే ఎరుక. ఎరుకయే జన్మకు కారణము. జన్మకారణమయ్యేదానిని చింతించకుమని హితవు.

**వ్యోమాతీతమిదంబాహ్యం సర్వకారణ వర్జితమ్**
**నిరంజనం నిరపాయ నిర్దేహ మచలం ధృవమ్.** ॥౨౦॥

ఈ పరిపూర్ణపరబ్రహ్మము ఆకాశమున కతీతమైనది. ఆకాశమును మీరినది. సర్వమునకు కారణమైన దానిని (బ్రహ్మము లేకఎరుకను) వదిలినది. అది అంజనము లేనిది అనగా దోషము లేనిది. అపాయము లేనిది దేహము లేనిది అచలము. ధృవం అనగా ఉన్నదని గాని లేదనిగాని సందేహములేనిది.

**వివరములు :**

**1. వ్యోమాతీత మిదం బాహ్యం :** అనగా అకాశమున కతీతమైనది పరిపూర్ణపరబాహ్యం. అతీతమైనది అనగా మీరినది, శ్రేష్ఠమైనదని జెప్పవచ్చును. 132 క.ప. "ఆకాశమనిన శూన్యం। బాకాంబనిన సగుణ మాకాశమనన్। కాకి వలె నల్లరూపది। యాకాశము మితములోన నణగుందు సుమీ ॥ మరొక క.ప. 133 **"ఆకాశమనిన కాలం। బాకాశంబన విలంబ మాకాశమనన్। లోకమున చంచలంబగు। నాకాశము శబ్ద రూపమగు వినవోయీ"॥** అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చియున్నారు. ఆకాశమనగా శూన్యమని, సగుణమని, నల్ల రూపని, మితము యందు అణిగియుండునది యని భావము. ఆకాశాంశములు – జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార రూపములగు అంతరేంద్రియములు. కామక్రోధలోభ, మోహములు ఆకాశగుణములు. కావున ఆకాశము చంచలమని నిర్ణయము. ఆకాశము శూన్యపద్ధతిగా గలది కనుక విదువతగినదని నిర్ణయు. "ఆకాశస్యగుణశబ్దో" యనున్యాయమువలన శబ్దగుణము గలది అకాశము గనుక వ్యాకరణ శిక్షితమైన మాట శబ్దరూప మని నిర్ణయము. చలించనిది ఆకాశము, చలించునట్టిది వాయువు యని ప్రకటనకు యుక్తముగా నున్నను విశ్వము, నేను, తనువు, ఎరుక, జగము యను సర్వము, ఉత్పత్తి స్థితి లయ, విస్తీర్ణ ఆకర్షణములు కలిగియుండునవియే యని భావము. ఇన్ని లక్షణములు గల ఆకాశమును బయలని ఇతరులు జెప్పుదురు ఎట్లనగా పృథ్వి – చరణములు, జలము – కటి, అగ్ని–హృదయము, వాయువు కంఠము, ఆకాశము – శిరస్సు. ఈ ప్రకారముగా సాక్షిభూతమగు ఎరుకకు దేహమగు పంచభూతములలో ఆకాశభూతము బయలని జెప్పుదురు. వారట్లు జెప్పుటకు కారణమేమనగా పరిపూర్ణపరబయలు వారికి తెలియదు. ఇది సద్గురు రహస్యము. శు॥ "రహస్యం యే తదుత్తమం" యిట్టి రహస్యము నీకు తెల్పియున్నాను. ఆకాశమును బయలని నిర్ణయించుకొని, నేను దెల్పిన రహస్యము మరువకూడదని భావము. కావున ఆకాశము పంచభూతములలో ఒకటి, ఎరుక రూపము గలది. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఎట్టి లక్షణములు లేనిది. ఏది కానిది, ఏది లేనిది. అది సర్వలక్షణ విలక్షణమైనది. ఎరుకైన ఆకాశరూపమును మీరినదని ఈ ఉపనిషద్వాక్యము యొక్క అర్థము.

**2. సర్వకారణవర్జితమ్ :** అనగా పరిపూర్ణపరబ్రహ్మము కారణ కార్యములు లేనిది. ఏ వస్తువు లేనిచో మరొక వస్తువు తోచబడదో అది కారణ వస్తువు అట్టికారణ వస్తువు యొక్క నామ రూపముల కంటే భిన్నమగు నామ రూపములు గలదై యున్నది, కాని విచారించగ కారణ వస్తువు యొక్క మూలద్రవ్యమునకు భిన్నము కానిదైయున్న వస్తువు కార్యమని చెప్పబడును. ఉదా॥ మట్టి కారణము. మట్టిచే చేయబడిన కుండలు, గురుగులు మొదలగునవి కార్యము. అట్లే బ్రహ్మము కారణము, బ్రహ్మచే నైన ఈ జీవేశ్వరజగత్తు కార్యము.

కారణస్వరూపమగు బ్రహ్మమునకు (అనగా అఖండ ఎరుకకు) మరియొక కారణము గాని మూలముగాని, ఉండుటకు స్థానము గాని లేదు. పృథివ్యాది పంచభూతములకు ఆత్మరూపమగు బ్రహ్మము కార్యకారణ సంబంధముతో మహాకారణముగా నున్నది. దానికి కారణము ఎంత వెదికిన కానరాదు. కారణము లేని కార్యము విశ్వములో యేదిలేదు. ఉండుటకు వీలులేదు. కనుక సృష్టి కారణమగు బ్రహ్మమునకు ఉనికి లేదు. ఎండమావులలో జలమున్నట్లే కానవచ్చిన అక్కడ నిజముగా నీరులేదు. కలయందు దోచిన శరీరముల వలననే కలయందుమాత్రమే నున్నట్లు తోచబడునేగాని కలనుండి మేల్కొన్న పిదప ఈషణ్మాత్రము ఎట్లులేదో అట్లే యేమియులేదు. అట్లే ఈ గుర్తెరిగే శరీరమునకు "అకాశ శ్శరీరంబ్రహ్మ" అని చెప్పబడినట్లుగా మనసుకు గోచరించు మహాకాశమే శరీరముగా నున్నది. ఈ దేహి దేహములు రెండు ఒక దాని కొకటి విడువక రెండు కలసి ఏకవస్తువుగా నున్నది. దీనికి పరిపూర్ణమందు స్థానము గాని మూలముగాని యేమీ లేదు. కావున **"కార్యకారణ విరాహిత్యం తల్లింగమచలం ధృవం"** అని చెప్పబడి కార్యకారణములు మీరి యున్నది వదిలినది పరిపూర్ణపరబ్రహ్మము. అదొక్కటే నిరపేక్షక శాశ్వతత్వము కలిగియున్నది.

**3. నిరంజనం :** నిరంజన మనగా అంజనము లేనిది. అంజనమనగా అజ్ఞానము, ఉపాధి, కాటుక అని అర్థములు గలవు. పరమాత్మ స్వరూప లక్షణములచే సచ్చిదానంద రూపమని జెప్పిన, దాని యందే జడదుఃఖములు యణిగి యుండి, త్రిగుణ విజృంభణలో మాయా కార్యములుగా ప్రకటమగుచున్నవి. అవ్యక్తాధిష్ఠానములు లేక మాయా బ్రహ్మముగా నున్నదా పరమాత్మ స్వరూపమే. సర్వద్వంద్వములకు అదే పుట్టినిల్లు. అది ఏకరూపద్వంద్వము. సమిష్టి అజ్ఞానమే మాయ, సృష్టికి పూర్వము జ్ఞాన మయంగా నున్నట్లుగా తోచిన, అనంతరకాల మందు అజ్ఞాన లక్షణములు దాని యందే పొడచూపు చున్నవి. నిరూపాధికముగా తోచిన, సర్వోపాధులకు అదియే కారణము, కడపటి శరణాలయముగా నున్న దదే. కాటుకవలె నల్లగానుండును. అజ్ఞానమను గాఢాంధకారము తోను, జ్ఞానమును తేజో స్వరూపముతోను పోల్చెదరు. ఈ తేజోంధకారములు లేక జ్ఞానా జ్ఞానములు రెండు పరమాత్మయే అయిన సృష్టికి పూర్వదశమందు అది జ్ఞానఘనము, చిద్ఘనము అయివున్నట్లు తోచబడున్నది. ఈ లక్షణములు బ్రహ్మకేగాని పరిపూర్ణ పరబ్రహ్మమునకు లేవు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మమే నిరంజనమనవలెను.

**4. నిరపాయమ్ :** నిరపాయమనగా అపాయము లేనిది. పరిపూర్ణపరబ్రహ్మము అపాయముకానిది. పరిపూర్ణపరబ్రహ్మకు ఆది మధ్యాంతములు లేవు. సర్వత్ర నిండి నిబిడీ కృతమై యున్నది. దాని కెట్టిపరిమితియును లేదు. కేవలం అఖండమై యున్నది. దాని యందు జ్ఞానము గాని, కర్మచేయుటకు మరియు ప్రాణశక్తి గాని యింద్రియములు గాని, వానిని నడిపించు అధిష్ఠాన దేవతలు గాని, అన్యమేమిలేదు. **"నిశ్శక్తి నిర్మలం పూర్ణం"** దాని యందు ప్రాణశక్తిగాని, గుర్తెరిగే తెలివి కాని లేదు. వేయేల దాని యందితరమేమి లేదు. అది తప్ప రెండవది లేనప్పుడు అది దేని కపాయము కల్గించును. రెండున్నప్పుడే ఒకదాని నుంచి రెండవ దానికి అపాయము. అది ఏకానానేకములు గానిది. కావున నిరపాయమని అచల ఋషులు ఎరుక లేక సేవించిరి.

**5. నిర్దేహ మచలం ధృవమ్ :** అనగా అచలం దేహము కానిది, దేహము లేనిదని

అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మమందు, స్థూల సూక్ష్మకారణ శరీర, మహాకారణ శరీరములుగా లేనిది. వాటిని వివరముగా పరిశీలిద్దాము.

**i) స్థూల శరీరము :** "పంచీకృత పంచమహాభూతైః కృతం సత్ కర్మజన్యన్ సుఖదుఃఖాది భోగాయతనం శరీరం, అస్తి జాయతే, వర్ధతే విపరిణమతే అపక్షియతే వినశ్యతీ ఇతి షడ్వికారవత్ ఏతత్ స్థూలశరీరం ।" - తత్వబోధ. - శంకరపూజ్య పాదులు

తా॥ పంచీకరణము పొందిన పంచమహాభూతముల వలన పూర్వపుణ్యవశమున నిర్మింపబడి సుఖము దుఃఖము అనుభవించుటకు ద్వారమువలె ఉపయోగపడుచు గర్భస్థమయి ఉండుట, పుట్టుక వృద్ధిపొందుట మార్పుచెందుట, క్షయముపొందుట నశించుట అను వికారములు కలిగియున్న శరీరమే స్థూలశరీరమందురు.

**ii) సూక్ష్మ శరీరము :** అపంచీకృత పంచ మహాభూతైః కృతం సత్ జన్యన్ సుఖదుఃఖాది భోగ సాధనమ్ పంచజ్ఞానేంద్రియాణి పంచ కర్మేంద్రియాణి పంచప్రాణాదః మనస్సైకం బుద్ధిస్సైకా ఏవం సప్తదశాకలాభిః నహ యత్తిష్ఠతితత్ సూక్ష్మ శరీరం । - ఆదిశంకరులు. - తత్వబోధ.

తా॥ పంచీకరణము పొందనట్టి సూక్ష్మములైన పంచమహాభూతములచేత నిర్మింపబడి పూర్వపుణ్య వశము వలన ఏర్పడి సుఖము దుఃఖము, భోగములను పొందుటకు ఉపయోగపడుచు మనలోనే వున్న లోపలి శరీరరమును సూక్ష్మ శరీరమందురు. ఈ సూక్ష్మ శరీరములో 17 భాగములు కలవు.

ఈ సూక్ష్మ శరీరములో కర్మేంద్రియములు - (వాక్కు, పాణి, పాదము. గుహ్యము గుదము) ఒక భాముగా చెప్పుకున్నాము అలాగే జ్ఞానేంద్రియములు కూడ (శోత్రములు, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘూణము) ఒక భాగముగా జెప్పుకున్నాము. కంటికి కనిపించేవి నిజమైన జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు కావు. అవి స్థూల శరీరము లోని భాగములు మాత్రమే నిజానికి సూక్ష్మశరీరము లోనే జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు యిమిడియున్నవి.

నిజానికి వున్నది ఒక్క చైతన్య స్వరూపము మాత్రమే. చైతన్య స్వరూపములో సూక్ష్మ శరీరము గాని స్థూల శరీరముగాని ఉండుటకు వీలులేదు. ఎందుకంటే మనము నిద్రలోగాని ఆనందానుభవములో గాని చైతన్య రూపములో నున్నప్పుడు స్థూల శరీరముగాని, సూక్ష్మ శరీరము గాని అనుభవములో లేవు. కాని లేనిది ఉన్నట్లుగా గోచరించి నిజమైన అనుభవము నిచ్చుటకూడ తెలిసిన విషయమే. ఉ॥ కలలో కనిపించిన పులి అబద్ధమైనను నిజముగా గుండె దడ కలిగించును. మేల్కొంచిన తర్వాత కూడ కొంత సేపు గుండె దడ వుండును. అదే విధముగా చైతన్య స్వరూపములో నిజముగా లేని స్థూలశరీరము, సూక్ష్మశరీరము మనకు నిత్య జీవితములో నిజముగా నున్నట్లు అనుభవము నిచ్చుచున్నవి. దీనినే లోకదృష్టి (Emperical) అందురు. ఈ లోక దృష్టి అనుసారముగానే ఇక్కడ స్థూల, సూక్ష్మ శరీరము చెప్పబడుచున్నవి. యదార్థదృష్టితో (Absolute) కావని తెలసికొనవలెను.

**iii) కారణ శరీరము :**

అనిర్వాచ్యా నాద్య విద్యారూపమ్ । శరీర ద్వయస్య కారణమాత్రం

సత్ స్వరూపాఽజ్ఞానం నిర్వికల్పకరూపం యదస్తి తత్ కారణశరీరం॥
ఆదిశంకరులు.

తా॥ అనాది కాలము నుండి వచ్చుచు స్థూల సూక్ష్మ శరీరములు కలుగుటకు కారణభూతముగా నుండి అజ్ఞాన రూపములో ద్వంద్వముల కతీతమై ఉన్నదా లేదా అని నిర్వచించుటకు వీలులేక ఆనందము కలుగునపుడు, గాఢనిద్ర కలుగునప్పుడు అనుభవములోకి వచ్చునది ఏ శరీరము కలదో ఆశరీరమునకు కారణ శరీరమందురు. ఇందు ఆత్మ తత్వమునకు గూర్చిన అజ్ఞానము యిమిడి యుండును.

**iv) మహా కారణ శరీరము :** ప్రాణము ప్రత్యగాత్మల వ్యవహారము మహా కారణశరీరమనబడును.

ఇదే విధంగా **ఈశ్వర తనువులు** నాలుగు 1. స్థూల శరీరమునకు వైశ్వానరుడు, 2. సూక్ష్మ శరీరమునకు హిరణ్య గర్భుడు, 3. కారణ శరీరమునకు అవ్యాకృతుడు 4. మహాకారణ శరీరమునకు అక్షర పురుషుడు అభిమానులుగాజెప్పినారు.

ఈ అష్టతనువులు పరిపూర్ణ మందు లేవు. శ్రీకృష్ణదేశికేంద్రులవారు 54 క.ప॥ "కలవేళ్ళను యీ మేల్కను । గలయీ బయలుండజూచి కలమేల్కలలో । గల లేని నిన్ను నీమేనుల లేవని నీవు దెలసి యుండుము చాలున్" ॥ అనగా కలసమయము నందు, మెలుకువ యందు అచల పరిపూర్ణము శాశ్వతముగా నున్నది జూచి కలమేలుకల యందు లేక యున్నట్టిలేనినిన్ను నీమేనులు (జీవతనుచతుష్టయము + ఈశ్వర తను చతుష్టయము) లేవని తెలిసియుండుము. ఎందుకనగా అవి ఎరుక యగు కలస్వరూపము. సద్గురు అనుగ్రహమువలన అచలపరిపూర్ణ పరబయలు దర్శనము వలన యెరుక లేక పోవుచున్నది. కనుక కలయగు ఎరుక లేక పోవడము మేలుక యని నిర్ణయము. అప్పుడు కలమేలుకలు లేకుండ కేవల అచల పరిపూర్ణ వరబయలు మాత్రమే యుండును. ఈవిధముగా అష్టతనువులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మమని ఈ ఉపనిషద్వాక్యము చెప్పుచున్నది.

**5. ధృవం :** అనగా వున్నదని గాని లేదని గాని సందేహము లేనిది. అనగా నిశ్చయముగా శరీరములు లేనిది పరిపూర్ణపరబ్రహ్మమని తెలియవలయును.

**తదేవలింగ మిత్యుక్తం సఏవశివఉచ్యతే**
**శివమధ్యేస్థితం విశ్వం శివాద్భావ్యం నకించన** ॥౨౨॥

ఆదైవమే లింగమని చెప్పుట తగియున్నది. అదే శివుడు (సదా శివుడు) అని చెప్పబడుచున్నది. అట్టి శివుని మధ్య ఈ విశ్వమున్నది. శివుని కంటే భావింపతగినది యేది లేదు.

**1. తదేవ లింగమిత్యుక్తం :** ఆదైవమే లింగమని చెప్పుట తగియున్నది. ఆ లింగము అనగా పరిపూర్ణపరబాహ్యామని గ్రహించవలయును. సామాన్యార్థములో ఆత్మయనగా పిండాండమందున్న తెలివి రూపమగు పరమాత్మయని Individual Soul లేక Consciousness అని అర్థము. ఈ అర్థమును మాత్రమే స్వీకరించినచో ప్రత్యగాత్మ పరమాత్మలు ఏకవస్తువే. ఉపాధిగతమైనప్పుడు ప్రత్యగాత్మయని అందురు. నిరుపాధికమైనప్పుడు పరమాత్మయని చెప్పబడును.

విశేషార్థములో ప్రత్యగాత్మ పరమాత్మయను రెండు పేర్లు గలవస్తువు ఒక్కటే. కనుక

ఆత్మ శబ్దముచే పరమాత్మను గ్రహించి దైవశబ్దముచే దాని కన్యమగు పరిపూర్ణ పరబ్రహ్మముగా (కేవలాత్మగా) గ్రహించవలయును. "దివ్" అనగా ప్రకాశమని, జ్ఞానమని వ్యుత్పత్త్యర్థము. దేవుడనెమాట జ్ఞాన స్వరూపుడగు (చిత్స్వరూపుడగు) పరమాత్మకే అర్థము కాని దైవ శబ్దముచే అత్యంతాతీతమగు వస్తువు నుద్దేశింతురు. కనుక ఆ అర్థములో అత్యంతాతీత వస్తువు పరిపూర్ణ పరబ్రహ్మమే దైవమని పరిపూర్ణ భావజ్ఞులు వాడినారు.

అందకే శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద.॥ 38 **"దేవుణ్ణి నిన్ను ఎరుగవు। నీ విప్పటి కెట్టివారొ।నే దెల్పెద నీ। కావెట్టి బోధలెందుకు। కావున నద్దేవుణ్ణి కనుగొన వోయీ। నామరూపకర్మలేవోయీ । నీ వాదేవుని లోన నిను లెస్సవెదికిన। న్నావలి ముచ్చాట నడుగోయి తెల్పెద"** అని శెలవిచ్చియున్నారు. ఇచట దేవుడనగా పరిపూర్ణపరబ్రహ్మమే. నిన్ను అనుటలో అఖండ ఎరుక రూపమగు పరమాత్మయే. కావున అట్టి దేవుణ్ణి పరిపూర్ణ పరబ్రహ్మమును లింగమనుట యుక్తముగానున్నది. ఎందుకనగా లింగమునకు యే అవయవములు గాని మానవుని పోలిన ఆకారములు గాని, ధరించు ఆభరణములు గాని, వస్త్రములుగాని లేవు. పరిపూర్ణ పరబ్రహ్మమునకు యిట్టి ఆకార, అవయవ, ఆభరణములు వస్త్రములు లేవు. మరియు లింగము దేనిని పోలియుండుటలేదు. కావున లింగము వ్యవహారార్థము పరిపూర్ణమని యనుట యుక్తముగానే యున్నది. లింగమనగా యిచట పానవట్టము మీది శివమూర్తి యని గాక పరిపూర్ణ పరబ్రహ్మముగా అర్థము గ్రహించవలయును.

**2. సఏవ శివ ఉచ్యతే :** అదే శివుడని చెప్పబడుచున్నది. ఇచట శివుడనుటలో పరిపూర్ణ పరబ్రహ్మము సర్వశుభప్రదమైనదని, మంగళ కరమైనదని యర్థములో వాడబడినది. పరిపూర్ణ భావము దృఢమైనచో శాశ్వత జననమరణ రహితము సిద్ధించుటకన్న మంగళకరమైనది మరొకటుండదు గదా! కనుక దానిని పరిపూర్ణపరబ్రహ్మమని, శివుడని, లింగమని, అచలమని గురుగుహ్యమని, అనంతమని పేర్లు వ్యవహారార్థము సందర్భానుసారముగా వాడబడినవని తెలియవలెను. పరిపూర్ణ పరబ్రహ్మమునకు అసలు ఏపేరు లేదు. మనము పెట్టుటచేత దానికి పేర్లు కలిగినవి. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ప.॥ 38॥ "పేరచలమనుచుబయలని। పేరెప్పుడులేదు మనము బెట్టుట చాతన్। మరియు క.ద 44 బట్టబయలనుచు దీనికి। మొట్టమొదల్ పేరులేదు। ముదమన ఎరుకే । పుట్టి పేర్బెట్టి దీనిని" యని గానము చేసి యున్నారు. అందులకే పరిపూర్ణమునకు వ్యవహారార్థము ఈ పేర్లు పెట్టబడినవి. అదే పరమ శివుడు.

**3. శివమధ్యేస్థితం విశ్వం :** అనగా శివుని మధ్యమందీవిశ్వమున్నది అని అర్థము. అంతా శివ మయమే, బ్రహ్మమయమే. అంతాపరమాత్మ మయం అని అర్థము. సృష్టికి పూర్వము ఆపరమాత్మ "ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడినాడు. ఆ బ్రహ్మమునకే సోఽకామయత, బహుస్యాం ప్రజాయేయేతి" అని సృష్టికామన కలిగి ఆపరమాత్మయే కార్యరూప జగత్తు అయివున్నాడు" తత్సృష్ట్వాతదేవాఽను ప్రావిశత్" అనుశ్రుతి ప్రకారము కల్పించిన జీవేశ్వర జగత్తునందు తెలివి రూపములోనో గుణరూపములోనో, శక్తి రూపములోనో అణు అణువునా బాహ్యాభ్యంతరములందు సర్వత్రా ప్రవేశించెను. వస్తువు యొక్క ఆవరణము నందంతట ఆ పరమాత్మ తెలివి రూపముగా వ్యాపకమైయున్నాడని

చెప్పుట సమంజసము. కనుక పరమాత్మ కన్యముగా ఏమిలేదు.

విశ్వమంతటా పరమాత్మను (గురువును) దర్శించుటే ఆత్మదృష్టి. ఇదే అమృత దృష్టి. వస్తు దృష్టియు గుణదృష్టియు, మృత దృష్టి అని అనబడుట కిదే కారణము. అమృత దృష్టి లేక పరమాత్మ దృష్టి కలిగినపుడే తన యందఖిల భూతములను, అన్ని భూతములందు తనను చూడగలుగుట సాధ్యమగును. విశ్వమే శివుడు, శివుడే విశ్వము. శ్లో॥ 45॥ "గురు మధ్యే స్థితం విశ్వం, విశ్వమధ్యే స్థితో గురుః, గురుర్విశ్వం నచోర్నాస్తి తస్మై శ్రీ గురువేనమః " అంటూ గురు పరమాత్మను గురుగీత అభివర్ణించినది.

**4. శివాద్భావ్యం నకించన :** అనగా శివునికంటే భావింపదగినది ఏది లేదు. పరిపూర్ణబోధ యంతయు భావనా రూపమే. శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద.॥ 32 **"చట్టువలె కదలకుండును॥ బట్టబయల్ యిట్టిదెరిగి॥ భావింపదగునూ॥ యెరుకలేక సేవింపదగునూ"** । అనిగానము చేసియున్నారు. కావున శివ అని పరిపూర్ణమని భావించుట ఈ బోధయందు దృఢముగావలసి యున్నది. మరేది లేదంటే పరిపూర్ణమందు ఇతరమైన దేది లేదని అర్థము. శ్రీకృష్ణప్రభువుల క.ద. 54లో "పరిపూర్ణమొకటి దక్క॥ నితరమైన ప్రపంచమెల్ల దగతెలియుము॥ నీ వెరుకేనని మదిలోపల"॥ యని సూటిగా జెప్పియున్నారు. అనగా పరిపూర్ణ మొకటి దక్క ప్రపంచమంతయు ఎరుకే యని నీమదిలో యెరుగుము. ఆ ఎరుక పరిపూర్ణ మందులేకనే తోచింది. పరిపూర్ణము ఎరుకగా ఎప్పుడు మార్పుచెందలేదు. అందు పంచతన్మాత్రలు గాని లేవు. అది అఖండ యెరుకగా గాని, జీవేశ్వర జగత్తుగా మారవలెనని సంకల్పించలేదు. ఏశక్తి సామర్థ్యములు అందులేవు. పరాప్రకృతిగాని ప్రాణముగాని దాని యందు లేవు. అహం కూడ లేనిది. కర్తృత్వభోక్తృత్వములు దానికి లేవు. అది జీవేశ్వర జగత్తుకు ఆధారము అధిష్ఠానముగాదు. సత్వరజోతమోగుణములందు లేవు. వేయేల అందు యితరమైనదేది లేదు. ఈ జీవేశ్వర జగత్తంత పరిపూర్ణమందు తోచుచున్నదేగాని వాటి పారమార్థిక సత్యత్వములేదు. కావున శివుని కంటే భావింపదిగినది. యేది లేదు.

**శివాదన్యమితిర్నాస్తి త్రిషులోకేషు నిశ్చితమ్**
**ద్రష్టాదృశ్యవశాద్బంధః ద్రష్టాభావే కుతోభయమ్** ॥ ౨3॥

త్రిలోకేషు అనగా మూడులోకములు, స్వర్గ మర్త్య పాతాళలోకములందు శివుని కంటే వేరే ఏది లేదని నిశ్చయము. దృశ్యముచే ద్రష్టబంధింపబడుచున్నాడు. ద్రష్టయే అభావమైనచో అనగా లేనిచో భయమే లేదు.

**1. శివాదన్యమితిర్నాస్తి త్రిలోకేషు నిశ్చితమ్ :** మూడు లోకములందు శివుని కంటే వేరైనది ఏది లేదు. అంటే మూడు లోకములయందు పరిపూర్ణము తప్ప మరొకటి లేదని నిశ్చయముగా జెప్పబడినది. మూడు లోకములలో స్వర్గలోకము లేక ఊర్ధ్వలోకము ఒకటి. ఇచట దేవతలు నివసిస్తారు. భూలోకములో చేసిన పాప పుణ్యములవల్ల ఏర్పడిన పాప పుణ్యసంస్కారముల ఫలము లిచ్చట అనుభవిస్తారని చెప్పుదురు. పుణ్య సంస్కారముల ఫలముగా సుఖముల ననుభవించుట, పాప సంస్కారఫలముగా బాధల ననుభవింతురని చెప్పుదురు. చేసిన పుణ్య ఫలములు ననుభవించినతోడనే **"క్షీణేపుణ్యేమర్త్యలోక విశంతి"** అనే న్యాయంగా వారు తిరిగి మర్త్యలోకమనగా మానవులుండే లోకమున మళ్ళీ పుడుతారు.

రెండవది మర్త్యలోకము లేక భూలోకము. ఇందు ఎవరెవరి కర్మాను సారము వారి వారి ప్రారబ్దానుభవమును అనుభవించుటకు యిచట జన్మమెత్తి కర్మల ననుభవిస్తుంటారు.

ఈలోకమున సత్కర్మలు, దుష్కర్మలు చేస్తుంటారు. వాటి ఫలితములు దృష్ట ఫలితములైతే అజన్మలోనే అప్పుడే అనుభవిస్తారు. అదృష్ట ఫలితములైతే తర్వాతి జన్మలలో నెప్పుడైన అనుభవిస్తారు. అంటే ఆగామి ఏర్పడును. చివరిది పాతాళ లోకము. ఇచట రాక్షసులు, నాగులు వశించెదరని ప్రతీతి. ఈ మూడులోకములందు శివునికంటే వేరైనది అనగా పరిపూర్ణము కంటే ఇతరమైనది యేది లేదని నిశ్చయము.

**2. ద్రష్టాదృశ్యవశాద్బంధః :** అనగా దృశ్యము చేత ద్రష్ట అనగా చూచు వాడు బంధించబడుచున్నాడు. ద్రష్ట, దృక్కు దృశ్యము త్రిపుటి. ద్రష్ట దృక్కుచే దృశ్యమును చూచును. దృశ్యాకర్షణవల్ల ద్రష్ట మోహితుడై బంధమునకు కారణమగుచున్నాడు.

బంధమనగా కట్టుబడి యుండుట. త్రికరణములగు మనస్సు, వాక్కు, శరీరము (నానాయింద్రియములతో సహా దేనిపై తన కెట్టి పెత్తనము లేకుండుటయే బంధము). సృష్టి స్థితి లయములు కలుగుటకు పరమాత్మ స్వంత్రముననే కలిగినవి అని అన్నను, మళ్ళీ మళ్ళీ అట్లు జరుగుటకు కారణ మేమని తెలుసుకొనుటకు ప్రయత్నిస్తే అందు యేవ్యక్తియో తన్ను ప్రేరేపించి బంధించి ఈ సృష్టి బంధములోకి ఈడ్చుకొని వెళ్ళు చున్నదని చెప్పదగును. కనుక సృష్టికారణము నిర్గుణ స్వరూపమగు బ్రహ్మమన్నా, సగుణ స్వరూపుడగు ఈశ్వరుడన్న, మొత్తమీద సృష్టికర్తయే బద్ధుడై యున్నాడు. ఆబ్రహ్మాదిస్తంభ పరియంతము యేదో తెలియరాని ఒక సూత్రమునకు బద్ధుడైయున్నది. ఇదే బంధము.

**శ్లో॥ కురంగ మాతంగ పతంగ మీనా : ।భృంగాః పంచభిరేవ పంచ॥**

అని చెప్పబడినట్లు ఈ శ్లోకమున జెప్పబడిన జీవులు ఒక్కొక్క తన్మాత్ర విషయము చేత ఆకర్షించబడి ప్రాణహాని తెచ్చుకొనుచున్నవి. పంచీకృత పంచ తన్మాత్రలనుండి ప్రభవించి పంచీకృత పంచ మహాభూతమలతో యేర్పడిన ఈ బ్రహ్మాండ మందు పంచతన్మాత్రలు విషయరూపములుగా అనగా శబ్ద స్పర్శ రూప రస గంధములుగానున్నవి. అందు శబ్దము యొక్క లోలత్వము చేత లేళ్ళుపాములు ప్రాణహాని తెచ్చుకొనుచున్నవి. ఏనుగులు స్పర్శసుఖము నాశించి నశించుచున్నవి. మిడుతలు, దోమలు అగ్నియొక్క రూపమునకు భ్రమించి అందుబడి నశించుచున్నవి. చేపలు జిహ్వా విషయమగు రసమునకు లోనై నాశనమగుచున్నవి. తుమ్మెదలు సంపంగి పుష్పము యొక్క మంచి వాసనచే ఆకర్షించబడి నశించుచున్నవి. ఇవన్నీ ఒక్కొక్కదానిచే ఆకర్షించబడి నశించుచున్నవి, గాని మానవుడు విశేషజ్ఞానము కలిగియుండి కూడ, పంచతన్మాత్రల ఐదింటికి లోలుడై, వాటికొరకు తపించుచు సత్ఫలితములకు పొంగి, దుష్ఫలితములకు కృంగి, దుఃఖముల పాలగుచున్నాడు. కనుక బాహ్యామందున్న శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములే ప్రాణులను బంధించుచున్నట్లు స్థూలదృష్టికి గోచరించుచున్నది.

ప్రపంచమందలి వస్తువులన్నియు గుణదోషములు రెండింటితో కూడుకొని యున్నవే గాని కేవల దోషము మాత్రమే గల వస్తువేది లేదు. **"గుణదోష మయం సర్వం స్రష్టా సృజన కౌతుకీ"** అన్నన్యాయమున అన్ని ద్వంద్వలక్షణోపేతమైయున్నవి. కేవలత్వ మనునది ప్రపంచము నందలి ఏ వస్తువునందైనను మృగ్యమే. దోషము వస్తువు నందున్నదా? లేక తనయందున్నదా? అంటే తన యందే యున్నదని చెప్పనగును. శబ్దాది విషయములను గుర్తించునది మనస్సేకదా! గుర్తించనిచో బంధమే లేదు. కనుక "మన యేవ మనస్యాణాం కారణ బంధ మోక్షయోః" అని చెప్పబడినది కనుక బంధము బాహ్యానిష్టయని యనరాదు.

అంతర్దృష్టయని చెప్పి తీరవలసినదే.

ఏ దృశ్యమైన కంటితో చూచుచున్నామని మనము తలంతుము గాని నిజముగా ఆవస్తువు కన్ను చూచుటలేదు. కన్నును ఒక పనిముట్టుగా జేసి అంతఃకరణమగు మనస్సు చూచుచున్నది. ఉదా॥ దారిలో ఒక రూపాయ బిళ్ళచూచిన దాని యొక్క ప్రకాశము కంటిలో బడి మనస్సు గుర్తించి దానిని తీసుకోవలసినదిగా చేతులను ఆదేశించును. ఈ విధముగా చూచువాడు (ద్రష్ట) దృష్టి (చూపు) దృశ్యము (చూడబడిన వస్తువు) యని త్రిపుటి ఏకమైనప్పుడే ఆవస్తువు కనబడును. ఆ విధముగా దృశ్యమును ద్రష్టను తీసుకోవలసినదిగా ఆదేశించుటయే దృశ్యము ద్రష్టను బంధించుచున్నది.

**3. ద్రష్టాభావే కుతోభయమ్ :** ద్రష్ట అభావమైనచో అంటే లేనిచో భయము లేదు. పైన వివరించినట్లు ద్రష్టా, దృక్కు, దృశ్యమనేటి త్రిపుటి ఏకమై నప్పుడే ఆవస్తువు కనబడుచున్నది. ఈ త్రిపుటి ఏ ఒక్కటిలేకుంటే తక్కిన రెండు లేకుండును. ద్రష్టలేనిచో దృక్కు, దృశ్యములేనివే అగును. అట్లే తక్కిన రెండింటిలో ఒకటి లేకున్న ఇరతరమైన రెండులేకుండును. ఈ విధముగా పరిశీలించిన యెడల ద్రష్టలేనిచో దృక్కులేదు. దృశ్యములేదు. అపుడు అన్యవస్తువే లేదు. అన్యవస్తువు లేనప్పుడు భయమేలేదు.

భయమెట్లు కలుగునో యించుక పరిశీలిద్దాము. ఆకాశార్థములో వ్యష్టినాల్గొవ భాగము పృథ్వీ భూతములో చేరుటవల్ల అంతః కరణమున భయము కులుగునని సాంఖ్యము జెప్పుచున్నది. కాని భయోత్పత్తికి అత్యంత ముఖ్య కారణము ఉపనిషత్తులు చాల గొప్పగా సిద్ధాంతీకరించినవి. **"ద్వితీయా ద్వై భయం భవతి"** అనగా ద్వైతమందనగా రెండవది అంటూ ఉంటే భయము పుట్టక తప్పదన్నమాట. తాను తప్ప రెండవది లేకపోతే ఇక దేనిని గురించి భయపడును. కనుక "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" అను శ్రుతికి బ్రహ్మవంటిది మరొకటి లేదని అన్యులు వాఖ్యానిస్తే "నేహనా నాఽస్తికించన" అని "బ్రహ్మణోన్యం నకించిన" అని "సర్వం ఖల్విదంబ్రహ్మ" అను శ్రుత్యర్థములతో మేళవించి బ్రహ్మమొక్కటే తప్ప రెండవది లేనే లేదు. అని అద్వైతులు సిద్ధాంతము చేసినారు. కాని "ఏకం అనేకం భవతి' అనగా మొదట ఏకమైన ఒకటిగానున్న వస్తువే పిదప అనేకంగా మారింది. లేక (అనేకములై వున్నవన్ని ఏక వస్తువు నుంచే కలిగినవి) చెప్పబడుచున్నప్పుడు అద్వితీయమైన ఏక బ్రహ్మమే భయమునకు మూల కారణమని చెప్పక తప్పదు. కనుక ఏకానేకములు గానుండే ఈ కారణ బ్రహ్మము ఒకప్పుడు అభయస్వరూపముగా, మరొకప్పుడు భయరూపమగుచు ద్వయదోష దూషితమగుచున్నదని చెప్పుట శ్రుతి సమ్మతమై యున్నది. కనుకనే ఏకానేకములు, సదసత్తులు, అస్తి నాస్తులు, భావా భావములు మొదలగు సాపేక్షిక శబ్దములచే వర్ణింపరాని కేవల నిరపేక్షక పరిపూర్ణపరబ్రహ్మమే అభయ స్వరూపమని అచల ఋషుల సిద్ధాంతము.

త్రిపుటిలో ద్రష్టలేదు. తానే లేదు గనుక రెండవదిలేదు. "నీ వుండిన జగముండును। నీవేగిన జగములేదుయవి నీతోడన్। భావింప నినుదలచిన। యీవిశ్వము బండి సున్న యిది గనువేమా।" అని వేమనార్యుల వారు చాటినారు. ద్రష్ట లేనప్పుడు జగమే లేదు, జగము లేనప్పుడు రెండవది లేనే లేదు. కావున భయములేదు. భయము లేకుంటే సంశయమేలేదు. సంశయ నివృత్తియైన జన్మరహితమగును.

**సర్వేంద్రియవినుర్ముక్త జ్ఞానంయత్ర విలిప్యతే**
**తత్రజ్ఞానం విస్పృజ్యేత సమాధేస్తస్య లక్షణమ్** ॥౨౪॥

సర్వేంద్రియాలచే విడువబడిన జ్ఞానం ఎక్కడైతే లేకుండ యగునో అచ్చట జ్ఞానము (బ్రహ్మాజ్ఞనము) పుట్టును ఆదే సమాధి లక్షణము.

**వివరములు :**

ఇచట సమాధి లక్షణము గూర్చి చెప్పబడినది. "ధీ" యనగా బుద్ధి. బుద్ధికి సమత్వము కలుగుట. పంచేంద్రియములచే శబ్దాది విషయములను గుర్తించినంత కాలము బుద్ధికి బేధ జ్ఞానమే సిద్ధించును. పంచతన్మాత్రలు. శబ్దాది విషయములు అనగా శబ్దస్పర్శ, రూప, రస, గంధముల నుండి కలుగు జ్ఞానము నుండి విముక్తి లభించిన యెడల బుద్ధికి విషయజ్ఞానము గాని భేద జ్ఞానముగాని వుండక పంచతన్మాత్రల ఏకైక రూపమగు బ్రహ్మవస్తువును అవలోకించును. ఇదియే సమాధి.

సర్వేంద్రియములను గూర్చి తెలుసు కొందము. జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము యను ఐదు అంతరేంద్రియములు. సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ, అపాన వాయువులు ప్రాణేంద్రియములు. శ్రోత్రము, త్వక్కు, చక్షువు, జిహ్వా, ఘ్రాణము, జ్ఞానేంద్రియములు – శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము ఐదు పంచతన్మాత్రలు. వీనినే విషయేంద్రియము లందురు. కర్మేంద్రియములు – వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యము. ఇందు చతుర్దశేంద్రియ విషయములు – చెవులకు శబ్దము, చర్మమునకు స్పర్శ, నేత్రమునకు రూపము, జిహ్వాకు రసము, ముక్కునకు గంధము, వాక్కునకు వచనము, కరమునకు దానము, పాదమునకు గమనము, గుహ్యమున కానందము, గుదమునకువిసర్జన మనస్సునకు కల్పన, బుద్ధికి నిశ్చయము, చిత్తమునకు చింతన, అహంకారమునకు అభిమానము. ఇన్నిటిని యెరుగునదే ఎరుక. ఈ ఎరుగునటువంటి జ్ఞానము లౌకిక జ్ఞానము లేక వ్యవహారిక జ్ఞానము. ఈ జ్ఞానమును యింద్రియ సన్నికర్షణ జ్ఞాన మనబడును. ఇట్టి యింద్రియ రూపమైన జ్ఞానమునకు బ్రహ్మము విషయము కాజాలదు. ఏలననగా జ్ఞానమునకు ఆధిభౌతికము ఎరుగుట. దేనిని యెరుగుట యనగా శబ్దాది విషయ పంచకము నెరుగుట. విషయ పంచకమునుండి మరలించినచో (సర్వేంద్రియములచే గుర్తించే జ్ఞానమును కలుగకుండ మనస్సును నిశ్చల స్థితి యందుంచినచో) ఆ జ్ఞానమే **"శుద్ధ జ్ఞానము"** అనబడును. అట్టి శుద్ధ జ్ఞానముచే సృష్టికి పూర్వముండే వస్తువును లేక తత్వమును గురించి ధ్యానించినచో ఆజ్ఞానము (నిరీంద్రియమగు మనస్సు) జ్ఞేయ రూపమును పొందుచున్నది. మనోహిజతువత్" అనగా మనస్సు లక్క వంటిది. ఏ మూసలో లక్కను కరిగించి పోస్తే ఆ రూపమే ఆ లక్క వహిస్తుంది. అదే విధముగా శుద్ధ జ్ఞానము లేక ఇంద్రియములతో సంబంధము లేకుండ జేసిన నిరీంద్రియమనస్సు జ్ఞేయాకారము వహించును. అప్పుడే ఆ జ్ఞేయబ్రహ్మము అవలోకనమగును. జ్ఞానము జ్ఞేయాకారము వహించినపుడు:

**శ్లో॥ సముద్రోవై యథాతోయం, క్షీరే క్షీరంజలేజలం**
**భిన్నేకుంభే యథాఽకాశం తథాఽత్మ పరమాత్మని॥** గురుగీత – 197 అని గురుగీత జీవేశ్వరైక్యం అనుశీర్షికన గానము చేసినది. నదుల నీరు సముద్రములో కలసి నట్లు, పాలలో పాలు, నీటిలో నీరు, బ్రద్ధలైన ఘటములోని ఘటాకాశము

ఆకాశములోకలసి నట్లు ఆత్మ పరమాత్మలో ఐక్యమగును మరియు

శ్లో॥ ఆకాశం మానసంకృత్వా మనః కృత్వా నిరాస్పదం
నిశ్చలస్తం విజానీయాత్సమాధిస్త లక్షణం॥ ఉత్తర గీత 1-32

అనగా ఆకాశమును మనస్సుగా నొనరించి, మనస్సు నిరాస్పదమైన దానిగాజేసి (శూన్యం రూపం గావించి) నిశ్చలత్వమును గుర్తెరుగుటే సమాధి లక్షణము అనిభావము.

**వ్యోమాంతరేచమాత్మాన మాత్మమధ్యే నిరామయమ్**
**వ్యోమాన మాత్మకుర్వీత స్సమాధిస్తస్య లక్షణమ్** ॥౨౧॥

ఆకాశ మధ్యమందున్న ఆత్మను, ఆత్మమధ్యమందున్న నిరామయమును అను యోగవిఘ్నము లేకుండ ఆకాశమును ఆత్మగా నొనర్చుటయే సమాధి లక్షణము.

**వివరములు :**

**1. వ్యోమాంతరేచ మాత్మానమ్ :** అనగా దహర (హృదయ) ఆకాశము మధ్య యందు అని అర్థము. అంటే ఆకాశము మధ్యపరమాత్మ నుంచుము. అనగా ఈ ఆకాశము పరమాత్మ కంటే వేరుగాదని భావించుము. ఇచట గుర్తుంచుకోవలసిన విషయమేమనగా ఆత్మనుంచి పంచభూతములు కలిగినవి. భద్రాదిరామశతక కర్త 7.సీ॥ ఆత్మయందున ఏక మాకాశము దయించె। ఆకాశమం దనిలంబు బుట్టె। అనిలంబువల్లను అగ్నిహోత్రుడు బుట్టె। అగ్ని హోత్రమువల్ల అప్పు బుట్టె। అప్పువల్లను మహాయవనీస్థలియు బుట్టె। అవనియందోషదు లమరబుట్టె। ఓషధులందునున ఒనర అన్నము బుట్టె। అన్నమందున నరులాది సకలజంతు జాలంబులాయె। నీ జగయుగంబులాయే నీరీతి పరమాత్మ మాయవలన॥ రమ్య॥ అని శెలవిచ్చియున్నారు. ఆకాశము ఆత్మయొక్క అంశమని ఈ సీసపద్యము వల్ల తెలియుచున్నది. మరియు పంచభూతముల ధర్మ కర్మలను పరిశీలించిన యెడల ఆకాశము బయలైయుండుట ధర్మము. అవకాశమియ్యడము కర్మము. బయలగుట, అవకాశ మిచ్చుట ధర్మ కర్మలై యుండుట వల్ల ఈ కర్మ ధర్మములు ఆత్మవికూడ అయియున్నవి. కనుక ఈ ఉపనిషద్వాక్యమున అకాశము అవకాశమిచ్చును. ఆత్మకు అవకాశ మిచ్చుటవల్ల ఆత్మను ఆకాశము మధ్య నుంచుము అని అర్థము. ఆకాశము శూన్యము గనుక ఆత్మను కూడ శూన్య మొనరించుమంటుంది. అనగా ఆత్మయే మనస్సు. మనస్సు సంకల్ప వికల్పములు కలుగకుండ నిశ్చల స్థితి లేక శూన్యమొనరించిన అట్టి మనస్సు నిరింద్రియమగును. అనగా విషయజ్ఞానము నశించును. అప్పుడు నిశ్చల బుద్ధియగును. నిశ్చల బుద్ధియే అదే సమాధి స్థితి.

**2. ఆత్మమధ్యే నిరామయమ్ :** నిర్+అమయము = నిరామయము అనగా వ్యాధులు లేని, లేక యోగవిఘ్నములు లేకుండుట. నిరామయుడు అనగా యోగమునందు యెడతెగక యుండువాడు. యోగమనగా కూడిక. దేనితో కూడికయని యనగా, తన ఆవరణ రూపమైన ప్రకృతితో అవినాభావముగా ఎప్పుడు విడిచి వేరుకాకుండ యుండు వాడు నిరామయుడు. ఆపరమాత్మతో ఏకత్వ సాధన చేయువాడు నిత్యముక్తుడు అని గురుగీత వర్ణించినది. "ఆకాశమే శరీరం బ్రహ్మ" అనున్యాయమున, బ్రహ్మమునకు ఆకాశమే శరీరము గనుక బ్రహ్మమునకు శరీరము ఉన్నది. మరియు అకాశము అసంగము. అచలము, నిష్క్రియము అయివుండుటచే బ్రహ్మకు సత్వ రజో, తమోగుణ సంబంధము గల ముఖ్య వ్యాధులున్నవి. ఈ గుణత్రయములు

తానుతానైయున్న కేవల బ్రహ్మస్థితి యందు మాత్రమే ఆ పరమాత్మ నిరామయుడు.

**3. వ్యోమానమాత్మకుర్వీత స్వమాధస్తస్యలక్షణమ్** : అకాశమును ఆత్మనొనర్చుటయే సమాధి లక్షణము. అనగా బుద్ధి నిశ్చలత్వము సమాధి.

శ్లో॥ ఖమధ్యే కురుచాత్మన మాత్మధ్యేచ ఖంకురు।
ఆత్మానం ఖమయం కృత్వా నకించిదపి చింతయేత్॥ ఉ.గీ.॥ 1-10

అనగా ఆకాశమందంటను వ్యాపించినదానిగా ఆత్మనుల్లంఘించి ఆ యాత్మ యందంతటను వ్యాపించి యున్నదానిగా ప్రతిష్ఠించి (అనగా రెండింటిని నొకటిజేసి) ఆ పిమ్మట ఇతరమైన దానిని కొంచమైనను తలంచకుము. అపుడు స్వస్వరూపముతో స్తబ్ధచిత్తుడవై నిలిచి పోదువు. శ్రుతి॥ **"వృక్ష ఇవస్తబ్ధో వితిష్టత్యేకస్తే నేదం పూర్ణం పురుసేన సర్వం"** అనగా పూర్ణత్వరూపుడై ఏ పురుషుదున్నాడో, అతడు ఆకాశమునందు వృక్షము వలె స్థాణువుగా నిలిచియున్నాడు. మరియు **"ఖ"** శబ్దముచే బ్రహ్మము చెప్పబడినది ("ఖంబ్రహ్మ" అని, "ఆకాశ శరీరం బ్రహ్మ" అనీ శ్రుతులున్నవి) ఆత్మ శబ్దముచే జీవుడు చెప్పబడెను. జీవ బ్రహ్మముల నేకముగా నెరిగి ధ్యానించుమని అర్థము. నీ బయటనున్న ఆకాశమే శరీరముగా గల బ్రహ్మనందు నీమనోరూపాత్మ జీవాత్మనులగ్నము చేసినను సరే. లేదా నీలోపలనున్న మనోరూప జీవాత్మ యందు ఆత్మను ప్రతిష్ఠించినను సరే అని చెప్పుటకై **"ఖంమధ్యే కురుచాత్మనం"** అని ఆగకుండా **"ఆత్మమధ్యేచ ఖంకురు"** అని చెప్పబడినది. మరియు ఆత్మ యందాకాశము, ఆకాశము నందాత్మయు ఓతప్రోతమై నున్నవని గ్రహించనగును. కావున ఆత్మను నాకాశ మొనర్చుటయే సమాధి.

**నిర్దేహం సర్వదానిత్యం సహదేహం సదానహి**
**ఇతి నిశ్చయభావేన సమాధిస్తస్యలక్షణమ్** ॥౨౬॥

నిర్దేహము అనగా దేహము కానిది. దేహిలేక ఆత్మ. అదే శాశ్వతము. సదేహము అనగా శరీరము అనిత్యము అనగా అశాశ్వతము. దేహము అశాశ్వతము, దేహము కాని ఆత్మ శాశ్వతము అనెడి నిశ్చయ భావముతో ఉండుటయే సమాధి లక్షణము.

**1) నిర్దేహం సర్వదా నిత్యం సహదేహం సదానహి** : దేహము అశాశ్వతము, దేహముకాని ఆత్మనిత్యము అనగా శాశ్వతము అని అర్థము. ఈ భావమును అద్వైత దృష్టితో మరియు పరిపూర్ణ భావముతో పరిశీలింతము.

నిర్దేహము అనగా ఆత్మ, శాశ్వతము. యాజ్ఞవల్క్యీ జనకునకు ఒక్కవాక్యములో ప్రత్యగాత్మ స్వరూపమునకు యిట్లు తెల్పియున్నాడు "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యం పర్జోతి పురుషః" అని చెప్పుటవల్ల ఆత్మ విజ్ఞాన మయుడు, యింద్రియములందు, ప్రాణములందున్న వాడని చెప్పినందువలన యింద్రియములు ఆత్మ కాదని తేలుచున్నది "హృది" అనగా హృదయ మందు అనుటవల్ల ఇంద్రియాధిష్ఠాన దేవతలు గారని తేలుచున్నది. ఏలననగా యింద్రియాధిష్ఠాన దేవతలు ఆయా యింద్రియములందుందురు. గాని హృదయమందుండరు "అంతః" అనగా హృదయము లోపల అనుటచే విజ్ఞానమను శబ్దముచే చెప్పబడిన బుద్ధియును గాదు. ఏలననగా బుద్ధి హృదయమందేయుండును గాని హృదయములోపల యుండదు. "జ్యోతి" యని చెప్పుటవలన దేహేంద్రియాది జడ పదార్థముల కన్నిటికి ఉపాదాన కారణమైన అవ్యాకృతము ఆత్మకాదు. ఏలనన అవ్యాకృతము సర్వకారణమున్ను, సర్వాంతరమున్ను అయినప్పటికి జడమై నందున ప్రకాశ రూపమైన ఆత్మ కాదు. "పురుషః" అని చెప్పుటవలన

సర్వ దేహము లందు వ్యాపించియున్న పరిపూర్ణుడనుట సిద్ధించును. కనుక అంతఃకరణ మందు ప్రతిబింబ పరిచ్ఛిన్నత చెందిన చిదాభాసుడన్న పూర్ణుడు కాదు. కనుక ఈ చిదాభాసుడు ఆత్మకాదు. కనుక దేహేంద్రియములకంటే చిదాభాసునికంటే విలక్షణమై సర్వపరిపూర్ణుడై సర్వ ప్రకాశమై స్వభావముగా అవిద్యాకామ్యకర్మ వాసనాది సర్వబంధ శూన్యమై చిద్ధాతువు మాత్రము ఆత్మయని నిశ్చయింపదగియున్నది. కాని పరిపూర్ణరీత్యా ఆత్మా నాత్మలు రెండు విడదీయరానివి. శ్రీ కృష్ణదేసికేంద్రులవారు క.ప.।। 82. **"దేహమున కొంత నిజమని మోహంబున నిలుపుకొనటే మోసంబు గురుద్రోహమగును గ్రాన విడువుము మోహంబును మేల్కొన కలమునిగిన రీతిన్।।"** అనీ క.ప. 152 "తనువునే గాన నంటే। ఘన సుఖదుఃఖములు రెండు గనుపడెనీవై। గనుక తనవు నీ వొక్కటె। వినరా నామాట నిట్టి। వెర్రిన బడకన్"।। అని మరియు క.ద. 58 "తను వెరుకలు రెండొక్కటి యని యనరాదనుచు కొందరందురు భువిలో। తనువెరుకలలో నొక్కటి। గన రాకుంటేను। రెండు గనరావోయన్నా। రెండొక్కాటే వినరామాయన్నా" అని శెలవిచ్చియున్నారు. కావున తనువు ఆత్మవిడదీయరానివి, మరియు రెండు అశాశ్వతమే. ఎందుకనగా ఆత్మనుండి ఆకాశము వగైరాపుట్టినవి. అంటే పుట్టుక వున్నదానికి గిట్టుట కూడ యున్నదని సిద్ధాంతము. కావున ఆత్మకు పుట్టుకయున్నది కావున అశాశ్వతము. శరీరము ఆత్మ ఎరుకనే, అశాశ్వతమే. పరిపూర్ణము ఆత్మ శరీరములు లేనిది అని క్రింది శ్లోకము చెప్పుచున్నది.

**శ్లో।। అశరీరం సర్వదాస్తి శరీరం రహితంసదా**
**అయమేవ సద్యోముక్తి రన్యదాభ్రమకారణమ్।।**

అనగా శరీర మెన్నడును లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమే ఎల్లప్పుడున్నది. ఈ భావము దృఢమైన తక్షణమే సద్యోముక్తి. తక్కిన సిద్ధాంతములన్ని భ్రమ కారణములు అని భావము.

**2. ఇతి నిశ్చయ భావేన సమాధిస్తస్యలక్షణమ్ :** అనగా పై విధముగా బుద్ధినిశ్చయమయ్యేనేని అదే సమాధి లక్షణమని ఈ ఉవనిషద్వాక్యము ఉద్ఘాటించుచున్నది. పంచేంద్రియములచే శబ్దాది విషయములను గుర్తించినంతకాలము బుద్ధికి భేదజ్ఞానము సిద్ధించును. ఆ పంచతన్మాత్రల యేకైక రూపమగు బ్రహ్మవస్తువును అవలోకించినపుడు విషయజ్ఞానముగాని బేధజ్ఞానముగాని వుండజాలదు. అదే సమబుద్ధి అదే సమాధి. సృష్టి అంతా ద్వంద్వరూపమే. వస్తుదృష్టి చేత నానాత్వముగా దోచు సమస్తము కారణ దృష్ట్యాలేక ఆత్మ దృష్ట్యా అంతా ఆత్మయేగాని వేరు గాదు. అట్టి కారణ రూపమగు ఆత్మ స్వరూపమును గుర్తించినందుననే "తన యందు నిఖిల భూతములను నొక భంగి సమహితత్వంబున" అని ప్రహ్లాదుడు నుడువ గలిగెను. గీతలో జెప్పి నట్లుగా 13-28 **"సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం"** అనగా సర్వమునందు సమముగానున్న పరమాత్మను దర్శించిన వాడాతడు, అతడు మాత్రమే సుఖదుఃఖములను సమముగా చూడగల్గును. అట్టి స్థితియే సమాధి గాని ముక్కు బిగించుకొని గాలి మూట గట్టుట గాదు. గురు కృపచే అఖండాత్మ దర్శనము జేసిన వానికి యిట్టి సమాధి కరతలామలకమై యుండును. క్షణములో సమబుద్ధిని పూనునేర్పుగలిగియుండును. ఈ భావమునే ఇచ్చట స్పష్టముగా చెప్పబడినది.

**ఆగామి సంచితంచైవ ప్రారబ్ధంచాపిసంత్యజ।**
**జ్ఞానం శూన్యం సదాచైవ జన్మశూన్యం స్వభావతః** ॥౨౩॥

తా॥ ఆగామి, సంచిత, ప్రారబ్ధములనుకర్మత్రయములను విడువుము. ఎల్లప్పుడు జ్ఞానము శూన్యమైనది. అట్లే జన్మయు స్వాభావికముగా శూన్యమైయున్నది.

**1. ఆగామి సంచితంచైవ ప్రారబ్ధం చాపి సంత్యజ :** ఆగామి, సంచిత ప్రారబ్ధకర్మ ఫలములను వదలుము.

కర్మ ఫలము మూడు విధములు : 1) సంచితము 2) ప్రారబ్ధము 3) ఆగామి

**1. సంచితము :** గడచిన జన్మ జన్మాంతరములలో చేయబడిన కర్మల యొక్క పుణ్యాపాప ఫలములు అనుభవించుచు రాగారాగా యీజన్మలో అనుభవించుటకు నిర్ణయమైనది కూడా పోను శేషించిన కర్మఫల రాశియే సంచిత మనబడును.

**2. ప్రారబ్ధమనగా :** తల్లి గర్భమందు పడినదాది దేహమును వీడి మరణించు పర్యంతము అనుభవించుటకు నిర్ణీతమైన సుఖదుఃఖ రూప కర్మఫలము ప్రారబ్ధమని యనబడును.

**3. ఆగామియనగా :** జన్మాది మరణ పర్యంతము యీజన్మలో చేయబడుతువున్న కర్మల యొక్క పుణ్యాపాపరూప అదృష్టఫలము ఆగామి యనబడును. దృష్టఫలము మాత్రము ఈ జన్మలోనే అనుభవించుట ప్రత్యక్షముగా చూచుచునే యున్నాము.

జ్ఞాని అయిన వానికి ఆగామి సంచితములు రెండు జ్ఞానోదయ సమకాలమందే నశించునని కొందరందురు. కాని

శ్లో॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ ॥భ.గీ.4-37॥

తా॥ మండుచున్న అగ్ని కట్టెలన్నిటిని యెట్లు భస్మ మొనరించునో, అట్లే జ్ఞానాగ్ని సమస్త కర్మలను భస్మము జేయును. అజ్ఞాన కార్యములను ఆగామి సంచిత ప్రారబ్ధములు మూటిలో రెండు మాత్రమే పోయి ఒకటి నిలిచి యుండునా? మరియు నొక రాజు మరణించినచో అతని ముగ్గురు భార్యలలో నొకతే మాత్రము ముత్తైదువుగా నుండజాలదు, అట్లే కర్మత్రయ విక్షేపమునకు స్థానమై వ్యష్టి సమిష్టి రూపంగా నుండు అంతఃకరణము నశించినచో ఆగామి సంచిత ప్రారబ్ధములు మూడున్ను అంతఃకరణతో పాటే నశించుచున్నవి గాని అందొక్కటి నిలిచి యుండజాలదు.

సుఖదుఃఖములను అనుభవించునది మనస్సు. స్థూలదేహమునందు యెట్టి వ్రణాదులు కలిగిన వాని బాధననుభవించునది స్థూలదేహముగాదు. మనస్సే. అందువలననే నిద్రకాల మందునూ, మత్తు మందిచ్చిన పిమ్మట స్థూలదేహము అందున్న దుఃఖ కారణములగు వ్రణాదులు యుండినను దుఃఖము మాత్రము కలుగుట లేదు. సుఖదుఃఖాదాలను అనుభవించు మనస్సు తత్కాలమందు పనిచేయక మగ్నత చెంది యుండుటయే యిందుకు కారణము. కనుక జ్ఞాని జాగ్రతవస్థయందున్నను తన ఆత్మ నిశ్చయ జ్ఞానమును వీడక స్వరూప లక్షణ మందే యుండుటచే దుఃఖాదు లాతడు అనుభవించుటయే లేదని చెప్పనగును. దుఃఖ కారణములు అతని శరీరముపైన ప్రత్యక్షముగా గానవచ్చుట చూచి అవి అతనిని బాధించుచున్నట్లు లోకులు తలంచుట మాత్రమేగాని, నిజముగా యోచిస్తే ఆగామి

సంచితములతో పాటు జ్ఞానికి ప్రారబ్ధము కూడలేదు. మరికొందరు.

శ్లో॥ ప్రారబ్ధం భోగతే నశ్యేత్, తత్వజ్ఞానేన సంచితం।
ఆగామి ద్వివిధం ప్రోక్తం తద్వేషీ ప్రియ వాదినౌ॥ అంటారు.

ఇదియు సరికాదు. ప్రారబ్ధము అనుభవించుటవల్ల పోవును. సంచిత తత్వజ్ఞానమువల్ల నశించును. ఆగామినశించుటకు ఆ జ్ఞానిని భూషించువారు మరియు దూషించు వారుంటేనే నశించునని ఇచ్చట పేర్కొనబడినది. అంటే జ్ఞాని యొక్క ముక్తి పరులపై ఆధార పడినదని అర్థమగుచున్నది. దూషించి, భూషించువారు లేకుంటే జ్ఞానికి ముక్తిలేదని అనుపించుచున్నది.

శ్లో॥ కర్మణ్య కర్మయః పశ్యేత్, అకర్మణిచ కర్మణి।
సబుద్ధి మాన్మేను ష్యేషు సయుక్తః కృత్స్న కర్మకృత్॥ భ.గీ. 4-18

తా॥ కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను, చూచుచు కర్మచేయువాడే బుద్ధ యోగమును తెలసిన యోగి బుద్ధి యోగమనగా జ్ఞాన యోగమే.

**శ్లో॥ బుద్ధి యుక్తో జహాతీహఉభే సుకృత దుష్కృతే।**
**తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మ సుకౌశలం** ॥భ.గీ. 2-50

తా॥ బుద్ధి యోగముతో గూడినవాడే లోకములోనే పుణ్య పాపములను రెంటిని విడుచుచున్నాడు. అందువలన నీవట్టి యోగమునకై సిద్ధపడుము. కర్మయందు కుశలత్వమే యోగము. కర్మచేయుటలో నేర్పుసంపాదించిన వాడేయోగి.

కనుక బ్రహ్మాఽ పరోక్షజ్ఞానము చెంది, కర్మయందకర్మను చూడ గలిగిన నేర్పుతో కర్మచేయు యోగియే జ్ఞాని, అట్టి జ్ఞాని చేయుకర్మ ఆగామి రూపకర్మఫలము నుత్పత్తి చేయజాలదు. కనుక అట్టి జ్ఞాని విషయములో ఆగామిరూప కర్మఫలము లేదు. కర్మత్రయము నుండి విడువబడినవాడై అట్టి జ్ఞానియే జన్మ రాహిత్యమును పొందగలుగుచున్నాడు. కనుక వార్తీకమీ కర్మత్రయ రాహిత్యమును ప్రతిపాదించుచున్నది. కనుక ఈ మూడింటిని వదులుము.

**2. జ్ఞానం శూన్యం సదాచైవ:** జ్ఞానము శూన్యమైనది. గుర్తెరుగునదే జ్ఞానము. జ్ఞానమే పరమాత్మ, పరబ్రహ్మ స్వరూపము. అంతః కరణ పరిణామ రూపమగు జ్ఞానము అను యింద్రియము యుక్తాయుక్త, నిత్యానిత్య, ఆత్మా నాత్మ, వివేకయుతమైనపుడే దాని నామము సార్థక్యత గాంచుచున్నది.

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్వజ్ఞానార్థదర్శనం।
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞాన్ యదతోఽన్యథా॥

భ.గీ. 13-12

తా॥ నిత్యమనునది ఆత్మ యొక్కటే యని యెరిగి ఆత్మతత్వము యొక్క సాక్షాత్కారము పొందుటయే జ్ఞానము గాని మిగతా అంతయు అజ్ఞానవే యని భావము. **"సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మనీ"** అనగా తనయందు సర్వభూతములను, సర్వభూతములనందు తనను చూడగల్గుటయే జ్ఞానం. ఇట్టి జ్ఞానం మానవులందు మాత్రమే సాధ్యము. జ్ఞానేంద్రియ గోచరమగు సమస్తము పరమాత్మ స్వరూపమే అను ఆరూఢ జ్ఞానముగాని, శాస్త్రజన్యజ్ఞానము కాదు.

జ్ఞానమంటే ఏమో తెలుసుకొన్నాము. ఇప్పుడు జ్ఞానము శూన్యమెట్లో గమనిద్దాము.
క.ప.॥123॥ ఎరుగుట జ్ఞానము తానను। జరిగేపని కర్మమనుచు జనులెన్నిరియా।

యెరుకయు కర్మయు లేనిదే। పరిపూర్ణము వీటినీవు బట్టకు మెపుడున్॥

అనగా ఎరిగే ఎరుక జ్ఞానమని, కర్మేంద్రియముల చేత చేయు పనులు కర్మని జనులు నిర్ణయించినారు. యెరుక యగుజ్ఞానము కర్మేంద్రియముల చేత జేయు కర్మ లేనిదే అచల పరిపూర్ణ పరబ్రహ్మము. గనుక జ్ఞానకర్మ పద్ధతుల యందు అస్తి నాస్తిక బుద్ధి నీకు అవసరము లేదు మరియు కం॥ 124 "జ్ఞానంబు సత్వగుణమను। దానికి జన్మించె" నని **"సత్వాత్ సంజాయతే జ్ఞానం"** అనగా సత్వగుణోద్భవమైనది జ్ఞానమని శ్రీకృష్ణుడు అర్జునునికి జెప్పియున్నాడు. గనుక జ్ఞానాదులు జ్ఞానము వల్ల కలుగునని తెలుసుకొనుము. మరియు "పుట్టింది గిట్టు జ్ఞానము। పుట్టెననుచు" అనగా శ్రీకృష్ణుడు జ్ఞానమునకు పుట్టుక కలదని అర్జునునకు దృఢముగా జెప్పియున్నాడు. గనుక పుట్టిన జ్ఞానము గిట్టుట యున్నదని యనడములో ఏలాంటి సందేహము లేదు. పుట్టుక గల జ్ఞానము ప్రజ్ఞానం బ్రహ్మయని, అహం బ్రహ్మాస్మియని, తత్త్వమసి బ్రహ్మమని, అయమాత్మ బ్రహ్మమని వార్తీక పద్ధతానుసారము బ్రహ్మమే తానను కున్నంత మాత్రమున జనన మరణ భ్రాంతి తొలగబోదని భావము. కావున జ్ఞానం శూన్యమని నిర్ణయము.

**3. జన్మశూన్యం స్వభావతః :** అనగా స్వాభావికముగా జన్మలేదని అర్థము. ఇట్లనుటను ఎవరు ఒప్పుకోరు. కాని పుట్టుట చచ్చుట వున్నట్లు భ్రాంతిచే తోచడం వల్ల పుట్టిందన్నారు. ఎండ మావులలో నీరు తోచినట్లు పరమాత్మ నిజంగా పుట్టనే లేదు. పుట్టనిది గిట్ట బోదు అనునది పరమ సిద్ధాంతము. కార్యకారణ పరంపర రూపముగా చక్రాకృతిలో పరిభ్రమించే ఎరుక పరిపూర్ణమందు పుట్టనే లేదు. పుట్టించుటకు మరొకటిలేదు. కనుక ఎరుకకు పుట్టుక చావులు లేవు. కార్యకారణములు రెండు గాక తాను తప్ప రెండవదియే లేని కేవల పరిపూర్ణ పరబ్రహ్మమునకు పుట్టుక చావులు లేవు. ఎరుకకు పుట్టుక చావులు లేవు. పరిపూర్ణమునకు పుట్టుక చావులు లేవు. కనుక రెండు ఒకటే యని యేల అనరాదు? అంటే, ఎరుక కార్యకారణ పరంపరలో చేరి నిరంతర పరిణామశీలమై ఎప్పుడు ఏకరీతిగా నుండుట లేదు. కనుక అనిత్యమై యున్నది. మార్పుచెందుచున్నది. కనుక మాయయై యున్నది మరియు చలన శీలము కలదై చలించుచున్నది. అన్నిటికి తానే కారణమై తనకన్యకారణము లేనిదై అనగా మూలము లేనిదై యున్నది. ఎండమావుల వలె తోచబడుట మాత్రమే కాని సత్యము కానిది. ఖండా ఖండములు ఏకానేకములు సర్వస్వగత భేదములు కల్గియున్నది. పరిపూర్ణమట్లుగాక కార్యకారణములు గాక సత్యమై నిత్యమై అచలమై సర్వద్వంద్వ రహితమై కేవలమై యున్నది. అది యిది కాదు, ఇది అది కాదు అని శ్రీ శివరామ దీక్షిత సిద్ధాంతము.

విశ్వము నందు సమస్తము సాపేక్షికమైనది. జనన మరణములు కూడ సాపేక్షికములే. కనుక జన్మ భావము కలిగినప్పుడు మృత్యుభావము స్ఫురించును. సర్వము పూర్ణముగా నిండి నిబిడీకృతమైయున్న పరిపూర్ణ పరబ్రహ్మము నందు జనన మరణములకు, రాకపోకలకు మరెట్టి భావాభావములకు తావులేదు. అందేదియూ పుట్టనే లేదు. లేనప్పటికి వున్నట్లు తోచబడినదని చెప్పుటకైనా కనీసం వీలు లేదు. **దేనికి భ్రాంతి కలిగినదో అదియే లేనప్పుడు పుట్టినదనిగాని తోచిన దనిగాని ఏ మాట పలుకుటకు సావకాశంలేదు.** కనుక **"మాటయే మాయ అన్నారు** శ్రీకృష్ణదేశికేంద్రులవారు. పరిపూర్ణబోధ గురుకృపచే నారూఢ

పరుచుకొన్నవానికి ఈ ఎరుక యందలి భ్రాంతి మహా శూన్యమై నశించుచున్నది. కేవల పరిపూర్ణమందు నేననే వృత్తి ఎన్నడు లేదు. పుట్టనినాకు మరణమెట్లుండును. పరిపూర్ణమందు పుట్టను లేదు, చావును లేదు. నా హృదయమందు నా గురు ధ్యానము చేయుట చేత పరిపూర్ణమందు నేను పుట్టనే లేదని భావము. **శ్లో॥ సర్వశూన్యమయం రూపం। జన్మ శూన్యం స్వభావతః। జన్మ భావేన మృత్యుశ్చ। పరిపూర్ణం స్వభావతః ॥** అనగా ఈ రూపమంతయు పూర్తిగా లేనిదే. స్వాభావికముగా పుట్టుకలేనిది. జన్మయున్న దని భావిస్తే మృత్యువునకు మూలమగుచున్నది. పరిపూర్ణ మొక్కటే స్వతసిద్ధమైనది, సత్యమైనది. నీవు జన్మించలేదనే భావము నీ గురువు ద్వార దృఢమైతే నీ జన్మ సఫలమైనట్లే. నా హృదయమందు నా గురు ధ్యానము చేయుటచేత అప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించుచున్నది. కాని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు **"లేనేలేనని నే లేకపోయిన వెనుక తానుండుగదా"**। అనిశిష్యుడంటే, **"వుంటే దాన్నె టైరిగెదవీవు"**। అంటూ **"దానిని నీవుండి కనుగొని చనందగు మండిత సత్కీర్తిసాంద్ర మానవ చంద్రా!"** అన్నారు. సర్వము పూర్ణము. ఆ పరిపూర్ణమందు సర్వ శూన్యం యెరుకే. కావున జన్మస్వాభావికముగాలేదు.

**దృష్టింజ్ఞాన మయీంకృత్వా తత్ జ్ఞానంచ విసర్జయ**
**యస్యజ్ఞాతం విశిష్యేత సర్వే జ్ఞానస్య జాయతే** ॥౨౮॥

చూపును (దృష్టిలేక దృక్కును) జ్ఞాన మయముగా జేసి పొందిన జ్ఞానమును విడిచి పుచ్చుము. ఎవనికి జ్ఞానము శేషించి యుండునో అన్నియు అతనికే కలుగు చుండును.

**వివరములు :**

**1. దృష్టిం జ్ఞాన మయీం కృత్వా :** దృష్టిం అనగా చూపు, కన్ను, బుద్ధి, దర్శనము అని అర్థములు. ద్రష్ట, దృక్కు, దృశ్యము అనుత్రిపుటి యందు దృక్కే దృష్టిగా యెంచవలయును. సకల బాహ్యేంద్రియముల దోచునటువంటిది వెలిచూపు. అంతర్దృష్టి యనగా సకలము అయిన అంతరేంద్రియార్థముల దోచునట్టి లోచూపు. మనస్సు బాహ్య విషయముల నుండి విడివడి అంతర్ముఖమై బుద్ధిచే నేను ఎవరు అని నిశితముగా పరిశీలించుటయే ఆత్మ విచారము లేక దృష్టిజ్ఞానమయం చేయుట. జ్ఞానము అనగా సామాన్యార్థం తెలివి ఈ తెలివితోనే మానవుడు శాస్త్ర జ్ఞానమును సంపాదించుచున్నాడు. బ్రహ్మ చైతన్యము బ్రహ్మాకారవృత్తి, స్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తాను తానై యున్న స్థితి యని విశేషార్థములున్నవి. సామాన్యార్థములో ఈ జ్ఞానము సకల ప్రాణుల యందే గాక జడములని నిర్ణయించిన పదార్థములందు కూడ నేదోరూపములో నున్నది. ఈ జ్ఞానం శబ్దతన్మాత్ర యొక్క పరిణామమే. శబ్దము వాక్కు అని వ్యవహరించుచు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీ అను చతుర్విధములుగా చెప్పబడినవి. సకలము నందు ఏదో రూపములో నిండియున్నది. పరమాత్మ యందు లేశ రూపముగా ఘనీభవించియున్నది. కనుక అది కేవల నిశ్శబ్ద బ్రహ్మమైన పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. ఈ జ్ఞానము ఏదో రూపములో జ్ఞానాజ్ఞానముల చెంది సర్వమును గుర్తించుచూ క్రియ కారకమైన కర్మ సంస్కారములను ప్రోగు చేసుకొని బంధకారణమగుచున్నది. అట్లు గాక తన సంగతి, తనమూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వస్వరూపసాక్షాత్కారము పొందగలడు. తన స్వరూపసాక్షాత్కారమును పొందుటయే ఈ శ్లోకమున, చూపును జ్ఞానమయంగా జేయుట.

**2. తత్జ్ఞానంచ విసర్జయ :** ఆ జ్ఞానముకూడ విడువుము అని ఈశ్లోకము జెప్పుచున్నది. విసర్జయ అనగా విడుచుట. భౌతిక వస్తువులను చేతులతో పట్టి విడువ వచ్చును. జ్ఞానము భౌతికము కాదుగదా! ఎట్లు విడువ వలయును? కంటికి కానరాని భాతిసిద్ధ పదార్థములను విడుచుట ఎట్లు? సూక్ష్మము సూక్ష్మము చేతనే పరిహరించవలెను. ఆ భావన ఈ క్రిందిశ్లోకమున చెప్పబడినది.

శ్లో॥ జ్ఞానమజ్ఞానినం దుష్ట్వా ద్వయోస్త్వజిత నిశ్చయం
ద్వయోస్త జతియత్ జ్ఞానం తతే జ్ఞానంచ పరివ్యజేత ॥

ఇచ్చట **"ద్వయోస్త జతియత్ జ్ఞానం"** అనగా ఏజ్ఞానము విడుచుచున్నదో ఆజ్ఞానము కూడ విడువ వలెనని చెప్పబడినది. అనగా జ్ఞానాజ్ఞానములను ఏజ్ఞానము విడుచుచున్నదో ఆజ్ఞానమును కూడ విడువవలెనని చెప్పబడినది. అంటే జ్ఞానజ్ఞానములు విడిచేవస్తువు కూడ జ్ఞానమే అని స్పష్టమయినది. అనగా జ్ఞానమును, అజ్ఞానమును సూక్ష్మరూపమగు జ్ఞానము తోనే విడువ వలయును.

జ్ఞానాజ్ఞానములు ద్వంద్వ రూపముగా కానవచ్చినను **"జ్ఞానా జ్ఞానంబులు యీ జ్ఞానంబువే కాని వేరు గావెన్నటికి"** క.ప.॥89 "అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు సెలవిచ్చిన రీతిగా విభిన్న కోణములలో రెండుగా తోచబడుచున్నవేగాని, రెండు ఒకే వస్తువునకు సంబంధించినవై యున్నవి. అనగా ఒకేజ్ఞానము జ్ఞానాజ్ఞానములుగా తోచబడుచున్నవన్న మాట. అట్టి భేదము నామ మాత్రమే. కనుక ముందుగా నామ మాత్ర భేదము తొలగించి ఏక మాత్రమగు జ్ఞానము మార్పుచెందు స్వభావము కలదగుటచే **"యా మాసామాయా"** అనగా ఏది మార్పు చెందుచున్నదో అది మాయ యనగా లేనిదని నిశ్చయించి దానిని విడువవలయును. సత్యా సత్యములు రెండును గుర్తెరిగి పారమార్థిక సత్యమగు పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క నిశ్చయమైనతదుపరి ప్రాతిభాసిక సత్యమగు ఈ అఖండ జ్ఞానము స్వస్వరూపజ్ఞానము లేనే లేదని నిశ్చయించి దానిని విడువవలయును.

**3. యస్య జ్ఞాతం విశిష్యేత సర్వేజ్ఞానస్యజాయతే :** ఎవరికి జ్ఞానము శేషించియుండునో అన్నియు నతనికే కలుగుచుండును. పై వివరణలో జ్ఞానమనగా అఖండ జ్ఞాన స్వరూపమైన బ్రహ్మమే, అది సృష్టి కారణమైనది. అదే బంధకారణమైనది. అది శేషించి యున్నచో జన్మ సంచర ప్రతిసంచర పద్ధతిలో జరుగును. ఈ జన్మలో చేసిన పుణ్యాపాప కార్యములవల్ల దుష్ట మరియు శిష్ట సంస్కారము లేర్పడి తిరిగి జన్మకారణమగును. "పునరపి జననం" యను న్యాయమున ఘోర సంసార వారాసిలో మునుగుతు తేలుతు సుఖదుఃఖము లనుభవించ వలసి వచ్చును. నిజమైన మోక్షము లేనేలేదు. కావున పరిపూర్ణ సద్గురువుల సన్నిధి జేరి, పరిపూర్ణము, ఎరుకలను గూర్చి తెలుసుకొని ఎరుకను విడుచుట వల్ల తిరిగి జన్మరాకుండ చూచు కొనవలయును.

**తస్మాత్సర్వంపరిత్యజ్య పూర్ణమేవావశిష్యతే**
**చిదాకాశం మహాకాశం ఆకాశంచ ద్వితీయకమ్** ॥౨౯॥

తా॥ అందువలన సర్వము అనగా అహం లేక సర్వము నెరుగునట్టి ఎరుకను విడిచిన పరిపూర్ణ పరబ్రహ్మమే శేషించి యుండును. చిదాకాశము, మహాకాశము అని ఆకాశము రెండు విధములు.

**వివరములు :**

**1. తస్మాత్సర్వం పరిత్యజ్య పూర్ణమేవావశిష్యతే** :ఈ శ్లోకము నందు సర్వమును వదులు మన్నారు. ఇచ్చట సర్వము అనగా సర్వమును ఎరుగునట్టి జ్ఞానము. అదే అహం, నేను, ఎరుక. శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ప.॥128 జ్ఞానము నేనన నొక్కటే । జ్ఞానమునే వేరటంచు । గనబోకుసుమీ॥ జ్ఞానము వచ్చును పోవును॥ జ్ఞానాతీతమును తాను॥, గాంచిన దాకన్ "॥. అని సెలవిచ్చియున్నారు. జ్ఞానమనగా తెలుసుకొనే తెలివి యని, మోక్ష విషయక బుద్ధియని ఎరిగే ఎరుక యని చెప్పబడును. గనుక నేనన్న, జ్ఞానమన్న ఒక్కటే, వేరుకాదు. కనుక జ్ఞాన మని యన్నా, నేనని యన్నా, వేరేయని తెలియక ఒక్కటే యని తెలిసికొనుము. జ్ఞానమునకు అతీతమగు అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొనునంత వరకు ఈ జ్ఞానమగు నేను పుట్టుచు గిట్టుచు యుండునని భావము.

**"పరిపూర్ణములో దోచిన యెరుకేకల"** అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. **"యెరుక యను కలలో పురుషుని కెరుకే ఈ విశ్వమగుచు నేర్పడు కలగా"** అని అంటూ ఎరుక విశ్వము ఎట్లు తోచునో తమకందార్థములో జెప్పియున్నారు. 'అహం' శబ్దముచే చెప్పబడిన ఆత్మ వస్తువే యీ ఎరుక అనే కలలో పురుషునికి కలరూపముగా దోచబడినదే ఈ విశ్వము. ఇట్టి ఎరుక విశ్వముతో గూడిన జగత్తు సత్యము గాదని చెప్పుటకు ఎవరు సాహసించగలరు.

జనన మరణ రాహిత్యమే మోక్షముగాని, ఆత్మసాక్షాత్కారము మోక్షముగాదు. జనన మరణములు పొందువాడు లేక కర్త ఎవరు? పొందింపజేయు కారయిత ఎవరు? వీరిర్వురు భిన్నులా? సృష్టికి పూర్వమున్నదే సృష్టి కారణము కర్త, కారయిత రెండు అదే. పూర్ణనాభి (సాలెపురుగు) అని పూర్ణభావజ్ఞులు అర్థము చెప్పుతారు. అది అభిన్ననిమిత్తోపాదకారణమై యున్నది. దానిని కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థములో క.ద. 50 **"అన్నియు తానై । తనకవి । పన్నుగ వేరనుచునోట బలుకుచు । మరితా నన్నిటి యెరిగె । ఎరుకై యున్నావని ఎరుకే నెరుక నూహింపుచుండూ॥ తనలో తానే మోహింపు చుండూ".** అంటూ వివరించినారు. కనుక జనన మరణములు పొందుటకు, పొందించుటకు, అత్యంత మూల కారణమై యున్నది, ఈ అధిష్ఠాన చేతన బ్రహ్మము లేక ఈ అహంపదార్థమే. ఈ మూల కారణమే సత్యము, నిత్యము, అదే మోక్షస్థానము అంతకంటే ఏమిలేదు అనుకొన్న వారికి ఆ యెరుక యొక్క పరిణామ రూపమగు సృష్టియు, అసృష్టియందు గల తన ఉపాధిన్ని సత్యములు, నిత్యములు కావలసియుండును. ఇక జనన మరణ రాహిత్యమనునది కలలోని వార్తయే యగును. పూర్ణనాభి యున్నంత వరకు అది దారమును సృష్టించుచునే యుండును. మరల హరించుచునే యుండును. అది దానికి సహజమైన స్వభావమున్నట్లే సర్వమునకు సర్వములో చేరియున్న తన వ్యష్ట్యోపాధికి అత్యంత మూలకారణమగు యెరుక (అహంపదార్థము) సత్యమని భ్రాంతి యున్నంత వరకు జనన మరణ రహితంకాదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు యెరుకకు స్థానము గాని వున్నదనే భ్రాంతి యున్నంతవరకు జన్మరహితం కాదు. ఎరుకే భ్రాంతి, భ్రాంతి రహితమే మోక్షము అని పెద్దలన్నారు. **పరిపూర్ణమందు ఎరుక పుట్టనే లేదు అని క్షణమైన మరువకయుండు మన్నారు అచల ఋషులు.** కనుక విడువవలసినది నేను అనే (అహం అనే) భ్రాంతినిమాత్రమేనని, ఎరుక యందలి భ్రాంతిని వదలుటయే సర్వమును వదలినట్లని తెలియవలెను.

సభాసదుల నుద్దేశించి నిండుసభలో "మీరెవరైన మోక్షమునకు పోగలరా? అని శ్రీకృష్ణదేవరాయలు ప్రశ్నించగా, ఎవరు బదులు చెప్పుటకు సాహసించలేదు. తెనాలి రామకృష్ణుడు మాత్రము లేచి నిలబడి **"నేను పోతే పోవచ్చును"** అని సమధాన మిడెనట. ఇంత సాహసము ఇతనికి కెట్లు వచ్చెనా యని అందరు అబ్బుర పడుచుండిరి. కాని **"నేను పోతే"** అని రెండు మాటలను చేర్చి చదువుకొని రాజు ఆ అర్థగాంభీర్యమునకు ముగ్ధుడయ్యెనట.

అట్లే ఆంగ్లము నందొక చమత్కార వాక్యములో ప్రశ్నోత్తరములు రెండు యిమిడియున్నవి "When shall I cease to be?" అనగా నేనెప్పుడు లేకుండా పోతాను? అంటేనాకు జన్మరాహిత్యమెప్పుడు కలుగును? అనే ప్రశ్నకు ఆమాటలనే కొద్దిగా క్రమము మార్చితే "When I shall cease to be" అగును. అంటే **"నేను"**.అనేది లేకుండ పోయినపుడు జన్మ రహిత మగునని అర్థము సిద్ధించుచున్నది. పైవివరణ వల్ల సర్వమును వదలవలసినది తేట తెల్లమైనది. కావున సర్వము వదిలిన అనగా నేను (అహం) లేనప్పుడు శేషించునది పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియవలయును.

**2. చిదాకాశం మహాకాశం ఆకాశంచ ద్వితీయకమ్ :** అనగా చిదాకాశము, మహాకాశమని ఆకాశము రెండు విధములు.

**శ్లో॥ స బాహ్యాభ్యన్తరస్థోయః సతాసత్తావ బోధకః**
**వ్యాపీ సమస్త భూతానాం చిదాకాశః సఉచ్చతే** ॥ శ్రీ వసిష్ఠగీత. అ. 5-15.

అనగా బాహ్య పదార్థములందును, అభ్యంతర మనోబుద్ధ్యాదులందును గూడ స్థితిగలిగి యున్నదై వానిరాకపోకల నెరుగుచు సాక్షియై యున్నదియు సమస్త భూతములందును వ్యాపించియున్నదియు చిదాకాశము (ఆత్మ) అని చెప్పబడును ఆత్మయనగా సకల ప్రాణులయందు బాహ్యాభ్యంతరములు లేకుండ వ్యాపించి యున్నదని వ్యుత్పత్త్యర్థము.

యాజ్ఞవల్క్య జనకునకు నొక్కవాక్యములో ఈ ప్రత్యగాత్మ స్వరూపమును తెల్పిన ఈ బృహదారణ్య శ్రుతి భావమును పరిశీలింతము "యోయం విజ్ఞాన మయః ప్రాణేషు హృద్యం పర్జోతిః పురుషః" దేహేంద్రియాదులకంటే తదిష్ఠాన దేవతలకంటే, బుద్ధికంటే అవ్యాకృతము కంటే చిదాభాసుని కంటే విలక్షణమై సర్వపరిపూర్ణమై సర్వప్రకాశమై స్వభావముగా అవిద్యా. కర్మవాసనాది సర్వబంధ శూన్యమైన చిద్ధాతువుమాత్ర మాత్మయని నిర్ణయింప దగియున్నది.

అధిష్టానచేతనబ్రహ్మము దాని యందు శబ్దము బీజరూపముగానున్నవి. దానినే పరావాక్కందురు. నిశ్శబ్దమనగా కేవలం పరావాక్కు కూడలేనిది కాదు. పరాకాశమని, మహాకాశమని తానుతానై యున్న ఆ ఆత్మనే వర్ణించియున్నారు. అనగా సృష్టికామన "సోఽకామయతబహుష్యాం ప్రజామే యేయేతి" అను సృష్టికామన కలుగక పూర్వము ఏబ్రహ్మమైతే యున్నదో అదే మహాకాశము. అట్లు సృష్టి కామన కలిగి సమస్తమును సృష్టించి అందుతాను అనుప్రవేశము జేసి ఈ సృష్టికంతటికి అధిష్ఠానము ఆధారమైన బ్రహ్మమునకే మహాకాశమని అందురు.

**శూన్యం కృత్వాచిదాకాశం మహాకాశ మవాప్నుయాత్**
**భావాభావద్వయంత్యక్త్వా నిరాకాశస్థితిర్భవేత్** ॥30॥

చిదాకాశ (ఆత్మ) మహాకాశములలో (అధిష్ఠాన చేతన బ్రహ్మమును) శూన్యముగా నొనర్చి మహాకాశమును బొందవలెను. భావాభావముల రెంటిని వదలిన నిరాకాశస్థితి గలుగును.

**వివరములు :**

**1. శూన్యం కృత్వా చిదాకాశం మహాకాశ మవాప్నుయాత్ :** అనగా మహాకాశమైన అధిష్ఠాన చేతన బ్రహ్మములలో చిదాకాశమైన ఆత్మను శూన్యము జేసిననేగాని మహాకాశమును పొందలేము. చిదాకాశమును శూన్యము జేసినపుడే మహాకాశము పొందుటకు అవకాశమున్నది. ఎట్లనగా ఆత్మనే (చిదాకాశమే) అన్నిటిని జేయుచున్నది. అదే చూస్తున్నది. అదే వింటున్నది, అదే రుచి రూస్తుంది, స్పర్శానందమును పొందుచున్నది. ఈ పనులు జరుగుటలో మనకున్న పంచేంద్రియములు కేవలము పనిముట్లు మాత్రమే. ఒకవస్తువును చూడవలయునన్న ఆవస్తువునుండి వెలువడు ప్రకాశము కంటియందు పడుతుంది. కంటి ద్వారా ఆ ప్రకాశము ఆత్మ యందు (మనస్సునందు) చేరును. అట్లు చేరునపుడు ఆ మనస్సు ఆ వస్తురూపము దాల్చును. అపుడే ఆ వస్తువు మనకు అగుపడును. సత్యా సత్యనిర్ణయము జేసి సత్యమును గుర్తించు జ్ఞానమును శుద్ధ మనస్సు, అతీంద్రియ మనస్సు లేక స్వవశీయ మనస్సుకు గలదు. అట్టి సత్యాసత్యముల నిర్ణయించుటకు తగిన శుద్ధత్వము లేనపుడు అనగా మలిన సంస్కార యుతమైనపుడు ఆ మనస్సును అజ్ఞానమని పిలువబడుచున్నది. శుద్ధమైన మలినమైన ఆ మనస్సే కనుక జ్ఞానము కూడ మనస్సేనని చెప్పబడుచున్నది. మనస్సుచేతనే సర్వప్రతీతి యగుచున్నది, సమస్తము గోచరించుచున్నది. **"మనోహిజతువత్"** అనగా మనస్సులక్కవంటిది. కరిగిస్తే అది యేరూపమైన దాల్చుటకు సమర్థవంత మగును. అట్లే మనస్సు ఏవస్తువునందు లగ్నమైన ఆవస్తు రూపము దాల్చును. ఏవస్తువు అయినను మనస్సుకు గోచరమైనదని చెప్పితే అట్లు గోచరించిన కాలమున మనస్స్వరూపం వహించే నన్నమాట. మనస్సు బ్రహ్మాకారమైనపుడు అది బ్రహ్మము యొక్క రూపమే అగుచున్నది. అంటే ఆ సమయమున మనస్సు (ఆత్మ) ఇంద్రియ సన్నికర్షణ జ్ఞానము నుండి విడివడి శూన్యమైనదని చెప్పవలయును. అట్లు శూన్యమైనప్పుడే మనస్సు మహాకాశ రూపమును అనగా బ్రహ్మాకార రూపమును వహించును. ఇదే ఆత్మ సాక్షాత్కార స్థితి లేదా సమాధి స్థితియని గుర్తించవలయును.

శ్లో॥ ఖ మధ్యేకురు చాత్మన మాత్మ ధ్యేచ ఖంకురు
ఆత్మానం ఖమయం కృత్వానకిఞ్చిదపిచిన్తయేత్ ॥ఉ॥గీ॥ 1-10

తా॥ ఆకాశమందంతట వ్యాపించిన దానిగా ఆత్మనుల్లగించి ఆ యాత్మ యందంతటను వ్యాపించి యున్నదానిగా ఆకాశమును ప్రతిష్ఠించి (అనగారెంటిని ఒకటిగా జేసి) పిమ్మట యితర మైనదానిని కొంచమైనను తలంచకుము. అపుడు స్వస్వరూపముతో స్తబ్ధచిత్తుడవై నిలిచి పోవుదువు.

మరియు 'ఖ' శబ్దముచే బ్రహ్మము చెప్పబడినది. ఖంబ్రహ్మ అనీ **"ఆకాశశ్శరీరం బ్రహ్మ"** అని శ్రుతులన్నవి. ఆత్మ శబ్దముచే జీవుడు చెప్పబడెను. జీవ బ్రహ్మలనేకముగా నెరిగి ధ్యానింపుమని ఈ ఉత్తరగీత శ్లోకము జెప్పుచున్నది.

నీకు బయట నున్న ఆకాశమే శరీరముగల బ్రహ్మము నందు, నీమనోరూప జీవాత్మను లగ్నము చేసినను సరే, లేదా నీలోపలనున్న మనోరూప జీవాత్మయందు అత్మను ప్రతిష్ఠించినను సరే అని చెప్పుటకే 'ఖ' మధ్యకురు చాత్మనం "అనికూడ ఆగకుండ ఆత్మమధ్యేచ ఖంకురు" అని ఈశ్లోకము చెప్పుచున్నది. మరియు ఆత్మ యందాకాశము, ఆకాశము నందాత్మయు

ఓతప్రోతమై ఆత్మాకాశములు వస్త్రమునందలి పడుగుపేకవలె నున్నవని గ్రహించవలయును. క్లుప్తంగా జెప్పాలంటే మనస్సును నిరాస్పదమైన దానిగా జేసి (శూన్యంగావించి) నిశ్చలత్వమును గుర్తెరుగు మంటుంది ఈ ఉపనిషద్వాక్యము.

**2) భావాభావద్వయం త్యక్త్వా నిరాకాశ స్థితిర్భవేత్ :** భావాభావములను వదలి నిరాకాశ స్థితి బొందు మని అర్థము. మొదట భావాభావములను గురించి తెలుసుకొందము. భావమనగా తలంపు, ఆలోచన అని సామాన్యార్థము, విశేషార్థములో సత్త, అస్తిత్వము (ఉనికి) కలిగియున్న పదార్థములన్నియు భావపదార్థములు, నిజమగు ఉనికి లేని పదార్థములన్నియు అభావపదార్థములు. కనుక అస్తి, నాస్తి శబ్దములు భావా భావములకు సమానార్థములుగా గ్రహింప నగును. శాస్త్రము నందీ యభావ పదార్థములు ముఖ్యముగా నాలుగు తరగతులుగా విభజించబడినవి.

**1) ప్రాగ్భావము :** పూర్వము నందు లేనిదై ప్రస్తుతము గాన వచ్చునది ప్రాగ్భావము. ఘటోత్పత్తికి పూర్వము ఆ ఘటము లేదనుట ప్రాగ్భావమునకు దృష్టాంతము.

**2) ప్రధ్వంసాభావము :** వస్తువు నశించిన పిదప ఆవస్తువు లేకపొవుట ప్రధ్వంసాభావము. ఘటనాశనానంతరము ఘటము లేక పోవుట ప్రధ్వంసాభావమునకు దృష్టాంతము. దీనికే ప్రత్యగ్భావమని కూడపేరు.

**3) అన్యోన్యాభావము :** రెండు వస్తువులలో యేవస్తువునందు లేకుండానే (అనగా అభావముగా నున్నను) ఆరెండు వస్తువుల సంయోగమేర్పడి వాని వియోగములో మరల లేకపోవుట అన్యోన్యాభావమనబడును. రెండు అరచేతులలోదేని యందు లేకపోయినను వాని పరస్పర తాకిడిలో శబ్దమేర్పడుచున్నది. అట్లే మనస్సు ప్రాణములు రెంటిలో యేనొక్కదాని యందును లేనప్పటికి అవి రెండు కలసినపుడు గుర్తు కలుగుచున్నది. ఎట్లనగా మనస్సు అంతఃకరణ మందు మగ్నత చెందినపుడు ప్రాణమొక్కటే ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ఆడుచుండును. అపుడు గుర్తులేదు. అట్లే సమాధి యందు ప్రాణనిరోధమేర్పడినపుడు గుర్తులేదు. కాని ఆ మనః ప్రాణముల సంయోగములో మాత్రమే గుర్తు 'Consciousness' కలుగుచున్నది. ఇవి అన్యోన్యా భావమునకు దృష్టాంతములు.

**4. అత్యంతాభావము :** ఏ దేశము (ప్రదేశము) నందుగాని ఏహ్యోకాలమందుగాని యే కించిత్తూ లేకుండుటయే అత్యంతాభావము. కనుక కుందేటి కొమ్మువంటి కేవల అలీక పదార్థమే దీనికి దృష్టాంతము.

భావశబ్దమునకు అభావశబ్దము ప్రతియోగి, ఈ రెండును ద్వంద్వములు, మాయ. యామాసామాయా అనే నిర్వచనము ప్రకారము ఏది లేనిదో అది మాయ, కనుక సర్వద్వంద్వములు మాయ, లేనివే, కనుక భావాభావములను వదులు మంటుంది ఈ వాక్యము. ఎందుకనగా భావాభావముల రెంటిలో దేని చేతను గుర్తింపరాని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. పరిపూర్ణ పరబ్రహ్మమందు భావముగాని, అభావము గాని లేనిది. **"శ్లో॥ యధానాహం తథాశుద్ధం, తస్మాచ్ఛుద్ధేన నిర్ణయః..."** అనగా నేను లేకుండ వుంటే యెట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణ పరబ్రహ్మము. ఏదిలేనిది, ఏదికానిది. "నిశ్శక్తి నిర్మలం పూర్ణం" అని గొనియాడ బడినది. భావాభావములు కూడలేనిదది. శ్లో 212॥ **"స్వయం బ్రహ్మమయోభూత్వాతత్పరం చావలోకయేత్"** అని గురుగీత గానచేసింది. సాధకుడు

మొదట తాను బ్రహ్మ స్వరూపుడు కావలెను. ఆతర్వాతనే తనకు పరంగానున్న నిరామయమై సకలము నందు నిండి నిబిడీకృతముగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మను చూడు మంటుంది. తాను (సాధకుడు) మహాకారణ శరీరతాదాత్మ్యముగలిగి **"అహంబ్రహ్మాస్మి"** నేనుబ్రహ్మనే అయియున్నాను యను యదార్థదృష్టితో జీవయాత్ర సాగించినచో తాననే వ్యష్టి దృక్పథము నశించును. అట్టి వానికి శరీరేంద్రియ మనోబుద్ధ్యాది సమస్తము మాత్రమేగాక తనశరీరమునకు లోపల బయట తోచబడే సమస్తము కూడ బ్రహ్మమే అనే అఖండాత్మ దృష్టి యుండును. ఇదే బ్రహ్మమయ మగుట. ఇదేతొలి భ్రాంతి, ఈభ్రాంతి భావము అభావమైనపుడు ఆపరిపూర్ణపరబ్రహ్మము అపరోక్షమగును.

**నిరాకాశ స్థితిర్భవేత్:** ఆకాశము అవకాశ రూపము, చతుర్దశలోకములకు త్రిమూర్తులకు ముక్కోటి దేవతలకు, నవగ్రహాలకు, నక్షత్రాలకు, బ్రహ్మాండ పిండాండములకు సమస్తమునకు చోటిచ్చునది. ఇదియే దేశము. సమస్తమునకు స్థానము ఆధారమూ అయివుండి లోపల వెలుపల నిండియున్నది. కర్మ జ్ఞాన వ్యవహార మంతయు దీనియందే జరుగుచున్నది. సృష్టియే కానప్పుడు యిది శుద్ధాకాశమని చెప్పబడును.

ఆత్మనుంచి వచ్చిన ఈ ఆకాశమునకు ఆత్మ కారణమున్ను సూక్ష్మమున్ను అయియున్నది. **"ఆకాశశ్శరీరం బ్రహ్మ"** యని శ్రుతి యందు, ఆత్మకు ఆకాశమే శరీరము అని చెప్పబడుచున్నది. అంటే ఆత్మ దేహిః, ఆకాశము దేహము అన్నమాట. మన యందుండే ప్రత్యగాత్మకు పంచకోశములు ఆవరణముగా నున్నట్లే, పంచభూతములు పరమాత్మకు ఆవరణముగా నున్నవి. అందు ప్రథమ భూతమైన ఆకాశమే ఆత్మకు మొదటి ఆవరణము. తీపిని బెల్లము నుండి వేరుచేయలేక పోయినట్లే ఆకాశమును ఆత్మనుండి వేరుపరుచలేము. అవి రెండు అవినాభావ సంబంధము కల్గినవై స్థూలముగా విడదీయ రానివైయున్నవి. ఐనను నాలుకపై వేసుకొన్నప్పుడు తీపిని గుర్తింప గలుగుతున్నాము. అట్లే ఆత్మానుభవమును ఆకాశమునుండి వేరుచేసి చిల్లక్షణముచే గుర్తించగలుగుచున్నాము. ధ్యానము చేయు మనస్సు ధ్యేయమైన ఆత్మతాదాత్మ్యము పొందినపుడే ఆత్మ యొక్క అపరోక్షజ్ఞానము గాగలదు.

"అహంబ్రహ్మాస్మి" అయమాత్మ బ్రహ్మ" నా ఆత్మనే బ్రహ్మము అని తెలుసుకొన్న వాడు 'నేను' అహం స్ఫురణ యుండుటవల్ల భ్రాంతికి కారణమగుచున్నది. ఇదే తొలి భ్రాంతి. ఈభావమును అభావము చేసిన యెడల భ్రాంతి రహితమై అనగా 'అహం' నేను లేకుండుట వల్ల నిరాకాశస్థితి యనగా పరిపూర్ణపరబాహ్య స్థితి కలుగును. **'నేను లేనప్పుడే అది' అంతా పరిపూర్ణ ముండగా నేనెక్కడ.**

**త్యజేద్విద్యామవిద్యాంచ క్షరమక్షరగ్ంత్యజ**
**బంధమోక్షద్వయంత్యక్త్వా యేనపశ్యతి తత్యజ** ॥30॥

తా॥ ద్వంద్వములైన విద్యా విద్యలను క్షరాక్షరములను విడువుము, బంధమోక్షములను రెంటిని వదులుము, దేనితో చూచుచుంటివో దానిని కూడ విడువుము.

**వివరములు :**

**1. త్యజేద్విద్యామద్యాంచ :** విద్యావిద్యలు ద్వంద్వములు, సాపేక్షికములు, ద్వంద్వములన్ని శాశ్వతములు గావు. ఇచ్చట విద్యయనగా జ్ఞానము, వేదశాస్త్రములు. నిత్యమగునది ఆత్మ యొక్కటి యేయని యెరింగి ఆత్మ తత్వము యొక్క సాక్షాత్కారము పొందుటయే జ్ఞానముగాని

మిగతా అంతయు అజ్ఞానమని భగవద్గీత చెప్పుతుంది. "సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మనీ" అనగా తనయందు సర్వభూతములను, సర్వ భూతములందు తనను చూడగలుగుటయే జ్ఞానం". ఇట్టిజ్ఞానము మానవులందు మాత్రమే సాధ్యం.

అవిద్యయనగా అజ్ఞానము అహంకార అభిమానములు. విద్యవలన కలుగునవి, స్వర్గాది మోక్షపదవులు, అవిద్యవలన కామ్యకర్మాచరణ యజ్ఞ దాన తపఃక్రియలు. వీనివలన కామ్యసిద్ధి స్వర్గనరకాది లోకములు సంభవించును. ఈ సర్వమునకు యెరుకయే కారణము. ఎరుక నిర్మితమగు సర్వశాస్త్రములు కర్మరూప యోగ యోగాంగ పద్ధతులు, సర్వము అశాశ్వత ఫలప్రాప్తినే కలిగించును. స్వప్నము నందు తాను నవఖండమండలాధిపతియైనట్లు గజారోహణ గావించి పూరేగునట్లు గోదాన భూదానాది దానములు చేయు చున్నట్లు కల గనుచుండగ మెలకువ వచ్చిన యెడల, తాను తనసైన్యము, ఆరోహించిన ఏనుగు సర్వము యెచ్చటికి పోయెనో తెలియనట్లుగా, అచల పరిపూర్ణ పరబాహ్యమున దానియందు మూలము లేక దాని నంటక యున్నమహాకాశమగు ప్రత్యక్ష పూర్ణమగు అఖండ యెరుకను తెలుసుకొన్నవారికి విద్యావిద్యోపాధి రహితమని సిద్ధాంతము. కనుక ద్వంద్వములైన, సాపేక్షికములైన విద్యావిద్యలు విడువవలయును.

**2. క్షరమక్షరగంత్యజ :** స్థావరజంగమ జీవోపాధులు క్షరములు. అధిష్టాన చేతన బ్రహ్మమను అఖండ యెరుక అక్షరము. ఆకాశము యొక్క సూక్ష్మ భాగమగు ప్రకాశరూపమగు బ్రహ్మము, వాయువు యొక్క సూక్ష్మ భాగమగు ప్రాణము, ఈ రెండు (అనగా ఆత్మ బ్రహ్మ ప్రకాశము ఆత్మ రూప ప్రాణము) ఈ రెండి చేరిక అఖండ యెరుక అక్షరుడు.

అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు, నీటి యొక్క సూక్ష్మాంశమూ ప్రాణమూ ఈ రెంటివల్ల తెలియబడుజీవుడు (లేక ప్రత్యగాత్మ) క్షరపురుషుదని నిర్ణయము.

ఈ క్షరాక్షర పురుషులు వస్తుసముదాయము చేత నిర్ణయింపబడిన వారే గాని ప్రత్యేక పదార్థ రూపులుగారు. కలయిక వలన యేర్పడినవారు. పదార్థములు విడి పోయిన యెడల ఉభయులు లేకుండా పోవువారే. కనుక క్షరాక్షరములు శాశ్వతమని మోక్షభ్రాంతి కలిగి వుండడము అనర్థకమని నిరసించడమైనది.

**3. బంధమోక్షద్వయం త్యక్త్వా :** అనగా బంధమోక్షములను వదలుము. బంధమనగా కట్టుబడి యుండుట. అనగా తన యిచ్ఛవచ్చిన రీతిని సంచరించుటకు, కోరిన ఫల ప్రాప్తికలుగుటకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లేకుండ, అవ్యక్త శక్తిచే సంకెళ్ళువేయబడినట్లుండుట బంధ మనబడును. త్రికరణములగు మనస్సు వాక్కు, శరీరము (నానావిధ యింద్రియములతో సహా) దేనినైన తనకెట్టి పెత్తనము లేకుండుటయే బంధము. "పుట్టుకతో మానవుడు సర్వస్వతంత్రుండుకాని సర్వత్ర సంకెళ్ళచే బంధించబడియున్నాడు" అని ఫ్రెంచ్ రాజనీతి తత్వవేత్త మరియు విద్యావేత్త రూసో రాజ్యావతరణ సిద్ధాంతమును రూపొందించి వివరించి యున్నారు.

మోక్షమనగా ముక్తి, కైవల్యము, నిర్వాణము, నిరతిశయ సుఖావిర్భావము, అత్యంత దుఃఖనివృత్తి ఇత్యాది మాటల నుపయోగించుచున్నారు. బంధము మోక్షము, బంధ విముక్తులు, బంధమునకు వ్యతిరేకార్థముగా మోక్షము ముక్తి అనుశబ్దములు వాడబడుచున్నవి. కానిముక్తి సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్య, సాక్షిత్వ ముక్తులు అని పంచవిధములుగా

చెప్పు ఈ ముక్తులు విష్ణువు, శివుడు మొదలగు యిష్టదైవములలోకములు, సామీప్యాదులు పొందుట యని యర్థము, కాని అవికూడ బంధములే.

అనంతకోటి జన్మలలోని కర్మవాసనల కూటమికి సంచితమని, వర్తమాన జీవితములో ననుభవించుటకు తెచ్చుకొన్న శుభాశుభ సంస్కార జన్యమగు పుణ్యాపాప కర్మ ఫలములు ప్రారబ్ధము. వర్తమాన జన్మల యందలి మనోవాక్కాయములతో చేయబడిన కర్మవాసనల రూపమే ఆగామి. ఈ త్రివిధ కర్మలు నశించిన గాని మోక్షము లేదని సర్వాంగీకార విషయము. అనగా జనన మరణ రాహిత్యమే మోక్షము. ప్రారబ్ధము అనుభవించుట చేత, సంచితము గురుముఖతః ఆత్మనిశ్చయ జ్ఞానము చేతను. ఆగామికర్మ కర్మత్యాగము కర్మఫల త్యాగముగాక, కర్తృత్వ రహిత కర్మాచరణవల్లనే సాధ్యమని గుర్తించవలయును.

అయితే ఏ పనికైనను కర్తఎవరు? "నేను" అను వ్యష్టి అహంకారమే కర్తయని యితరులు పలుకుచున్నారు. కాని ప్రత్యగాత్మ ప్రకాశములేనిదే యింద్రియ వ్యవహారముండ జాలదు. కనుక దానినే కర్తయనవలెను. కాని ప్రత్యగాత్మ పరమాత్మకంటే అభిన్నమైనపుడు సర్వమునకు పరమాత్మయే కర్త కనుక వ్యష్టి అహంకారమే కర్తయని నిశ్చయించుకొని అహం కర్తృత్వము వదలి కర్మాచరణ చేయునివారు కర్తృత్వత్యాగమొనర్చినవారు కాదు. ఏలననగా వ్యష్టికర్తృత్వము పోయిన సమిష్టి యందు కర్తృత్వము శేషించి యుండును కనుక కర్మఫలత్యాగము చేసినవాడు, వ్యష్టి కర్తృత్వము త్యాగము చేసినవాడు సర్వ కారణమగు బ్రహ్మము నందే చేరుదురు. ఈ బ్రహ్మమే మోక్షమని అందరందురు. కాని బ్రహ్మమే బంధమునకు అత్యంత మూల కారణము, కనుక బంధమోక్షములు రెండు బ్రహ్మమే. బ్రహ్మమే అన్నిటికి కర్తయని తెలిసినది. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు క.ద. 52॥ "ఆటాడి ఆడకుందును। ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే। ఆటాడు ఎరుక యనియెడి। ఆటాడించేటి వాడు। అతడేరా కర్త। అంతటికి యూ అచల మకర్తా" అనగా ఎరుక యగు పురుషుడు ఆటాడును। ఆడకుండ యుండును. మరియు శరీరముచేత ఆడకుండ తనలోనే తాను ఆడుచుండును గనుక ఆటాడించువాడు యెరుక పురుషుడే కర్తయని నిర్ణయము. ఈ సర్వమునకు పరబాహ్యము అకర్తయని తెలిసికొనుము. కనుక బంధ మోక్షముల రెంటి స్థానము బ్రహ్మమే. బ్రహ్మమే అన్నిటికి కర్తయని తెలియవలసి యున్నది. ఈ బ్రహ్మము యొక్క కర్తృత్వమెట్లు రహిత మగును. బ్రహ్మమే శాశ్వతమని ధృఢ భావన చేస్తే దాని కర్తృత్వము శాశ్వతముగా యుండిపోవును. కనుక పరిపూర్ణ బోధచే "పరిపూర్ణ మెప్పటికి యుండును. కర్తయైన ఆబ్రహ్మమునకు ఆపరిపూర్ణబ్రహ్మము నందు మూలముగాని నిలుచుటకు స్థానముగాని లేదని ధృఢముకావలెను.

కనుక శాశ్వతముగా జన్మరాహిత్యము కావలెనంటే బంధ మోక్షరూపములుగా మారుచున్న ఈ బ్రహ్మము నుండియే ముక్తి కావలసియున్నది. కనుక నిరాలంబోపనిషత్ "కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః" అని చెప్పుచున్నది.

పరిపూర్ణ పరబ్రహ్మము నందు బ్రహ్మస్వరూపుడవైన నీవుగాని నీబంధ మోక్షములు గాని లేవు. పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమని తెలిసి బ్రహ్మస్వరూపుడైన నీవు లేనే లేవని గురుముఖతః తెలసి లేకపోవుటయే జన్మరాహిత్యము. అదియే నిజమైన మోక్షము. కావున బంధ మోక్షములను వదులుము.

**4. యేన పశ్యతితత్యజ :** దేనితో చూచుచుంటివో దానిని కూడ విడువుము. కన్ను ద్వారా మనస్సు చూచు చున్నది. కన్ను కేవలం చూచుటకు ఒక ఉపకరణం మాత్రమే. దానిని దృక్కందురు. కన్ను ద్వారా మనస్సు చూచి మనస్సు తదాకారము పొందినపుడే ఆవస్తువు కనబడును. జ్ఞానమన్న దృక్కన్న ఒక్కటే. ద్రష్ట (జ్ఞాత) దృక్కు (జ్ఞానము) దృశ్యము (జ్ఞేయము) ఈ మూడున్ను త్రిపుటి రూపము. ఇందొకటి నిలిచి మిగతా రెండు పోయేటివి కావు, దృక్ దృశ్యములు పోతే ద్రష్టయనే పేరే యుండజాలదు. అట్లే దృక్కు లేకున్న దృశ్యము లేదు ద్రష్టలేదు. మనస్సుకు అనేక వృత్తులు గలవు. అఖండ బ్రహ్మాకార వృత్తియు కూడ నొక వృత్తియే. వృత్తి రాహిత్యము సిద్ధించ వలయునన్నపుడు ఆఖండ బ్రహ్మాకార వృత్తియు పోవలసినదే.

శ్లో॥ ఉల్కాహస్తో యథా కశ్చిత్ ద్రవ్యమాలోక్యతాంత్యజేత్।
జ్ఞానేన జ్ఞేయ మాలోక్య పశ్చాద్ జ్ఞానం పరిత్యజేత్॥ ఉ.గీ. 1-21

దీపము పట్టుకొని కావలసిన వస్తువు దొరికిన తర్వాత దీపము వదలి పెట్టినటుల, జ్ఞేయమును తెలుసుకొన్న జ్ఞానమును పరిత్యజిస్తే జ్ఞేయ బ్రహ్మము మిగిలియుండునా? క.ప.128॥ జ్ఞానము వచ్చును పోవును.। జ్ఞానాతీతమును తాను గాంచిన దాకన్" అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు అభివర్ణించియున్నారు. జ్ఞానము క్షర సంపదలోనే చేరును. కనుక వాటినికూడ వదులుము.

**నిరహంకారేణ చిజ్జడాత్మ కావరణంచిత్వా**
**నిరామయ నిరంజన పరమంశివ మాలోక్య నిరహంకారోభవ** ॥32॥

తా॥ అహంకారము లేక చిజ్జడాత్మకమగు (చేతనము స్థూలముల) ఆవరణను ఛేదించి ఎట్టి వ్యాధులు లేని నిరంజనుడగు పరమ శివుని (పరిపూర్ణపరబ్రహ్మమును) కనుగొని నిరహం కారుడవు కమ్ము.

**వివరణము :**

**1. నిరహంకారేణ :** అనగా అహంకారములేక యని యర్థము. అహమనగా నేను అనగా జ్ఞానమున కతీతమగు అచల పరిపూర్ణపరబయలును తెలుసుకొనునంత వరకు ఈ జ్ఞానమగు నేను పుట్టుచు, గిట్టుచుయుండను. నిరహంకారేణ అని యంటే నేను లేకుండ పోయిన యని యర్థము. నేను అనగా ఏది? అను వస్తునిర్ణయ జ్ఞానము ముందుగా తెలుసుకొందము. వైఖరీ వాక్కుగల మానవోపాధి యందున ప్రతివ్యక్తి నేను అని తనను గురించి పలుకుచున్నాడు. మాటలు వచ్చినది మొదలు ఆబాల గోపాలము మరణము సిద్ధించు వరకు లింగ వయో భేదము లేక నేను నేను అంటూ పలుకుచుండుటచే దీనిని వైయ్యాకరణులు సర్వనామములలో ప్రథమస్థాన మిచ్చినారు. నేను అనగా అహం, స్థూలసూక్ష్మ, కారణ మహాకారణ శరీరములలో ఏయొక్క శరీరమైనా కావచ్చును.

1. నేను పొడుగరిని, బలిష్ఠుడను నల్లటి వాడను మొదలగు వాక్యములతో అన్నప్పుడు స్థూల శరీరమతో తాదాత్మ్యము చెంది ఆత్మ యొక్క (నేను యొక్క) ధర్మముగా భావించి పలికి నట్లయినది.

2. నేను సుఖంగానున్నాను. నేను గొప్ప దుఃఖములో నున్నాను, అను వాక్యములలో మనస్సుతో (సూక్ష్మ శరీరముతో) తాను తాదాత్మ్యము చెంది మనోధర్మములగు

శోకమోహములు సుఖదుఃఖములు ఆత్మయందు (నేను యందు) అధ్యస్తము చేయుచున్నాడు.

3. అట్లే ప్రాణముతో (కారణ శరీరముతో) తాదాత్మ్యము చెంది నాకేమి తెలియదు అంటూ జడమగు ప్రాణ లక్షణమగు అజ్ఞానమును ఆత్మందు (నేను యందు) ఆరోపించుచున్నాడు.

4. "అహం బ్రహ్మాస్మి" సోఽహం" "శివోహం" యిత్యాది వాక్యములలో మహాకారణ శరీరము (ప్రత్యగాత్మతో) తాదాత్మ్యము చెంది సత్యమునకు చేరువైనాడు. కనుక వ్యష్టియందు నాలుగు శరీరములు అట్లే ఈశ్వర తనువులందు ఈ నాలుగు శరీరములున్నవి. కనుక "నేను" గుర్తెరిగే తెలివి–Consciousness సర్వభూతములయందు ఎరుక రూపంగానోలేక మరుపు రూపములోనో వుండియేయున్నది. సృష్టికి పూర్వము నిజరూపములో original State లోవున్న యిదియే స్వస్వరూపము. ఇది యింద్రియ గోచరము గాకున్నను పంచేంద్రియ గోచరమగు సమస్తము దాని మారు రూపములే గనుక ఆ నేను (ఆత్మ) కానిదేది లేదు. కనుకనే "ఆత్మనోఽన్యంనకించిన" అని శ్రుతియున్ను పలికినది. ఇది శుద్ధ మనస్సునకు అనగా విషయ గ్రహణము చేయక యుండు నిరీంద్రియ మనస్సుకు అపరోక్షమగును. **"మనసైవాను ద్రష్టవ్యం"** అని శ్రుతి. అవిచ్ఛిన్న తైల ధారవలె మనస్సు ఆత్మయందు ఏకాగ్రత చెంది నపుడు ఆ మనస్సు ఆత్మరూపమే చెందుచున్నది. ఇది ఆపరోక్ష సాక్షాత్కారము. ఇది సచ్చిదానందము లేక అధిష్టానచేతన బ్రహ్మము. **వ్యష్టియందు నేను సమిష్టియందు బ్రహ్మము లేదనుటయే నిరహంకారము. ఆభావనలో ఎల్లప్పుడుండే వాడు నిరహంకారుడు.**

శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద. 283॥ **"అనహంకారుడనిమిషుడు। గనుకనే విశ్వం బనేటి కలగానదహంబనువాడు ననిమిషుడుగా । వున విశ్వంబనేటి స్వప్నోద్యోగాము బూని చేయుచు। యావుద్యోగము మానీ। యను నీస్వప్నోద్యోగమునకు నేకారణమని తాననిమిషుడెన్న దనుకోదమాటా నుద్యోగాము బూని చేయుచు యావుద్యోగాముమానీ"॥** అని శెలవిచ్చియున్నారు. అహం బ్రహ్మాస్మియను అహంకారము లేని వాడు విశ్వమనే ప్రపంచమును చూడడు. ఆహంకారమున్నవాడు విశ్వమనే స్వప్న ప్రపంచమును గనుచున్నాడు. తను యొనర్చు కార్యములన్నియు సత్యములను భ్రాంతితో తానే కారణమని నిర్ణయించుకొని జనన మరణ సంసార బాధల ననుభవించుచున్నాడు. అహంకారము లేనివాడు ఈ విశ్వమనే ప్రపంచమున వ్యవహరించుచున్నను ఈ స్వప్న ప్రపంచమునకు కారణ కార్యములకు కర్తనని గాని భోక్తనని గాని తలంపడని భావము.

**2. చిజ్జడాత్మ కావరణం చిత్వా :** చిజ్జడాత్మక మగు ఆవరణను ఛేదించుము. అని అర్థము. చేతనము, భౌతిక పదార్థము రెండు ఎరుకనే. అందు చేతనము పదార్థము నందు సూక్ష్మంగాను, నువ్వులలో నూనే, కట్టెలలో నిప్పు, పాలలో వెన్న, పూవులో తావివలె ఉంది అని అనుటకంటె విడదీయుటకు వీలు లేనంత సూక్ష్మంగా ఉంది అని అనటం సమంజసము, ఏలనంటే ఆయా పదార్థముల నుండి నూనె, నెయ్యి యిత్యాదులను తేలికగా విడదీయ వచ్చును. ఈ విడివడిన పదార్థములందు గూడ పదార్థ రూపంగా, వస్తు రూపంగా, స్థూలరూపంగానే పంచేంద్రియ గోచరమౌతునే వున్నాయి. కాని ఈ చేతనము అట్లాగోచరించేది గాదు. అది పదార్థమును విడిచి వేరే యుండజాలదు. అట్లే చేతనమును విడిచి పదార్థము

వుండజాలదు. విశ్లేషం పొందిన పదార్థమే నాశనమౌతుంది. ఈ రెంటిని చిజ్జడములంటారు. ఈ రెండు కలిసి వస్తున్నాయి. కలిసే ఉంటాయి. యిందొకటి పోతే రెండోది కూడ దానితోనే పోతుంది. ఇదే వస్తువు యొక్క లక్షణము. ఈ చిజ్జడముల సమిష్టిరూపమునకె యెరుక యని పేరు పెట్టారు. ఈ రెంటిని వేర్వేరుగా వ్యవహరించవలసి వచ్చినప్పుడు సూక్ష్మ భాగమును యెరుకయని తెలివియని చేతనమని గుణమని స్థితిగతుల భేదములను పురస్కరించుకొని పేరుపెట్టడమైనది. అట్లే స్థూలభాగమును మరుపని, అజ్ఞానమని, జగత్తు అని అన్నారు. ఈ స్థూల సూక్ష్మముల ద్వంద్వమే సర్వత్రాగోచరిస్తున్నది. ఏక వస్తువుగా కనబడిన ద్వంద్వ రూపంగా యున్నది. కనుక ద్వంద్వరూప ఏకమునవలసి వచ్చెను. ఇట్టి చిజ్జడాత్మను ఛేదించవలయును. అంటే ఈ యెరుకను వదలివలయును. ఎందుకనగా ఇందేది పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. అట్లు ఎరుక యనబడు చిజ్జడాత్మమును వదలి నిరామయము, నిరంజనమైనపరమశివమును (పరిపూర్ణపరబ్రహ్మను) ఆలోకనము చేయవలయును.

**3. నిరామయం నిరంజన పరమం శివ మాలోక్య నిరహంకారోభవ:** నిరామయుడును నిరంజనుడునునగు పరమశివుని కనుగొని నిరంకారుడవుకమ్ము యని యర్థము.

**(అ) నిరామయ:** నిరామయము అనగా నిర్+ఆమయః = నిరామయః. ఆమయః యనగా వ్యాధి, వ్యాధి యనగా యోగవిఘ్నము. యోగవిఘ్నములు లేనివాడు నిరామయుడు. అనగా యోగమునందే యెడతెగక నుండువాడు. యోగము అనగా కూడిక, దేనితో కూడిక, తన ఆవరణ రూపమైన ప్రకృతితో అవినాభావముగా ఎప్పుడు విడిచి వేరుకాకుండ నున్నవాడు. అతడు నిరామయుడని పిలువబడుచున్నాడు. ఆపరమాత్మతో ఏకత్వసాధన చేయు వాడు నిత్యముక్తుడు.

**(ఆ) నిరంజనము :** నిరంజనము అనగా పాపరహితమని, రజోగుణ సంబంధము లేనిదని రెండర్థములున్నవి. దుష్టకర్మ ఫలమే పాపము. కర్మకు చలనము, చలనమునకు ప్రాణము ప్రాణచలనమునకు రజోగుణములు కారణములు. పాపములేనిదన్న, రజోగుణము లేదన్న ఒక్కటే. అయితే గుణత్రయ ప్రకృతి పరమాత్మయందు సర్వైక్యమై బీజరూపముగా అణగి మణగి యున్న స్థితి యందు మాత్రమే పరమాత్మ నిరంజనమని చెప్పతగియున్నది. రజోగుణము లేనప్పుడు శారీరక మానసిక చలనము లేమి యుండవు. సృష్టికారణముగాని, సృష్టి పరిణామముగాని యుండదు. అట్టి స్థితియే నిరామయమని, నిరంజనమని వర్ణింపబడినది. నిరంజనము, నిరామయమగు పరమశివుని (పరిపూర్ణ పరబ్రహ్మమును) మాలోక్యము చేసుకోమని ఈ వాక్యము జెప్పుచున్నది.

**(ఇ) పరమంశివ :** ఇచట పరమంశివయని చెప్పుటను పరిపూర్ణ పరబ్రహ్మను గూర్చి చెప్పినట్లే యగును. శివయనగా శుభస్వరూపుడని మంగళస్వరూపుడని అర్థము. జన్మరాహిత్యమునకన్న మంగళకరమైనది మరొకటిలేదు గనుక పరంశివుడని వ్యవహారార్థము వాడినారు. **"సత్యంశివం సుందరం"** అని నిర్గుణ పరమాత్మయే వుపలక్షింపబడి అభివర్ణింపబడినది. దీని నింకను పొడిగించి అది కోటి సూర్య ప్రకాశవంతమని శుద్ధస్ఫటిక సన్నిభమని, పాటల వర్ణమని, బహు చిత్రవర్ణమని పేర్కొంటూనే 'వుపాసకానాం హితార్థాయ బ్రహ్మణోరూపకల్పనా" అని చెప్పబడినట్లు అనేక రూపములచే ఉపాసకులకు పెద్దలు సౌలభ్యం చేకూర్చుచున్నారు. ఇట్లు వర్ణించబడిన శివునకు పరముగా శ్రేష్ఠముగా నున్నవాడే

పరమశివుడు. అదే పరిపూర్ణ పరబ్రహ్మము ఇట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును ఆలోకనము చేయుమంటుంది ఈ శ్లోకము.

**(ఈ) ఆలోక్య :** ఆలోక్యమనగా చూచుట అని సామాన్యార్థమేగాని, మనస్సుచే వూహించుట, తెలివిచే వుండజూచుకొనుట అనునవి కూడ ఆలోక్యమున కర్థములుగా గ్రహించవచ్చును. జ్ఞానేంద్రియ పంచకము మనస్సు అను ఆరింటి చేతను తెలియబడేదంత కూడ అవలోకనమే. పంచతన్మాత్ర విషయములు యింద్రియముల చేతను, భావాభావ రూపములు మనస్సు చేతను మనము ఆలోకనము చేయగలుగు చున్నాము.

కాని ఎరుక మరుపులు, సాకారనిరాకారములు సగుణ నిర్గుణములు సదసత్తులు, భావాభావములు గాని పంచతన్మాత్రలు గాని లేని ఈ పరిపూర్ణపరబ్రహ్మమును దేనిచే ఆలోకనము చేయగలము అను ప్రశ్న ఎదురగుట సహజము. అయితే అది ఏమికానిది, అందేమి లేదని "నేతినేతి, నేతీతి హోవాచ" అన్నరీతిగా వ్యతిరేక పద్ధతిగా (Negative) గా దానిని భావించు కొనవచ్చును. కాని దానిని ఆలోకనము చేయుట ఎట్లు? **'లేనెరుకతో దీన్ని గనిపెట్టు మని', ఏరుక లేక సేమిచుమని'** అన్నారు. అయితే సూర్యుని చూడ బోయిన చీకటివలె **"చూస్తునే యెరుక పారి పోవునురా"** అంటున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మము అపరోక్షమగుట, ఎరుక లేక పోవుట సమకాలమునందే జరిగి పోవు చున్నవి. **"పరిపూర్ణమును జూచిన ఎరుక లేదు"** అన్నారు. ఆలోకనమనీ, అపరోక్షమని అనుట గూడ అపచారమే. కాని అంత కంటే శబ్దములు లేవు గనుకనే **"నవాగచ్ఛతి నోమనః"** అంటుంది శ్రుతి. నరుని నోట యెంగిలి కానిదొక్క పరిపూర్ణపరబ్రహ్మమే.

పరిపూర్ణపరబ్రహ్మమును ఆలోకించుటకు పూర్వము ఆ లేనెరుక స్వరూపుడు తానేనని గుర్తించి, ఆ స్వస్వరూపమైన అఖండాత్మ స్వరూపుడు తానే ఎరుకై నిలువవలయును. అట్లు నిలిచిన నాడే, అట్టి స్థితి యందే తానుగాని, తానులేని పరిపూర్ణబ్రహ్మమున్నది. తానే లేదు అనే యదార్థ జ్ఞానము శిష్యునికి కలుగును. ఇదే పరిపూర్ణమును ఉండజూచుకొనుట. **నేను లేనని ఆరూఢత కలుగుటయే పరిపూర్ణాలోక్యము.**

**(ఉ) నిరహంకారోభవ :** నిరహంకారదవుకమ్ము అనగా అచలుడవుకమ్ము అని అర్థము. ఏమిలేనప్పుడే పరిపూర్ణపరబ్రహ్మము అపరోక్షము. నేను లేకుండ అగుటయే పరిపూర్ణపరబ్రహ్మము లేక పరమశివుడగుట. అట్లయిన వానికి కోరికలన్ని నశించును. తానే లేదుగనుక అహంకారము లేకుండును. అట్టి వాడు నిరహంకారుడే. అట్లు పరిపూర్ణ పరబ్రహ్మమును ఆలోకనము గావించుకొని అనహంకారదవు గమ్మని హితబోధ జేయుచున్నది ఈ శ్లోకము.

వస్తువు యొక్క అనిత్య భావనవల్ల వస్తువు యందు ప్రేమపోదు. ఆ కానవచ్చే వస్తువు కూడ తానే అనే భావన వల్ల "యిదంవృత్తి మాత్రమే (నానాత్వరూపమగు ప్రపంచ దృష్టి) పోవును కాని "యిదం" వృత్తి నాశనం వల్ల "అహం" వృత్తి అనగా సర్వం నేనే అనే తలంపు పోదు. అయితే "అహం వృత్తి" రహితమైతే "యిదం వృత్తి" ఆనాడే నశించును. అహం వృత్తి అంటే నేను నేనను అహంకారము మాత్రమే గాదు, దానికి కారణమైన "బ్రహ్మోహం' అనే బ్రహ్మాకార వృత్తి కూడ లేక పోయినపుడే అహం వృత్తి కత్యంత నాశనము. ఇట్టి అహం వృత్తి పరిపూర్ణ బోధచే గాని రహితం గాదు. పరిపూర్ణ బ్రహ్మావలోకనము

వలన మాత్రమే సర్వసంఘ వివర్జితుడగును.

**ఆత్మానాత్మ రహిత పరిపూర్ణ పరమాకాశ నిరతిశయ**
**నిరీశ్వర లింగ మధ్యే విలీనోభవ** ॥33॥

ఆత్మ (బ్రహ్మము, అనాత్మ (దేహము) రహితమైన, పరిపూర్ణపరమాకాశ రూపమగు నిరతిశయ నిరీశ్వర లింగ మధ్యమున విలీనుడవుగమ్ము. అనగా పరిపూర్ణుడవుగమ్ము, అశరీరుడవుకమ్ము అని భావము.

**1. ఆత్మానాత్మరహితమ్ :** ఆత్మానాత్మలు సృష్టికి పూర్వము నిర్వికారమైయున్న ఆత్మ (పరమాత్మ) అనియు, మిగత అంతయు అనాత్మయని పిలువబడు చుందును. కార్యరూపమగు జగత్తునకు, కారణము మాయ యనియు, మాయకు విలక్షణముగా బ్రహ్మము (పరమాత్మ) కలదనియు అది కారణ కర్తృత్వములు లేనిదనియు, అపోహ చెందుటయే! ఇది ఎంత మాత్రము సరిగాదు. సర్వశ్రుతి స్మృతి, పారమార్థిక గ్రంధములున్ను బ్రహ్మమే జగత్కారణమనిన్ని స్పష్టముగా తెలియజేయుచున్నవి. కారణవస్తువు పరమాత్మయే. సృష్టి కామన కలిగి సృష్టిగా పరిణమించెనని చెప్పక తప్పదు. అట్టిచో కారణవస్తువును ఆత్మయనియు, కార్యరూపజగత్తును అనాత్మయనియు పిలుచుట ఎంత మాత్రము సరికాదు. క.ద. 58 "తను వెరుకలు రెండొక్కటి। యని యనరాదంచు కొందరందురు భువిలో। తను వెరుకలలో నొక్కటి। గనరాకుంటేను। రెండు గనరావోయన్నా రెండొక్కాటె వినరామాయన్నా।" అనగా తను వెరుకలు రెండు నొక్కటిగాదని భిన్నములని కొందరు చెప్పుదురు. అవిసరిగాదు. ఎట్లనగా ఈ రెంటిలో ఒకటి అగుపడకపోతే రెండు కానరావు. అందుచేత రెండు ఒక్కటని తెలుసుకొనుము. పరిపూర్ణ పరబాహ్మము నందు ఇతర మేమియు లేదు. అంటే ఆత్మగాని, మాయగాని, అనాత్మగాని లేవు. వానికి మూలము గాని, స్థానము గాని లేవు. ఇట్టి పరిపూర్ణవిషయ ప్రబోధమందే ఆత్మానాత్మ లేనివగుచున్నవి. పరిపూర్ణబోధ ఆత్మానాత్మల వినాశహేతువని దిగువ శ్లోకము గానం చేసింది.

శ్లో॥ ఆత్మానాత్మ వినాశ హేతు మనిశం సర్వాతిరిక్తం శుభం
పూర్ణా పూర్ణ మనామయం సుఖతరం సర్వాపద ధ్వంసకం॥

**2. పరిపూర్ణ పరమాకాశమ్ :** పరమాకాశం అనగా శ్రేష్ఠమగు ఆకాశము. ఆకాశములుఐదు పరాకాశము (ఆత్మ) దహరాకాశము (మనస్సు) నిర్వయకాశము (దిక్కులు) సూర్యాకాశము (కాలము) భూతాకాశము. ఆకాశమనగా అసలు ప్రకాశింపని జడము అని ఒక అర్థమున్నది. మరియు

**శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ, ఆకాశ వ్యాపితంచయత్।**
**ఆకాస్య గుణశబ్దోనిశబ్దో బ్రహ్మ ఉచ్యతే॥** ఉత్తర గీత. 1-50

ఆకాశమనగా అవకాశరూపము, ఖాళీ ప్రదేశము (Space) నామరూపాత్మకమగు సర్వజగత్తు నందు సూక్ష్మంగా వ్యాపించి యున్నది. దాని గుణము శబ్దము, బ్రహ్మము నిశ్శబ్దమైయున్నది. అని ఈశ్లోకార్థము. ఈనిశ్శబ్ద రూపమైన ఆకాశమే పరమాకాశమని శ్లోకమునందభివర్ణింపబడినది. నిశ్శబ్దమనగా ఎట్టిదో ముందుగా తెలుసుకొనవలసియున్నది. స+శబ్దము=సశబ్దము. అనగా శబ్దముతో కూడినది. నిర్+శబ్దము నిశ్శబ్దము అనగా శబ్దముతో కూడనిది. శబ్దముతో కూడుట, కూడక పోవుట అనురెండు లక్షణములు ఒకే

ఆకాశమునకున్నవి. శబ్దముతో కూడినపుడు భూతాకాశము, శబ్దముతో కూడనపుడు అదే పరమాకాశ మనబడుచున్నది. దాని యందు శబ్దము బీజరూపముగా నున్నది. దానినే పరావాక్కని అందురు. నిశ్శబ్దమనగా కేవల పరావాక్కు కూడలేనిదికాదు. పరమాకాశమని తాను తానైయున్న ఆత్మనే వర్ణించినారు. పరిపూర్ణపరాకాశమనగా పరిపూర్ణ పరబ్రహ్మగా గుర్తించవలయును.

**3. నిరతిశయమ్ :** నిరతిశయమనగా సాటిలేని, నిరూపమానమైనది. అత్యధికము అని అర్థములు గలవు. పైనపరమాకాశమును తానుతానై యున్న ఆత్మనే వర్ణించి చెప్పినాము. ఆ ఆత్మకు కూడ పరమై, నిరుపమానమై సాటిలేని దైన పరిపూర్ణపరబ్రహ్మము మధ్య విలీనము కమ్మని జెప్పుటలో తాను పరిపూర్ణపరబ్రహ్మము గావలము ననుటయే.

**4. నిరీశ్వరలింగమధ్యేవిలీనోభవ :** నిరీశ్వరలింగ మనగా పరిపూర్ణ పరబ్రహ్మమనియే తెలియవలెను. ఈశ్వరుడనగా, బ్రహ్మము సృష్టి స్థితి లయములకు గారణమైనపుడు ఈశ్వరుడని పేరు. ఇంకా కొంత విపులముగా జెప్పాలంటే స్వరూప స్వభావములచే మాయా తీతుడై నిర్గుణుడై నిష్క్రియుడై యున్న బ్రహ్మము నిర్గుణ బ్రహ్మమనియు తటస్థ భావమున మాయాశబళితమై యున్న బ్రహ్మ చైతన్యమని లేక ఈశ్వరుడనియు, సగుణ బ్రహ్మమనియు యందురు.

సమిష్టి అజ్ఞాన రూపమై సత్వగుణ ప్రధానమై యుండు మాయ యందలి చిదాభాసమును మాయా సహిత చైతన్యమును గూడి ఈశ్వరుడనబడును. సత్వగుణ రూపమై యున్న ఈ శ్వరోపాధి యగు మాయయందు ఆవరణ విక్షేపములు ప్రబలమై యుండనందున ఈశ్వరుడు సర్వజ్ఞుడును, స్వతంత్రుడును, నిత్యముక్తుడై యున్నాడని యితరులందురు. కాని బ్రహ్మమునందు గూడ త్రిగుణములైన సత్వ, రజో, తమో గుణములు కూడ బీజ రూపములో ఆ బ్రహ్మమందు అణగినుణగి యున్నవి. కావున ఈ ఈశ్వరుడు కాని, నిరీశ్వరమైనదే పరిపూర్ణపరబ్రహ్మము. లింగము నిరవయవమైనది. పరిపూర్ణ పరబ్రహ్మము కూడ నిరవయవమైనది. "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" యని చెప్పుటచే ఉపాసన కొరకై ఆబ్రహ్మమును నిరవయవముగా లింగరూపమును జేసి పూజించుట కలదు. ఇవియును ఎరుకయే. నిరీశ్వరలింగమనగా ఈశ్వరుడు కాని, లింగరూపము కాని, పరిపూర్ణ పరబ్రహ్మముగానే తెలియవలెను. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము నందు లీనమగుట అనగా నిరంతరము నేను అనగా ఈశ్వరుడు లేని వానిగా యుండుమని ఉపనిషద్వాక్యము హితవు జెప్పుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మమే ఉన్నదని తెలిసి ఎరుక లేక సేవించుటయే నిరీశ్వర లింగ మధ్యే విలీనమగుట.

**అనావృతేన జీవేశ్వర భావం విసృజ్య స్వస్వరూప**
**మాత్రం నిర్వికార చైతన్య చ్ఛేదనం కుర్యాత్** ॥౩౪॥

ఆవరణ రహితత్వముతో జీవేశ్వర భావమును వదలి స్వస్వరూప మాత్ర నిర్వికార చైతన్యమును ఛేదించవలయును.

**వివరణము :**

**1. అనావృతేన :** అనగా ఆవరణ రహిత మొనర్చి యని అర్థము. ముందుగా ఆవరణ రహితమనగా నేమో తెలిసికొందము. మాయకు ఆవరణము, విక్షేపమని రెండు శక్తులు గలవు.

**(అ) ఆవరణ :** బ్రహ్మస్వరూపమును మరుగు పరచి స్వరూప జ్ఞానము గలుగుకుండ

చేయుటయే ఆవరణ లక్షణము.

**(ఆ) విక్షేపము :** భ్రమాజ్ఞానమును కలిగించి దాని యందు సత్యత్వ బుద్ధిని గలిగించుటయే విక్షేపకార్యము. ఉన్న పరబ్రహ్మమును మరుగు పరచి లేనిదానిగా జేయుట, లేని పదార్థమును వున్నట్లుగా భ్రమ రూపజ్ఞానము గల్గించుట అను అపూర్వశక్తి సామర్థ్యములు గలదగుట చేతనే, ఈ మాయా అఘటనా ఘటనా పటీయసి యని పేర్కొనబడినది.

అదియును గాక అష్టావరణములు గలవు :

1. దుఃఖము = దుఃఖము జన్మ మెత్తుట వల్ల వచ్చినది. 2. జన్మము = కర్మచే వచ్చినది.
3. కర్మ = కర్మ అభిమానము చేత వచ్చినది. 4. అభిమానము = అవివేకముచే వచ్చినది.
5. అవివేకము = అజ్ఞానముచే వచ్చినది. 6. అజ్ఞానము = మాయవలన వచ్చినది.
7. మాయ = బ్రహ్మము వలన వచ్చినది. 8. బ్రహ్మము అనాది గనుక ఎందుచేత వచ్చినది గాదు

ఈ అష్టావరణములను రహితమొనర్చ వలయును. ఆవరణ రహితమునకు సత్కర్మానుష్ఠానము, అంతఃకరణ శుద్ధి అవసరము. శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద. ॥76॥ **"ఆవరణము నాకసము। నిరావరణము నచలమనుచు। అనిరి మహాత్ముల్। ఆవరణము మితిగలిగిన। దావరణములేంది అమితమని తెల్సుకోరా। యీరెంట్నివేరని కనుక్కోరా। ఆవరణముననే నిరావరణమును జూచి। యావరణ వెడలీన । ఆవలమాట । లేదని కనుక్కోరా యీరెంట్ని వేరని కనుక్కోరా"॥** అని తెలవిచ్చి యున్నారు. అనగా ఆకాశరూపమైన ఆకాశాదిక కూటస్థమగు యెరుక ఆవరణము గలది. అచల పరిపూర్ణపరబాహ్యము నిరావరణము యని మహాత్ములు ఈ రెంటి విషయము నెరిగి చెప్పిరి. మితము గలిగినది యావరణ రూపమన యెరుక. అమితమైనది నిరావరణ అచల పరిపూర్ణ పరబాహ్యము. గనుక యీ రెంట్ని వేరని నీవు తెలుసుకొనుము. ఆవరణమగు యెరుకతో నిరావరణమగు పరబాహ్యమును తెలుసుకొని, ఆవరణమగు యెరుకను నీతో విడిచినచో నావల యేమాటలేదని యెరుగుమని భావము. ఇచ్చట యేమాట లేదనుట యనగా ప్రతిజ్ఞా వచనమని నిర్ణయము. అనగా ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్త్వమసి బ్రహ్మ అయమాత్మ బ్రహ్మయను యే నిర్ణయము లుండవు, ఎందుకనగా, తాను తెలుసుకొన్న పరబయులు నందు ఎరుకలేదు గనుక ఎరుకనిర్ణయములగు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరీలను యే వాక్యములు అందున్న ప్రజ్ఞలు వుండవని నిర్ణయము.

**2. జీవేశ్వర భావం విసృజ్య :** అనగా జీవేశ్వర భావమును వదలుము. జీవుడు నిజముగా సంపూర్ణ స్వతంత్రుడు. విభువు. స్వాత్మ స్వరూపమైన బ్రహ్మమే. ప్రత్యగాత్మ స్వరూపమే. పరమాత్మ స్వరూపమేగదా! తన కారణశరీరమగు వ్యష్టి యజ్ఞాన సంసర్గముచే దేహేంద్రియాదులతో తాదాత్మ్యము చెంది జీవుడని చెప్పబడుచున్నాడు. జీవయనగా ధాతు వ్యుత్పత్తిని బట్టి ప్రాణధారణయని యర్థము. పరమాత్మ యొక్క చలన శక్త్యాత్మకమగు ప్రాణ సహితుడై యుండుట వలన జీవ శబ్దముచే నాతని వ్యవహారము ప్రవర్తిల్లినది.

వ్యష్టి అజ్ఞానమే జీవుని కారణ శరీరమై యున్నది. ఈ వ్యష్టి అజ్ఞానాంశము యొక్క చేరిక, లేక సమిష్టి అజ్ఞానమే ఈశ్వరునికి శరీరమగుచున్నది. కావున వ్యష్టి శరీరాభిమాని యగు ప్రాజ్ఞునకు, ఈశ్వరునకు ఆవిధముగా బేధములేదు. కనుకనే మహావాక్య విచారణ యందు "తత్త్వమసి". వాచ్యార్థము వివరించు పట్ల 'తత్' పదమునకు సర్వజ్ఞత్వ విశిష్టుడగు

ఈశ్వరుడును, 'త్వం' పదమునకు కించిజ్జత్వ విశిష్టుడగు జీవుడును అర్థముగా చెప్పబడి యున్నట్టి జహదజహల్లక్షణ (భాగత్యాగలక్షణ) చే వారి ఉపాధులను ఉపాధిధర్మములగు సర్వజ్ఞత్వ కించిజ్జత్వాదులను పరిత్యజించి శేషించిన అధిష్టాన చేతనమునకు అసిపదముచే నైక్యము ప్రతి పాదించబడినది. లక్ష్యార్థమున ఉపాధి విశిష్టమగు ఆత్మ తత్త్వములకు, అనగా జీవేశ్వరులకు ఐక్యము సిద్ధాంతము చేయబడినది. జీవుడు తాను నిత్యముక్తుడయ్యును, ముక్తిని గోరుట ప్రాప్త ప్రాప్తవ్యము అని వర్ణించబడినది. అనగా తాను ముక్తుడయ్యును అనగా ముక్తి యిది వరకే తనచే పొందబడి యుండియు పొందబడనిదిగా, ముందు ముందు పొందదగినది గాను యెంచుచుండుట "కంఠ చామీకరవత్" అనగా యొక పసిబిడ్డ తన కంఠమునందున్న హారమును మరచి హారము కావలెనని విలపించుచున్నట్లున్నది. అట్టి జీవుడును లేని బంధమారోపించుకొని ముక్తిని కోరుచున్నాడు. బంధము లేనే లేదు. ముక్తి స్వస్వరూపమే గాని సాధింపబడునది గాదు. కనుక యుపాధి రూపమగు తన యజ్ఞానావరణము తొలగించుకొన వలెనని గాని, అన్యథా ముక్తి సాధించవలసిన యగత్యమేమిలేదు. కావున జీవేశ్వర భావము వదలి వేయవలయును. అంతే గాక జీవునికి గాని, ఈశ్వరునికి గాని మూలమై యితరమైన వస్తువునకు గాని పరిపూర్ణమందు మూలముగాని, నిలిచే యందుకు స్థానము లేదని గురుమూర్తిచే దృఢము చెంది జీవేశ్వర భావమును వదలి వేయవలయును.

**3. స్వస్వరూప మాత్రం నిర్వికార చైతన్య చ్ఛేదనం కుర్యాత్ :** తాను బ్రహ్మమయుడగుటయును పొందుటయే నిర్వికార చైతన్యము. అట్టి చైతన్యమును ఛేదించుటవల్ల పరిపూర్ణపరబ్రహ్మము స్వతసిద్ధము. తాను బ్రహ్మమయుడు లేక నిర్వికార చైతన్య స్వస్వరూప జ్ఞానమనగా నేమో మొదట విచారింతము. స్వస్వరూప జ్ఞానమనగా తాను బ్రహ్మ స్వరూపుడై దేహాదేహ లక్షణములను పూర్తిగా విడనాడుటయే బ్రహ్మమయుడగుట. గురుధ్యానము చేత దేహాభిమానము లేక యున్నాడు అనగా సృష్టికి పూర్వము **"జ్ఞానదేవతుకైవల్యం"** అని చెప్పిన స్థితిలో నున్న స్వరూపమును ధ్యానించుట నిర్గుణ ధ్యానము. **"మనోహి జతువత్"** అనగా [illegible] ఏ మూసలో పోసిన ఆ యాకారము ధరించునట్లు ఏ వస్తు రూపము [illegible] మునందో ఆవస్తురూపము మనస్సు ధరించగలదు. ఆవస్తువు యొక్క స్వరూప [illegible] సంపూర్ణముగా మనస్సు నందు వ్యాపకము కాగా మనస్సు తన్మయమై పోవును. ఇదే వస్తు సాక్షాత్కారము "తత్త్వజ్ఞానార్థ దర్శనం" అనగా యిదే, మనస్సు ఏకాగ్రత చెందుటయే స్వస్వరూప జ్ఞానము. ఇదియే బ్రహ్మమయమగుట. బ్రహ్మము యింద్రియ గోచరము కాదు గదా! స్వరూప సాక్షాత్కారమెట్లు చేకూరును? వస్తు సాక్షాత్కార విషయమున వృత్తి వ్యాప్తి ఫలవ్యాప్తి అను రెండుభేదములు గలవు.

**(అ) ఫలవ్యాప్తి :** అనగా వస్తువు యెదుట నున్న ఘటమువలె కనుల కగుపడును. ఘట జ్ఞానముచే చిత్తమునందు ఘటాకారవృత్తి కలుగును. ఘటము కనబడగనే అంతః కరణ ప్రతిబింబితుడగు చిదాభాసుడు దానిని "యిది ఘటమని" ప్రకాశింప జేయును. బ్రహ్మ విషయములో యిట్టి వృత్తి కలిగి యుండుట లేదు.

**(ఆ) వృత్తి వ్యాప్తి :** మనస్సు నందు వస్తువిట్టిదని మాత్రము గోచరించును. దీనినే వృత్తివ్యాప్తి యనబడును. యిట్టి జ్ఞానమును గురుముఖతః తెలియ వలసియున్నది. ఇదియే అఖండ జ్ఞానము లేక అఖండజ్ఞాన ఎరుక. ఈ అఖండ జ్ఞానరూపమైన బ్రహ్మమున

తెలియుటయే లేక బ్రహ్మమయమగుటయే తాను ఎరుకై నిలుచుట, ఇట్టి అఖండ జ్ఞానమును ఛేదించుటయే పరిపూర్ణము అవలోకము చేయుట. అందుకే గురుగీత 212 "స్వయం బ్రహ్మమయోభూత్వాతత్పరం చావలోకయేత్" అనగా తాను బ్రహ్మమయుడై తత్పరం అనగా అపుడు తనకన్యముగా నున్నదానిని కూడ చూడవలెనంటున్నది. తాను బ్రహ్మమయుడైన పిదప నిక తెలియవలసినది పరిపూర్ణ పరబ్రహ్మమే. ఆ కేవల బ్రహ్మము సిద్ధికొరకు స్వస్వరూప నిర్వికార చైతన్యమును ఛేదించ వలయును.

**నిర్వికార నిర్దేహ బోధమవాప్య సర్వకాల సర్వావస్థేషు**
**అహం పదార్థరహితం వ్యాపారం కుర్యాత్**
**అహంబ్రహ్మేతిభావం విసృజ్య అహం రహిత నిష్ఠోభవ.** ॥3౫॥

ఎట్టి వికారములులేని, దేహము లేని బోధను (పరిపూర్ణ బోధను) పొంది, సర్వకాల సర్వావస్థల యందు అహం (నేను) పదార్థరహిత వ్యాపారము జేయవలయును. అహం బ్రహ్మమను (నేను బ్రహ్మనను) భావము వదలి అహం రహిత నిష్ఠడవు గమ్ము.

**వివరములు :**

**1. నిర్వికారమ్ :** అనగా అవికారము, వికారములు లేనిది. షడ్భావ వికారములనగా ఆరు వికారములు చెప్పబడినవి. 1. అస్తితే = తల్లిగర్భ మందుండుట 2. జాయతే = పుట్టుట 3. వర్ధతే=పెరుగుట 4. పరిణమతే= పరిణామము చెందుట, మార్పు చెందుట. 5. అపక్షీణయతే= క్షీణించుట 6. వినశ్యతే = నశించుట. ఇవి షడ్వికారములు.

ఈ వికారములన్నియు ఆవరణ రూపమైన దేహమునకేగాని ఆత్మరూపమైన దేహికి లేవు. నేను మేనులు రెండు ఒక్కటైన స్థూల రూపమైనమేను మాత్రమే దృగ్గోచరమగుచున్నది. దాని వికారములే కండ్ల బడుచున్నవి. నేను కంటికి కానరానిది. అందుచే దాని వికారములు కండ్లబడుటలేదు. దానికి వికారములున్నవా? అంటే తప్పక వున్నవని చెప్పవలసినదే. ఇచ్ఛాసంకల్ప, రాగద్వేషాదులన్నియు వికారములే. అంటే అవి మనోధర్మములుగాని ఆత్మధర్మములు గావు అని జవాబు చెప్పవచ్చును. కాని అట్టి మనస్సు దేని వికారము: ఆత్మవికారమే గదా! అయితే వికారమని ఎందుకన్నారంటే, సృష్టి సంకల్పముకలుగనప్పుడు దాని యందేవికారములు గానరాలేదు. అట్టి నిర్వికార స్వరూపుడనే నేను, నాకు యిపుడీ జీవలక్షణములు సర్వ వికారములు కలిగినవి అను స్వస్వరూపానుభవము కలుగు చున్నది. ఏ వికారములు లేనిది ఏమి లేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమని తెలియ వలయును.

**నిర్దేహమ్ :** పరిపూర్ణ పరబ్రహ్మమందు దేహములేదు. దేహము కానిదది. దేహము లెన్ని వాటి వివరములు గూర్చి శ్లోక సంఖ్య (21) చూడుము.

**(అ) స్థూల శరీరము :** 1. జ్ఞానేంద్రియములు ఐదు, 2. కర్మేంద్రియములు ఐదు, 3. అంతరేంద్రియములు ఐదు 4. విషయేంద్రియములు ఐదు 5. ప్రాణేంద్రియములు ఐదు మొత్తము 25 తత్వములతో కూడి స్థూలశరీమాయెను. అభిమాని విశ్వుడు.

**(ఆ) సూక్ష్మ శరీరము :** జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. ప్రాణేంద్రియములు ఐదు మనోబుద్ధులు రెండు వెరసి 17 తత్వములతో కూడి సూక్ష్మ శరీరమాయెను. తైజసుడు అభిమాని.

**(ఇ) కారణశరీరము :** జీవుడు, ప్రాణము, ప్రత్యగాత్మ వ్యవహారమునకు కారణ

శరీరమనబడును. అభిమాని ప్రాజ్ఞుడు.

ఈ శరీరత్రయములేగాక మహాకారణ శరీర మొకటి కలదని అచల ఋషులు భావించారు.

**(ఈ) మహాకారణ శరీరము :** ప్రాణము ప్రత్యగాత్మల వ్యవహారమునకు మహాకారణ శరీర మనబడును. అభిమాని పరమాత్మ.

ప్రత్మగాత్మ స్థూల శరీర మందభిమానము కలిగి, తనకొరకు ఒక జీవనవిధానము నేర్పరుచుకొని జీవించవలయుననెడి ప్రగాఢమైన కాంక్ష అనగా శరీరమును శాశ్వతముగా నంటి పెట్టుకొనాలనెడి కోరిక గలవాడు జీవుడు ఈ నాల్గు దేహములు జీవతనువులనబడును.

ఇక సమిష్టిలో **ఈశ్వర తనువులను** గురించి తెలుసుకొందము.

**(అ) మహాకారణ శరీరము :** దహరాకాశమగు సమిష్ట్యంతఃకరణము పరమేశ్వరుని హిరణ్మయ కోశము. దీని యభిమాని యక్షర పురుషుడు. ఈశ్వరోపాధియగు విశ్వము లయము పొందినను తాము చలించక అట్లే యుండును, కావున నీయభిమాని నక్షర పురుషుడని చెప్పబడుచున్నాడు.

**(ఆ) కారణశరీర నిర్ణయము :** ఆనందమయ కోశమును నిరవయాకాశమందురు. ఈ నిరవయాకాశమగు పరాప్రకృతి ఈశ్వరుని ఆనందమయ కోశముగానున్నది. దీని యభిమాని పరమేశ్వరుడు. ఇతనికి అంతర్యామియని పేరు మరియు సకల జీవులకు కర్మానుసారముగా ఫలమ నిచ్చుట చేత నితనికి నంతర్యామి యనెడిపేరు సార్థక మయినది. అవ్యాకృతుడనియు నితనిని వ్యవహరింతురు.

**(ఇ) సూక్ష్మశరీర నిర్ణయము :** ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయములను త్రికోశములు కలిసి పరమేశ్వరుని సూక్ష్మశరీమగుచున్నది. దీని యభిమాని హిరణ్యాగర్భుడు. సకల సూక్ష్మ శరీరము లందు సూత్రాత్మ యగు ప్రాజ్ఞుడు నేనని యభిమానపడుట వలన హిరణ్యాగర్భుడని జెప్పబడుచున్నాడు.

**(ఈ) స్థూల శరీర నిర్ణయము :** స్థూల శరీర రూపమగు అన్నమయ కోశాభిమానిగా నున్న పరమేశ్వరుని విరాట్టుగా వ్యవహరింతురు. సూక్ష్మశరీరాభిమానము విడువక సకలప్రాణుల స్థూల శరీరములందు నేను నేనని యభిమానము ధరించుట వలన నితనికి వైశ్వానరుడనియు పేరుగలదు. వైశ్వానరుడనేక రూపములతో ప్రతీతి యగుటచే విరాట్టుడను నామము సార్థక మగుచున్నది.

ఏవికారములు లేని, అష్ట తనువులు లేని మరియు ఏ ఇతరమైనది లేని దానిని పరిపూర్ణపరబ్రహ్మము యనబడును. ఎందుకనగా పరిపూర్ణ పరబ్రహ్మమందు వికారములుగాని అష్టతనువులు గాని లేవు. అది యేది కానిది, పరిపూర్ణము తప్ప ఇతరములన్నియు ఎరుకనే యని తలచవలయును. ఈశ్లోకమునందు నిర్వికారనిర్దేహ బోధ మహావాక్యమనగా పరిపూర్ణబోధను పొందుము అని జెప్పబడినది కావున పరిపూర్ణ బోధనుగురించి క్లుప్తముగా దిగువ పేర్కొనబడినది.

శ్రీమద్రామదుగు శివరామదీక్షితులవారు తమగురువులైన శ్రీశ్రీధరస్వామి వారి నుండి పరి పూర్ణబోధను సాకల్యముగా గ్రహించిరని ప్రతీతి. ఈ పరిపూర్ణబోధ జనన మరణ రాహిత్యమునకు ఏకైక మార్గము. పరిపూర్ణప్రబోధ నిశ్చయము :

**1. పరిపూర్ణపరబయలు శాశ్వతమైనది.**

**2. నేను ఎరుక లేనే లేనిది, అశాశ్వతమైనది**

**3. నేను లేనసుటయే ఎరుక యందలి భ్రాంతి రహితము.**

కర్తృత్వరహిత కర్మాచరణతో కర్మాచరణ గావించుచు తనువు విడిచినావాడే (అహం పదార్థరహిత స్థితి నొందిన నాడే) వేయించిన విత్తనము మరల మొలకెత్తనట్లు భ్రాంతి రహితము కాగలదు. భ్రాంతిరహితమే మోక్షము.

పరిపూర్ణబోధజ్ఞుల కర్తవ్యమేమనగా అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము గురువు దృష్టద్రాష్టాంతముల ద్వారా ఉండజూచుకొని (ఉన్నదని ఆరూఢ పరుచుకొని) పరిపూర్ణ పరబ్రహ్మమునకు గాని మరియే యితరమునకుగాని పుట్టుక యెండమావుల జలమువలె, సురస్వప్నమువలె లేకనే తోచుచున్న అఖండ ఎరుకయగు సృష్టికారణమగు పరమాత్మను వస్తునిశ్చయముగా తెలుసుకొని తన నిజ స్వరూపమైన ఆ అఖండమెరుక లేనే లేదని నిరసించుట రీత్యా జన్మ కారణమును తొలగించుకొనుటయే. జనన మరణ రాహిత్యమునకు ఏకైక మార్గము. సృష్టికారణమగు పరమాత్మ తానే అని గ్రహించుటకు గురూపాసనయే మార్గము. గురుమంత్ర జపముచే గురుస్వరూపమే తానని ఆరూఢత చెంది ఆ గురుపరమాత్మ యందు తన స్థూల, సూక్ష్మకారణ, మహాకారణములు మానసికముగా నిత్యము గురునకు సమర్పించుచు ఎరువు సొత్తుగా తన జీవితమును నడుపుకొనుటకు వాటిని మరల గ్రహించి ధర్మ పద్ధతిగా మాత్రమే సకల కర్మలు చేయుచు కర్తృత్వరహితకర్మా చరణమువలన నైష్కర్మ్య సిద్ధి సాధించి జన్మరాహిత్యమును గాంతురుగాక!

**3. సర్వకాల సర్వావస్థేషు అహం పదార్థ రహిత వ్యాపారం కుర్యాత్ :** అహం అనగా 'నేను'. అని శబ్దార్థము. అహం పదార్థ రహితం అనగా నేను లేనిస్థితి. వ్యాపారం అనగా పని, కుర్యాత్ అనగా చేయుము. నేను లేకుండ ప్రతి పనిని చేయుము అని అర్థము. నేను అను శబ్దమునకు తాదాత్మ్య సంబంధముచే స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ, శరీరములన్నియు లక్షింపబడుచున్నవి. "అహం బ్రహ్మాస్మి" అనుమహా వాక్యములో 'అహం' అను మాటకు ప్రత్యగాత్మనే అర్థముగా గ్రహించవలసి యున్నది. భగవద్గీత యందు విభూతియోగమున అంతా పరమాత్మ స్వరూపముగా అభివర్ణింపబడుటలో అహం శబ్దమే ప్రయోగింప బడినది.

శ్లో॥ **అహమాత్మాగుడాకేశు సర్వ భూతాశయస్థితః।**
**అహమాదిశ్చ మధ్యంచ। భూతానమంత మేవచ॥** భ.గీ. 10-20

సర్వభూతముల (ప్రాణుల) హృదయములందు నేనే ఆత్మగానున్నాను. నేనే అన్ని ప్రాణుల యొక్క ఉత్పత్తి, స్థితి నాశనములకు కారణ స్వరూపుడనై యున్నాను. గనుక పరమాత్మ, ప్రత్యగాత్మలు, స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములన్నియు భ్రమస్వరూపులేయని **"భ్రమేణాహం భ్రమేణత్వం భ్రమేణోపాసకా జనః"** అను భ్రాంతిరహిత శ్లోకములో చెప్పబడినది.

"అహం పదార్థరహితము" నేనులేకుండ యని అర్థము, లేకుండ పోవుట – అర్థమేమి? విచారణ చేత, శాస్త్రప్రమాణము, గురువాక్యము, అనుభవము, యుక్తి మొదలగు వారిచే పరిపూర్ణపరబ్రహ్మమందు ఈ అహం పదార్థము లేనే లేదని ఆరూఢ పరచుకొంటే అని

అర్థము. అంతేగాని తానుండి ఈ విశ్వము, విశ్వకారణమైన 'అహం' అనే ఎరుక అదృశ్యమై పోతే అని అర్థంకాదు. ఎండ మావులుండగానే చూపుల కందని జలముగానవస్తున్ననూ అచట ఒక చుక్కైన నీరు లేనే లేదని నిశ్చయ జ్ఞానము కలిగినట్లు ఎరుక వుండగానే ఎరుక విశ్వములు అనేలేవని నిశ్చయమైనచో అని మాత్రమే అర్థము. ఇట్టి ఆరూఢత సిద్ధించినచో సర్వభ్రాంతులు సర్వ సంశయములు రహితమై జన్మ రాహిత్యమే చేకూరును. పరిపూర్ణ పరబ్రహ్మమందు అహం యనే ఎరుకకు స్థానముగాని మూలముగాని వున్నదనే భ్రాంతి సమసిపోతే వరకు జన్మరహితంకాదు. అహమే ఎరుక. ఎరుకే భ్రాంతి **"భ్రాంతి రహిత మిదం మోక్షం"** అన్నారు పెద్దలు.

కనుక 'అహం" ఎరుక లేనే లేదని ఆరూఢమై యున్నవారికి అనగా నేను లేకుండా పోయినవారికి జన్మరాహిత్యము కరతలామలకము. అంతేగాక వారికెట్టి కోరికలుండవు. కనుక క్రోదాగ్నులు ఉపశమించును. వారికి కామ్య బుద్ధిగాని కర్తృత్వ బుద్ధిగాని యుండదు. రాగద్వేషములు సుఖదుఃఖములు పాపపుణ్యములు సంస్కారములు వారి అంతః కరణమున అంట జాలవు. కావున **అహం పదార్థ రహితవ్యాపారం కర్తృత్వ రహితముగా కుర్యాత్ అనగా కర్మాచరణగావించుమని ఈశ్లోకము గురూపదిష్ట మార్గముగా సూచన చేయుచున్నది.**

**అహం బ్రహ్మేతి భావం విసృజ్య** : అనగా నేను బ్రహ్మనైతిని అను భావమును వదలుము అని హితవు జెప్పుచున్నది.

"అహం బ్రహ్మాస్మి" ఇది యుజుర్వేదాంతర్గత బృహదారణ్య కోపనిషత్తు నందలి ననుభ వాక్యము. బ్రహ్మవిద్యకు యోగ్యమైన మానవోపాధి యందు బుద్ధికి సాక్షిగా నున్న ప్రత్యగాత్మకు బ్రహ్మ ప్రకాశము వలననే నాది, నేనను అహం వృత్తి కలుగు చున్నది. అందు వలన అహం బ్రహ్మత్వనిర్ణయము సిద్ధించు చున్నది. "అస్మి" అనగా ఐతిని అని అర్థము. ప్రత్యగాత్మ అధోపరిణామము పొందుటచే జీవోపాధులందు జేరుచున్నది. బ్రహ్మనిర్ణయము తెలిసి యూర్ధ్వ పరిణామము పొందునపుడు తానే బ్రహ్మమగుచున్నది కావున "అహం బ్రహ్మాస్మి" అనగా నేను బ్రహ్మనైతిని అనునట్టి నిర్ణయము సార్థక మగుచున్నది. ఇదే తొలి భ్రాంతి. తొలగవలసినది ఇదే.

మహావాక్యములు నిర్ణయము వల్ల తాను బ్రహ్మ స్వరూపుడగుటను పరి పూర్ణబోధ యందు అఖండజ్ఞానఎరుకస్వరూప మని, ఎరుకై నిలుచుట యని అచల ఋషుల సిద్ధాంతము. మహావాక్యము లందు "అహం" నేననునది మిగిలి యున్నది. నేను లేకుంటేనే అది శుద్ధమని "యధానాహం తథా శుద్ధం" అని భ్రాంతి రహిత శ్లోకము వర్ణించినది. కనుక నేను లేకుండవుంటే యెట్లుండునో అట్లే శుద్ధమైన పరిపూర్ణముండును. నేను లేకుండుట చేతనే అది శుద్ధం మరియు నేను అను బ్రహ్మమునకు (ఎరుకకు) పరిపూర్ణ పరబ్రహ్మము నందు స్థానము లేదు. కనుక అహం బ్రహ్మేతి భావం విసృజ్య నేను బ్రహ్మననే భావము వదలియుండుమని నిర్ణయము.

**4. అహం రహిత నిష్ఠోభవ** : నేను లేననే భావమును దృఢ పరచుకొని అదే నిష్ఠలో నుండుమంటుందీశ్లోకము. అహం అనగానేను. నేననే అహం వృత్తి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములతో వ్యవహార కాలమున సంబంధపడి నేను అని పలుకు చున్నది. ఇంకా శ్రీకృష్ణదేశి కేంద్రులవారు క.ప. 134 **"అహమే తనువీ విశ్వం। బహమే**

**జీవేశ్వరులన। నహమే తద్దైక్యం। బహమే యహముకుమూలం। బహమణిగిన నణగునన్ని యనఘ చరిత్రా"॥** యని శెలవిచ్చి యున్నారు. అనగా శరీరమన్నను, విశ్వమనియన్నను, జీవుడని యన్నను, ఈశ్వరుడని, జీవేశ్వర ఐక్యమని యన్న అహమే యగును. అహంకారమే యగును. అహంకారమే అహంకారమునకు మూలము. గనుక అహం నశించిన సర్వము నశించునని భావము. మరొక క.ప. 139 **"లేని నీరాకడే స్వప్నానందము నీకు గురుడు పరిపూర్ణంబున్। పూనితెల్పి మేల్కొల్పిన। నేననకను నీవు బోవ నీ మేల్కదిరా"** అని అన్నారు. అనగా అచల పరిపూర్ణ పరబయలందు నీ వునికి లేదు నీవు అచల పరిపూర్ణ పరబయలు యొక్క ప్రతిబింబము యని నిశ్చయించుకొనడము స్వప్నము నందలి ఆనందమని నిర్ణయము. సద్గురుమూర్తి ద్వారా అచల పరిపూర్ణపరబయలు•యొక్క నిర్ణయము తెలసి మేలుకొన్నచో నేనను నీవు లేకపోదువు. అదే నీకు మేలుక. ఈ రీతిగా తెలుసుకొని అహం రహిత నిష్ఠతోనుండుమని ఈశ్లోకము హెచ్చరించుచున్నది.

**మూలాభావ మిదం జ్ఞాతుం నశరీరం నకిమస్తి** ॥౩౬॥
**ఇతి మంత్రం సదా జపేత్**

తా॥ మూలంలేని దీనిని తెలియుటకు శరీరము లేదు. ఏమియు లేదు. అను షోడశాక్షరీ మహామంత్రము. నిద్రవచ్చేదాక, చచ్చేదాక ఎల్లప్పుడు జపించవలయును.

మూలాభావ = మూలంలేని, ఇదం = దీనిని, జ్ఞాతుం = తెలియుటకు, నశరీరం = శరీరములేదు, నకిమస్తి = ఏమియూలేదు.

మూలంలేని దీనిని తెలియుటకు శరీరములేదు. ఏమియులేదు. ఈమంత్రమును సదా నిద్రవచ్చేదాక చచ్చేదాక జపించుమని అచల ఋషులు తమ శిష్యులకు చెప్పుదురు. ఇచ్చట చచ్చేదాక యనగా "అహం" నేను అను అహం భావము పూర్తిగా నశించు వరకు ఈ మంత్రము జపించవలయునని అర్థము. దీనిని మరచిన మరు క్షణముననే ఎరుక ఆవరించి అధో పాతాళమునకు త్రొక్కి పెట్టును. మూలం లేని యీ గుర్తెరిగే శరీరము యేమి లేదు అను నది షోడశాక్షరి మహామంత్రము. వీటి నిర్ణయము సద్గురువుచే విని వస్తు నిశ్చయముగా నీ మనంబునకు దృఢ మయ్యేవరకు నీవు ఈ మంత్రము జపించుమని నిర్ణయము. శ్రీకృష్ణ దేశికేంద్రులవారు గురు మంత్రార్థమును దెలుపుతు క.ద. 227 "తొలు మంత్రర్థ మెక్కడ। కలదోయని వేదుకనేల కలదంతటయా। వలిమంత్రర్థ మెక్కడ కలదో యని చూడనేల। కాదా చూచేది। వినేది యనేది తినేది। అలతొలుత దాన్ని నీవవలోకనము జేసి। కలకాల మెరుకాలు గలదాని విడువెరుక"। అని శెలవిచ్చి యున్నారు. అనగా మొదటి మంత్రమైన ద్వాదశి మంత్రార్థము నెచ్చటనో గలదని వెదుక నవసరములేదు. అది యెరుక మరుపు యనునది లేక సర్వత్ర నిండి నిబడీకృతముగా ముల్లు గ్రుచ్చసందులేక యున్నది. రెండవ మంత్రార్థము అనగా షోడశీ మంత్రార్థము ఎచట నున్నది యని విచారించవలసిన పనిలేదు. అదేగాదాచూచేది, వినునది, తినునది, గనుక ఇందు మొదటి మంత్రర్థమగు అచల పరిపూర్ణ పరబయలను దర్శించి ఎరుకమరుపు యను ద్వంద్వ పద్ధతిగల యెరుకను కలకాలము విడిచి యుండుమని భావము.

ఇచట ఇంకా కొంత వివరించుట అసందర్భమేమి కాదు. పరిపూర్ణ భావజ్ఞుడు గురువు ద్వారా తెలివి (జ్ఞానము) లేనే లేదని తెలుసుకొని క్రియ చేస్తుంటాడు. ప్రపంచీకుడు

తెలివి, తెలివికి తెలియబడేది సత్యమని భ్రాంతిజెంది కాంక్షతో కర్మ చేస్తాడు. ఎరుకే శాశ్వతమన్న భ్రాంతియే సర్వ భ్రాంతులకు మూల కారణము. శ్రీకృష్ణ దేశికేంద్రుల వారు క.ద. 230 "ఉన్నది పరిపూర్ణము లెం।దెన్నటికి యెరుకయనుచునిది దృఢమౌదా। కేన్నుమునే బోధించిన। తిన్నని యీ బోధ" అని మరియు క.ద. 150 **"సత్యమగు బట్టబయలు నసత్యంబగుయెరుక నెరిగి సద్గురు కృపచే సత్యము గాదని యెరుకను। సత్యముగా నమ్మియుంటే। చాలు చాలన్న"**। అని శెలవిచ్చియున్నారు. అనగా పరిపూర్ణము సత్యము, ఎరుక సత్యముగాదని, లేనే లేదని నమ్మిన (దృఢమైన) యెడల కర్మప్రవృత్తి పోత్సహించు త్రిపుటిగాని కర్మచేయు త్రిపుటిగాని లేవని అపుడే నమ్మకమగును. ఎట్లనగా ఎండమావులలో నీరు లేనేలేదని ఘట్టిగా తెలుసుకొన్న తర్వాత నీళ్ళున్నట్లుగానవస్తున్న లేనే లేవని నిశ్చయముందునట్లు కర్మను ప్రొత్సహించు త్రిపుటి – జ్ఞానము, జ్ఞేయము, జ్ఞాత మరియు కర్త, కర్మ కరణము అను త్రిపుటిచే కర్మ జరుగుచున్నది. జ్ఞాత యే కర్త, జ్ఞానమే కరణము (పనిముట్టు) లేనే లేవని దృఢమై కర్మ చేస్తే, ఆ కర్మ చేసియు చేయ నట్లే అగుచున్నది. ఈ రెండు త్రిపుటులు లేనే లేవని నిశ్చయమైన వారికి కర్మ ప్రవృత్తి కవసరమగు కాంక్ష (ఫలాసక్తి) గాని, కర్తృత్వాహంకారము గాని ఉండదు. కర్తృత్వ రహితముగా నిష్కామ కర్మ జరుగుచున్నది. ఉ॥ యజమాని చెప్పినట్లు లెక్కలు వ్రాయుట వల్ల ఫలాఫల దోషము గుమాస్తాకు ఎట్లు అంటదో అట్లే కర్తృత్వ రహితముగా కర్మలాచరించిన పరిపూర్ణ భావజ్ఞునికి చేసిన పనికి సంస్కారము ఉత్పత్తి కావు. అట్లు సంస్కారము ఉత్పత్తి కాకుండ కర్మలు చేయుట వల్ల జన్మ రాహిత్యము సిద్ధించును.

**శ్లో॥ అశరీరం సర్వదాఽస్తి శరీరం రహితం సదా**
**అయమేవ సద్యోముక్తి రన్యథా భ్రమకారణమ్॥**

శరీరము లేని పరిపూర్ణ పరబ్రహ్మమే ఎప్పుడు యుండి యున్నది. శరీర మెప్పుడును లేదు. ఈ సిద్ధాంతము దృఢమైన తక్షణమే సద్యోముక్తి లభించును. అనగా జన్మ రాహిత్యము సిద్ధించును.**"అంతా పరిపూర్ణ ముండగా నేనెక్కడ"**

**అహమన్నం సదానాద మితీహి బ్రహ్మవేదినమ్**
**అహమన్న మహం నాస్తి ఇతి నిశ్చయమేనహి** ॥32॥

అహమన్న మనెడి సదానాదమే బ్రహ్మను తెలుసుకొనుట. నేనే అన్నమన్న నేనేలేక పోవుట నిశ్చయము.

**1. అహమన్నం సదానాదమితీహి బ్రహ్మవేదినమ్ :** "అహం" అనేడి సదా నాదమే బ్రహ్మము అని తెలుసు కొనుట యని అర్థము. మొదట అహంను గూర్చి తెలుసుకొందము. అహంను గురించి శ్రీకృష్ణదేశిక ప్రభువులు క.ప. 134 అహమేతనువీ విశ్వం। బహమే జీవేశ్వరులన। నహమేతదైక్యం। బహమే యహముకు మూలం। బహమణిగిన నణగునన్ని యనఘ చరిత్రా"॥ అని శెలవిచ్చియున్నారు. అనగా శరీరమన్నను, విశ్వమని యన్నను, జీవుడనియన్నను ఈశ్వరుడని జీవేశ్వర ఐక్యమన్నను అహమేయగును. అహంకారమే యగును. అహంకారమునకు అహంకారమే మూలము గనుక అహం నశించిన సర్వము నశించునని జెప్పియున్నారు. ఈ పద్యమునందు ముఖ్యముగా అహం అనగా తనువు, విశ్వము, జీవుడు, ఈశ్వరుడు, జీవేశ్వర ఐక్యమని జెప్పబడినది. అంటే అహం అనగా బ్రహ్మమని తేట తెల్లమైనది.

శ్రు॥ అహమన్న మహమన్న మహమన్నన్నా అహమన్నాద్రోహమన్నాద్రోహమన్నదా"

వైఖరీ వాక్కుగల మానవోపాధి యందున ప్రతివ్యక్తి "నేను" అని తనను గురించి పలుకుచున్నాడు. మాటలు వచ్చినది మొదలు ఆబాలగోపాలము మరణము సిద్ధించు వరకు లింగవయో భేదములేక నేను నేనని పలుకుచుండుటచే దీనిని వ్యాకరణకర్తలు సర్వనామములో ప్రథమస్థాన మిచ్చినారు.

వాక్కు వైఖరీ రూపములో మానవులందున్నది గనుకనే నేను శబ్దమునకు వాగేంద్రియము ద్వారా పలుకుచున్నారు. ఆ వాక్కే మధ్యమా పేరుతో పశుపక్షాదులందుండి అవ్యక్త శబ్దములచే తవు భావవములను కనీసం స్వజాతి ప్రాణులకైనను తెలియజేయగలుగుచున్నవి. తరులతా గుల్మాదులందు ఈవాక్కు యింకను సూక్ష్మమై తన శరీర రక్షణకై తగుదిశను అన్వేషించి ఆదిశలో వ్యాపించుచుండును. ఈ తెలివినే పశ్యంతి వాక్కందురు. పాషాణములందు తెలివి మరువు రూపములో నుండి శక్తి రూపములో గుప్తమై మరుగై యున్నది. దీనినే సామాన్య జ్ఞానమని కూడ నందురు. ఈ తెలివి (నేను) సామాన్యముగా నున్నను లేక మానవోపాధి యందు విశేషముగా నున్నను లేక వరా, వశ్యంతి, మధ్యమ, వైఖరీ వాగ్రూపములుగా ప్రకాశించినను చరాచర రూపములగు సర్వోపాధులందును తెలివి రూపంగానో శక్తి రూపముగానో, జీవరూపంలో గుణరూపముగానో వుండియే యున్నది. మహావాక్యములలో దీనినే "ప్రజ్ఞానం బ్రహ్మ" అనీ, అహం పదార్థమని, త్వం పదమనీ, అయమాత్మయనీ, సృష్టికి పూర్వము బ్రహ్మయనీ, తత్పదమనీ వివిధ నామములతో అభవర్ణించబడింది.

నేనంటే బ్రహ్మమని తెలుసుకొన్న మీదట నేనే లేక పోవుట నిశ్చయము ఎట్లో విచారింతము. నేనే లేక పోవుట నిశ్చయ మనగా విచారణ, శాస్త్ర ప్రమాణము, అనుభవము, యుక్తిచే గురు వాక్యము ద్వారా ఈ అహం పదార్థము లేనేలేదని ఆరూఢ పరుచుకొంటే అని అర్థము. అంతే గాని తాను వుండి ఈ విశ్వము ఈ విశ్వమునకు కారణమైన 'అహం' అనె యెరుక అదృశ్యమైపోతే అని అర్థముగాదు ఎండమావులుండగానే చూపులకు అందలి జలముగా గానవస్తున్న అచట ఒక చుక్కైన నీరు లేనే లేదని నిశ్చయ జ్ఞానము కలిగినట్లు ఎరుక యుండగానే ఎరుక విశ్వములు లేనేలేవని ఆరూఢమైనచో అని మాత్రమే అర్థము. ఇట్టి ఆరూఢ సిద్ధి వల్ల సర్వ భ్రాంతులు సంశయములు రహితము కాగలవు. అప్పుడే జన్మరాహిత్యము.

**"జనన మరణ రాహిత్యమే మోక్షము"** ఎరుకే భ్రాంతి "భ్రాంతి రహిత మిదం మోక్షం" అన్నారు పెద్దలు. పరిపూర్ణమందు యెరుక పుట్టనేలేదు అని క్షణమైన మరువక యుండమన్నారు. అచల ఋషులు.

కనుక ఎరుక లేనేలేదని ఆరూఢులైయున్నవానికి, అనగానేను లేకుండా పోయిన వారికి జన్మ రాహిత్యము కరతలామలకము అంతేగాక వానికి ఎట్టి కోరికలుండవు. వారికి కామ్య బుద్ధిగాని, కర్తృత్వ బుద్ధిగాని యుండదు. రాగద్వేశములు, సుఖదుఃఖములు, పాపపుణ్యముల సంస్కారములు వారినంట జాలవు. "నేను లేనిదే అది" అంతా పరిపూర్ణ పరబ్రహ్మముండగ నేనెక్కడ.

**నప్రకృతిః, నపురుషో నకూటస్థః నచాత్మా**
**నిత్యోహం పూర్ణో నిర్వికారో నిరాఖ్యః**
**నిరాకాశ మివాత్మానం తూష్ణీభూతంస్థితస్సదా** ॥3౮॥

అనగానేను భోజ్య స్వరూపమైన యన్నమును. నేను అన్నమును భక్షించువాడను.

శ్రుతి॥ "అహమను రభవం సూర్యశ్చ అహమే వేదం సర్వమస్మామి" నేను మనువును సూర్యుడను అయితిని. నేనే భోజ్యరూపమై దీనినంతను తినుచున్నాను. అన్నము భుజించుటకు పూర్వము అన్నమును మ్రొక్కి తినుట ఆచారము. కంచము నుండి అన్నపుమెతుకులు క్రింద పడినచో వెంటనే అన్నము సల్లరాదు "అన్నం పరబ్రహ్మ స్వరూపము" అని ఇకముందు అన్నంసల్లకుండ భుజించవలయునని పెద్దలు హితవు జెప్పేవారు. కాని పెద్దలమాటలు సద్దిమూట అనే భావముతో సరిపెట్టుకొని పోయేవారము. కాని అన్నమే బ్రహ్మమనెడి భావము ఎట్లో యిప్పుడు అర్థమగుచున్నది.

తైత్తిరీయోపనిషత్ నందు భృగువల్లీ రెండవ అనువాకమునందు "అన్నం" బ్రహ్మేతివ్యజానాత్। అన్నా ద్ధ్యేవ్య ఖల్విమాని భూతాని జాయంతే అన్నేన జాతానిజీవంతి। అన్నం ప్రయంతభి సంవిశంతీతి॥

భృగువు తపస్సు జేసి అన్నమును బ్రహ్మముగా తెలుసుకొనెను. ఏలననగా కనబడు ఈ ప్రాణము అన్నం నుండియే పుట్టుచున్నది. అన్నంవలననే జీవించుచున్నది. మరణించిన తరవ్వాత అన్నము నందే తిరిగి లీనమగుచున్నది.

జనకుని పాదసన్నిధిని శుకుడు ధర్మోపదేశము పొందుటకై వచ్చి శుశ్రూషలు చేయుచున్నకాలములో అతనికి జ్ఞానము కలిగించుటకై ప్రపంచములోగల వస్తువులన్నింటిలో పరమనీచమైన పదార్థమేదో దానిని తెమ్మని జనకు డాజ్ఞపించెను. శుకుడు తిరిగి తిరిగి మానవ పూరీషము (మలము) కన్న హేయమైన పదార్థములేదని యెంచి దానిని తెచ్చెను. అంత జనకమహారాజు అగ్నిని రగుల్కొల్పి దాని యందా పురీషము పేల్చి ఓ! పురీషమా నీకన్న హేయవస్తువు ప్రపంచములో లేదని శుకుడు నిన్ను తెచ్చినాడు. నీ వేమందువు? అని ప్రశ్నించగా ఆ పురీషము నుండి నాకిప్పుడు ఈ హేమరూపము కలిగినదేగాని, నా పూర్వ రూపము మధురాతి మధురమగు పంచభక్ష పరమాన్న రూపముగదా! దానికి పూర్వ రూపము పంచభూత సముదాయము. అంతకు పూర్మము ఆత్మస్వరూపమే. నన్ను హేయరూపముగా చిత్రించిన శుకుని గుర్తే హేయరూపము. నేను ఆత్మ స్వరూపమే గాని అన్యముగాదు. అని బదులిడెను. సర్వమునందు ఆత్మను దర్శించువాడే సమదర్శి. అన్నియు ఆత్మ యొక్క స్వరూపములే "ఆత్మనోన్యం నకించన" ఆత్మ వినా ఏమిలేదు. అహమన్న, నేనన్న ఒక్కటే నేనన్న, ఆత్మ యన్న బ్రహ్మమన్న ఒక్కటే. అదేఎరుక, మరొక చోట కం॥........ **నేరానొకవేళను లేనటంచు। నూహ పొడమినన్॥** అనగా పరబయలున పిపీలికాది బ్రహ్మపర్యంతరము సకలము లేకనే వచ్చి అరఘడియలో కోటి పర్యాయములు వెళ్ళుచుండును. అయినా నేను లేననే లక్షణము నాకు తెలసిన యెడల ఎప్పుడు రాకుండపోకుండ లేకపొదును.

పైన పేర్కొన్న వివరముల బట్టి మనకు తెలియవచ్చిన దేమనగా అన్నమే బ్రహ్మము. అంతేగాక నేను భోజ్య స్వరూపమైన అన్నమును, అన్నమే నేను, నేనే బ్రహ్మమును అని స్పష్టమైనది.

**2. అహమన్న అహం నాస్తి। ఇతి నిశ్చయమేనహి :** నేను అన్నమన్న, నేనే లేక పోవుట నిశ్చయము అని అర్థము. నేనే అన్నమన్న నేనే బ్రహ్మనని తెలియుట.

నేను అనగా ఏది? అనువస్తు నిర్ణయ జ్ఞానము ముందుగా మనము తెలుసుకొందము.

తా॥ నేను ప్రకృతిని (స్త్రీని) గాను, పురుషుడనుగాను, కూటస్థుడను గాను, ఆత్మనుగాను, నేను నిత్యుడను. పూర్ణుడను, నిర్వికారుడను, నామము లేనివాడను, నిరాకాశమువలె నేను మౌనముగా నుండు ప్రాణివలె ఆత్మగా నెప్పటికి నున్నవాడను.

**వివరములు :**

**1. నప్రకృతి, నపురుషో:** నేను ప్రకృతి యనగా స్త్రీని గాను మరియు పురుషుడను గాను శ్వేతరక్త ప్రభాభిన్నం= తెలుపు, ఎరుపు వర్ణములకు భిన్నమైనదని అర్థము. "అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం" అనగా మూల ప్రకృతి యెరుపు తెలుపు నలుపు అను త్రివర్ణాత్మకమై యున్నదని వర్ణించబడినది. సత్వగుణము తెలుపు, రజోగుణము ఎరుపు, తమోగుణము నలుపు, కనుక ప్రకృతి త్రిగుణాత్మకమూ, త్రివర్ణరంజితమూనై యున్నది. దానిని పురుషుడు త్రిగుణాతీతుడని చెప్పబడుచున్నాడు. అతని యందు త్రిగుణములతో పాటు వాని వర్ణములు కానరావు, కాని ఆ త్రిగుణములు అతని యందు అసలు లేనేలేవా? అంటే బీజరూపముగానున్నవి అనియే చెప్పవలసి యుండును. ఏలననగా త్రిగుణాత్మక ప్రకృతికి పురుషుడే ఆశ్రయ స్థానమైయున్నాడు. పురుషుని కంటే అన్యదేశమున లేదు. అన్యదేశమున నున్న దంటే బ్రహ్మమున ఏక దేశీయతయు అద్వైతహానియు సంభవించును. పురుషుని వినా ప్రకృతి కునికియే లేదు. పురుషుడే ప్రకృతికి, దాని నుండి కలిగిన సమస్తమునకూ ఆధారమూ అధిష్ఠానము అయి యున్నాడు. పురుషుని యందు ప్రకృతి ఒక భాగమందున్నది. అని "పాదోస్య విశ్వా భూతాని త్రిపాదస్యా మృతందివి" అని కొందరు, ఇదియును గాదు పురుష ప్రకృతులు రెండును నేను మేనుల వలె ఓతప్రేతమై అవినాభావ సంబంధము కలిగి యున్నవని సిద్ధాంతము. గురుస్తోత్రములో ఇట్లు పేర్కొనబడినది. శ్వేతమనగా తెలుపు. రక్తమనగా ఎరుపు. సత్వరజస్తమోగుణములున్నూ వాని యొక్క శ్వేత (శుక్ల) రక్త (లోహిత) నీల (కృష్ణ) వర్ణములున్నూ తోచబడని లేక ఆవిర్భావము చెందని స్థితియే బ్రహ్మము అని పిలువబడును. అది శ్వేత రక్తాది వర్ణములకు భిన్నమైనది. అయితే లోహిత శుక్ల కృష్ణాది వర్ణములన్నియు తనయందు బీజరూపముగా నుంచుకొన్న ఆ వస్తువున కేదో వర్ణముండ వలదా? కనుకనే దానిని పాటల వర్ణమన్నారు. మరియు "శుద్ధస్ఫటిక సన్నిభం" అన్నారు. స్ఫటికమునకు ఏవర్ణములేకున్నను అది అన్ని వర్ణములు పులుముకొను సమర్థత కలిగియున్నది. అట్లే రక్త శుభ్రాసిత ధూమ్ర, సునీలములను పంచవర్ణములు దాని యందు ప్రకటమగుచున్నవి.

పురుషుడే సర్వమంగళ స్వరూపుడగు శివుడు. ప్రకృతియే ఆ పురుషుని యొక్క శక్తి, అగ్నిని విడిచి దాని దాహకశక్తి వేరుగా నుండనట్లే పురుషుని విడిచి పురుషశక్తి వేరుగా నుండజాలదు పురుష ప్రకృతులుగా లేక శివశక్తులుగా గురుపాద యుగళము వర్ణింపబడినది. గురు పాదములో దక్షిణ పాదము శివ స్వరూపము. శివశక్తులే రెండు పాదములు. కాని రెండు కలసి యేక రూపమగు బ్రహ్మపదము. కనుకనే గురు పాదముల రెండింటిని దగ్గరగా జేర్చి ఏకము జేసి భక్తుడు నమస్కారములు పూజలు చేయును. అట్లేకము చేయునపుడు శివశక్త్యాది భేదములేని "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ".

పురుష ప్రకృతులు సాపేక్షికములు ద్వంద్వములు. ద్వంద్వములన్ని పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనివే కనుక పరిపూర్ణ పరబ్రహ్మము పురుష ప్రకృతులు లేనిదని ఈ శ్లోకము నందు జెప్పబడినది.

**2. నకూటస్థ:** బ్రహ్మము తనయందు మాయచే కల్పించబడిన ఉపాధులలో నుండుటచే బ్రహ్మమునకే కూటస్థుడని, ప్రత్యగాత్మయని పేరు.

కూటమైన స్థూల సూక్ష్మ శరీరములకు అధిష్ఠానమైయుండుటచే బ్రహ్మము కూటస్థుడనబడెను. వాస్తవమున కూటస్థుడు బ్రహ్మమే. కావున బ్రహ్మ లక్షణములైన సత్య, జ్ఞాన, అనంతత్వములు గలిగి యున్నాడు.

ఇట్లు గలిగి యుండుట జాగ్రత్, స్వప్న సుషుప్తుల యందు అనుభమున తెలియనగును. ఆ అవస్థల యందు దృశ్యములు సత్యములై తెలియబడునవియై యున్నవి. వాని నెరుగు సంవిత్తు (తెలివి) సత్య జ్ఞానానంత స్వరూపమై యున్నది. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము కూటస్థుడుగాదు. పరిపూర్ణ పరబ్రహ్మ ఉపాధి లేక ఆవరణలేదు. శరీరములేదు. అది దేనికి ఆధారము అధిష్ఠానము కాదు. "అశరీరం సర్వదాస్తి" అనేశ్లోకము ఈ భావమును మరింత బలపరుచుచున్నది.

**నచాత్మా :** నేను ఆత్మనుగాను. ఆత్మయనగా నేమో తెలుసుకొందము. ఆత్మ సకలప్రాణులయందు సమస్త వస్తువులందు బాహ్యాభ్యంతరములనే భేదములేకుండ వ్యాపించి యున్నదని వ్యుత్పత్యర్థము. ఆత్మ, బ్రహ్మ అని రెండు శబ్దాలచే వ్యవహరించబడే వస్తు వొక్కటియే గాని వేరుగాదు.

ఏషు సర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే
దృశ్యతేత్వ గ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిని. కఠో 1-3-12

తా॥ ఏ యాత్మ సర్వభూతములయందు కనుపించకుండ గూఢముగా నున్నదో, ఆయాత్మను తత్వవేత్తలు తమ సునిశిత మగు ఏకాగ్రమగు బుద్ధిచే చూచుచున్నారు.

తా॥ "ఆత్మావాఽరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధిధ్యాసి తవ్యః" ॥అదియెట్టిదనగా: ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది. ధ్యానముచే పొంద దగినది. అనగా మనస్సుచే తెలియ దగినదిగా నున్నది. **పరిపూర్ణమనగా:**

"స్వయమేవ పరంబ్రహ్మ పూర్ణమద్వయ మక్రియం"॥

తా॥ పరిపూర్ణ పరబ్రహ్మము తనయందు గాని, తనకు వేరుగా గాని, రెండవ దనే దేమియు లేక ఒక్కటియై నిష్క్రియమైయున్నది.

యఏవం నిర్బీజంవేద, నిర్బీజ ఏవనభవతి॥ సుబాలోపనిషత్॥

తా॥ అది బీజరహితమని, అది దేనికి కారణం కాదని తెలుసుకొన్నవాడు బీజరహితుడై తిరిగి పుట్టడు.

"నతత్ర చక్షుర్గచ్ఛతి, నవాఙ్గచ్ఛతి, నోమనః నవిద్మోనవి జానీయో, యథైవ తదను శిష్యా దన్యదేవ తద్విదితాదథో అవిధితాదధి యితి శుశ్రుమ పూర్వేషాయే నస్తద్వ్యా చచక్షిరే" కేనోపనిషత్॥

తా॥ బ్రహ్మము వాక్కుకు అందదు! మనస్సుకు చక్షువుకు అందదు, జ్ఞానమునకు గూడ తెలియరానిది ఏదో, అది తెలిసిన దానికంటెను తెలియరాని దాని కంటెను వేరుగా నున్నదని పూర్వము పెద్దలు తెలుసుకొని శిష్యుల కుపదేశించిరి.

"అచక్షుష్క, మశ్రోత్ర మవాగ్గ మనః"

తా॥ కండ్లు, చెవులు, వాక్కు, మనస్సులు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము.

"అప్రాణోహ్యమనః శ్శుభ్రోహ్యక్షరాత్ పరతః పరః" ॥ముండక॥ఉ.
తా॥ మనః ప్రాణములు లేనిది. అమృత స్వరూపుడగు అక్షర పురుషుని కంటే పరుడగు పురుషోత్తముని కంటె పరమైనది (క్షర, అక్షర పురుషోత్తములకు పరముగా నున్నది అని తెలియవలయును).

**4. నిత్యోహం :** నిత్యుడను, అనగా శాశ్వతుడను, పరిపూర్ణపరబ్రహ్మము నిత్యమై శాశ్వతమైనది. నిత్యం అనగా బ్రహ్మము కాలత్రయములందు శాశ్వతమై యుండునది అని సామాన్యార్థము. అనగా దాని అస్థిత్వమునకు అనగా వునికికి మాత్రం భంగం లేదన్నమాట. కాని దాని రూపనామములు నిరంతరము మారుతూనే యున్నవి. అయినను వస్తువు యొక్క యునికికి భంగము కలుగుట లేదు. వాఙ్మనసులకందే సమస్తము గొప్పదైన ఆ పరబ్రహ్మస్వరూపమే. ఏ వస్తువు కేవలము నశించి పోవుట లేదు. ఉదాహరణకు ఒక చెట్టును నరికితే కట్టెలు, కట్టెలును కాల్చితే బొగ్గునుసి, ఆ నుసిగాలిలో ఎగుర గొట్టిన వాతావరణము నుండి నేలపై వ్రాలి మన్ను రూపము వహించుచున్నది. కనుక చెట్టు కేవలము నాశనము కాలేదు. (Matter is indestructible) అనగా పదార్థమునకు నాశనము లేదు. అని విజ్ఞాన శాస్త్రము చెప్పుచున్నది. అదే విధముగా బ్రహ్మము నానా రూపములు చెందుచున్నది. ప్రళయానంతరము సృష్టికి పూర్వమున్న స్థితిలో నుంటున్నది. కనుక సృష్టికి పూర్వము, సృష్టి అనంతరము, సృష్టి కాలమునందు అనగా భూత భవిష్యత వర్తమాన కాలములయందు బ్రహ్మ పదార్థము యేదో రూపములో వుంటూనే యున్నది. కనుక త్రికాలా బాధ్యమన్నారు. సద్రూప మనగా నిదియే. బ్రహ్మమును ఈ దృష్టితోనే నిత్యమన్నారు. అంతేగాని నామరూపములో కూడ మార్పు లేదనే అర్థములోకాదు. మార్పు చెందేది మాయ. కనుక యిది మాయా బ్రహ్మమనాలి. "ఏకం అనేకం భవతి" అనే న్యాయంగా ఒకే బ్రహ్మము ద్వివిధముగా నున్నది. నిత్యా నిత్యములనే ద్వంద్వలక్షణములుగా నున్నది. నిత్యానిత్యములనే నిర్ణయము ఎరుగని కేవల నిత్యత్వ మొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. అందుకే 'నిత్యోహం' నిత్యుడేనని పరిపూర్ణపరబ్రహ్మమును ఈ వాక్యమున జెప్పబడినది. శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ప.51. **"బయలనిన నిత్యవస్తువు బయలన నొక్కరీతి నుండు బహ్మాండములో"** అని వర్ణించి యున్నారు. బయలు నిత్య వస్తువనగా, పరిపూర్ణ పరబ్రహ్మము శాశ్వతమైనది. కాలత్రయమలలో బ్రహ్మాండము మార్పు చెందునట్లు (ప్రళయము పొందునట్లు) మార్పుచెందక యుండినదని సెలవిచ్చియున్నారు.

**5. పూర్ణో :–** పూర్ణుడను పరిపూర్ణపరబయలే పూర్ణముగా నున్నది. పూర్ణం అనగా నిండుకొని యున్నదని అర్థము. దేనిని నిండుకొని యున్నది అని ప్రశ్నిస్తే తన యావరణ యందది పూర్తిగా నిండుకొని యున్నది. బ్రహ్మాండ భాండము లన్నియు ఆ యెరుక యొక్క ఆవరణము నందుండుటచే వానియన్నిటి బాహ్యాంతరముల యందు ఆ యెరుక పూర్ణమై యున్నదే కాని తన యావరణము ఎంత పెద్దదైన "మహితోమహియాన్" అని చెప్పబడిన దాని కొక మితి మాత్రమున్నది. సూర్య చంద్ర నక్షత్రాది నవగ్రహము లెంత గొప్పవైన ప్రకాశవంతమైన అవి అన్నియు నొక మితి కలిగి యున్నవే యని విజ్ఞాన శాస్త్రము చెప్పుచున్నది.

మనకు తెలియబడుచున్న విశ్వాకారమగు బ్రహ్మము విశ్వగతమును, విశ్వాతీతమున్నై

పూర్ణముగా వస్తువు యొక్క వెలుపల, లోపల ఆకాశము వలె సర్వ వ్యాపకమై నిండుకొని యున్నదని ఇతరులందురు. దీనినే ప్రత్యక్ష పూర్ణమని చెప్పవచ్చును. ఏలననగా ఇది అంతటా నిండుకొని యున్నట్లు గానవచ్చును. ఎండమావులందు నీరువలె ప్రత్యక్షముగా గానవచ్చినను ఎండమావులందు నీరు ఎట్లు లేదో పూర్ణముగా గానవచ్చినను ఎరుక (ఆత్మ) సకల దేశమందు నిండియున్నట్లు తోచినను నిజముగా నిండియే లేదు. అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతట నిండియున్నట్లు గానవచ్చినను ఏక దేశీయమైయున్నది. వాక్కుకు, కంటికి, మనస్సుకు ఎంత మాత్రము గోచరించని పరిపూర్ణ పరబ్రహ్మమే సకల దేశములందు నిజముగా నిండి పూర్ణమై యున్నది. కనుక ప్రత్యక్ష వస్తువైన ఎరుక కంటే పరోక్షమైయున్న (కానరాని) పరిపూర్ణ పరబ్రహ్మమే పూర్ణమై యున్నది.

**6. నిర్వికారో :** అనగా వికారములు లేనిది, పరిపూర్ణ పరబ్రహ్మము ఎట్టి వికారములు లేనిది. షడ్భావ వికారములు అనగా ఆరు వికారములు చెప్పబడ్డవి.

1) అస్తితే = తల్లి గర్భమందుండుట. 2) జాయతే = పుట్టుట. 3) వర్ధతే = పెరుగుట. 4) పరిణమతే = పరిణామము చెందుట 5) అపక్షీయతే = క్షీణించుట. 6) వినస్యతే = నశించుట. ఈ వికారములన్నియు ఆవరణరూపమైన దేహమునకే గాని ఆత్మ రూపమైన దేహికి లేవు. నేను మేనులు రెండు ఒక్కటైనా స్థూల రూపమైన మేను మాత్రమే దృగ్గోచరమగుచున్నది. దాని వికారములే కనబడుచున్నవి. "నేను" కంటికి కానరానిది. అందుచే దాని వికారములు కండ్ల బడుటలేదు. దానికి కూడ వికారములున్నవా? అంటే తప్పక యున్నవి. ఇచ్ఛాసంకల్ప రాగ ద్వేషాదులన్నియు వికారములే గదా! అట్టివి మనోధర్మములుగాని ఆత్మ ధర్మములుగావని చెప్పవచ్చును. కాని అట్టి మనస్సు దేని వికారము? ఆత్మ వికారమేగదా! అయితే అది వికారమని ఎందుకన్నారంటే సృష్టి సంకల్పము కలుగునప్పుడు దాని యందే వికారములు కానరాలేదు. మొదట్లో అట్టి నిర్వికార స్వరూపుడనే నేను. నాకు యిపుడుజీవ లక్షణములు సర్వ వికారములు కల్గినవి అను స్వస్వరూపాను భవము కలుగుచున్నది. ఇట్టి వికారములు పరిపూర్ణ పరబ్రహ్మమందు లేవు.

**7. నిరాఖ్యః :** ఆఖ్యయనగా పేరు నిరాఖ్యః అనగా ఏ పేరులేనిది. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఏ పేరు లేదు శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు క.ద.44 **"బట్టబయలనుచు దీనికి। మొట్ట మొదట పేరు లేదు। ముదమున ఎరుకే। పుట్టి పెర్బెట్టి దీనిని। పట్టుకల వ్యాదలేక। పారిపోవునురా"**। అని శెలవిచ్చియున్నారు. మరియు మరొకచోట క.ప. 38 **"పేరచలమనుచు బయలని। పేరెప్పుడు లేదు మనము బెట్టుట చాతన్। పేరాయె బయలుకిప్పుడు పోరానివు నేను మృషమని పోతేజాలున్"** అని శెలవిచ్చియున్నారు. అచలము పరిపూర్ణము బట్టబయలు యని పలుకు నామములు మన నిర్మితములే కాని మనము లేకముందు పరిపూర్ణపరబయలుకు ఏపేర్లు లేవు. గనుక ఎరుక అచలమునకు నిర్ణయించిన నామములు తాను పెట్టుకొని ఆనందించుటకు బదులుగా తనకు అచల పరిపూర్ణపరబయలందు మూలముగాని నిలిచేందుకు స్థానముగాని లేదని గురుమూర్తి చేత వున్నదివున్నట్లు తెలుసుకొని తాను లేకపోవుట జనన మరణ భ్రాంతి రహితమునకు చాలునని భావము.

పరిపూర్ణపరబ్రహ్మమని, బయలని, బట్టబయలని, ఉత్తబట్టబయలని, పరమపదమని, గురుగుహ్యమని, అనంతమని, స్థిరమని, అచలమని, మొదలగు పేర్లు నిరపేక్ష కేవల బ్రహ్మము (Absolute) నకు, వ్యవహారార్థము కల్పించబడ్డాయి. నామరూపాలు మిథ్య అనీ, కల్పితములని, కేవల బ్రహ్మ మొక్కటే సత్యమని శాస్త్రము ఉద్ఘోషించుచున్నాయి. కనుక ఏనామమున్ను పనికి రాదు. అయినా అచలము, బయలు, బట్టబయలు, ఉత్తబట్టబయలు పరిపూర్ణమని ఈ సాంప్రదాయమునందు ఆ కేవల బ్రహ్మమును వాడుచున్నారు. కాని అందందు, అచలము, బయలు, పరిపూర్ణము అనే మాటలు భిన్న భిన్నార్థములలో వాడబడ్డాయి. పరిపూర్ణమనే మాట ఒక్కటే కేవల బ్రహ్మమును సూచించుటకు వాడబడింది. కనుక ఆ ఒక్క మాటలోనే దానిని వాడుతున్నారు.

**8. నిరాకాశమివాత్మానం తూష్ణీ భూతం స్థితస్సదా :** అనగా నిరాకాశము వలె నేను తూష్ణీ భూతమగు నాత్మగా ఎల్లప్పుడు నున్నానని యర్థము. పంచ ఆకాశములు, పరాకాశము, దహరాకాశము నిర్వయవాకాశము సూర్యాకాశము, భూతాకాశ మని ఐదు విధములుగా జెప్పబడినది. ఈ ఐదాకాశములకు పరమైనది శ్రేష్ఠమైనది నిరాకాశము మరియు అదే పరిపూర్ణపరబ్రహ్మము. 1) ఆకాశము యొక్క నిజాంశమువలన శోకము కలిగినది. శోకమునందలి యాకారశూన్యత శరీరేంద్రియములందు తెలియుచున్నది. 2) ఆకాశము వాయువుతో జేరినపుడు కామములు కల్గుచున్నవి. కామమునందు జ్ఞాన శూన్యత్వము, చంచలత్వమను రెండును దెలయుచున్నవి. 3) ఆకాశము అగ్నితో జేరినపుడు క్రోధము కల్గును. క్రోధము నందు జ్ఞాన శూన్యత్వము నగ్ని వేడిమియుగలవు. 4) ఆకాశము జలముతో జేరినపుడు మోహము కలుగుచున్నది. మోహము నందు జ్ఞాన శూన్యత్వము, ప్రాణము యొక్క మోహరూప జ్ఞాన సంబంధమగు కోరిక కలుగుచున్నది. 5) ఆకాశము పృథ్వితో జేరునపుడు భయము కలుగుచున్నది. భయమునందు జ్ఞాన శూన్యతయు పృథ్వి యొక్క జడత్వము తెలియబడుచున్నవి. ఆకాశమునకు శబ్దమును తన్మాత్రగలదు. నిరాకాశమన్నపుడు కామ, క్రోధ, లోభ, మోహభయము మరియు శబ్దతన్మాత్ర యేమియు లేకుందను. భయము లేనప్పుడు సంశయముండదు. సంశయము లేనప్పుడు భ్రాంతి రహితము. మరియు "నిశ్శబ్దో బ్రహ్మ ఉచ్యతే" అప్పుడు నిరాకాశమందు శబ్దతన్మాత్ర కూడలేకుండును. భ్రాంతి రహితమైనప్పుడు పలుకులేదు. కావున భ్రాంతి రహితము కలిగినవాడు నిరాకాశముగా మౌనముగా నుండు ప్రాణివలె చలనము లేని ఆత్మస్థితివలె యుండును.

**మోహకామాది సంబంధ మహం బ్రహ్మేతిభావనమ్**
**నిగమాగమశాస్త్రాణి ఉచ్ఛిష్టమివతత్త్యజ** ॥౩౯॥

అరిషడ్వర్గ సంబంధమైన కామక్రోధ, లోభ, మోహ, మదమాత్సర్యములను అహం బ్రహ్మయను భావమును, ఆగమ నిగమ శాస్త్రములను ఉచ్ఛిష్టముల వలె (ఎంగిలి పడినవి గావున) వదలివేయుము.

**1. మోహకామాది సంబంధమ్ :**

శ్రీ పరుశురామ నరసింహ దాసులవారు అరిషడ్వర్గములను గూర్చి యిట్లు వర్ణించి యున్నారు.

47 సీ॥ కోరుట కామంబు కోరిన యర్థంబు గొనసాగ కుండిన క్రోధమగును। వచ్చిన ద్రవ్యంబు వదలకుండుట లోభ మాధనాపేక్ష మోహంబు నగును। ధనమున్నదని మోదమున నుబ్బినాకేమి కొదువని గర్వించుటది మదంబు। తన ద్రవ్య మపహరించిన జనులందున మది నీర్ష్యనుంచుట మత్సరంబు। అనుచు నీశత్రుషట్కవర్గముల నణచి। శాంతి జెందిన పురుషుండు సర్వసముడు ॥రమ॥ అనగా కోరుట కామము కోర్కె కొనసాగనిచో క్రోధము, వచ్చిన ద్రవ్యము వదలక పోవుట లోభము, ద్రవ్యముపై అపేక్ష కలిగి యుండుట మోహము, ధనము కలదనియు యుబ్బుట మదము, తన ద్రవ్యాపేక్షమోహము, తనద్రవ్యమును అపహరించినవాని మీద యీర్ష్యమత్సరము, గనుక ఈ అరిషడ్వర్గముల నణచి శాంతి జెందవలెను.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంఙ్గస్తే షూపజాయతే
సంఙ్గాత్సంజాయతే కామః, కామాః త్క్రోధోఽభి జాయతే॥ గీత 2-62

అనగా విషయచింతన వలన సంగమును, సంగమువలన కామము, కామము వలన క్రోధము కలుగును, క్రోధము వలన సమ్మోహము, సమ్మోహము వలన స్మృతి భ్రంశము, స్మృతి భ్రంశము వలన బుద్ధినాశనము, బుద్ధినాశము వలన సర్వనాశనము సంభవించునని భగవద్గీత వుద్ఘాటించుచున్నది. ఇన్నిటికి మనస్సు జ్ఞానేంద్రియాలచే విషయ పంచకమును గుర్తించుట మూల కారణమైయున్నది. ఈ వ్యష్టి మనస్సుకు మూలకారణము అధిష్ఠానము అగు సమష్టి మనోరూపమగు గుర్తులేక శుద్ధఎరుకే (Supreme Consciousness) కారణముగానున్నది. దానిని పరిపూర్ణ బ్రహ్మావలోకనముతో నిర్వీర్య మొనర్చిననే తప్ప అంతః కరణమునకు శాంతి లభించదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును **"చూస్తేనే యెరుక పారిపోవునురా"** అని, **"పోయిన ఎరుక మళ్ళీ, మళ్ళేనా?"** అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. ఆ విధంగా పోయిన ఎరుక మరల రానిచో ఆ పరిపూర్ణ భావజ్ఞుడు వ్యవహారమెట్లు చేయగలడు? నామ మాత్రావశిష్టముగా తన యందున్న గుర్తునకు పరిపూర్ణబ్రహ్మము నందు మూలం లేదు, కొనకు ప్రవేశించుటకు స్థానము లేదు, అనే నిశ్చయముపై నాతడు విషయములందు వర్తిస్తున్నా విషయము లాతని నంటవు. వస్తువులను గుర్తించునే గాని వస్తువు నందలి శబ్దాది విషయము లందాతనికి గుర్తుండదు. ఎట్లనగా పంచదారను గుర్తించునేగాని దాని యందలి రస మాధుర్యముపై గుర్తుండదు. శబ్దాది విషయములందే వైరాగ్యముగాని వస్తువులయందు వైరాగ్యము లేదు. ఇదియే రాజయోగి లక్షణము సీ॥84 జలజ పత్రము లందు సలిలమంటని యట్లు ...." అంటూ భద్రాద్రిరామ శతకమునందు చెప్పబడి నట్లుగా పరిపూర్ణభావజ్ఞుడైన రాజయోగి "అఖిల వ్యవహారములు జేసి అంటదధిప" అని గుర్తెరింగి వాటిని వుచ్ఛిష్టము (ఎంగిలివలె) వలె వదలివేయు మని ఉపనిషద్వాక్యము జెప్పుచున్నది.

**2. అహం బ్రహ్మేతి భావనమ్ :** నేను బ్రహ్మను అను భావమును కూడ ఉచ్ఛిష్టమువలె వదలుము.

79 సీ॥ పరిపూర్ణమైయున్న పరమాత్మ బ్రహ్మవిద్యకు యోగమైన కాయంబు నందు। బుద్ధికి సాక్షియై స్ఫురియింపుచున్నది యహమనె పదమున కర్థమగును। ప్రతి లేనిద్వైస్వతః పరిపూర్ణ పరమాత్మ బ్రహ్మశబ్దమున కర్థంబు నిదియు। అహమేవ బ్రహ్మ బ్రహ్మైవాహమని

యన్న యస్మ్యనే పదమున కర్థమగుచు। ఎరిగి వాచ్యార్థముల నెల్ల పరిహరించి। అనుభవజ్ఞాని బొందు లక్ష్యార్థమందు ॥రమ॥ అని భద్రాద్రి రామ శతకమున రమ్యముగాజెప్పబడినది అనగా :

1. బ్రహ్మ విద్యకు అధికారియైన దేహమందు బుద్ధికి సాక్షియై స్ఫురింపుచున్నది యేదో అది అహం అనే పదమున కర్థమగును.

2. ప్రతి లేనిదై స్వతః పరిపూర్ణ పరమాత్మయైన వస్తువు బ్రహ్మమనే పదమునకు అర్థమగును.

3. అహమే బ్రహ్మము, బ్రహ్మమే అహమని తెలిసికొనుటయే అస్మి పదమునకు అర్థమగును.

పిండబ్రహ్మాండములైన ఉపాధులు వాచ్యార్థమని యెరుగవలెను.

ఇంకా కొంత పరిశీలిద్దాము. బ్రహ్మ విద్యకు యోగ్యమైన మానవోపాధి యందు బుద్ధికి సాక్షిగానున్న ప్రత్యగాత్మకు బ్రహ్మ ప్రకాశము వల్లనే నాది, నేను అను అహం వృత్తి కలుగుచున్నది. అందువలన అహం వలన బ్రహ్మత్వ నిర్ణయము సిద్ధించుచున్నది. "అస్మి" అనగా ఐతిని అని అర్థము. ప్రత్యగాత్మ అధోపరిణామము పొందుటచే జీవోపాధులందు చేరుచున్నది. బ్రహ్మ నిర్ణయము తెలిసి యూర్ధ్వ పరిణామము పొందునపుడు తానే బ్రహ్మమగు చున్నది. కావున "అహం బ్రహ్మాస్మి" అనగా నేనే బ్రహ్మనైతిని అను నిట్టి నిర్ణయము సార్థకమగుచున్నది.

ఈ భావమునందు **"నేను"** అహం ఇంకా మిగిలియున్నది. వస్తువు యొక్క అనిత్య భావన వల్ల వస్తువు యందు ప్రేమ పోదు. ఆ కానవచ్చే వస్తువు కూడ తానే అనేభావం వల్ల "ఇదం" వృత్తి మాత్రమే నానారూపమగు ప్రపంచ దృష్టి పోవును, కాని యిదం వృత్తి నాశనము వల్ల "అహం వృత్తి" సర్వం నేనే అనుతలంపు పోదు. అయితే అహం వృత్తి రహితమైతే ఇదంవృత్తి ఆనాడే నశిస్తుంది. అహం వృత్తి అంటే నేను అను అహంకారముకాదు. దానికి కారణమైన "బ్రహ్మోహం "అనే బ్రహ్మాకార వృత్తిలేక పోయినపుడే అహం వృత్తి కత్యంత నాశనము. ఇట్టి అహం వృత్తి పరిపూర్ణ బోధచే గాని రహితము గాదు. కావున ఈ అహం వృత్తిని ఎంగిలిని వదలినట్లు వదలిననేగాని పరిపూర్ణపరబ్రహ్మము స్వతసిద్ధము గాదు. ఎట్లు వదుల వలయునన్న, పరిపూర్ణ పరబ్రహ్మమునందు బ్రహ్మోహంనకు స్థానముగాని మూలంగాని లేదని గురు ముఖతః తెలిసి వదలవలయునని తెలియవలెను.

**3. నిగమాగమశాస్త్రాణి :** ఆగమనిగమ శాస్త్రములను కూడ వుచ్ఛిష్టమువలె వదలమని ఈ వాక్యము హెచ్చరించుచున్నది.

ఆగమము అనగా దేవపూజా విధానమును తత్సంబంధించిన విషయములను తెలుపునట్టి శాస్త్రము మరియు వ్యాకరణాది శాస్త్రములు అనగా :

శ్లో॥ శిక్షా వ్యాకరణం చంధో నిరుక్తం జ్యోతిషం తథా
కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః॥

శిక్ష, వ్యాకరణము, ఛందము, నిరుక్తము, జ్యోతిషము కల్పము, అని వేదాంగము ఆగమము యని యర్థము. 1. శిక్షయనగా విద్యాభ్యాసము, బోధన, దండనము. 2 వ్యాకరణము అనగా శబ్ద శాస్త్రము, శబ్దనిష్పత్తిని తెలుపు శాస్త్రము. 3. చంధము అనగా

పద్య లక్షణ శాస్త్రము. 4.నిరుక్తము అనగా వేదాంగములలో నొకటి 5. జ్యోతిషము అనగా గ్రహగతి నిర్ణయ శాస్త్రము. 6. కల్పము అనగా ఒక శాస్త్రము. బ్రహ్మదినము. ఈ ఆరు ఆగమము అని అర్థము.

నిగమము అనగా వేదము. వేదము విద్ అను ధాతువు నుండి పుట్టినది. విద్ అనగా ప్రకాశము, ఎరుక, జ్ఞానము అని నిర్ణయము, ఈ వేదమును శ్రుతి ఆమ్నాయ మని చెప్పుట గలదు.

"శ్రూయత ఇతిశ్రుతి" అనగా శోత్రేంద్రియములచే శబ్దరూపముగా తెలియబడుటను బట్టి శ్రుతి యనియూ జెప్పబడెను. ఆమ్నాయమనగా వల్లించుట యని అర్థము. "వేద ఇతీతి వేదః" తెలియజేయునది గాన వేదమని చెప్పబడెను. ఈ వేదశబ్ద నిష్పత్తి ఎట్లనగా "విదంతియతో ధర్మా ధర్మ మితివేదః "అనగా దీని సహాయము వలన ధర్మా ధర్మములు తెలియబడును గనుక ఈ వేదము. కర్మకాండ మనియు, ఉపాసనాకాండమనియు, జ్ఞానకాండ మనియు మూడు భాగములుగా యున్నది.

**(అ) కర్మ కాండము** : ఇహపర సుఖములకు దగిన కర్మానుష్ఠానములను, జేయు పద్ధతులను, అశ్వమేధము, వాజపేయము మొదలగు యజ్ఞములను చేయు విధములను, అవి చేయుట వలన కలుగు ఫలములను బోధించును.

**(ఆ) ఉపాసనాకాండము** : పరమేశ్వరుని యందు భక్తి చేయు విధమును, అట్లు భక్తి చేయు వారికి కలుగు ఫలమును బోధించును.

**(ఇ) జ్ఞానకాండము** : తత్వజ్ఞానము వలన బ్రహ్మజ్ఞానము పొందు మార్గమును, అందువలన కలుగు ప్రయోజనమును బోధించును.

**4. ఉచ్ఛిష్ట మివతత్యజ** : ఉచ్ఛిష్టము వలె వదలివేయుము అని యర్థము. ఉచ్ఛిష్టమనగా "ఎంగిలి" అని నీచార్థము. కాని తినగా (అనుభవించగా) మిగిలిన దంతయు ఉచ్ఛిష్టమే అనే అర్థము కూడ కలదు. తినేవాడు తినుపదార్థము రుచిని బట్టి ఎక్కువ తక్కువ తినునుగాని ఆపదార్థమును వినియోగములో తెచ్చునపుడు ఒక స్థాయిలో దాని వినియోగము పూర్తిగా ఆగిపోవును. అప్పటికి తినాలనిపించిన తినలేకుండ వుండును. (Negative Utility) కావున అవి ఎంత రుచిగావున్న తినలేదు. వాటిపై విరక్తి కలిగి వదలివేయును. అప్పట్లో మళ్ళీ, వాటి జోలికిపోడు. అట్లే ఈ శ్లోకమునందు పేర్కొన్న అరిషడ్వర్గములు, నేను బ్రహ్మననే భావన, ఆగమనిగమ శాస్త్రము లన్నియు ఎరుకనే, ఎరుక రూపములో నున్న వీటిని ఉచ్ఛిష్టము వలె వదలి వేయుమని జెప్పుచున్నది. ఎరుకను ఎందుకు వదలవలెనో ఎట్లు వదల వలెనో తెలుసుకొందము.

"పరిపూర్ణమును, ఎరుకను యెరిగి యెరుకను మానుము" అను ఒక్క వాక్యములో పరిపూర్ణ బోధ అంతా ఇమిడియున్నది. పరిపూర్ణమున్నది, ఎరుకలేదంటే సరిపోతుందా? అంటే ఎరుకను వస్తునిశ్చయముగా అనగా ఎరుక యొక్క స్థాన స్వరూపుడై నిలిచి, అపుడుతన కన్యముగా వున్న పరిపూర్ణ పరబ్రహ్మమునందు తనకు మూలముగాని స్థానముగాని లేనేలేదని ఆరూఢ స్థితినందిన నాడే యెరుకను విడిచిన వాడు. ఈ విషయమునే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు తమ కందార్థములలో క.ద. 281 "గురుడచలచలములను తన నెరిగించిన శిష్యుడెరిగి యెరుకై వుండన్, ఎరుకను నిల్పకు మనినను ఎరుకను విడనాడి శిష్యుండెట్లుండునంటే..."

అని వ్రాసినారు. అనగా శిష్యుడు ప్రథములో ఎరుకై నిలువ వలెననునది స్పష్టము.

**"ఎరుక బ్రహ్మమనియే యిల శంకరాచార్యులు, తెలివి బ్రహ్మమనుచు తెలిపెవ్యాసు, లెరుక తెలుపులరెంట్ని యెరుగదు వేమన విశ్వదాభిరామ వినురవేమ"**

అనగా వ్యాసులు, శంకరాచార్యులు దేనిని బ్రహ్మముగా ప్రతిపాదించినారో అదే ఎరుక కనుక ఎరుకై నిలుచుట అనగా అద్వైతసిద్ధి పొందుట. అది సామాన్యము గాదు. ఆస్థితి యందు శిష్యుడుండగ దానిని కూడ వదలి వేయుమని జన్మరాహిత్యమును గోరుశిష్యునికి గురువు కర్తవ్యమును తెలియజేసినాడు.

మరింకేమి చేయమన్నాడో విందాము క.ద. 237 **"పరిపూర్ణము నెరుకనునే। నెరిగించితి నీవు రెంటి నెరిగితివి గదా। యెరుకను గురుదక్షిణగా। మరివేగిరమివ్వు।"** మన్నాడు. యిది ఎట్టి వానికి సాధ్యము. ఎరుకను గురు దక్షిణగా యిచ్చి వేస్తిని అని వాచా అంటే సరిపోతుందా! చాలదు ఎరుకను ఎరిగి పిమ్మట దానిని వదలవలె. ఎరుకను గూర్చి పరోక్షముగా శ్రవణం చేసినంత మాత్రాన ఎరిగినట్లగునా? దేనిని పూర్తిగా ఎరుగవలెనంటే తనమనస్సు ఆ వస్తు స్వరూపమును దాల్చిననే ఆ వస్తువు అపరోక్షమైనట్లు చెప్పాలి. ఇక్కడ ఎరిగేది, ఎరుగబడేది రెండు ఎరుకే. వ్యష్టి రూపమై యెరిగే ఎరుక జ్ఞాన రూపము, సమిష్టి రూపమైన తన స్వరూపమే జ్ఞేయం.

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ, జ్ఞానంచ మనవుచ్యతే
జ్ఞానం జ్ఞేయం సమంకృత్వా యథానాన్యత్ ద్వితీయకం ॥గురుగీత॥ ॥211॥

అనగా ఈ జ్ఞాన జ్ఞేయముల అంతరము (భేదము) నశించి రెండు ఏక రూపము వహిస్తేనే ఎరుక అపరోక్షమైన దన్న మాట అప్పుడే శిష్యుడెరుకై నిల్చెననాలి. ఇందుకు ముందుగా జ్ఞేయ రూప యెరుక యొక్క స్థాన స్వరూప స్వభావములను గురుముఖతా, వస్తు నిశ్చయ రూపంగా గుర్తించ వలసి యున్నది. ఆ పిమ్మట ఆ జ్ఞానము ఆరూఢము కావలె, అపుడింక తెలివిచే తెలియదగని యితరంలేదు. అపుడు సర్వము తానేయై నిలిచిన తాను తనకన్యముగా నున్న పరిపూర్ణము మాత్రమే వుంటాయి. పరిపూర్ణమందు తనకు మూలం లేదనెడి విషయము యిచటనే ఆరూఢ మౌతుంది, పరిపూర్ణమును గట్టిగా వుండ జూచుకొనే స్థితిని యిక్కడనే, అపుడు చేయతగిన కర్తవ్యమేమి? గురుదు ఎరుకను నిల్పకు మని చెప్పిన మాటను పాటించి పాలించుటయే. ఈ స్థితి యందే ఎరుకను విడిచే సామర్థ్యము కలుగునే **"ఎరుక కూకుదు వేరు నెరిగి తవ్వితే చాలు"** నని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు అన్నారు. జ్ఞాన జ్ఞేయ రూపంగా నున్న తన స్వరూపము కంటే అన్యంగా పరిపూర్ణ బ్రహ్మము నందు తనకు మూలం లేదనిన్ని నిలుచుటకు స్థానములేదని తెలుసుకొని తానే బ్రహ్మననే భ్రాంతి పూర్తిగా వదలివేయుట ఎరుకను విడచుట.

ఎరుకై నిలుచుట యనగా తన వ్యష్టి జ్ఞానము నిజముగా ఏమాత్రము అల్పమైనది కాదు. కించిజ్ఞత్వాది అల్ప లక్షణములు గలదిన్ని కాదు. అది సామాన్యమైనది. కాదు. అది కేవలము పరాయెరుకయే అయివున్నది. కాని దోషము లుండుటచే దాని శక్తి సామర్థ్యములు మరుగుపడినవి అని గ్రహించి సర్వాతీతమైన పరాయెరుకయే సర్వగతమైనపుడు కేవలయెరుక యని (శుద్ధ యెరుక) వ్యష్ట్యుపాధి గతమై యున్నపుడు మిశ్రమయెరుక యని పేరొందినది. కనుక తానే పరాయెరుక యని, పరాయెరుకకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలంలేదు

గనుక మూలంలేని గుర్తెరిగే శరీరమునకు మూలము లేనే లేదని దోషములు దూరికృత మొనర్చుకొన్న శుద్ధాంతః కరణముచే గ్రహించి ఆ ఆరూఢ జ్ఞానముచే సుస్థితుడై యెట్టి నిర్ణయములను చేయక శాంత చిత్తుడై యుండుటయే ఎరుకను మానుట అని అర్థము. ఈ అర్థములో వ్యష్టియందు సమిష్టి యందు ఎరుక నశించుట లేదు. కాని ఎరుక పుట్టలేదని అచల ఋషుల పరమ సిద్ధాంతము. పుట్టని ఎరుక గిట్టదు కనుక ఎరుకకు నాశనము లేదు. వుండి ఎరుక లేనిదే యగుచున్నది. ఎరుక యను కల బాసిన మనుజుడు కూడ కలలోపలి పనులు చేయుచునే యుండును గాని అట్టి కర్మ ఆగామి రూపముగా ఎట్టి అదృష్ట ఫలమున్ను సృష్టించ జాలదు. ఈ విధముగ ఎరుకను వుచ్ఛిష్టము వదలి నట్లు వదులు మన్నారు.

**జ్ఞానమధ్యేజగన్నాస్తి పూర్ణమధ్యే జగన్నహీ**
**నహిజ్ఞానాధికం సర్వం జ్ఞాన మాత్మ స్వరూపకమ్** ॥౪౧॥

జ్ఞానమధ్యన జగములేదు. పరిపూర్ణ మధ్యమున జగములేదు. సర్వము జ్ఞానాధికము. గాదు. జ్ఞానమాత్మ స్వరూపకము.

**వివరములు:**

**1. జ్ఞానమధ్యేజగన్నాస్తి :** జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి అని అర్థము. తెలివి అనగా తెలుసుకొను శక్తిగల ఒక పనిముట్టు. జ్ఞానమునకు యెరుగుట ఆధిభౌతికము. ఈ జ్ఞానము అంతరేంద్రియ పంచకములో మొదటిది. దీనినే అంతఃకరణము అనగా లోపనిముట్టుగా కూడ చెప్పబడుచున్నది. వృత్తి భేదముచే ఈ అంతఃకరణమే మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము అనుపేర్లతో ఆయా పనులు చేయుచు అంతఃకరణ చతుష్టయముగా నున్నది. జాగ్రదవస్థలో ఈ ఐదు విధములు గాను పని చేయుచు స్వప్నావస్థయందు ఈ పంచవిధ వ్యవహారములు చేయక, మనోబుద్ధుల యొక్క వ్యాపారములను సాగించుచు, సుషుప్తి యందు ఈ ఐదు వ్యవహారములు పూర్తిగా విరమించి విశ్రాంతి చెందు చున్నది. అనగా సర్వము గుర్తెరిగే జ్ఞానము, దేనిని గుర్తించక, అంతఃకరణము జడరూపము వహించుచున్నది. ఆ జడ స్థితినే మరుపు లేక "అజ్ఞానము" అని వ్యవహరించబడుచున్నది. ఈ జడ అజడలక్షణములే ఎరుక మరుపులు, జ్ఞానా జ్ఞానములు అని పిలువబడుచున్నవి.

విశేషార్థములో జ్ఞానమనగా "బ్రహ్మ పదార్థమే", జ్ఞాన దేవతుకైవల్యం" అనగా సృష్టికి పూర్వము తాను తానై ఏక మాత్రముగా నుండు బ్రహ్మమే కేవలము జ్ఞాన స్వరూపమై ఏకమాత్రము గానున్నది. దానినే జ్ఞానఘనము, చిద్ఘనము, ప్రజ్ఞానఘనము అను సమాసములచే వేదాంత శాస్త్రము అభివర్ణించుచున్నది. ఈ దృక్పథములో జ్ఞాన శబ్దమునకు ఒక చక్కటి నిర్వచనమీయ బడినది. "సర్వము నందు తాను, తన యందు సర్వము, తానే సర్వము" అని నిర్వచించబడినది. మరియు "ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞాన భవతి" అనగా ఏవస్తువు యొక్క పరి జ్ఞానము చేత సర్వవస్తు జ్ఞానం కలుగునో అదే జ్ఞానము ఆత్మ, బ్రహ్మము. మరియు భగవద్గీతలో "ఏవంజ్ఞాత్వానేహ భూయోన్యత్ జ్ఞాతవ్య మవశిష్యతే" అనగా ఏది తెలుసుకొన్న పిదప ఇక తెలియ తగినది లేదో అదే జ్ఞానమనియు (బ్రహ్మము) అనియు చెప్పబడినది మరియు "అధ్యాత్మ జ్ఞాననిత్యం, తత్వ జ్ఞానార్థ దర్శనమ్, ఏతత్

జ్ఞానమితి ప్రోక్తం, అజ్ఞానం యద తోన్యథా" అనగా బ్రహ్మజ్ఞానమే శాశ్వతమైన జ్ఞానమనియు ఆ తత్వ జ్ఞానముచే తెలియబడు బ్రహ్మ వస్తువు యొక్క (జ్ఞేయ బ్రహ్మము) సాక్షాత్కారమే జ్ఞానమనియు ఇతర మంతయు అజ్ఞానముగానే చెప్పవలయునని దీని భావము.

జ్ఞానమంటే బ్రహ్మమని తెలుసుకొన్నాము. ఇప్పుడు జ్ఞానము మధ్య జగత్తు లేదనుటను విచారింతము. జ్ఞానాజ్ఞానములు రెండు లేని వస్తువులు. జడములనియు జ్ఞానా జ్ఞానములుగా వర్తించు ప్రాణులును చేతనములనియు పిలువబడుచున్నది. చిజ్జడములన్నియు ఒకే ఆత్మ యొక్క (అఖండ యెరుక) పరిణామములే. నిమిత్త ఉపాదానము కారణములుగా నుండి నామరూప భేదము మాత్రమే కలిగి యున్నందున, నామ రూపములు మార్పుచెంది మిథ్యా భూతములనియు, ఉపాదాన కారణము అగు బ్రహ్మ వస్తువు (ఆత్మ) మాత్రము సత్యమనియు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" అని అద్వైత సిద్ధాంతము ప్రతిపాదించబడినది. ఆవిధముగా అద్వైత సిద్ధాంత ప్రకారము కూడ చిజ్జడములు, జ్ఞానా జ్ఞానములు లేక ఎరుక మరుపులు తేజోంధకారములు అన్నియు సర్వద్వంద్వములు. ఒకే ప్రతి పత్తి కలిగినవై యున్నవి. కనుక సర్వద్వంద్వములు రెండు సత్యములు లేక రెండు అసత్యములు కావలసి యుండును గాని ఒకటి శాశ్వతము, మరొకటి అశాశ్వతము, ఒకటి బ్రహ్మము మరొకటి మాయ కాజలవు. అద్వైత ప్రతిష్ఠాపనాచార్యులగు ఆది శంకరులు కూడ ఆదిలో దేహి నిత్యము దేహము అనిత్యము అని ప్రతిపాదించినను, చివరకు 'సర్వవేదాంత సంగ్రహము' అనుపేరుతో వారు రచించిన గ్రంథములో **"యధా మృణయో కుంభం తద్వతేదేహపి చిన్మయః"** అనగా మట్టితో తయారు చేయబడినకుండ అంతయు మట్టే అయినట్లుగా దేహమంతయు కూడ చిన్మయమై యున్నదని చెప్పి యున్నారు. స్థూల రూపమగు దేహమును విడదీసి చూచినచో దేహము జడము, అజ్ఞాన రూపము అయివున్నదేగాని "సర్వ మదయ ఆత్మ" అని చెప్పడిన రీతిగా సర్వము ఆత్మ మయమే. చిజ్జడములు రెండు ఓతప్రోతమై విడదీయ రానివై యున్నది. అందు ఒకటి లేనిచో రెండును వుండజాలవన్న మాట. దీపము లేని ప్రకాశముగాని వుండజాలదు కదా! ఈ విధంగా పరిశీలించినట్లయితే జ్ఞానము (బ్రహ్మము) మధ్యజగముండుటకు వీలు లేదని తేలినది.

**2) పూర్ణ మధ్యే జగన్నహి :** పూర్ణమనగా నిండినది, సకలము ముగిసినది యని అర్థములు గలవు. తత్వతః చూసినట్లయితే పూర్ణము ప్రత్యక్ష పూర్ణము, పరోక్షపూర్ణములుగానున్నవి. ప్రత్యక్ష పూర్ణము అనగా కార్యరూపముగా నున్న జగత్తు కారణ రూపంగా నున్న పరమాత్మ. లేక బ్రహ్మము పరోక్ష పూర్ణమనబడుచున్నది. కార్యరూపముగా నున్న జగత్తు యందు కారణ రూపంగా యున్న పరమాత్మ సువర్ణాభరణములందు బంగారమువలె సంపూర్ణముగా నిండి యుండుటచే యిదియును పూర్ణము గానే తెలియబడుచువున్నది. ఈ రెంటిలో పరోక్ష రూపముగా నున్న పరిపూర్ణము అతీతమై రెండవది లేకపోవుట చేత బాహ్యాభ్యంతరములనే నిర్ణయములేక ప్రత్యక్ష పూర్ణము నతిక్రమించి యున్నది. విచారించి చూడగ ప్రత్యక్ష పూర్ణమగు ఈ జగత్తు కారణముతో సహా "యదృశ్యం తన్నశ్యం" అనే న్యాయంగా లేని వస్తువే అయి పోవుచున్నది.

ఈ ప్రత్యక్ష పూర్ణము పరోక్ష పూర్ణమందు లేదనుటను పరిశీలింతము. అద్వైత సిద్ధాంత రీత్యా బ్రహ్మ సత్యంజగన్మిథ్యా యను నిర్ణయానుసారము బ్రహ్మమొక్కటి సత్యము

తక్కినదంతా లేక కనబడేదంతా మిథ్యా స్వరూపమని లేనిదని నిర్ణయించినారు. మిథ్య అనగా కేవల అళీక పదార్థము కాదు. అనగా శూన్యముగాదు. పారమార్థిక సత్యత్వము లేనిదని యనవచ్చును. విచారించి చూస్తే బ్రహ్మము జగత్కారణమని వేదోపనిషత్ శాస్త్రములు ఘోషించుచున్నవి. అంటే బ్రహ్మము కారణ వస్తువు నందు కార్య వస్తువగు జగత్తు బీజరూపముగా నుండక తప్పదు. కనుక రెండు సత్యమో, రెండు అసత్యమో అయియుండవలయును, బ్రహ్మైవేదం విశ్వ మిథం వరిష్టం" అని శ్రుతి కూడ పై భావమునే చెప్పుచున్నదంటే జగత్తు బ్రహ్మము యొక్క రూపాంతరమే. జగత్తు వ్యవహారిక సత్యము గలదని ఎందుకన్నారంటే ఈ ప్రపంచములోని వస్తువులన్ని జాగ్రదవస్థలో సత్యాలుగానే గోచరిస్తాయి కాని పుట్టుక, చావు పరిణామాల వల్ల జగత్తు అసత్యమే అన్నారు. బ్రహ్మము ఒక్కటే పారమార్థిక సత్యం, జన్మమృత్యుపరిణామాధి ధర్మాలు లేక పోవుట వల్ల, వస్తువుకాక పోవుట వల్ల దేశకాల కారణ కార్యాల కతీతముగా బ్రహ్మ మొక్కటే పారమార్థిక సత్యత్వముగా బ్రహ్మ మొక్కటే పారమార్థిక సత్యత్వము గలదంటారు. కాని పరిపూర్ణ భావజ్ఞుల దృష్టిలో పరిపూర్ణమొక్కటే సత్యమె నిత్యమై యున్నది. ఇతరమైన దానికి అందుతావులేదు. ఉన్నదంటే ఎండమావులలో నీరువలె లేకనే తోచుచున్నదని, నిజముగా లేదని స్పష్టంగా జెప్పినారు.

**3. నహిజ్ఞానాధికం సర్వం** : సర్వము జ్ఞానాధికముగాదు. అద్వైతము ప్రకారము జ్ఞానమనగా బ్రహ్మపదార్థమే. "జ్ఞానదేవతు కైవల్యం" అనగా సృష్టికి పూర్వము తాను తానై ఏకమాత్రముగా నుండు బ్రహ్మమే కేవలం జ్ఞాన స్వరూపమై ఏకమాత్రముగానున్నది. దానిని జ్ఞాన ఘనమని, చిద్ఘనమని, ప్రజ్ఞానఘనమని వేదాంత శాస్త్రములు అభివర్ణించుచున్నవి.

శుకుడు జనకమహారాజుకు శుశ్రూషలు జేయు సమయమున అతనికి జ్ఞానము కలిగించుటకై అన్నిటికన్న నీచమైన పదార్థము తెమ్మనెను. శుకుడు ఆలోచించి మానవ పురీషము కన్నహేయమైన పదార్థముమరొకటి లేదని దానిని తెచ్చెను. జనకుడు అగ్నిని రగుల్కొల్పి అందు ఆ పురీషము వ్రేల్చి ఓ పురీషమా! నీకన్న నీచమైన వస్తువు ప్రపంచమున లేదని శుకుడు నిన్ను తెచ్చినాడు. నీవేమందువు అని ప్రశ్నించగా ఆ పురీషము నుండి నాకీ హేయమైన రూపము యిప్పుడు కలిగినది. కాని నా పూర్వరూపము మధురమైన పంచ భక్షములు. దానికి పూర్వ రూపము పంచ భూతములు, అంతకు పూర్వము ఆత్మ స్వరూపము. నన్ను నీచముగా చిత్రించిన శుకుని గుర్తే హేయమైనదని బదులు పలికెనట. కనుక అన్నిటి యందున్నది ఆత్మనే. ఆత్మదర్శనమే జ్ఞానము. "యత్ జ్ఞాత్వాన పునర్మోహం ఏవం యాస్యసి పాండవ। యేనభూ తాన్యశేషేణ దక్ష్యాత్మన్య థోమయి" అనగా దేనిని తెలిసినచో తిరిగి మోహము కలుగదో, దేనిని తెలియుటచే నీయందునూ, నాయందునూ కూడ సకల భూతములను చూడగలనో అదే జ్ఞానం. "బ్రహ్మణోన్యం నకించిన" అనగా బ్రహ్మము తప్ప ఏమీలేదు. మనోవాక్కుల కందేదంతా కలసి ఒకే వస్తువు అదే జ్ఞానము, బ్రహ్మము. కావున జ్ఞానము కంటే అధికమైనది మరొకటి లేదు.

**4. జ్ఞానమాత్మ స్వరూపకమ్** : క.ప. 128 జ్ఞానము నేననవొక్కటే జ్ఞానము నేవేరటంచు గనుబోకుసుమీ "అని శ్రీకృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చియున్నారు. అనగా జ్ఞానమనగా తెలుసుకొన తెలివి, మోక్ష విషయక బుద్ధి, యెరిగే ఎరుకయని చెప్పబడును. గనుక నేనన్న జ్ఞానమన్న (ఆత్మయన్న) ఒక్కటే. జ్ఞానమన్న ఆత్మయన్న ఒక్కటే వేరుగాదని

తెలియవలయును. ఆత్మ సాక్షాత్కారమునందు జ్ఞానమే జ్ఞేయరూపము (ఆత్మ రూపము) దాల్చును. గనుక జ్ఞానము ఆత్మ స్వరూపమని గుర్తించవలయును.

**జ్ఞానంనాస్తీతి నిశ్శంకం విరామోయత్ర చాస్తిచేత్**
**దృష్టిస్తత్రైవ నిశ్చిత్య నిర్వికార స్థితిర్భవ** ॥౯౧॥

జ్ఞానము లేదనుటలో సంశయము లేదు. ఎచ్చట విరామ ముండునో అచ్చట దృష్టి నిగిడ్చి నిర్వికార స్థితి నొందుము.

**వివరములు :**

**1. జ్ఞానం నాస్తీతి నిశ్శంకం :** జ్ఞానము లేదనుటలో అనుమానములేదు. జ్ఞాన మనగా సామాన్యర్థములో తెలివియని అర్థము.

శ్రీకృష్ణ దేశికేంద్రులవారు కందపద్యములందు జ్ఞాన పద్ధతిలో జ్ఞానమును గూర్చి లెస్సగా జెప్పియున్నారు. క.ప.123, "ఎరుగుట జ్ఞానము దానను। జరిగేపని కర్మ మనుచు, జనులెన్నిరియీ। యెరుకయు కర్మము లేనిదె। పరిపూర్ణము వీటినీవు। బట్టకు మెపుడున్ అనీ "క.ప.124 **"జ్ఞానంబు సత్వ గుణమను। దానికి జన్మించె ననుచు దామోదరుడా మేనత్త కొడుకు తోననే। జ్ఞానమునకు జన్మ మొకటి గలిగే గదోయి"** మరి "సత్వాత్ సంజాయతే జ్ఞానం" అనగా సత్వగుణోద్భవమైనది జ్ఞానమని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునికి ప్రబోధించియున్నాడు. గనుక జ్ఞానమునకు జన్మాదులు కలిగి యున్నవని తెలుసుకోమని భావము మరియు క.ప.125 **"పుట్టింది గిట్టు జ్ఞానము పుట్టేననుచు కృష్ణమూర్తి పురుహూతజుడౌ। నట్టితను ముద్దు మరిదికి గట్టిగా వినజెప్పె నిందు కలతేమోయీ"** అనగా శ్రీకృష్ణ పరమాత్మ జ్ఞానమునకు పుట్టుక కలదని అర్జునునికి దృఢముగా జెప్పియున్నాడు. కనుక పుట్టిన జ్ఞానమునకు గిట్టుట యున్నదని అనడములో ఎలాంటి సందేహము సంశయము లేదు. మరియు కం॥ 128 **జ్ఞానము నేనన నొక్కటె జ్ఞానము నేవేరటంచు గనబోకుసుమీ। జ్ఞానము వచ్చును బోవును। జ్ఞానాతీతము తాను గాంచిన దాకన్"**॥ జ్ఞాన మనగా తెలుసుకొనే తెలివియని, మోక్ష విషయ బుద్ధియని ఎరిగే ఎరుక యని చెప్పబడును. గనుక నేనన్న జ్ఞాన మన్న ఒక్కటే యని తెలుసుకొనుము. జ్ఞానమునకు అతీతమగు అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొన్నంత వరకు ఈ జ్ఞానమగు నేను పుట్టుచు గిట్టుచునే యుండునని భావము. ఈ వివరణ వల్ల బోధ పడినది యేమనగా జ్ఞానమునకు పుట్టుక యున్నదని, పుట్టుక యున్నదానికి చావు తప్పక యుండుటవల్ల జ్ఞానము లేదని నిస్సంకోచముగా నమ్మవచ్చును.

**2. విరామోయత్ర చాస్తి చేత్ దృష్టిస్తత్రేవ నిశ్చిత్య :** అనగా ఎచ్చట విరామ ముండునో అచ్చట దృష్టిని నిగుడ్చి అని అర్థము. విరామము అనగా విశ్రాంతి. జాగ్రదవస్థ యందు మనస్సు సంకల్పము చేస్తునే ఉంటుంది. స్వప్నావస్థయందు కూడ మనస్సే, మనస్సులోని భావములనే చూస్తుంది. అప్పుడుకూడ మనస్సుకు విరామములేదు. మరియు సుషుప్తి యందు మనస్సు మగ్నత చెందుట వల్ల మనస్సు పనిచేయదు. అప్పుడు మరుపు రూపము. ఇదే అజ్ఞాన రూపము. ఈ స్థితిలో మనస్సు గాఢ నిద్రలో వుంటుంది. మరియు దేని నెరుగదు. కాని జాగ్రదవస్థలో మనస్సు విరామము పొందవలె, అప్పుడే మనస్సు నిర్వికారస్థితి పొందును. అదెట్లో గమనింతము.

ఇంద్రియ రూపమైన జ్ఞానమునకు బ్రహ్మము, విషయము కాజాలదు. ఏలననగా జ్ఞానమునకు ఆధి భౌతికము ఎరుగుట, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను విషయ పంచకమును ఎరుగును, అట్టి విషయ పంచకము నుండి జ్ఞానమును మరలించినచో ఆ జ్ఞానమే శుద్ధమనబడును. ఇచటనే మనస్సునకు విరామము. అట్టి శుద్ధ జ్ఞానముచే సృష్టికి పూర్వముండే వస్తువును లేక తత్వమును గురించి ధ్యానించినచో అజ్ఞానము (నిరీంద్రియ రూపమగు మనస్సు, స్వవశీయ మనస్సు శూన్యమైన మనస్సు) జ్ఞేయ రూపమును పొందుచున్నది. కనుకనే అప్పుడు జ్ఞానమునకు (మనస్సు)నకు విరామము కలుగును అప్పుడే ఆ మనసు నిర్వికారస్థితికి చేరును.

**3. నిర్వికార స్థితిర్భవ :** నిర్వికారస్థితిని పొందుము. నిర్వికార స్థితి యనగా నెట్టిదో కొంచెము విచారింతము. షడ్భావవికారము లన్నియు ఆవరణ రూపమైన దేహమునకే గాని ఆత్మ రూపమైన దేహికి లేవు. నేను మేనులు రెండు ఒక్కటైనా స్థూలరూపమైన మేను మాత్రమే దృగ్గోచర మగుచున్నది. దాని వికారములే కండ్లబడుచున్నది. నేను, కంటికి కానరానిది. అందుచే దాని వికారములు కండ్ల బడుటలేదు. నేనుకు కూడ వికారము లున్నవి, ఇచ్ఛా సంకల్పరాగ ద్వేషాదులన్నియు వికారములే, అంటే అవి మనోధర్మములు గాని ఆత్మ ధర్మములు గావని జవాబు చెప్పవచ్చును. కాని అట్టి మనస్సు దేని వికారములు? ఆత్మ వికారమేకదా! ఐతే అది వికారమని ఎందుకన్నారంటే సృష్టి సంకల్పము కలగనపుడు దాని యందు ఏవికారములు గానరాలేదు. మొదట్లో అట్టి నిర్వికార స్వరూపుడను నేను, నాకు యిపుడు యీ జీవలక్షణములు, సర్వవికారములు కలిగినవి అను స్వస్వరూపానుభవం కలుగుచున్నది. ఇట్టి స్వస్వరూపానుభవమే జ్ఞానము. ఇట్టి స్వరూపాను భవము నెచ్చటనైతే విరామము చెందునో అచ్చట దృష్టినిగుడ్చి అచ్చట నిర్వికారము పొందుటకు అవకాశము గలదని ఈ ఉపనిషద్వాక్యార్థము.

**సర్వాంతస్థం శివం ధ్యాత్వా సర్వభావాన్విసర్జయేత్**
**జ్ఞానమంతర్బహిర్ధ్యాత్వా జ్ఞాతృజ్ఞానం పరిత్యజ్య** ॥౪౨॥

సర్వము నందు నిండి యున్న శివమును (పరిపూర్ణపరబ్రహ్మమును) ధ్యానించి అన్ని తలంపులను వదలుము. జ్ఞానమును అంతర్బాహ్యముల ధ్యానించి జ్ఞాతృ జ్ఞానములను విడువుము.

**1. సర్వాంతస్థం శివం ధ్యాత్వా :** అన్నిటియందు నిండియున్న శివము (పరిపూర్ణ పరబ్రహ్మము) ను ధ్యానించుము. అన్ని చింతలను వదలుము అని అర్థము. శివము అనగా మంగళకరమైనది. పరిపూర్ణపరబ్రహ్మము దృఢమైన యెడల శాశ్వత జననమరణరహితము సిద్ధించుట కన్న మంగళ ప్రదమైనది మరొకటి లేదు గదా! పరిపూర్ణపరబ్రహ్మమును శివము అని వ్యవహారార్థము వాడినారు. అన్నిటియందు నిండియున్న పరిపూర్ణపరబ్రహ్మమును శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు క.ద. 147 లో **"ఏ పరిపూర్ణమేనికి**

**లోపల వెలినిండియుండు। లోపము లేకన్। ఆ పరిపూర్ణమే జగతికి లోపల వెలినుండు దాని। లోనే వున్నవిరా। పై రెండెవ్విలేని వెన్నకురా। ఈ పూర్ణబోధచే। పై ప్రపంచ శరీర రూపము లెడబాపు। మీా పట్లనె। దానిలోనే వున్నవిరా"** అని లెస్సగా వర్ణించియున్నారు. అనగా ఏ పరిపూర్ణము శరీరమునకు లోపల వెలుపల నిండి నిబిడీకృతమై యున్నదో ఆ పరిపూర్ణమే జగతికి లోపల వెలుపల నిండియుండును. దానియందే ఈ శరీరము జగము రెండు తెలియుచున్నవి. ఇవి లేనివే గనుక వీటిని వదలుము. అచల పరిపూర్ణ బోధచేత పై ప్రపంచ శరీరముల రూపములను (చక్షురేంద్రియ గోచరము. స్వభావము) ఈ క్షణముననే విడువుమన్నారు.

ఇక పరిపూర్ణపరబ్రహ్మమును ధ్యానించుమంటుంది ఈ శ్లోకము. ఎట్లు ధ్యానించవలయును? అంటే శ్రీకృష్ణదేశికేంద్రులవారి కందార్థము క.ద. 35 "మ్రొక్కేరితర జేజేలు" అని అన్నారంటే వారు ఆత్మస్వరూప నిశ్చయజ్ఞానపరులు. అట్టి జేజేలు తమ కన్యముగా నున్న శివమును సేవించవలయును. సేవ లేక ఉపాసన అనుట తోడనే సేవ్యవస్తువు, సేవ, సేవకుడు లేక ఉపాస్యవస్తువు వుపాసన ఉపాసకుడు అనే త్రిపుటి సిద్ధమగుచున్నది. పరిపూర్ణపరబ్రహ్మము ఉపాస్యముగాదు ఉపాసింపదగినది బ్రహ్మయేకాదు "నేదం యదిద ముపాసతే" అనే కేనోపనిషత్ ప్రవచనము. కనుక శ్రీకృష్ణదేశికేంద్రులవారు "ఎరుకలేక సేవింపదగు" అని అన్నారు" శ్లో॥ పూర్ణమేవా నిరాలంబం, ఆగ్నేయో నిర్గుణంతథా.... అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః॥" ఈ శ్లోకమున పరిపూర్ణ పరబ్రహ్మము దశదిశల యందు, మరియు వెలుపలలోపల చెప్పుటచే దేని ప్రాతి పదికగా ఈ దశదిశలు, అంతర్బాహ్యములు చెప్పబడినవో అది పరిపూర్ణమందుండుటకు వీలులేదు. కనుక దానికి లేనెరుక యని, లేనికల యని శ్రీకృష్ణదేశికేంద్రులవారు పేరిడి క.ద. 66 "లేని కలకలిగినప్పుడు। దానిని దశదిశల యందు తగ మొదట కొనన్ తానంటకున్న మేల్కను। లేని కలే చూచె నేని। లేక పొవు గదా। కలతో మేల్కలేక పోదుగదా।" అంటూ దృష్టాంతమిచ్చియున్నారు గదా। ఎరుకను అధిగమించి దాని ద్వాదశస్థానములందున్న పరిపూర్ణపరబ్రహ్మమునకు నమస్కారమంటే అర్థమేమి? **ఎరుకను విడుచుటయే నమస్కారము.**

**2. సర్వభావాన్ విసర్జయేత్ :** నిఘంటువు ప్రకారము భావము అనగా తలంపు, నిశ్చయము ధ్యానము, భక్తి, ఆత్మ, సత్తు యని యర్థములు గలవు. కాని యిచట తలంపు అని గ్రహించ వలయును. అంటే తలంపుల నన్నిటిని వదిలి వేయుము అని అర్థము. పదార్థములు భావమని, అభావమని రెండు విధములు. అందు భావము ఆరు విధములుగా జెప్పబడినవి. 1. ద్రవ్యము 2. గుణము, 3 కర్మ 4. సామాన్యము 5. విశేషము, 6. సమవాయము. ఈ ఆరున్ను భావమని చెప్పబడును. మరియు 1. ప్రాగ్భావము 2. ప్రధ్వంసా భావము 3. అన్యోన్యాభావము 4. అత్యంతా భావము. 5. యావృదా భావము 7. సమవర్తకా భావము 8. సామాన్యా భావమని అభావములు (8) విధములు, పరిపూర్ణపరబ్రహ్మమందు

ఈ భావములు గాని, అభావములు గాని ఏవి లేవు. అది సర్వలక్షణ విలక్షణమైనది. కావున సర్వభావములను వదలవలయును. అభాములకై పుట సంఖ్య (69) చూడుము.

**3. జ్ఞానమంతర్బహిర్ధ్యాత్వా :** జ్ఞానమును అంతర్బాహ్యముగా ధ్యానించుమని అర్థము. జ్ఞానము సచ్చిదానంద రూపమగు ఆత్మ. ఆత్మయే సృష్టికి పూర్వము బ్రహ్మమని చెప్పబడి "ఏక మేవాఽద్వితీయంబ్రహ్మ" అని పేరొందినది. అట్టి జ్ఞాన రూపమైన బ్రహ్మమును అంతర్బహిర్ధ్యాత్వా యని చెప్పుటలో అట్టి బ్రహ్మమును అంతర్బాహ్యముగా ధ్యానించు మంటుంది. అనగా అట్టి బ్రహ్మమును సగుణ నిర్గుణోపాపసన చేయుమని చెప్పినట్లే.

బాహ్యము లేక సగుణోపాసన అనగా షొడశోపచారములతో కూడి అర్చనయు, మంత్రజపస్తోత్ర ధ్యానాదులనియు ఉపాసనా శబ్దమునకు సామాన్యార్థము జెప్పుచున్నవి. శబ్దార్థమును చక్కగా విచారించినచో ఉప+ఆసన=ఉపాసన. ఉపయనగా సమీపమున, ఆసన అనగా నిలకడ కలిగి కూర్చుండుట. అనగా బ్రహ్మము యొక్క సన్నిధానమున మనస్సు స్థిరముగా నుంచుట, ధ్యానధారణములే ఉపాసనాశబ్దమునకు విశేషార్థములు.

శ్లో॥ శ్రవణం కీర్తనం స్మరణం విష్ణోపాద సేవనం అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం॥ అను నవవిధ భక్తులు సగుణోపా సనలోనే సాధ్యం.

అంతర్ధ్యానము లేక నిర్గుణోపాసన యనగా సృష్టికి పూర్వము సృష్టి బీజములగు సత్వరజోస్తమో గుణములు జీవుల సకల సంస్కారములు బీజ రూపంగా తనయందు గర్భీకృతము చేసుకొన్న పరమాత్మ నిర్గుణదని జెప్పబడుచున్నాడు. ఈ నిర్గుణ స్వరూపము సృష్టిసంకల్పము కలిగి గుణత్రయ విజృంభణ జరిగినపుడు కూడ వ్యక్తముగాకుండ యనగా యింద్రియ గోచరము గాకుండ వున్నందున అతడే అవ్యక్తమని పేరొందినది. అట్టి అవ్యక్తము సర్వవ్యాపకము, నిరామయము, అమూర్తము అగు పదార్థమునకు పూజాధ్యానములు జేయుట ఎట్లు? ఆవాహన విసర్జన యెట్లు? క్రియారూపముగా నున్నను భావనా రూపముగా మనస్సుచే ఈ బ్రహ్మమును ఉపాసించవచ్చును. ఉపాస్య వస్తువునకు నామ రూపము లుండనక్కరలేదు. పూజా ద్రవ్యములు అంతకంటే అక్కర లేదు, కాయిక వాచికములతో పనిలేదు. ఆత్మ వస్తువు యొక్క స్థాన స్వరూపములు గురుముఖతః తెలుసుకొని ధ్యానము నందు ధ్యాత, ధ్యానము, ధ్యేయమను త్రిపుటి యుండి ధ్యానము పరిపక్వమగు కొలది త్రిపుటి నశించి ధ్యానము ధ్యేయరూపము వహించును అంటే ధ్యేయమగు (గురు స్వరూపము) బ్రహ్మ స్వరూపమే తానై ఏక భావన చెందును. అప్పుడిక ధ్యాన భావము మాటయే పొసగదు. ఈ స్థితియందు మాత్రమే నిర్గుణోపాసన సంభవము, ఈ త్రిపుటి రహితమే ధ్యానమునకు పరాకాష్టా.

**4. జ్ఞాతృ జ్ఞానం పరిత్యజ్య :** పై విధంగా ధ్యానించి జ్ఞాతృ (ద్రష్ట) జ్ఞానము (దృష్టి) ని వదలుము. జ్ఞాతృ యనగా అంతః కరణ ప్రతిబింబమగు చిదాభాసుదు. ఇంకా కొంత విడమర్చి చెప్పాలంటే బ్రహ్మము ప్రాణమనే రూపము జెందినపుడు జీవనామము చెందినది. అంతఃకరణ విశిష్టత్వమే జీవత్వము. అతడే జ్ఞాతృగా జెప్పబడుచున్నాడు.

జీవుడు తనమూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషి చేసినచో తన స్వరూపసాక్షాత్కారము పొందగలడు. తన స్వస్వరూప జ్ఞానమే జ్ఞానమునకర్థముగా స్వీకరించవలయున.

**శ్లో॥ "దేహ బుద్ధ్యాతు దాసోహం జీవ బుద్ధ్యాత్వదం శకః॥ ఆత్మ బుద్ధ్యాత్వమే వాహం యితిమే నిశ్చితామతాః"॥** అనగా దేహభావముతో కూడిన ద్వైత భావం అనగా భక్తుడు దాసుడు, భగవంతుడు ప్రభువు. జీవభావము నందు భక్తుడు భగవంతుని శరీరములో ఒక అణురూపమైన అంశస్వరూపుడు. మరియు "అణోరణియాన్ మహత్ మహాయాన్" బ్రహ్మవస్తువు అణువు కంటే కూడ చిన్నది. అణుస్వరూపులైన జీవులందాబ్రహ్మము అంతర్యామిగానున్నది. జ్ఞానము శరీరము నందలి ప్రతి అణువు నందు గూడ వ్యాపించి యున్నది. ఆత్మ భావమే అద్వైత భావము. బ్రహ్మను నేనను భావము.

జ్ఞాతృ జ్ఞానము వదలు మనుటలో జీవ భావమును, ఆత్మ భావమును (బ్రహ్మ భావమును) వదలుమని జెప్పినట్లే. అట్లు జాతృ జ్ఞానము వదిలినచో (బ్రహ్మ భావము, నేనను భావము వదిలిన) నేను లేనిది, నేనుకాని పరిపూర్ణపరబ్రహ్మము అపరోక్షము.

**షడ్భూతరహితంపూర్ణం అష్టావర్ణ వర్జితం**
**షడ్వర్గరహితంపూర్ణం షడ్కోశరహితంసదా** ॥౪౩॥

పరిపూర్ణ పరబ్రహ్మమందు ఆరుభూతములు అష్టావరణములు, అరిషడ్వర్గములు మరియు ఆరుకోశములు ఎల్లప్పుడును లేవు.

**వివరములు :**

**1. షడ్భూతరహితంపూర్ణం** : పరిపూర్ణపరబ్రహ్మము ఆరు భూతములు లేనిది సాధారణముగా పంచ భూతములచే ఈ ప్రపంచ మాయెనని చెప్పుతుంటారు. మొదట సర్వాంగీకారమైన పంచభూతములును గురించి తెలుసుకొందాము. "తస్మాద్వా, ఏతస్మాదాత్మన ఆకాశంభూతః, ఆకాశద్వాయుః వాయోరగ్ని అగ్నేరాపః అద్భ్యః పృథ్వి ...." అను శ్రుతి ప్రకారము మరియు "ఆకాశశ్శరీరంబ్రహ్మ" అనుసరించి ఆకాశమే శరీరము గల ఆత్మ నుంచి ఆకాశము ఆకాశము నుండి వాయువు అట్లే ఇతర భూతములు కలిగినవి. ఈ భావమును శ్రీకృష్ణదేశికేంద్రుల వారు 62 క.ద॥ "ఆకాశాధిక భూతా। నీ కాత్మ కమగుచు ఎరుక ఈ జగమయ్యె" మరియు "82 క.ద" ఎరుకైన భూతములు। నీ వెరుగుము ఆకసముగాడ్పు। యింగలమును। నీళ్ళిరవందనేలయని। నేనెరిగిన పద్ధతి నీకు। నెరిగించి నానూ। ముజ్జగములయ్యేను వీట్లతోను"॥ అని సెలవిచ్చియున్నారు. పంచ భూత పరిణామము చెందిన యెరుకకు అనగా విశుద్ధచేతనమునకు ఆ పంచభూతములలో పృథ్వి పాదములు, జలము కటి, అగ్ని హృదయము, వాయువు కంఠము, ఆకాశము శిరోభాగమమై విరాట్ పురుషుని స్థూల దేహమయ్యెను. పంచభూతములు వాటి ధర్మ కర్మలు స్థానములు మొదలగునవి తెల్పు పట్టికను పరిశీలించుము.

| భూతములు | ధర్మములు | కర్మలు | వర్ణములు | అధిదేవతలు | స్థానములు | గుణములు, | శక్తులు | బీజములు |
|---|---|---|---|---|---|---|---|---|
| 1.పృథివి చతుష్కోణాకారము | స్నేహించడము | ధరించడము | స్వర్ణము | బ్రహ్మ | గుదము | శబ్ద, స్పర్శ, రస, రూప, గంధము-5 | క్రియా శక్తి | లం |
| 2. జలము అర్ధచంద్రాకారము | చెప్పడము | పదునుచేయడము | స్ఫటికము | విష్ణువు | గుహ్యము | శబ్ద, స్పర్శ, రస, రూప-4 | ఇచ్ఛాశక్తి | వం. |
| 3. అగ్ని త్రికోణాకారము | వెలగడము | కాల్చడము | యెరుపు | రుద్రుడు | నాభి | శబ్ద, స్పర్శ, రూప-3 | జ్ఞానశక్తి | రం |
| 4. వాయుము షట్కోణాకారము | చలించడము | చేర్చడము | పొగ | మహేశ్వరుడు | హృదయము | శబ్ద, స్పర్శ 2 | ఆదిశక్తి | యం |
| 5. ఆకాశము వర్తులాకారము | బయలైయుండడము | అవకాశ మివ్వడము | నీలము | సదాశివుడు | కంఠము | శబ్దము 1 | పరాశక్తి | అం |

6.ఆరవభూతము ఆత్మ- ఎందుకనగా ఆత్మనుంచే తక్కిన భూతములన్ని పుట్టినవి.

పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ ఆరు భూతములు లేవు. కనుక షడ్భూత రహితమని ఈ వాక్యము ప్రబోధించుచున్నది.

**2. అష్టావరణ వర్జితమ్ :** పరిపూర్ణ పరబ్రహ్మమందు అష్టావరణములు లేవు. అష్టావరణములేవనగా 1. దుఃఖము: దుఃఖము జన్మ మెత్తుట వల్ల వచ్చినది 2. జన్మ=జన్మ కర్మ చేయుట వల్ల వచ్చినది. 3. కర్మ =కర్మ అభిమానముచే వచ్చినది. 4. అభిమానము=అవివేకమువల్ల వచ్చినది. 5. అవివేకము= అజ్ఞానముచేత వచ్చినది. 6. అజ్ఞానము = అజ్ఞానము మాయవల్ల వచ్చినది. 7. మాయ = మాయ బ్రహ్మము వల్లవచ్చినది. 8. బ్రహ్మము= బ్రహ్మము అనాది గనుక ఎందుచేత వచ్చినది కాదు.

మరొక విధముగా అష్టావరణములు 1. పృథివి : కోటి యోజనముల విశాలమైయుండును. 2. జలము =పదికోట్ల యోజనముల విశాలమై యుండును. 3. అగ్ని ఇరువది కోట్ల యోజనముల విశాలమైయుండును. 4.వాయువు= 30 కోట్ల యోజనముల విశాలంబైయుండును. 5. ఆకాశము=40 కోట్ల యోజనములు విశాలమై యుండును 6. అహంకారము= 50 కోట్ల యోజనముల విశాలమైయున్నది. 7. మహాతత్త్వములు =60 కోట్ల యోజనముల విశాలంబై యున్నది. 8. ఇన్నిటిపైన మహా ఆవరణమయని ప్రకృతి వ్యాపించియున్నది.

ఇన్ని ఆవరణములు దాటినది, మీరినది, లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. కనుక ఆవరణరహితమైనదని ఈ ఉపనిషద్వాక్యార్థము.

**3. షడ్వర్గ రహితం పూర్ణం :** పరిపూర్ణ పరబ్రహ్మము అరిషడ్వర్గములు లేనిది, అరిషడ్వర్గము లగూర్చి భద్రాద్రిరామశతకము నందు :

47 సీ॥ కోరుట కామంబు కోరిన యర్థంబు గొనసాగకుండిన క్రోధమగును।
వచ్చిన ద్రవ్యంబు వదలకుండుట లోభ మా ధనాపేక్ష మోహంబు నగను।
ధనమున్నదని మోదమున నుబ్బి నాకేమి కొదువని గర్వించుటది మదంబు।
తనద్రవ్య మపహరించిన జనులందును మది నీర్ష్యనుంచుట మత్సరంబు।
అనుచునీషడ్వర్గముల నణచి శాంతి జెందిన పురుషుండు సర్వసముడు॥ రమ్య॥

కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు అరిషడ్వర్గములు. ఈ ఆరింటి నణచినవాడే సర్వ సముడని పై పద్యము అర్థము. ఈ అరిషడ్వర్గములు లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము.

**4. షట్కోష రహితం సదా :** ఎల్లప్పుడు పరిపూర్ణపరబ్రహ్మము ఆరుకోశములు లేనిది. కోశమనగా కత్తి, వర, పుస్తకము, ఖజాన మొదలైన అర్థములు గలవు. కాని కోశ శబ్దము వేదాంత శాస్త్రములో ప్రత్యేకార్థములో వాడబడినది. ఆత్మ కావరణ రూపముగా కప్పబడినవేవో వాని కోశము లన్నారు. **అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ. కోశములనే పంచకోశముల** యొక్క ఆవరణ లోపల ఆత్మ అంతరాంతరముగా నున్నదన్నారు. అనగా అన్నమయకోశముల లోపల ప్రాణమయ కోశము, ప్రాణమయ కోశములోపల మనోమయ కోశము, మనోమయము నందు విజ్ఞాన కోశము, విజ్ఞాన కోశములోపల నున్నది ఆనందకోశము ఆనంద కోశమందున్నది ఆత్మ యని కొందరన్నారు. ఆత్మయనే దానిని కూడ హిరణ్మయకోశమని కొందరు వాడారు **"షట్కోశిక మిదం సర్వం" "హిరణ్మయే పరేకోశే విరజం బ్రహ్మ నిష్కలం"** అంతా ఆరు కోశములుగా నున్నదని, అందు చివరి కోశము హిరణ్మయ కోశమని శ్రుతులు దానిని ఉద్ఘాటించినని కాబట్టి కోశములు ఐదు మాత్రమేకాదు ఆరు కోశములని అంగీకరించవలసినదే.

ఆత్మ ఈకోశములన్నిటికి అంతరాంతరము గానున్నదని చెప్పరాదు. ఒక కోశముకంటే నొకటి పుత్తరోత్తర సూక్ష్మముగా నున్నవి. అందాత్మ సూక్ష్మాతి సూక్ష్మముగా నున్నది. అది అణోరణియాన్" యని కొనియాడ బడినది. జీవోపాధులందు ఆత్మ ఈ విధముగా సూక్ష్మముగా నున్నది. నేనెవరు అని ఆత్మాన్వేషణ చేయువారికి జిక్కును.

పిండాండ మందు షట్కోశములు, బ్రహ్మాండమందు షట్కోశములు వెరసి 12 కోశములు ఏ కోశమందు లేదంటే ఈ పండ్రెండు కోశములలో ఎక్కడ ఎంత సూక్ష్మ పరిశోధన చేసిన లేదని అర్థము. ఈ పన్నెండు యేమిలేదు. ఈ పన్నెండింట ఏమిలేదనెటందుకే పూర్ణబోధకుల ద్వాదశి ఈ పన్నెండింట ఉన్నదేది? లేని దేది? అంటే ఈ పండ్రెండు కోశములందున్నది ఆత్మయని వేదాంతులన్నారు. పరమాణువులన్నారు వైశేషికులు. నేటి శాస్త్రజ్ఞులు ఆ పరమాణువులను శోధించి అందు నిగూఢంగా ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులున్నావని, అవి మహావేగంగా నిరంతర చలనశీలములై గిర్రున తిరుగుచున్నవని కనిపెట్టారు. ఆ పరమాణువును కూడ బ్రద్ధలుకొట్టి సర్వనాశకకారియగు మహాశక్తిని ఆవిష్కరింపజేయుచున్నారు. శాస్త్రజ్ఞుల ఈ సూక్ష్మాతిసూక్ష్మ పరిశోధన వల్ల **పిండాండములో హిరణ్మయ కోశముతో సహ యే కోశములో చూచిన చలనము తప్ప అచల స్థితి లేనే లేదని తెలినది.** అంటే ఏకోశమందు లేనిది అచలతత్వము. సృష్టి యొక్క పూర్వాపరమలందు అధిష్ఠాన చేతన బ్రహ్మము స్థితిలో నున్నా అది కేవలాచల స్థితికాదు. జాగ్రదవస్థలో ఎన్నో చలనాత్మక వ్యవహారములు చేసిన వానికి గాఢ సుషుప్తిలో నున్న అచల స్థితి వంటిదే అది

అంటే, చలనము సంతను గర్భీకృత మొనర్చుకొని యున్నది. కేవలాచల స్థితిలో యున్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. ఎరుక యొక్క ద్వాదశ కోశములు పరిపూర్ణమందులేవు. మరియు లేని కోశములలో పరిపూర్ణస్థితి ఏకోశమందులేదు.

**జ్ఞానంత్యక్త్వా జగత్త్యక్త్వా ఆత్మానంత్యజ సంతతమ్**
**పురుష ప్రకృతిర్నాస్తి ఏకం నాస్తి ద్వయం నహి** ॥౪౪॥

జ్ఞానమును వదలుము, జగత్తుని వదలుము ఎల్లప్పుడు ఆత్మను విడువుము. పురుషుడు లేడు, ప్రకృతి లేదు. ఒకటి లేదు, రెండును లేదు.

వివరములు :

**1. జ్ఞానం త్యక్త్వా జగత్త్యక్త్వా ఆత్మానం త్యజ సంతతమ్ :** అనగా ఎల్లప్పుడు జ్ఞానమును, (ఎరుకను), జగత్తును, ఆత్మను విడువుము. 54 క.ద. "పరిపూర్ణ మొకటి దక్కనితరమైన ప్రపంచమెల్ల దగతెలియుము నీ వెరుకేనని మదిలోపల" అని చెప్పుట వల్ల ఈ ఉపనిషద్వాక్యమున పేర్కొనబడిన జ్ఞానము, జగత్తు మరియు ఆత్మ, పురుష ప్రకృతులు, ఒకటి రెండు యెరుకేనని అనవలసియుండును. కావున వాటినన్నిటిని (ఎరుకను) వదిలిననే గాని పరిపూర్ణము స్వతసిద్ధముగాదు. మొదట జ్ఞానమంటే, జగత్తంటే, ఆత్మయంటే ఏమో తెలుసుకొందము.

జ్ఞానమనగా సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్రజ్ఞానము మరియు వస్తుజ్ఞానము సంపాదించును. విశేషార్థములో బ్రహ్మ చైతన్యము, బ్రహ్మాకారవృత్తి, స్వస్వరూప స్ఫూర్తి, సృష్ట్యాదులే స్ఫురించని తాను తానై యున్నస్థితి. సామాన్యార్థములో తెలివి. ఈ తెలివితోనే మానవుడు శాస్త్రజ్ఞానము మరియు వస్తు జ్ఞానము సంపాదించును. ఈ జ్ఞానం సకల ప్రాణులందు మాత్రమేగాక జడములని నిర్ణయించిన పదార్థము లందు కూడ నేదో రూపములో నున్నది. తన సంగతి తన మూలము సంగతి విచారించి వివేక జ్ఞానముతో కృషిచేసినచో తన స్వరూప సాక్షాత్కారము పొందగలడు. "సర్వము ఖల్విదం బ్రహ్మ" ఏకం అనేకం భవతి" యిత్యాది శ్రుతులలోనున్న బ్రహ్మ శబ్దమునకు అచ్చతెనుగులో ఎరుక అనే శబ్దము వాడినారు. ఇచట జ్ఞానము గూర్చి తెలుసుకొన్నాము. అట్లు తెలుసుకొన్న జ్ఞానమును వదలు మంటుంది. ఈ ఉపనిషద్వాక్యము.

**(అ) జగత్త్యక్త్వా :** జగత్తును కూడ వదలు మంటుంది. తమోగుణ ప్రధానమగు ప్రకృత్యావిచ్ఛిన్న చేతనము నుండి వరుసగా ఆకాశాది సూక్ష్మభూతములను, ఆ సూక్ష్మ భూతములు పంచీకృతమై యొండొంటితో కూడుట వలన స్థూల భూతములను, తద్భూత కార్యములగు సర్వస్థూలోపాధులతో కూడిన జగత్తు క్రమముగా ఉద్భూత మయ్యెను. తమోగుణ ప్రధానమగు ప్రకృతి నుండి పరిణమించుటవల్ల జగత్తు దృశ్యరూపమును, జడరూపమునై ఉన్నది. ఈ దృశ్యమానమగునది నిజముగా ఏ వస్తువు అంటే బ్రహ్మమే జగత్తుకాదు. రజ్జువునందు తోచబడు సర్పము రజ్జువేకాని సర్పము కానేకాదనునట్లు మన భ్రాంతి వలననే దానిని జగత్తుగా చూస్తున్నాము. కాని ఏ భ్రాంతి కలుగుటకునైన దాని కొక అధిష్ఠానము లేక ఆధారముండి తీరవలెను. కావున ఈ జీవేశ్వర జగత్తునకు అధిష్ఠానముగానున్నది బ్రహ్మమే. అధిష్ఠాన బ్రహ్మము తప్ప జగత్తు పారమార్థికముగా లేనిది. మిథ్య. అనగా జగత్తునకు పారమార్థిక సత్తామాత్రము లేదు. బ్రహ్మ జ్ఞానముచే బాధనొందు పదార్థములే.

"తద్వృత్స చాపియ స్యాస్తి" అనగా ఎవనికి పరిపూర్ణమందు యెరుక ఎల్లప్పుడు లేనేలేదని ఆరూఢ మగునో వానికి "ప్రపంచం నాస్తి తస్యవై" అనగా వానికి ప్రపంచము లేనే లేదని అర్థము. సచ్చిదా నంద స్వరూపుడవగు అఖండ ఎరుక నీవు. నీవేలేనపుడు నీయందు తోచబడిన ప్రపంచము లేనే లేదని అర్థము క.ప. 47. **"నీవున్న చోట నుండును। నీ వివిధ విచిత్ర జగము నీతో గూడన్। నీవు లేనట్టి చోటును। నీ వివిధ విచిత్ర జగము నిలువదు కుర్రా"॥** అని శెలవిచ్చియున్నారంటే జగత్తును వదలుమని అన్నట్లే. బాధ యనగా మిథ్యా వస్తువులన్నీ రూఢిగా నిశ్చయమగుట మాత్రమేగాని జగము అవిచ్ఛిన్న ఘటమువలె ధ్వంసము లేక నాశనము పొందదు. కావున జగత్తు మిథ్య గనుక వదలమంటుంది ఈ వాక్యము.

**(అ) ఆత్మానంత్యజ సంతతమ్ :** ఆత్మయనగా అవస్థా త్రయము నందలి సంగతులను శరీరము జ్ఞానము లేని జడ పదార్థ మగుటవలన యెరుగజాలదు, చెప్పజాలదు. కాబట్టి దేహము కంటెను వేరుగా ఒక జ్ఞాన స్వరూప మగు వస్తువు ఈ శరీరము నందుండి సకల విషయముల నెరుగుచు చెప్పుచున్నది. అట్టి జ్ఞాన స్వరూపమగు వస్తువే ఆత్మయనబడును. అదే బ్రహ్మము. ఉత్పత్తి, స్థితి, లయ, విస్తీర్ణ ఆకర్షణములు చేయునది యెరుకనే గనుక ఆటాడించెడి వాడు యెరుకనే, కర్తయని నిర్ణయము. అన్నిటికీ అచలము అకర్తయని శ్రీ కృష్ణదేశికేంద్రులవారు. క.ద. 52లో **"ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే ఆటాడు ఎరుక యనియెడి। ఆటాడించెడివాడు అతడేరా కర్త। అంతటికి యీ అచల మకర్తా"**। అని వివరించియున్నారు. కనుక యెరుక పురుషుడే ముమ్మాటికి ఈ జీవేశ్వర జగత్తుకు కర్త, మరియు కారణము. కారణము వదలనిచో మళ్ళి మళ్ళి ఉత్పత్తికి కారణమగును. కనుక ఎరుకైన బ్రహ్మమును (ఆత్మను) వదలమంటుంది ఈ వాక్యము.

ఎట్లు వదలవలెనో అచల ఋషులు తేటతెల్లముగా జెప్పినారు. ఇందుకు భ్రాంతి రహిత శ్లోకము యిచట ఉదాహరించబడినది. శ్లో॥ త్యజ ధర్మ మధర్మంచ ఉభే సత్యానృతే త్యజ। వుభే సత్యానృతే త్యక్త్వాయేన త్యజసి తత్యజ॥ అనగా ధర్మా ధర్మములను (ఆత్మా - అనాత్మలను) సత్యా సత్యములను వదిలివేయుము. దేని చేత వానిని వదలివేసితివో దానిని కూడ వదలి వేయుమంటుంది. త్యజ అనగా త్యాగము చేయుము. త్యాగము అనుమాటకు దానము చేయుట లేక ఉచితముగా యిచ్చివేయుట అని అర్థము. ధనకనక, వస్తువాహనములు, ఈషణ త్రయమును త్యాగము చేసి సన్యాసాశ్రమమును స్వీకరించినను జనన మరణ భ్రాంతి రహిత స్థితి చేకూరదు. కనుకనే శ్రుతి। **"నకర్మణా నప్రజయా, ధనేన త్యాగేనైకే మానుశః"** త్యాగము వలన తప్ప అమృతత్వము (చావు లేక పోవుట) సిద్ధించదని భావము. పైన పేర్కొనిన జ్ఞానము, ఆత్మ, జగత్తు, పురుష ప్రకృతులు ద్వంద్వములు. సర్వద్వంద్వములు ఆత్మా అనాత్మ, జ్ఞానా జ్ఞానములు, పురుష ప్రకృతులును విడిచిన తర్వాత దేని చేత ఆ సర్వద్వంద్వములు వదిలితివో ఆవస్తువు శేషించియుండును. అట్లు శేషించిన వస్తువును కూడ వదిలినప్పుడే భ్రాంతి రహితమగును. అప్పుడే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము. సర్వద్వంద్వములు యెరుకనేగాని అందేది పరిపూర్ణము కాదు. కనుక ఎరుకను వదలవలెననెడిది సత్యము. అట్టి యెరుకను దేనిచేత వదలవలెను? ఎరుక కాని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మము. అది కేవలం నిష్క్రియం. దానిని ఒక పనిముట్టుగా జేసి దానితో

ఎరుకను విడుచుట అసాధ్యము. పరిపూర్ణమెరుకలను సద్గురువు ద్వారా తెలసి, ఎరుక లేనే లేదని దృఢము చేసికొన్న మీదట ఆ యెరుకయే బ్రహ్మమనే తన పూర్వానుభవమను భ్రాంతిని పూర్తిగా వదిలి వేయుటయే ఎరుకను విడుచుట. ఇదంతయూ భావనా రూపమే. **కనుక "యెరుక చేతనే పట్టి తీసివేయరా"** అని శ్రీ కృష్ణదేశికుల హితవు. విడిచే వాడు, విడువబడేది, విడిచే పనిముట్టు మూడు ఎరుకే. ఈ త్రిపుటిని విడుచుటయే పరిపూర్ణ బోధకుల లక్ష్యము. ఈ త్రిపుటి రహిత మందే సర్వ భ్రాంతి రహితము శాశ్వత జనన మరణ రహితము. ఇదే మోక్షము.

**2. పురుష ప్రకృతినాస్తి :** పరిపూర్ణ పరబ్రహ్మమందు పురుషుడు లేడు స్త్రీ కూడ లేదు యని భావము. "శ్వేత రక్తా ప్రభాభిన్నం" తెలుపు యెరుపు వర్ణములకు భిన్నమైనదని అర్థము. **"అజామేకాంలో హిత శుక్ల కృష్ణాం..."** అనగా మూల ప్రకృతి యెరుపు, నలుపు తెలుపు. రజోగుణము ఎరుపు, తమో గుణము నలుపు. కనుక ప్రకృతి త్రిగుణాత్మకము, త్రివర్ణ రంజితమునై యున్నది. కాని పురుషుడు త్రిగుణాతీతుడని చెప్పబడుచున్నాడు. అతని యందు త్రిగుణములతో పాటు వాని వర్ణములు కానరావు. కాని ఆ త్రిగుణములతని యందు బీజరూపముగా నున్నవని చెప్పవలసి యుండును. ఏలననగా త్రిగుణాత్మ ప్రకృతికి పురుషుడే స్థానమై యున్నాడు. పురుషుని వినా ప్రకృతికునికి లేదు. పురుషుడే ప్రకృతి. దాని నుండి కలిగిన సమస్తమునకు ఆధారము అధిష్ఠానము అయివున్నాడు. పురుషుని యందు ప్రకృతి ఒక భాగము నందున్నదని **'పాదస్యో విశ్వభూతాని త్రిపాదస్య మృతం దివి"** అని కొందరందురు. అదియును సరిగాదు. పురుష ప్రకృతులు రెండు నేను మేనులవలె ఓత ప్రోతమై అవినాభావ సంబంధము కలిగి యున్నవని సిద్ధాంతము. ఈ విషయము అర్థమగుటకు మందాధికారులకై శివుడు అర్ధనారీశ్వరుడని చిత్రించబడినారు. ఈ పురుష ప్రకృతులు కూడ ఎరుకనే కావున పురుష ప్రకృతులు లేనివి.

**3. ఏకం నాస్తి ద్వయం నహి:** పరిపూర్ణ మందు ఒకటి లేదు. రెండును లేదు. సంఖ్యానీకములో అనగా అంకెలలో సున్న (0) నుంచి 9 వరకు సంఖ్యలున్నవి. ఒకటి నుండి తొమ్మిది వరకు సృష్టికి సంబంధించి ఆ సున్న నుండియే వచ్చినవి. ఒకటికి పూర్వమున్న సున్నను కొందరు అసత్తు, శూన్యమని అన్నారు. కొందరది శూన్యముగాదు పూర్ణము, సత్ అన్నారు. సున్న అనే మాట శూన్యమనేది సంస్కృత శబ్దము. ఆ వస్తువు సత్తు అయివున్నది, అసత్తు అయివున్నది. ఈ ద్వంద్వ స్వరూపముగా నున్న సృష్టి కారణ బ్రహ్మము సత్యమైనదీ, మనోవాక్కుల కగోచరమైనదీ యగు పరిపూర్ణ పరబ్రహ్మము కానేరదు. "నసత్తన్ నా సదుచ్యతే" అనగా అది సత్తు కాదు, అసత్తుకాదు. పరిపూర్ణపరబ్రహ్మము సదసద్రహితమైనదని అచల ఋషుల నిర్ణయము. ఏకానేకములు గానిది. అందు ఒకటి గాని రెండుగాని మరే సంఖ్యలుగాని లేవు. అందుకే ఏకం నాస్తీ ద్వయం నహి అని చెప్పబడినది.

**బాహ్యాభ్యంతరంనాస్తి సత్యం సత్య మహర్నిశమ్**
**కర్తృకారణహీనో యమనుత్పన్న మిదం జగత్** ॥౪౫॥

పరిపూర్ణపరబ్రహ్మమందు బాహ్యము (సగుణ రూపము) అభ్యంతరము (నిర్గుణ రూపము లేక నిరాకారము) లను ద్వంద్వములు లేవు అనెడిది సత్యం సత్యం అని రెండేసి పరియాయములు దృఢ పడుటకు చెప్పబడినది. పరిపూర్ణము కర్తృకారణములు లేనిది.

అందు ఈ జగత్తు ఉత్పన్నములు కాలేదు.

**1. బాహ్యాభ్యంతరం నాస్తి సత్యంసత్యమహర్నిశమ్** : పరిపూర్ణమందు బాహ్యాభ్యంతరములు అనగా సగుణ నిర్గుణోపాసనలు లేవు. మరొక విధంగా జూచిన బాహ్యమనగా స్థూలము, అంతరమనగా సూక్ష్మము కూడలేదని అర్థము. ఇది ఎల్లప్పుడు సత్యము సత్యమని రెండేసి పరియాయములు చెప్పబడినది. సగుణోపాసనయనగా నామ రూపములతో కూడిన విగ్రహమునకో వ్యక్తికో షోడశోపచారయుతంగా పూజయు, నామ జపస్తోత్రములు చేయుట సగుణోపాసన.

శ్లో॥ శ్రవణం కీర్తనం స్మరణం విష్ణోపాదసేవనం।

అర్చనం, వందనం, దాస్యం సఖ్య మాత్మనివేదనం। అను నవవిధ భక్తులు సగుణోపాసనలోనే సాధ్యం. ఇదంతయు బాహ్యాభక్తి. గురూపాసన విధానమునములో సగుణ రూపుడై తనకు మంత్రోపదేశము చేసిన గురువు యెడల శిష్యుడు ఈ బాహ్యాభక్తి ముఖ్యముగా అనుసరించవలసియున్నది. బాహ్య భక్తి యందు ఆత్మ నివేదన భక్తికి పరాకాష్ఠ.

అభ్యంతరము లేక నిర్గుణోపాసన గురించి తెలుసుకొందము. సృష్టికి పూర్వం సృష్టి బీజములగు సత్వరజో తమోగుణములు, జీవుల సకల సంస్కారములు బీజరూపముగా తన యందు గర్భీకృతము జేసుకొన్న పరమాత్మ నిర్గుణుడని జెప్పబడును. ఈ నిర్గుణ రూపము సృష్టి సంకల్పము కలిగి గుణత్రయ విజృంభణ జరిగినప్పుడు కూడ వ్యక్తము గాకుండ అనగా ఇంద్రియ గోచరము గాకుండ వున్నందున అతడే అవ్యక్తమని పేరొందినాడు. నామరూపయుతుడై జీవేశ్వర జగత్తుగా పరిణమించినపుడు సోపాధిక నిరూపాధికములగు సమస్తము నందు బెల్లము నందు తీపివలె వ్యాపించి నామరూపములచే ఆవృతుడై కండ్లకగుపించక యున్నాడు. అముక్తము అనగా బెల్లమును తీపి విడిచి యుండని రీతిగా జీవేశ్వర జగత్తు వీడి అన్యదేశమున లేదు. మూర్తము అనగా ఆకారము రూపము లేకుండ నిరవయవముగా నుండుట అవ్యక్తము. సర్వ వ్యాపకము, నిరామయము లేక అమూర్తమగు పదార్థమునకు క్రియారూపముగాకున్నను భావనా రూపముగా మనస్సుచే ఈ ఆత్మను లేక బ్రహ్మము నుపాసించవచ్చును. ఈ మానసిక పూజ యందు ఉపాస్య వస్తువునకు నామరూపము లుండనక్కరలేదు. పూజా ద్రవ్యము లవసరము లేదు. క్రియారుపమగు పూజకు అవసరమగు కాయిక వాచికములతో పనిలేదు. కాని ఉపాస్యవస్తువు గురు ముఖతః వస్తు నిశ్చయమైన వారికి గాని తదితరులకు యిది అసాధ్యమే. నిర్గుణోపాసన విధానమందు ఆత్మ వస్తువు యొక్క స్థాన స్వరూప స్వభావములు తెలిసియుండుట ముఖ్యావసరము.

పూజాధికము నందు త్రిపుటి వుండక తప్పదు. ఉపాసకుడు, ఉపాసన, ఉపాస్య వస్తువు అని త్రిపుటి వుంటే తప్ప ఉపాసన సాధ్యముకాదు. అట్లే ధ్యానమందు కూడ ప్రథమములో ధ్యాత, ధ్యానము, ధ్యేయ రూపము వహించును. అంటే ధ్యేయమగు గురు స్వరూపము బ్రహ్మ స్వరూపము తానే అయి ఏక భావన చెందును. అపుడిక ధ్యానమంటే పొసగదు. ఈ స్థితి యందు మాత్రమే నిర్గుణోపాసన సంభవము. అవిచ్ఛిన్న తైలధారవత్తుగా ధ్యానము చేయునపుడు కూడ ద్విపుటి త్రిపుటులు తప్పవు. ఈ త్రిపుటి రహితమే ధ్యానమునకు పరా కాష్ఠ. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థములలో 126 క.దు॥ **జనులాత్మానుభవం బైనను। ముక్త్యని బల్కి। రిట్లు నమ్మకు మెరుకే। కనరాదెచ్చట గురుకృప। ననుభవమెవ్వరికి**

**పైన ఆమాట నిజమో। అనుభవ ముళ్ళక్కి మాటనిజమో। వినజెప్పు రెండు వివరించి పై మాట"।** అని అన్నారు. అనుభవము శూన్యమైనది కనకనే శూన్య సమాధి యన వలసి వచ్చెను. కావున పరిపూర్ణ మందు ఈ అంతర బాహ్యములు అనగా సగుణ నిర్గుణోపాసనలులేవు. ఇవి లేవనుటను ఆరూఢ పరుచుటకు రెండేసి పర్యాయములు యిచట జెప్పబడినది.

**2. కర్తృత్వ కారణ హీనోయి :** కర్తృత్వము మరియు కారణము కూడ లేనిది పరిపూర్ణ పరబ్రహ్మము. కర్తృత్వము అనగా ఒక పని చేసినందులకు బాధ్యత. పంచ కారణములు లేనిదే పని జరుగదు. "అధిష్ఠానం తథాకర్తా కరణంచ పృథగ్విధమ్। వివిధాశ్చ పృథక్చేష్టాదైవం చైవాత్ర పంచమమ్ భ.గీ. (18-14) 1. అధిష్ఠానము. (సూక్ష్మ శరీరములేక అంతః కరణము) 2. కర్త అంతః కరణముతో కూడిన చైతన్యం. (చిదాభాసుడు జీవుడు) 3. ఇంద్రియములు, 4. వివిధములగు ప్రాణ చలన రూపములగు క్రియలు 5. అధిష్ఠానదేవతలు ఈ ఐదు కారణములతో పిండాండ వ్యవహారము జరుగుచున్నది. ఇందు కర్తృత్వ మెవరిది? అంతః కరణముతో కూడిన చైతన్యము ప్రధాన కర్త యని చెప్పవలెను. ఏలననగా జీవుడే గుర్తెరుగుచు నా కర్మల నుద్దేశ పూర్వకముగా చేయుచున్నాడు. మరి బ్రహ్మాండ మందెవరిది కర్తృత్వము అంటే సృష్టి సంకల్పము జేసిన బ్రహ్మదే. అయితే జీవేశ్వరులు బ్రహ్మకంటే భిన్నులు కారు. ఆ బ్రహ్మ చైతన్యమే ఉపాధి గతమై జీవేశ్వులనే పేరుతో పిండాండ బ్రహ్మాండములందు కర్తృత్వము వహించుచున్నది. "తేన వినాతృణా గ్రమపినచలతి" అనగా దాని సత్తలేనిచో గడ్డి పరక కూడ కదలదు. ఏది లేకుంటే అసలు కర్మ అనేది జరగదో దానినే కర్త అనాలి. అందుకే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు 52 క.ద॥లో 'ఆటాడి ఆడకుందును। ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే। ఆటాడు ఎరుక యనియెడి। యాటాడించువాడు అతడేరా కర్త। అంతటికి యీ అచలమకర్తా॥" అని శెలవిచ్చియున్నారు. ఈ భావమును కేవలం పిండాండ పరంగా కాక బ్రహ్మాండ అధిష్టాన స్థానములందు సమన్వయము గావించుకొనవలయును.

సర్వకారణమైన బ్రహ్మమే (అఖండ ఎరుకయే) కారణ కర్తృత్వము గలదై యున్నది. దీని రహిత విధానము పరిపూర్ణ బోధ రీత్యా ఆరూఢ పరుచుకొన్నవారికి కర్మకౌశల రూపమైన కర్తృత్వ రహిత విధానము తెలిసి నైష్కర్మ్యసిద్ధి రీత్యా జన్మకర్మలు తొలగ గలవు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మము కర్తృత్వకారణ హీనమయినది.

**3. అనుత్పన్న మిదం జగత్ :** పరిపూర్ణమందు ఈ జగత్తు పుట్టనే లేదని అచల ఋషుల సిద్ధాంతము క.ప॥ 67 "ముడిబడి కర్మము జ్ఞానము। విడువక నా రెండు వెలసె। విశ్వమననదే॥ అని శెలవిచ్చియున్నారు. అంటే కర్మ జ్ఞానముల చేరిక వల్లనే ఈ విశ్వమేర్పడినది. మూలములేని గుర్తెరిగే శరీరమును విడిచి సద్గురుమూర్తి నాశ్రయించి అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొన్నయెడల గడియ కాలమైన ఎరుక నిలువక పోవును. అందుకే అచల ఋషులు పరిపూర్ణ పరబయలు నందు ఈ విశ్వము పుట్టనేలేదని సిద్ధాంతముచేసి యున్నారు. "ద్వితీయ కారణా భావాదనుత్పన్నమిదం జగత్" "యద్వైనహినభశూన్యం జగచ్ఛూన్యం తద్వైవహి" (సామ : 61 మహ అ 5-13-14) తా॥ రెండవ కారణము లేని వలన ఈ జగత్తు పుట్టనిదే. ఆకాశము యేరీతిన శూన్యమో

ఆరీతిగానే జగత్తు శూన్యము గదా! శృ॥ సర్వం వికారజాతం మాయా మాత్రం" నామరూప వికారములు కలిగి యుద్భవించినది సమస్తమును మాయా స్వరూపమైనది లేనిదే. కావున ఈ జగత్తు పుట్టనే లేదు.

**నరశృంగేణాచాకాశం భిద్యతే జగదస్తిచ**
**అజాగళస్త నేక్షీరం జాయతే జగదస్తిచ** ॥౪౮॥

అనుత్పన్నమగు నీజగత్తు నరుని కొమ్ముచే ఆకాశము భేదించుట వంటిదైయున్నది. మరియు మేక మెడచంటి యందుపాలున్నచో నీ జగత్తుండును.

**వివరములు :**

పరిపూర్ణము నిర్మలమై శుద్ధమై దేనికి తావులేనట్టి పరబాహ్యమందు జగత్తు పుట్టనేలేదని అచలబుధులు సిద్ధాంతము జేసి యున్నారు. ఆ భావము దృఢ మగుటకు అనేక దృష్టాంతము లిచ్చియున్నారు. వాటిని పరిశీలింతము.

ప్రస్తుత ఉపనిషద్వాక్యములందు పరిపూర్ణపరబాహ్యమందు జగత్తు పుట్టనే లేదనెడి విషయమును నరుని కొమ్ముతో పోల్చినారు. నరుని కొమ్ముచే ఆకాశమును భేదించగల్గిన జగుత్తుండునని చెప్పబడినది. నరునికి కొమ్ముండుటకు వీలులేదు. నరునికి కొమ్ముతోచుటగాని లేక భ్రాంతి జెందుటకు అవకాశము లేదు. కుందేటి కొమ్ము గలదని భ్రాంతి జెందుటకవకాశము గలదు. ఎట్లనగా కుందేలును వేటకాడు వెంబడించు సమయమున అది తన రెండు చెవులను నిక్కించి ఒకచోటికి చేర్చి పరిగెత్తుటవల్ల చెవులు ఒక కొమ్ముగా భాసించును. అనగా కొమ్మున్నట్లు భ్రాంతి చెందుటకవకాశము కలుగును. కాని కుందేలు చిన్నదైన, దాని చెవులు చాల పెద్దవై నిక్కించి పరుగెత్తుట వల్ల భ్రాంతి కవకాశమున్నది గాని నరుని చెవులుకుందేలు చెవుల కంటే అతి చిన్నవి. వాటిని నిక్కించి యుంచుటకు వీలు లేదు. కనుక నరునకు కొమ్మున్నట్లు భాసించుటకే అవకాశము లేదు. మరియు నరునకు కుందేలు వలె కొమ్ముగా భాసించుటకు అధారము అధిష్ఠానము యేది లేదు. నరుని కొమ్మున్న దనుటకు ఊహించుటకు కూడ అవకాశము లేదు. అట్టి అనూహ్యమైన కొమ్ముతో లేని ఆకాశమును భేదించుటకవకాశము లేదు. అది జరగని పని. "ఆకాశం గగనం శూన్యం" అని అన్నారు. మరియు శ్రీ కృష్ణదేశికేంద్రులవారు 132. కం.ప॥ **"ఆకాశమనిన శూన్యం। బాకాశంబనిన సగుణ మకాశమనన్। కాకివలె నల్ల రూపది। ఆకాశము మితము లోన నణగుండు సుమీ॥"** అని సెలవిచ్చియున్నారు. అనగా శబ్దగుణము గలిగి యున్నందున ఆకాశము రూపము గలదని, ఇతర వస్తువులతో కలియుటవలన భూతమని వ్యవహరించబడుచున్నది. ఆకారణమున నామ రూపములు మిథ్య గనుక ఆకాశములేనిదని నిర్ణయము. ఇటువంటి లేని ఆకాశమును లేని నరుని కొమ్ముచే భేదించుట యనునది లేకనే జరిగింది. ఇచట కర్త, కర్మ, క్రియ అనే త్రిపుటి లేనేలేదు. అదే విధముగా పృథ్వి ఆకాశమునుండియే అయినది. లేని ఆకాశము నుండి తక్కిన భూతములు ఏర్పడినవంటే వుండి కలుగలేదు లేకనే కలిగినవి. ఈ పంచభూతములచే ఏర్పడిన నరుని శరీరము కూడ లేకనే కలిగినది. కనుక నరుడు కూడలేనివాడు. ఆకాశము కూడ లేనిదే. దానిని లేని నరుని కొమ్ముచే భేదించుట జరిగినదని అనుట సత్యము ఎట్లుకాదో జగత్తు పుట్టినదనుట సత్యము గాదని, జగత్తున్నదంటే మిథ్యనే, లేనిదే.

**అజాగళస్త నేక్షీరం జాయతే జగదస్తిచ :** అనగా ఆడ మేక మెడ సంటియందు పాలుగలిగినచో నీ జగముండునని అర్థము. అందు పాలుండుటకు వీలు లేదు. కనుక జగత్తు లేదని ఈ ఉపనిషద్వాక్యార్థము. మేక మెడలో వ్రేలాడు చనులకు ఆడమేక చనులే ఆధారము అధిష్ఠానము. కనుక యిచట భ్రాంతి కవకాశము కలదు. ఇవి చనుల వలెనే వ్రేలాడుచున్నవి కనుక వాటి యందు కూడ పాలు గలవని తలంచుటకు ఆధారమున్నది. కాని పాలుండుటకే వీలులేదు. వాటియందు పాలెట్లులేవో జగత్తు కూడ పుట్టలేదని నిశ్చయముగా నమ్మవలెను. ఎందుకనగా పరిపూర్ణము నిర్మలమై శుద్ధమై యున్నదని అందు యేవస్తువులేదని, కార్యకారణ రూపముగా నున్న జగత్తుండుటకు వీలులేదని, వున్నట్లు తోచుచున్నదని అచలఋషుల గట్టినమ్మకము.

జగత్తు =జ+గ+తు,జ= అంటే పుట్టుట, గ=అంటే గచ్ఛతి, తు=అంటే వదిలిపెట్టుట=అంటే జగత్తు పుట్టనేలేదని చెప్పవచ్చును.

**శునకశ్శుకవాక్యస్య వదేచ్ఛేజ్జగదస్తిచ**
**సూర్యోచంద్ర ప్రకాశేన భాసతేజగదస్థితః** ॥౪౨॥

కుక్కచిలుక పలుకు పలుక గలిగిన జగత్తుండును. సూర్యుడు చంద్రకాంతితో ప్రకాశించిన జగత్తుండును.

**వివరములు :**

**1. శునకశుకవాక్యస్యవదేచ్ఛే జగదస్తిచ :** శునకమనగా కుక్క, శుకమనగా చిలుక, శునకము జంతువు. చిలుక పక్షిజాతికి చెందినది. అయినను వీటిలో గల వాక్కు ఒకే విధమైనది. అద్దానిని "మధ్యమ వాక్కు" అని అందురు. వాక్కు వైఖరీ రూపములో మానవులందున్నది గనుకనే మానవులందరు నేను నేను అని పలుకగలుగుచున్నారు. ఆ వాక్కే "మధ్యమ" పేరుతో పశుపక్ష్యాదులందుండి తమ భావమును స్వజాతి ప్రాణులకు తెలియ జేయుచున్నవి.

కుక్క, చిలుకలలో మధ్యమ వాక్కున్నదని తెలుసుకొంటిమి. గాని ఈ వాక్కు కేవలం సజాతి ప్రాణులకే ఉపయోగపడును. కావున చిలుక పలుకులు కుక్కకు, కుక్కలు మొరుగుట చిలుకకు అర్థముకావు. ఎందు కనగా మధ్యమ యను తెలివి లేక పలుకు వేర్వేరుగా నుండుటయే యిందుకు కారణము. కుక్క మొరిగిన సజాతియైన కుక్కలకే అర్థమగును గాని చిలుక కర్థముగావు. అట్లే చిలుక. చిలుకకు అభ్యాసము చేయించిన మానవులవలె పల్కె టట్లు చేయవచ్చును. గాని కుక్కకట్లు సాధ్యముగాదు. అట్లుగాక సత్యమైతే ఈ జగత్తుండుట సత్యమని జెప్పబడినది. గనుక కుక్క చిలుక పలుకులు పలుక జాలదు, జగత్తు కలుగుట అసత్యమని దృష్టాంతము ద్వారా సాధకునికి దృఢపరచనైనది. జగత్తు సర్వము నామ రూపములతో గలది. నామ రూపముగా గలది మాయ. యా మా సా మాయ యను నిర్వచనము ప్రకారము ఏది లేనిదో అది మాయ గనుక జగత్తు మాయవలన కలిగినది. కనుక అది లేనిది.

**2. సూర్యోచంద్ర ప్రకాశేన భాసతేజగదస్థితః :** చంద్రకాంతితో సూర్యుడు ప్రకాశించిన జగత్తుండునని అర్థము. ఈ భావన యధార్థమైనదిగాదు. సూర్యుని కాంతితోనే చంద్రుడు, నవగ్రహములు ప్రకాశించును. సూర్యుని కాంతివల్ల సృష్టిలోని సమస్త

చరాచరములు తమ తమ పోషణకై వలయు అన్నపానాదులు సమకూర్చుకొనును. సూర్యునికాంతి విశేషముగా యుండును. ఆ కాంతిస్వయంప్రకాశము. తాను ప్రకాశించుటకు యితర వస్తువలపై ఆధారపడవలసినపని లేదు. చంద్రునికి స్వయం ప్రకాశము లేదు. తాను ప్రకాశించవలయునన్న చంద్రుడు సూర్యునిపై ఆధార పడవలసి యున్నది. కాని యిచట తద్భిన్నముగా జెప్పి చంద్రప్రకాశము వల్ల సూర్యుడు ప్రకాశించును అనుట సత్యమైతే జగత్తు యొక్క ఉనికి సత్యమని చెప్పబడినది. అది సత్యముగాదు. జగత్తు సత్యముగాదు. చంద్ర ప్రకాశమువల్ల సూర్యుడెన్నడును ప్రకాశించడు గనుక జగత్తు అసత్యమని నిరూపించబడినది. సాధకునికి జగత్తులేదనుట ధృధ పరుచుటకు యిటువంటి చాటువులు జెప్పబడినవి.

**ఔదుంబరే భవేత్పుష్పం జాయతే జగస్థితమ్**
**చందనే పుష్ప మాఘ్రాణం సంతోషోప్యస్తి చేజ్జగమ్** ॥౪౮॥

అత్తి చెట్టుకు పుష్పములు కలిగిన జగత్తు యొక్క ఉనికి యుండును. చందన పుష్పమును వాసన చూచిన సంతోషము కలిగినచో జగముండునని భావము.

**వివరములు :**

**1. ఔదుంబరేభవేత్పుష్పం జాయతే జగస్థితమ్ :** అత్తి చెట్టుకు పూలు కలిగిన జగత్తు యొక్క ఉనికి యుండునని దృష్టాంతము. అత్తి చెట్లు పూవులు పూయవు. అనగా ఇతర చెట్లకు పూత బూసినది కనబడి ఆ పూత వల్ల కాయలు కలుగునట్లుమనము చూస్తున్నాము. కాని అత్తి చెట్టునందు పూత కనబడకనే కాయలు కాయును. కనుక అత్తి యందు పూలు కనబడిన జగత్తుండునని సాటువు చెప్పబడినది. అత్తి చెట్టు పూత పూయదు. కనుక అత్తి చెట్టుకు పూలు కలిగినవనిన సత్యముగాదు. అట్లే జగత్తు పారమార్థికముగా గలదనుట అసత్యమే.

బాగుగా పరిశీలించినయెడల కొన్ని చెట్లు పూలు పూయకనే కాయలగును. కాని వాటి కాయలలోనే పూలు వుండును. ఉ॥ మేడి, రావిచెట్లు అత్తి కూడ ఆ కోవకు చెందును. ఆ చెట్లకు కాయలే మొదట కాయును. ఆకాయలందే పూలు లోపలి భాగమున తొడిమె చివర యుండును. మేడి పండును కోసిన తొడిమె లోభాగమున ఈ పూవు ఉండును. అత్తికాయలో కూడ పూవు వుండును. అందు పూవు వుండికూడ మనకు కనబడుటలేదు. అట్లే పారమార్థికముగా జగత్తును పరిశీలించిన యెడల జగత్తుండి కూడ లేనట్లుగా భావించవలయును. వ్యవహారికముగా జగత్తు సత్యమే. ఎరుక యందు ఎరుక సత్యమే. కాని పరిపూర్ణములో యెరుకకు నిలిచే అందుకుస్థానము గాని మూలముగాని లేదు. కనుక దానికి లేనెరుక అని పేరొందినది. అత్తి చెట్టు నందు పువ్వుండి కూడ కనబడుటలేదు. అట్లే జగత్తుండి కూడ పరిపూర్ణ భావజ్ఞునికి లేనిదానిగాయున్నది అని తెలియవలెను.

**2. చందనే పుష్ప మాఘ్రాణం సంతోషోప్యస్తిచేజ్జగమ్ :** అనగా గంధము చెట్టు యొక్క పుష్పమును వాసన జూచిన సంతోషమైనచో జగముండునని జెప్పబడినది. మంచి గంధము చెట్టు పూలు పూయదు. పూలు ఉంటే తప్పక వాసన వుంటుంది. ఎందుకనగా దాని ప్రతి వస్తువు నందు మంచి సువాసన వుండును. వాసన చూచిన తప్పక మనస్సు సంతోషమగును. కాని పూలు లేవు. వాసన చూచు ప్రక్రియయు లేదు, కనుక

సంతోషమగునను మాటయే లేదు. అదేవిధముగా పరిపూర్ణ భావజ్ఞుడు తనకు పుట్టుక లేదని భావించును. పుట్టుక లేనప్పుడు గిట్టుట కూడ లేదు. తానే లేదు కావున అతనికి జగత్తే లేదు. తానుంటేనే ఈ జగత్తు, భార్యపిల్లలు, సంసారము ఇవన్ని యున్నట్లే కాని అతడు ఎల్లప్పుడు తాను పరిపూర్ణమందు లేననే భావనలో యుండి అశరీరునిగా వ్యవహారార్థము లోకమున పనులు చేయును. ఏపని చేసిన కర్తృత్వ రహితము గాజేయును. ఇతరులకు తమవలెనే ఆతడు పనులు చేయుచున్నట్లు కనపడిన ఆ పనుల వల్ల అతనికి సంస్కారములుత్పత్తికావు. చందన పుష్పమేలేదు దాని సువాసన వల్ల సంతోషమెక్కడిది? సంతోషములేదు. కావున పారమార్థికముగా జగత్తు లేదనేది నిశ్చయముండ వలయును.

**శ్లో॥ శుద్ధే సుషుప్తావివచ తస్మినాహం కదాచన । తద్వత్సదాపి యస్యాస్తి ప్రపంచంనాస్తి తస్యవై॥** తా॥ అహం అనగా "నేను". అను వృత్తి గాఢ సుషుప్తి యందు యేవిధముగా లేదో, అట్లే శుద్ధమైనదాని యందు అనగా పంచతన్మాత్రలు లేని పరిపూర్ణపరబ్రహ్మమందు "నేను" అను ఆ యెరుక యెల్లప్పుడు లేనే లేదని ఏమహానుభావునికి ఆరూఢమై యుండునో అట్టివానికి ప్రపంచము కూడ లేనిదేయగుచున్నది.

**రవిరభ్యుదితేరాత్రౌ చంద్రోమధ్యాహ్న మస్తివా**
**తథైవ సత్యవద్భాతి ద్రష్టాదృక్చ జగస్థితిః** ॥౪౯॥

రాత్రివేళ సూర్యుడుదయించినను, మధ్యాహ్నము చంద్రుడు ప్రకాశించినను, అదేవిధముగా ద్రష్టా దృక్కు సత్యమైనచో జగత్తుండును.

**వివరములు :**

**1. రవిరభ్యుదితే రాత్రౌ, చంద్రో మధ్యాహ్నమస్తివా :** అనగా రాత్రివేళ సూర్యుడు ఉదయించిన, మధ్యాహ్నము వేళ చంద్రుడు ప్రకాశించిన యని అర్థము. ఇందు రెండు వాక్యములు పరస్పర విరుద్ధార్థములు జెప్పి అవి సత్యమైతే జగత్తు యొక్క ఉనికి సత్యమని చెప్పబడినది. కొంచెము జ్ఞానమున్నవాడు కూడ రాత్రివేళ చంద్రుడుండునని, సూర్యుడుదయించడని మరియు పగలు సూర్యుడే ప్రకాశించును గాని చంద్రుడు ప్రకాశించడని చెప్పును. అటువంటప్పుడు రాత్రివేళ సూర్యుడుదయించుట, పగటిపూట చంద్రుడు ప్రకాశించుట సత్యముగాదు. అట్లే ఈజగత్తుకు ఉనికి యున్నదనుట అసత్యము. అందుకే ఈ దృష్టాంతము.

నిజస్థితి యేమనగా సూర్యుని చుట్టు భూమి తిరుగుట వల్ల రాత్రింబవళ్ళుయేర్పడుచున్నవి. భూమి తన చుట్టు తాను తిరుగునపుడు యే భూభాగము సూర్యుని ముందుండునో ఆభాగము పగులు. యే భాగము సూర్యునికి ముందు లేకుండునో ఆ భాగమున చీకటి ఆవరించి యుండుటవల్ల రాత్రింబవళ్లు యేర్పడును. సూర్యుడు ఉదయమున ఉదయయించును. సాయంత్రము అస్తమించును. కావున రాత్రి యందు సూర్యుడుదయించుట అసంభవము – అట్లే జగత్తు యొక్క యునికి అసత్యమని జెప్పిబడినది. అట్లే మిట్ట మధ్యాహ్నము చంద్రుని ప్రకాశముండుటకు వీలులేదు. ఎందుకనగా చంద్రుడు భూమి చుట్ట తిరుగుచున్నాడు. అట్లు భ్రమణము చేయు సమయమున సూర్యుని కాంతి చంద్రునిపై బడుటవల్ల చంద్రుడు ప్రకాశించును. చంద్రుని ప్రకాశము రాత్రివేళనేయగుపడును గాని పగటివేళ చంద్రుడు అగుపడిన ప్రకాశించుటకు వీలులేదు. ఎందుకనగా ఒక ఫ్లోరసెంట్

ట్యూబ్ లైటు వెలుగులో చిరుదీపము కాంతి మృగ్యము. పగటివేళ చంద్రుడు కనపడిన చంద్రుని కాంతి మృగ్యము. మనము ఈ విషయమును సాదృశ్యముగా కృష్ణపక్ష పగటి వేళ గమనించవచ్చును. కృష్ణ పక్షమున చంద్రుని మనము పగటివేళ చూడవచ్చును. కాని సూర్యుని కాంతిలో దాని కాంతి మృగ్యము. అటువంటప్పుడు మధ్యాహ్నము చంద్రుడు ప్రకాశించుననుట దబ్బర. అదేవిధముగా జగత్తు లేదని కలగలేదని, కలవంటిదని, ఈ భావమును దృఢ పరుచుటకు ఈదృష్టాంతము చెప్పి యున్నారు.

**2. తద్వైవ సత్యవద్భాతి ద్రష్టా దృక్చ జగస్థితిః :** అనగా అదే విధముగా ద్రష్ట దృక్కు సత్యమైతే జగత్తు ఉనికి గల్గియుండును. అంటే ద్రష్ట దృక్కు నాశనయయ్యేటివే. లేనివే కనుక జగత్తు కూడ లేనిది. మొదట ద్రష్టయనగా దృక్కు అనగా నేమో తెలుసుకొందము. సర్వేంద్రియములద్వారా బహిర్గతమై శబ్దాది విషయములను గుర్తించునది అంతఃకరణప్రకాశము. సుషుప్తి యందీ అంతఃకరణము సహితము అవిద్యయందు మరుపు రూపము చెందుచున్నది. కాని ఏది నిద్రించిన తాను నిద్రించక ఉచ్ఛ్వాస నిశ్వాస రూపముగా ప్రాణము ఒక యంత్రమువలె పనిచేయుచున్నది. ఈ యంత్రమునకు సత్తాయిచ్చుచూ పనిచేయించునది ఆత్మ లేక ద్రష్ట, యనగా చూచువాడు.

ఇతరేంద్రియముల ద్వారా వ్యవహరించునపుడాతడే శ్రోత, మంత, యిత్యాది యితర నామములు చెందుచున్నాడు. ఏ యింద్రియముల ద్వారా ఏ విషయమును తెలుసుకొన్నప్పటికి మొత్తము మీద అన్నిటిని తెలుసుకొనువాడితడే గనుక యితనిని ఒక్కమాటలో 'జ్ఞాత' అని పిలువబడును. లేక వ్యక్తి భావన విడిచినచో యతనినే దృక్ అని పిలువనగును. అపుడు "దృక్" చే తెలియబడుదానికి దృశ్యమని పేరిడిరి. పిండబ్రహ్మాండములను నాచే గుర్తించబడి దర్శించబడుచూ వున్నందున "దష్టుర్ యోగ్యం దృశ్యం" అనే న్యాయంగా దృశ్యకోటిలో చేరి పోవుచున్నవి. ఇవన్ని మాయ యేనా? అంటే సృష్టికానేలేదు. సృష్టిలేనే లేదు, ఉన్నట్లు తోచబడుట మాత్రమే అందురు. దీనికే వివర్తవాదమని పేరు. జగత్తు నందుతోచబడే సకల పదార్థములు ఏక దేశీయములు, మిత పరిమాణములు, క్షణికములు, అన్నృతజడదుఃఖ స్వరూపములు నామ రూపాత్మకములు అయివున్నందున యివి పారమార్థికముగ లేనివి గనుక మిథ్య "యామాసామాయ" అను నిర్వచనాను సారము దృశ్యం మాయ యని చెప్పబడినది. దృక్ దృశ్య ద్రష్టయనే త్రిపుటిలో దృశ్యము మాయ యైతే తక్కిన రెండు మాయనే, లేనివే. ఏలననగా త్రిపుటిలో ఏ ఒక్కటి లేక పోయిన తక్కిన రెండు లేనివే యగును. కనుక దృక్, ద్రష్టలేనివిగా నిర్ణయించి అవి వున్నట్లు సత్యమైతే జగత్తుండునని, లేవు గనుక జగస్థితి లేనిదని చెప్పబడినది. ఈ భావమునే సామః61 మహ అ. 5-13-14 నందు "ద్వితీయ కారణాభావాదనుత్పన్న మిదం జగత్। యద్వైవహినభశ్శూన్యం జగ చ్ఛూన్యం తథై వహి" అనగా రెండవ కారణము లేని వలన ఈ జగత్తు పుట్టనిదే. ఆకాశము ఏరీతిగా శూన్యమో ఆ రీతిగనే జగత్తు శూన్యం కదా! "సర్వంవికారజాతం మాయా మాత్రం॥" నామరూప వికారములు కలిగి యుద్భవించినది సమస్తము మాయా రూపము. కనుకలేనిది. జగత్తు కూడ వికారములతో కూడి ఉద్భవించినది. కావున జగత్తు మాయా, లేనిది.

**పాషాణాత్పీతవసనం భవేత్సత్యం భవిష్యతి**
**పాషాణాజ్జాయతేపద్మం జగత్సత్యం భవిష్యతి** ॥౫౦॥

రాతి నుండి పట్టు వస్త్రం ఉత్పత్తియైన జగత్తు సత్యము కాగలదు. పాషాణము వలన పద్మము కలిగిన జగత్తు సత్యమై యుండును..

**వివరములు :**

**1. పాషాణాత్పీతవసనం భవేత్సత్యం భవిష్యతి :** పట్టు ఎట్లు ఉత్పత్తి యగునో మొదటతెలుసు కొందము. పట్టువస్త్రము పట్టు పురుగు వల్ల కలుగును. పట్టు పురుగు మల్బరీ ఆకులను తిని బాగుగా బలిసి తన నోటి నుండి వెలువడు చొంగతో తనచుట్టు తాను గూడు నల్లుకొని అందు స్పృహలేకుండ కొంత కాలము వరకుండును. కొన్నాళ్ళకు నిద్రమేల్కొని తన చుట్టు అల్లుకొన్న గూడును కత్తరించుకొని బయటకు వచ్చును. అట్లు బయటకు రాకమునుపే ఈ పట్టు కాయలను వేడినీటిలో వేయుదురు. వేడి వల్ల పట్టు కాయలోని పురుగు చనిపోవును – ఆ కాయనుండి పట్టుదారము తీసి పట్టు వస్త్రములుత్పతి చేయుదురు. కాని మరే వస్తువుతో పట్టు వస్త్రము తయారుకాదు. ఒక వేళ రాతితో గాని కట్ట గుజ్జుతో గాని కొన్ని రసాయన ప్రక్రియల వల్ల పట్టు వస్త్రముల వలె తయారు చేసిన ఆ వస్త్రములు కృత్రిమ పట్టువస్త్రములే అగునుగాని అసలు పట్టు వస్త్రమలు గావుగదా! అంటే ఆ వస్త్రములు సత్యమైన పట్టు వస్త్రములు గావు. సత్యమొక్కటే యుండును గాని రెండుగా వుండుటకు వీలులేదు. అట్లే పరిపూర్ణమొక్కటియే సత్యముగాని ఇతరములన్ని అసత్యములు. జగత్తుకూడ అసత్యమే. పట్టు వస్త్రము నందు కల్తీలేదు. నికారస్సైన పట్టుతో తయారు చేయబడినది. అందుకొంచమైన ఇతరము కలసిన నకిలీ పట్టు వస్త్రమనబడును. అట్లే పరిపూర్ణమందు యితరము యేదైన వున్నట్లు తోచిన అదంతయు యెరుకే. జీవేశ్వర జగత్తుకూడ లేదు. ఉన్నట్లుతోచుట మాత్రమే. అందుకే పరిపూర్ణఋషులు అసలు జగత్తు పుట్టనే లేదందురు. అధిష్ఠానబ్రహ్మమునుగాని, జీవేశ్వర జగత్తును గాని పరిపూర్ణమును చేయదలచిన అది కృత్రిమ లేక మాటల పరిపూర్ణపరబ్రహ్మమే యగును. ఇంకా చెప్పాలంటే కల్తీ పరిపూర్ణమగును. జగత్తు పరిపూర్ణ మందుఉండడానికి వీలులేదు. స్థానములేదు. పరిపూర్ణము యేది లేనిది. ఏదికానిది. జగత్తున నామ రూపములు నిరంతరం మారుచుండును. మారేదంతా మిథ్య, లేనిదే. నిజముగా తోచుచున్నదంతా అశాశ్వతము. దానికి పారమార్థిక సత్వము లేదు. జగత్తు (ఎరుక) కేవలం అలీక పదార్థము కాదు. ఎరుక ఎరుక యందు సత్యమే. జగత్తు లేదంటే రేవుదాటుటకు నావ ఎందుకు? నది కడ్డముగా నడిచి పోరాదా? బయటికి పోవుటకు దర్వాజలు ఎందుకు? అంటే జగత్తునకు పరిపూర్ణమందు స్థానము లేదు. అని గుర్తించుట ముఖ్యము. కావున రాతి నుండి పట్టు వస్త్రము కలుగదు. కనుక జగత్తు యొక్క ఉనికి సత్యంగాదని చెప్పబడినది.

ఇక రాతి నుండి పద్మము కలిగిన జగత్తుండును. తామర నీటి యందు పెరిగే మొక్క. ముఖ్యంగా మడుగు లందు, సరస్సులందు, కొలనులందు వీటిని చూస్తుంటాము. నీటిని వదిలిన ఈ మొక్క బ్రతక జాలదు. రాతి యందు నీరుండుటకు వీలులేదు. పద్మము కలుగదు అట్లే పరిపూర్ణమందు యితర మేమి యుండుటకు వీలులేదు. ఏది పుట్టదు, అదిదేనిని పుట్టించదు. అది దేనికి ఆధారము అధిష్ఠానము కాదు. కనుక పరిపూర్ణమందున ఎరుక రూపమున నున్న ఈ జగత్తు పుట్టనే లేదు మరియు ఉండుటకు వీలులేదు. కనుక యెరుకకు స్థానమెక్కడిది? లేదు. జగత్తులేదు.

**సూర్యే తథ్యాం తమస్సైవ జగత్సత్యంభవిష్యతి**
**ఇక్షోఃఫలంభవేద్దృష్టం జగత్సత్యం భవిష్యతి** ॥౫౧॥

సూర్యుని యందు నిజముగా చీకటి యున్న జగత్తు సత్యమగును. చెరుకుగడకు ఫలము కలిగిన జగత్తుండును.

**వివరములు :**

**1. సూర్యే తథ్యాం తమస్సైవ జగత్సత్యం భవిష్యతి :** సూర్యుడు నిరంతరము అతి కాంతి వంతముగ మందుచున్న గోళము. అందు చీకటి కలుగుట అసత్యము. అందు చీకటి యుంటే జగత్తుండుట సత్యమని చెప్పినారు. సామాన్యజ్ఞానమున్న వారెవరు కూడ సూర్యుని యందు చీకటి యున్నదంటే నమ్మరు. భూభ్రమణము, పరిభ్రమణమువల్ల రాత్రింబవళ్ళు యేర్పడి చీకటి వెలుతురులుగా గోచరించున్నవి. భూమి యొక్క యే భాగము సూర్యుని ముందులేదో ఆ భాగమున వెలుతురు పడుటకు అవకాశము లేనందున అంధకారము అలుముకొన్నది. కాని సూర్యుడు నిరంతరము వెలుగుతున్న గోళము కనుక అందు చీకటి కవకాశము లేదు. ఆ కారణము చేత సూర్యుని యందు చీకటి యుండదనేది సత్యము - కనుక సూర్యుని యందు చీకటి లేదు, అట్లనే జగత్తుకు వునికి లేదు - జగత్తు సత్యముగాదు. చీకటి సూర్యుని యెరుగదు. కనుక సూర్యుని వలన ప్రయోజనమేమి? అంటే చీకటి పోవుటయే ప్రయోజనము. అట్లే తాను గురుముఖత తన స్వరూప నిశ్చయ జ్ఞానము పొంది ఆ పిమ్మట పరిపూర్ణము తెలియ ప్రయత్నిస్తే తానే లేకుండ పోవును. అట్లు పోతే జన్మరాహిత్యము అట్లు పోతే భ్రాంతి రహితమగును. సర్వభ్రాంతి రహితమే పరిపూర్ణబోధ వల్ల ప్రయోజనము.

**2. ఇక్షోఃఫలం భవేదృష్టం జగత్సత్యం భవిష్యతి :** అనగా చెరుకుగడ నందు ఫలము కలిగిన జగత్తుండును అని అర్థము. ఎట్లో పరిశీలింతము. చెరుకు గడకు ఫలము "కలుగదు చెరుకుగడ తుదవెన్ను బుట్టిన చెరుకున తీపెల్లజెరుచు గదరాసుమతి" అని సుమతి శతకకర్త గానము చేసినట్లు చెరుకుగడలు ఎదిగి చివర వెన్నుబుట్టిన చెరుకు గడతీపి నాశనమగునని శెలవిచ్చియున్నారు. కనుక వెన్నురాకమును పే చెరుకునుకోసి గానుగాడించి బెల్లం తయారు చేయుదురు. అసలు చెరుకు ఫలము కలగదు. కలుగుట అసత్యము. పూత పూయును గాని కాత లేదు. చెరుకు గడను గణువులు గణువులు నరికి భూమిలోనాటిన దాని నుండే పిలుకలు పుట్టును గాని విత్తనములు నాటిన గాదు. కావున చెఱుకునకు ఫలము కలుగుట అసంభవము. అదెట్లు అసంభవమో జగత్తున్నదనుట అసంభవమని యిచట దృష్టాంత మీయబడినది.

"భ్రమ మూలమిదం జగత్" అనగా జగత్తు భ్రమ మూలంగానే కలిగినది. జగత్తు మిథ్యయని అద్వైతులంటున్నారు. క్షణ క్షణము మారిపోతు సృష్టి స్థితి లయములకు లోనగుజగత్తు సత్యంకాజాలదు **"జాయతే, గచ్ఛతీతి"** అనగా పుట్టేది పొయ్యేది యేదో అదే జగత్తు అని నిర్వచించబడింది. దృశ్యాదృశ్య ప్రపంచములో సర్వమునకు ఉత్పత్తి నాశనములున్నట్లు మనము గమనించుచున్నాము గదా! కనుక సర్వము జగత్తే. జగత్తు కాని దేది? పంచతన్మాత్రల అన్యోన్య మిశ్రమముతో యేర్పడిన పంచ భూతములతో ఈ ప్రపంచము లేక జగత్తు యేర్పడినదని సాధారణాభిప్రాయము. పంచభూతములు ఆత్మవల్ల

వచ్చినవి. ఈ ఆత్మకు ఆత్మవల్ల వచ్చిన పంచభూతములకు పరిపూర్ణపరబ్రహ్మమందు మూలం గాని స్థానముగాని లేనేలేదు. జ్ఞాన స్వరూపమై యున్నది. కనుక లేనెరుకయని, మూలములేని గుర్తెరిగే శరీరమని పేర్లు పొందినది. మరి యెట్లు వచ్చినదంటే వున్నట్లు తోచుటమాత్రమే. గనుక యిది భ్రాంతి, భ్రమయని, పరిపూర్ణబోధచే ఈ భ్రాంతి రహిత మగునని చెప్పబడినది. ఈ భ్రాంతి యొక్క రాకపోకలే గాని నిజంగా ఎరుక పుట్టనే లేదని అచల సిద్ధాంతము. శ్రీ శివరామ దీక్షితుల వారు **ఈ యెరుకే భ్రమ కనుక సకల భ్రమలకు మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమే.** ఈ దృష్టితో **"భ్రమమూలంమిదం జగత్"** అన్నారు. పుట్టి చచ్చేది. రాక పోకలుసలిపేది యెరుకయే యని అర్థం చెప్పవచ్చును. ఈ ఎరుక రహితమగుటయే భ్రాంతి రహితము. సద్గురువుల నాశ్రయించి ఈ భ్రాంతిని తొలగించుకొనుట మానవ జన్మ లక్ష్యమని తెలియవలయును. కనుక జగత్తుకు పరిపూర్ణమందు స్థానము లేదనుటకే ఈ దృష్టాంతమని గ్రహించవలయును.

**చంద్రోసూర్యప్రకాశేన భాసతే జగదస్తిచ**
**గగనాంబుజమస్త్యేవ జగత్సత్యం భవిష్యతి** ॥౧౨॥

**1. చంద్రో సూర్య ప్రకాశేన భాసతే జగదస్తిచ :** ఈ ఉపనిషద్వాక్యము జగత్తు యొక్క అసత్యత్వమును వర్ణిస్తు సూర్యుని వలె చంద్రుడు ప్రకాశించిన జగత్తుందునని దృష్టాంతము ద్వారా నిరూపించుట జరిగినది. చంద్రునకు స్వయం ప్రకాశములేదు. సూర్యునికే స్వయం ప్రకాశముగలదు. చంద్రుడు ప్రకాశించవలయునన్న చంద్రుడు సూర్యునిపై ఆధార పడవలసి యున్నది. అసలు జరుగునట్టి ప్రక్రియను పరిశీలించినయెడల సూర్యుని చుట్టు నవగ్రహములు తిరుగుచున్నవి. ఆ నవగ్రహములలో మనము నివసించుభూమి యొకటి. ఈ భూమి సూర్యుని చుట్టు తిరుగుచున్నది. అట్లే ఈ భూమిచుట్టు చంద్రుడు తిరుగుచున్నాడు. ఈ విధముగా తిరుగుతున్న సమయమున సూర్యుని కిరణములు చంద్రునిపై బడును. అప్పుడు చంద్రుడు ప్రకాశించుచున్నట్లు మనకు కనబడును. సూర్యుని మధ్య, చంద్రుని మధ్య భూమి వచ్చినపుడు భూమి యొక్క ఛాయ వల్ల చంద్రకళలు మారును. అసలే అడ్డము లేనప్పుడు పౌర్ణమి, పూర్తిగా అడ్డొచ్చినపుడు అమవాస్యలు యేర్పడుచున్నవి. సూర్యుడే లేనిచో, చంద్రుడు ప్రకాశించదు. చంద్రుని వలన సూర్యుడు ప్రకాశించుచున్నాడనుట అసత్యము. అట్లే జగత్తు అసత్యమని ఈ సాటువున జెప్పినారు.

**2. గగనాంబుజ మస్త్యేవ జగత్సత్యం భవిష్యతి :** అనగా ఆకాశము నందు పద్మము పుష్పించిన జగత్తుందును. ఆకాశమునందు పుష్పము పూయదు. కాని వానతుంపరులలో సూర్య కిరణములు విశ్లేషణ జెంది వాని యందలి సప్తవర్ణములు ఆకాశముపై ఇంద్రధనుస్సుగా యేర్పడును. ఆ యింద్ర ధనస్సులోని సప్తవర్ణములకు సూర్యకిరణములందలి సప్తవర్ణములే కారణము గాని ఆకాశము కారణముగాదు. అటులే లేని ఎరుకయే జగత్తునకు కారణము గాని పరిపూర్ణమెంత మాత్రముగాదు. ఆకాశమునకు పద్మము కలుగుట అసంభవము అట్లుకలిగిన జగత్తుందునని యనుటకూడ అసత్యమే కనుక జగత్తులేనిదే యని తెలియవలయును.

**మత్స్యపాదంభవేద్దృష్టం జగద్దృష్టం భవిష్యతి**
**కుక్కుట్యాంచస్తనేక్షీరం జాయతే జగస్థితః** ॥౧౩॥

చేపకు కాళ్ళు కనబడిన జగత్తుండును. కోడిపెట్టకు స్తనములుండి అందు పాలుండిన జగత్తుండును.

**వివరములు :** ఈ ఉపనిషద్వాక్యములందు కూడ పరిపూర్ణ పరబ్రహ్మమందు జగత్తుతో సహా సమస్తమునకు ఉనికి లేదనుటను దృష్టాంతముల ద్వారా తెలియజెప్పుచున్నది. పరిపూర్ణమందు యేదైన తోచిన అదంతయు యెరుకే యని శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు శెలవిచ్చియున్నారు. పరిపూర్ణమెప్పుడు ఎరుకకు ఆధారము, అధిష్టానముగాలేదు. ఎరుక ఎప్పుడు పరిపూర్ణమందు పుట్టనే లేదు. అట్లే జగత్తు కూడ పుట్టనేలేదు. ఈ విషయమునే దృఢపరుచుటకు చేపకు పాదములు కనబడిన జగత్తు కనిపించుననీ, కోడిపెట్ట స్తనములుండి అందు పాలుండిన జగత్తు ఉన్నదని చెప్పవచ్చునని తెల్పుచున్నవి. చేపకు పాదములు కనిపించవు, కాని చేపకున్న చిన్నపాటి రెక్కలతో నీటిని త్రోసివేసి నీటిలో వేగముగా వెళ్ళగలవు. అవి మానవునికి కాళ్ళు చేతుల వంటివిగా ఉండి చేపకు ఉపయోగపడును. కాని మానవుల, జంతువుల, పక్షుల కాళ్ళవంటివి అవి కావు. గాని వేగముగా నీటిలో పోవుటకు మాత్రము పనికి వచ్చును. అవి కాళ్ళు గావుగాని, కాళ్ళవలె పనికి వచ్చును. అంటే అవి కాళ్ళవలె లేకనే ఉండి లేని వగుచున్నవి. అంటే జగత్తు పరిపూర్ణమందుండి లేని దగుచున్నది. అంటే తోచుచున్నది అని అనాలి. అప్పుడే పరిపూర్ణము యొక్క ఆస్తిక్యత మనకు గోచరమగును.

రెండవ వాక్యమందు కోడి పెట్ట స్తనములుండి అందు పాలుండిన జగత్తుండునని చెప్పబడినది, కోడిపెట్టకు స్తనములుండవు, పాలెక్కడివి. అది పాలిచ్చే పక్షిగాదు. చెవులుంటే వాటికి పాలిచ్చే స్తనములుండును. పక్షులకు చెవులుండవు స్తనములుండవు. కనుక పాలుండవు. ఇది నిజమైతే జగత్తు కూడ వున్నది సత్యమగునని దృష్టాంతమీయబడినది. జగత్తు కూడ కోడి పెట్టస్తనములలోని పాల వంటిది. అంటే కోడి పెట్టకు స్తనములే లేవు, పాలులేవు జగత్తులేదు. క.ద. 75 **"కనుపడెడి బయలు లోపల। కనుగొన లేదయ్యో ఎరుక కావున శూన్యం బనవలసె । దీన్నె ఆకసమనవలసెను। దీన విశ్వమాయనోయప్పా। యింతకు వేరే మాయ యేదప్పా । కనుకానె యీ విశ్వమును లేనిదని లెస్స । వినజెప్పనాయెను। కనబోకుండని పోని । మాయనోయప్పా।"** మాయనోయప్పా యని జగత్తు స్థితి బహులెస్సగా వివరించినారు శ్రీ కృష్ణ ప్రభువులు.

**భేదాభేదద్వయంనాస్తి క్షరమక్షరగ్ంనచ**
**మాయాతత్కారణంనాస్తి సత్యం సత్యం పునఃపునః** ॥౫౪॥

భేదాభేదములు (ద్వంద్వములు) లేవు. క్షరమక్షరసంపత్తులనగా నాశనమయ్యేవి, నాశనముగాని సంపత్తులు (ఇవికూడ ద్వంద్వములు) లేవు. మాయ, మాయకు కారణమైన బ్రహ్మములేనివే. ఇది సత్యము. సత్యము అని దృఢ మగుటకు రెండేసి పర్యాయములు చెప్పబడినది.

**వివరములు :**

**1. భేదాభేద ద్వయం నాస్తి :** భేదాభేదములనగా భేదములు మరియు పోలికలు. భేదము సామ్యమును అపేక్షించును కావున యివి ద్వంద్వములు. పరిపూర్ణ సిద్ధాంతము ప్రకారము సర్వద్వంద్వములు ఎరుక కావున లేనివని నిర్ణయము. భేదాభేదములుగానిదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే.

సృష్టిలోని సమస్త చరాచరములను పరిశీలించినట్లుయితే ప్రతియొక్కటి మరొకదానితో పోలి లేకుండును. ఒకే తూకము గల బంగారమును వేర్వేరుగా కరిగించి ఒకే మూసలో ఒకటి తర్వాత ఒకటి పోసి తీసిన రెండింటి యందు కించెత్తైన భేదమ గోచరించును. సామ్యముండుట కవకాశమ లేదు. ఒకే చెట్టుకు కాసిన కాయలందు భేదముండును. అవి గొప్ప కురుచలై యుండును. మన చేతివేళ్ళు అన్ని సమానంగా లేవు. ముక్కులను పరిశీలించిన ఒకరిది చిలుక ముక్కయితే మరొకరిది నద్దిముక్కు మరొకరిది పొట్టిదైతే ఇంకొకరిది పొడుగాటిది. రంగులలో ఆకారములలో తేడా, గుణములలో, మేధస్సులలో తేడాలున్నవి. మరొక విచిత్రమైన విషయమేమంటే ఒకరి వేలి ముద్ర రేఖలు ప్రపంచములో గల మానవులందరి వేలి ముద్రల రేఖలతో విభేదించును. అందువల్లనే నేరగాండ్లను వేలిముద్రల సహాయముతో సులభంగా గుర్తించగలగుచున్నారు. కనుక సృష్టి వైవిధ్యముతో కూడుకొని యున్నది. సృష్టిలో ప్రతి వస్తువు మరొక వస్తువు నపేక్షించును. కావున సర్వము ద్వంద్వములే. అవి లేనివే. ఈ వైవిధ్యము లేని దొక్క పరిపూర్ణమని జెప్పుచున్నారు. కొందరు పరిపూర్ణమునకు యెరుకకు సామ్యము జెప్పి ఎరుక కూడ పరిపూర్ణమని జెప్పుచున్నారు. నమ్మరాదు.

**"సదృశ్యం భిన్నభేదతః"** రెండు వస్తువులనేవి పారమార్థికముగాలేవు. కనుక భేదమనేది లేదు. జగత్తు, జీవుడు, ఈశ్వరుడనువానిలో జగజ్జీవ భేదము, ఈశ్వర జగద్భేదము, జీవేశ్వర భేదము, జీవజీవ పరస్పర భేదము అంతయు మిథ్య అని అందురు. రెండువస్తువు లుంటే గాని భేదమనేది చెప్పటానికి రానేరాదు. అట్లున్నప్పుడు ప్రత్యక్షముగా కానవచ్చు భేదము నశించవలెనన్న అందొక వస్తువు సత్యమని మిగిలిన వన్ని అసత్యములని, మిథ్యయని చెప్పకపోతే భేదము. నశించదా ఏమి? పంచదార కరిగించి వేర్వేరు మూసలలో పోసి వివిధ నామ రూపాలు కల్పించి తెచ్చి వానిలో వానికి పరస్పర భేదము లేదని చెప్పుటకై పంచదార సత్యమని దానితో తయారైన వస్తువులు మిథ్యయని, అసత్యములని చెప్పవలెనా? లేక మొత్తమంతా పంచదారనే కనుక భేదములేదని చెప్పవలెనా? తీపి యిష్టములేని వాడు పంచదార యిచ్చిన, పంచదార చిలుక నిచ్చిన, యేనుగునిచ్చిన వద్దనే అంటారు. ఇష్టమున్నవాడు అందేదిచ్చిన ఆప్యాయంగా అన్నికావాలంటాడు. ఎందుకనగా వారికా వస్తు రూపయదార్థజ్ఞానము తెలియదు. కారణమును గుర్తించినచో కార్యభేదముండ జాలదు. అదే విధముగా పరమాత్మను గుర్తించినవారికి దృశ్యమానమగు సర్వమునందు పరమాత్మయే ప్రకాశించును. అపుడు నిజముగా భేదము పరిహసించుటయగును.

పరిపూర్ణ పరబ్రహ్మకు ఎరుకకు సామ్య భేదములు గలవు. అయిన అది యిదికాదు. ఇది అది కాదు. కందార్థములలో శ్రీకృష్ణదేశికేంద్రులవారు **"అంతటగల దొక్క అచలమే గాని యెరుక అంతట గలదని అనరాదు వినరాదు".** అని అన్నారు. పరిపూర్ణమంతట నిండుకొని యున్నది. సూది మోపుటకైన తావీయని పరిపూర్ణమందు అన్యముండుటకే వీలులేదు. అంతట గనుపడు నంతటిదే గాని అంతట గలదా అని శ్రీకృష్ణదేశికేంద్రులవారు శెలవిచ్చియున్నారు. భేదాభేదములు ద్వంద్వములు. ఎరుక రూపము. కావున లేనివని తెలియవలయును.

**2. క్షరమక్షరగగంనచ :** క్షరసంపదలు అనగా నాశనమయ్యేటి సంపదలు, అక్షరసంపదలు నాశనము గాని సంపదలు. ఈ రెండు పరిపూర్ణమందులేవని అర్థము.

స్థావర జంగమ జీవోపాధులు క్షరములు, అధిష్ఠానచేతనబ్రహ్మమను అఖండయెరుక అక్షరము. ఆకాశము యొక్క సూక్ష్మ భాగమగు ప్రకాశరూపమగు బ్రహ్మము. వాయువు యొక్క సూక్ష్మ భాగమగు ప్రాణము. ఈరెండు (అనగా ఆత్మబ్రహ్మ ప్రకాశము + ఆత్మరూపప్రాణము) ఈ రెంటిచేరిక అఖండయెరుక అక్షరుడు.

అన్నము యొక్క సూక్ష్మాంశము మనస్సు, నీటి యొక్క సూక్ష్మాంశము ప్రాణము ఈ రెంటి వలన తెలియబడు జీవుడు (లేక ప్రత్యగాత్మ) క్షరపురుషుడని నిర్ణయము.

క్షరాక్షరపురుషులు వస్తుసముదాయము చేత నిర్ణయింపబడిన వారే గాని ప్రత్యేక పదార్థ రూపులు గారు. కలయిక వలన యేర్పడిన వారే. పదార్థములు విడిపోయిన యెడల ఉభయులు లేకుండ పోవువారే. కనుక క్షరాక్షరములు శాశ్వతమని మోక్షభ్రాంతి కలిగియుండడము అనర్థకమని నిరసించడమైనది.

**3. మాయ తత్కారణం నాస్తి సత్యం సత్యం పునఃపునః :** అనగా మాయ, మాయకు కారణమైన బ్రహ్మము కూడలేనిదే. మొదట మాయను గురించి తెలుసుకొని తర్వాత తత్కారణమైన బ్రహ్మమును గూర్చి తెలుసుకొందము. ద్వంద్వరూపములుగా నుండునదియే మాయ అని ఆదిశంకరులు వివేకచూడామణిలో "సన్నాప్య సన్నాపు భయాత్మికానో। భిన్నాప్యభిన్నాప్యు భయాతికానో సంగాన్యసంగాన్యు భయాత్మి కానో। మహాద్భుతాఽ నిర్వచనీరూపా॥ అని నిర్వచించినారు. "యామూసా మాయ" అని మాయకు సామాన్య నిర్వచనము. ఏది లేనిదో అది మాయ మాయ అనగా తానెచ్చటి నుండి వచ్చెనో, యెవ్వరు పొమ్మనే వారు లేకనే తనంతట తానే పోవడమే మాయ. మాయ సృష్టికి పూర్వము అసలే లేనట్లు తోచుచున్నది. సృష్టి ప్రారంభకాలమున బ్రహ్మము నందు తోచి, ఆ బ్రహ్మ యొక్క సాన్నిధ్యమందు చేతనవంతమైన బ్రహ్మముతో కూడి జీవేశ్వర జగత్తుకు కారణమైనట్లు చెప్పబడినది. వృక్ష కారణము బీజమునందణిగి మణిగి యున్నట్లే జీవేశ్వర జగదాది మాయ కార్యములు సహితం బ్రహ్మము నందు బీజరూపముగా యణిగి మణిగి యున్నవని చెప్పక తప్పదు. మరుగై యున్నది, ప్రకటమై యున్నదనాలి. ఎక్కడ దాగియుండెనో అక్కడనే ప్రకటమై అక్కడే వుండి అక్కడనే తిరోభావము చెందినవి. పగలు నక్షత్రాలు కనబడనంత మాత్రాన నక్షత్రాలు లేనేలేవనుట ఎట్లు పొరబాటో అట్లే అధిష్ఠానబ్రహ్మతో పాటే మాయ వుందని చెప్పాలి. ఈ మాయా బ్రహ్మలలో మాయ అసత్యమని, బ్రహ్మము నిత్యమని యనరాదు. ఎటొచ్చి ఈ మాయాది గుణములు ఆ బ్రహ్మమునందు ఆవిర్భావ తిరోభావములు చెందుచున్నవే కాని బ్రహ్మమున కన్యముగా లేవు. "బ్రహ్మణోన్యం నకంచన" అనగా బ్రహ్మమున కన్యముగా కొంచమైన లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతా బ్రహ్మ స్వరూపమని శ్రుతులు ఘోషించుచున్నవి. కనుక మాయా బ్రహ్మలు రెండు బ్రహ్మము యొక్క రూపాంతరములే. అచల పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ మాయకు వునికి లేదుగనుక నిరసించనైనది.

బ్రహ్మమును గూర్చి తెలుసుకొందము. బ్రహ్మమనగా నిత్యమై శుద్ధమై ఆదిమధ్యాంతరహితమై అద్వయమై నిష్క్రియమై నిర్గుణమై స్వయం ప్రకాశమై సర్వకారణమై సర్వమునకు ఆధారమై, అధిష్ఠానమై సర్వవ్యాపకమయి సచ్చిదానంద లక్షణములే స్వరూప లక్షణములుగా గలదై మనోవాగగోచరమై యుండునదే బ్రహ్మము".

"బ్రహ్మైవజగత్కారణం" అనగా బ్రహ్మయే జగత్తుకు కారణము. ఏబ్రహ్మమనగా?

సృష్టికంతటికి మూలకారణమైన వస్తువేదో అదే బ్రహ్మము. "సోఽకామయుత బహుస్యాం ప్రజాయే యేతి" అతడే ఆదిలో ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ అనగా అతడే అనేకము కావలయునని కోరెను. "తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్" అని సృష్టించి సమస్తము నందు తానే అను ప్రవేశము గావించెను. ఆయాజీవుల నామ రూపాత్మకమగు ఉపాధులను నడిపించెను. ఈ విధముగా ఆదిలో ఒకటైన బ్రహ్మము అనేక నామరూపములుగా జీవులుగా మార్పుచెందెను. అయితే ఆబ్రహ్మము కారణ స్వరూపము. జీవులు కార్యరూపములు. కారణ కార్యరూపమగు బ్రహ్మమే కార్యరూపమగు జీవులయ్యెనన్న మాట. మరియు కార్యరూపులగు జీవులు కారణ రూపులయ్యెదరు. కనుక కారణ కార్యములు రెండును ఒకటే యని చెప్పవలసి యున్నది. కార్యకారణములలో కారణమెట్టు వంటిదో కార్యము అటువంటిదే. కార్యము అనిత్యమగుచో కారణము అనిత్యమే. సృష్టికారణమగు బ్రహ్మము అనిత్యమే. ఆ అసత్యమునే ఈ శ్లోకమందు సత్యం సత్యమని దృఢముగా నమ్ముట కొరకు రెండేసి మార్లు చెప్పబడినది.

**గురుశిష్యద్వయం నాస్తి ఉపదేశః కథంభవేత్**
**ద్వైతాద్వైతం సదానాస్తి ద్వంద్వహీనం కథంభవేత్** ॥౫౫॥

గురువు శిష్యులు యిద్దరులేరు. అప్పట్లో ఉపదేశమెట్లు కలుగును? ద్వైతాద్వైతములు ఎల్లప్పుడు లేవు ద్వంద్వహీన మెట్లగును.

**వివరములు :**

**1. గురుశిష్యద్వయం నాస్తి ఉపదేశం కథం భవేత్ :** గురు శిష్యు లిద్దరు రహితమైనప్పుడు గురుడు లేడు శిష్యుడు లేడు. ఆ తర్వాత ఉపదేశ మెక్కడుండును. ముందు గురుశిష్యులెట్లురహిత మగుదురో తెలుసుకొందము.

క.ద. 22॥ "సాధన సంపత్తియుగల। సాదకుడొక నరుడు ఘోర సంసారమునన్। బాధపడలేక తనపుణ్యోదయమున గురును గాంచి గురుతర భక్తిన్। శరణని మ్రొక్కి మరిమారి యుక్తిన్। బోధ జేయుము పుణ్యపురుషా మాబోంట్లాకు। సాధించదగు ముఖ్య సాధానాని పల్కె॥" అని శిష్యుడు జనన మరణ నివృత్తికి ముఖ్య సాధన తెలియజేయుమని ప్రార్థించగ గురుడు క.ద॥ 23॥ శరణా గతుడుగు శిష్యుని కరుణామృత దృష్టిచాత। గని మోదము। ముప్పిరిగొన మృదు వాక్యములను। పరమ దయాళుండుగురుడు భక్తా వినుమనెనూ। సంశయమిక బాధింపదనెనూ। పరిపూర్ణ మొకటి లేనెరుకానె దొకటి। పరిపూర్ణమెరుకాల నెరిగి। యెరుకను మానుః" మని యెరిగించినాడు. అంతటితో ఆగక క.ద 228॥ రానిదిపోనిది బయలని। లేనిది యీఎరుక యనుచు లెస్సగ దృఢమౌ। దాకను నీవీ మంత్రము। మానక జపియింపుచుండు। మానీతి .శాలీ। లేనిదిలేదు। మరువాకీ జోలి। లేనిది లేదాని పూని నిశ్చయమైతె। తానొక్కటుండునుగాని యెట్లననినుః॥" అని గురు మంత్ర నిర్ణయమును తెల్పినారు. అనగా యెరుక యొక్క స్థాన స్వరూప స్వభావములు ముందుగా గురుముఖతః గుర్తెరిగి తానెరుక స్వరూపుడై నిలిచి తనకు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలం గాని స్థానంగాని లేదని ఆరూఢతనొందిన వాడే యెరుకను విడిచినవాడు. లేనెరుకను క్షుణ్ణముగా వివరించి చూపించి, అదికానిది అదిలేనిది యేదో అదే పరిపూర్ణపరబ్రహ్మము అని మాత్రము చెప్పవచ్చును. గురుడు చెప్పి చూపించిన ఎరుకను ముందుగా తెలుసుకొనును. అంటే ఆ

లేనెరుక స్వరూపుడు తానేనని గుర్తించి ఆ సర్వ స్వరూపుడైన అఖండాత్మ స్వరూపుడు తానే అయినిలుచుటే ఆ లేనెరుకను తెలియుట. అట్టి స్థితి యందే తాను కాని తాను లేని - పరిపూర్ణ పరబ్రహ్మమున్నది తానే లేదు అనే యదార్థ జ్ఞానము శిష్యునికి కలుగుచున్నది. ఇదే పరిపూర్ణమును ఉండజూచు కొనుట. అట్ల వుండజూచిన తెలివి లేనే లేదని దాని రహితమొనర్చుకొనుటే లేనెరుకతో పరిపూర్ణమును గనిపెట్టుట. ఇదే ఎరుక లేక సేవించుట. అట్టి ఎరుక స్వరూపుడుగా నిలిచిననాడు తన కన్యంగా నున్న పరిపూర్ణపరబ్రహ్మమును సత్యముగాను, తన కలిమి కలవంటిది, మిథ్య మృష అనిన్ని గురువాక్యరీత్యా భావిస్తే ఎరుక రహితమగును. "యాదృశీ భావనా యత్రతాదృశీ భవతి నిశ్చయం" అనేమాట యిక్కడ సార్థకమగును. అప్పుడే గురుడులేడు, శిష్యుడు లేడు. ఉభయులు రహితమైనారు. అట్లు జన్మరహితమైన తర్వాత "ఉపదేశఃకథం భవేత్" అనగా ఉపదేశ మెట్లుండును. అంటే ఉపదేశమునకు తావులేదు. ఉపదేశమవసరములేదు.

నా గురుడు లేకనే యున్నాడు. నేను కూడ లేకనే యున్నాను. కాని అంతకు ముందు భ్రమ కారకుడనై యున్నందున వున్న వాడును. నన్ను లేనివానిగా లేకుండ జేయుటకు ఉన్నవానిగా గురుడు తోచినాడు. తోచిన వేళావిశేష మేమోగాని నాకు గురువై పరిపూర్ణ బోధను కరుణించుటవల్ల ఆ క్షణముననే నేను లేనివాడనయ్యాను. ఇక నేను లేను, నాగురుడు లేడు. ఆక్షణమున ఉన్నవాడై నన్ను లేనివానిగా జేసి లేకుండా పోయిన గురు పరంపరా సార్వభౌములకు ఇవే మాత శతకోటి నమస్కారములు ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ప. 164॥ **"కప్పురము నిప్పుగలసే। చొప్పున వెలిగవల కండ్ల। జూస్తుండగనే। తప్పున గనరాదట్లనే। ఇప్పుడు నిను నన్నుబోధ। నెరుగుము బుద్ధిన్"॥** మరియు ప్రకాశము చూస్తుండగనే ఎట్లలేకుండ పోవుచున్నవో, అట్లే నీవు నేను అనెటి ఎరుక యగు కర్పూరము అచల పరిపూర్ణబోధయనెడి నిప్పు ఈ రెండు విచారణ రూపమున ప్రకాశవంతమై నీవు ఎరుకనేభ్రాంతి, బోధ రూపమగు అగ్ని యొక్క సూక్ష్మాంశమగు శబ్దము రెండు కూడ లేక పోవుచున్నవి. ఈ పద్ధతిగా నీవు నేను లేనివారమని నీ బుద్ధియందు నిశ్చయించుకోమన్నారు. ఇట్లు బుద్ధి నిశ్చయమైనవారికి ఆ తర్వాతబోధ అవసరము లేదు. వారే లేరు, ఎవరికీ బోధ యని ఈ ఉపనిషద్వాక్యము ప్రశ్నించుచున్నది. అప్పుడు ఎవరైన, ఏదైన మిగిలున్నదా? తెలుసుకొనువారు, తెల్పేవారున్నారా? అంటే ఏది మిగులలేదు. ఎవరులేరు.

## 2. ద్వైతాద్వైతం సదానాస్తి, ద్వంద్వహీనం కథంభవేత్ :

ద్వైతాద్వైతములు ఎల్లప్పుడును లేవు. ద్వైతులనగా జీవేశ్వరులు వేరగుదురు గాని ఏకముగాదు. ఎట్లనగా తేజోంధకారములు ఏకముకానట్లు మరియు జీవుడు కించిద్గుణములు కలవాడు. ఈశ్వరుడు సర్వజ్ఞ గుణములు గలవాడు. కనుక వీరికి ఐక్యము పొసగదు. అయిన ఈశ్వరుడు వరము లిచ్చువాడు, జీవుడు అనుభవించువాడని ద్వైతుల నిర్ణయము.

అద్వైతులనగా జీవేశ్వరులకు ఏకత్వము తెలియజేయువారు ఎట్లనగా అఖండానంద రూపమగు చైతన్యము (ఆత్మ) ఒక్కటే సత్య పదార్థము. అదే బ్రహ్మము, సకల ప్రపంచమునకు సాక్షి భూతము. నిర్వికారము నగు బ్రహ్మము నందు జగద్భ్రాంతి అవిద్యా ప్రభావమున

కలుగుచున్నది. అవిద్య మాయ యని, ప్రకృతియని అనబడుచున్నది.
మాయయగు సత్వగుణము నందలి చేతన ప్రతి బింబము+ చేతనము+మాయ= ఈశ్వరుడు.
రజోగుణమునందలి చేతన ప్రతి బింబము+ చేతనము + అవిద్య = జీవుడు

మాయా, అవిద్యోపాధులుగు జీవుని ఈశ్వరుని తీసివేయగా చేతనము (బ్రహ్మము) శాశ్వతము.

ద్వైతము అద్వైతము మొదలగు మతములందు దురభిమానము నుండి విడువడనివాడు మా మతము దొడ్డది, ఇతర మతములన్నియు చెడ్డవనే భావమందుండును. మతము నందు అభిమానము ముదిరినచో, అది అన్యమత ద్వేషమునకు, మత కలహములకు దారి తీయును. నిజమునకు యే మతము చెడ్డది కాదు. వేర్వేరు మతములన్నియు వేర్వేరు దృక్పథములన్నియు పూర్ణ సత్యమునకు గొనిపోవు సత్యములే. అందు ఏ మతమువాదమును దూషించుట న్యాయము గాదు. సర్వాభిమానములకు మూల కారణమగు ఎరుకయే. లేని పరిపూర్ణపరబాహ్యమును తన గురుమూర్తి కృపచే తెలిసిన మహాత్ముడు అతని ప్రయత్నమేమి లేకుండనే సర్వాభిమానము తమంతట తామే అతని అంతః కరణము నుండి పారిపోవును. క.ద. 119 "ద్వైతాద్వైత విశిష్టులు। సైతురు। వినిసైసరెపుడు। సైసక పిదపన్। సైతురు క్రమమున వేరన। నాతతి మతి జీవశివులనవి వినబోకు। నేబోధించినది। విడబోకు। పూతహో బయలూను పొడజూచి గురునీచె। ద్వైతాద్వైత విశిష్టాద్వైతములు మాను మవి వినబోకు।" మని అన్నారు. ఇవన్ని మిథ్యావాదములని గురుకటాక్షమున నెరిగి ద్వైతాద్వైత ప్రబోధములను మాను మన్నారు. దైతాద్వైతములు ద్వంద్వములు. ద్వంద్వములన్ని లేనివని సిద్ధాంతము. కనుక ఇవిలేని వని తెలియవలయును.

ద్వైతాద్వైతములు ఎరుక, లేనివని తెలిసిన తర్వాత ద్వంద్వహీనము లెట్లుగునో విచారింతము. సత్యాసత్యములు, నిత్యా నిత్యములు, ఇవన్ని ద్వంద్వ కోటిలో చేరినవి. సత్యమునకు అసత్యము, నిత్యమునకు అనిత్యము (అశాశ్వతము) ప్రతి యోగి శబ్దములు. "ఏకం అనేకం భవతి" ముందుగా ఒకటి రెండై ఆ పిదప అనేకమైనది. కనుక పరమాత్మ స్వరూపము ద్వంద్వరూప ఏకవస్తువు. ఒకటి అనే శబ్దము రెండుగాని, అనేకముగాని అపేక్షించు సాపేక్షిక శబ్దమై యున్నది. ఒకటిగా నుండి నిస్సంకల్ప స్థితిలో అచలమై సత్యమై నిత్యమై వున్నప్పుడు దానికి బ్రహ్మమని పేరు, సంకల్ప రూపచలనము కలిగినప్పుడు అదే ఆత్మయై "తస్మాద్వాయె తస్మా దాత్మనః పృథ్వీ పృథివ్యా ఓషధయః, ఆకాశద్వాయుః ఓషధీభ్యోన్నం అగ్నేరాపః అద్భ్యః పృథ్వీ పృథివ్యా ఓషధయః ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః" ఈవిధముగా ఆత్మనుంచి పంచభూతములు, ఆకాశము,, వాయవు, అగ్ని, జలము, జలము నుండి భూమి, భూమినుండి సస్యములు, వాటి నుండి అన్నము, అన్నము నుండి అన్నతజడదుః ఖాత్మకముగు విశ్వమైనది. ఈ రెండు రూపములుగా నున్నది ఆ బ్రహ్మము మొక్కటే.

సంఖ్యానీకములో అనగా అంకెలలో (౦) సున్న నుండి 9 తొమ్మిది వరకు సంఖ్యలున్నవి. అనగా 0,1,2,3,4,5,6,7,8,9 వరకు సృష్టి సంబంధించి ఆ సున్న నుండియే వచ్చినవి. ఒకటి అనే అంకెకు పూర్వమున్న సున్నను కొందరు అసత్తు, శూన్యమన్నారు. సున్న అనే మాటకు శూన్యమనేది సంస్కృత శబ్దము. ఆ వస్తువు సత్తు మరియు అసత్తయి యున్నది. ఈ ద్వంద్వరూపముగా నున్న సృష్టికారణమైన బ్రహ్మము, సత్యమైనదీ, మనో వాక్కుల

అగోచరమగు పరిపూర్ణ పరబ్రహ్మము కానేరదు. "నసత్తన్ నాపదుచ్యతే" అనగా అది సత్తుగాదు, అసత్తు గాదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము సద సద్రహితమైనదని అచల ఋషులు నిర్ణయించినారు. ద్వైతా ద్వైతములు సాపేక్షికమైనవి గనుక ఎప్పుడు లేనివే. మరి అప్పుడు వుండేది ద్వంద్వముగాని నిరపేక్షకమైన ఏకమైన పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే. ద్వంద్వములేనిది.

**స్తుతినిందాద్వయంనాస్తి అహంకారం కథం భవేత్**
**భూతం భవ్యం ద్వయం నాస్తి చిజ్జడస్య కథం భవేత్** ॥౫౬॥

సాపేక్షికములై ద్వందములైన స్తుతి నిందలు లేనివైనప్పుడు అహంకారమెట్లుండును. భూత (గడిచిన కాలము) భవిష్యత్తులు లేవు జడమునకు చిత్తెట్లు కలుగును.

**వివరములు :**

**1. స్తుతినిందా ద్వయం నాస్తి అహంకారం కథం భవేత్ :** స్తుతి అనగా స్తోత్రము. నిందయనగా దూరుట, గర్హణము, అపవాదు. స్తుతికి ప్రతియోగిపదము నింద. స్తుతి నిందలను జెప్పినప్పుడు ద్వంద్వములుగా జెప్పినట్లయినది. సర్వద్వంద్వములు లేనివే కావున స్తుతి నిందాద్వయములు నాస్తి యని ఈ వాక్యమున జెప్పినట్లయినది. స్తుతి నిందలు లేనప్పుడు అహంకారమెట్లుకలుగును? అంటే కలుగ జాలవు. స్తుతి నిందలవల్లనే మోద ఖేదములు కలుగును. ఖేదము వల్లనే అహంకారము జనించును. రెండు లేనప్పుడు అహంకారము కలుగుటకు వీలులేదు. స్తోత్రమువల్ల ఉబ్బి పోవుట జరుగును. నిందించిన అహంకు అడ్డువచ్చిన దానిని తొలగించుటకు అభిమానము కాపాడు కొనుటకు ఎంతటి క్రూర కృత్యములైన చేయును. ఈ రెండు లేనిచో అభిమానము జనించదు అహంకార ముత్పత్తికాదు.

పెడితే పెండ్లి లేకుంటే చావు కోరుదురన్నట్లు కవులు, కళాకారులు, చివరకు భిక్షగాళ్ళు కూడ స్తుతి నిందలు జేసినట్లు, చేస్తున్నట్లు మనము చూస్తున్నాము. పూర్వము కవులు తమ కావ్యములను రాజులకో, చక్రవర్తులుకో, దండనాయకులకో వారి వారి వంశజులను పొగడుతూ అంకితముజేసి మణులు, మాణిక్యములు, భూషణములు, మడి మాన్యములు, అగ్రహారములు, ఊళ్ళను కానుకలుగా పొందియున్నారు. అట్లే బీజాక్షరములచే పద్యములల్లి వారి వంశ నాశనము, రాజ్య భ్రష్టత్వమును కలిగించినవారున్నారు. అంతే గాక కవులు తమతమ కావ్యములందు కుకవుల నిందించి, సత్కవులను పొగిడినట్లు మనము చూస్తున్నాము.

ఇక భక్తులు, వాగ్గేయ కారులు, పదకవితా దురంధరులు తమ తమ యిష్టదేవలతలను స్తోత్రముల ద్వారా, భజనలద్వారా, కీర్తనల ద్వారా తత్వముల ద్వారా పదముల ద్వారా మధురంగా గానము జేసి తన్మయులై తమను మరచి భగవంతునికి చేరువైన వారున్నారు. అట్టి వారిలో త్యాగయ్య, అన్నమయ్య, భక్తతుకారాం, తులసీదాసు, మీరాబాయి మొదలగు వారిని పేర్కొన వచ్చును. అట్లే భక్తులు స్తోత్రములతో పాటు ఆపదల పోగొట్టుకొనుటకు తెగుడుట కూడ చేసినట్లు మనము చూస్తున్నాము. కంచెర్ల గోపన్న (రామదాసు) చెరసాలలో బాధలు పడలేక "ఎవనబ్బ సొమ్మని కులుకుతున్నావు రామా!" అని నిందించుటలో అతడు భగవంతునికి ఎంత దగ్గరయ్యాడో గోచరమగుచున్నది. ఇచట నిందలు జేయుట భక్తికి పరాకాష్ఠయైనది. స్తుతినిందలు ద్వంద్వములు కనుక లేనివి.

స్తుతి నిందలు లేకుంటే అహంకారము జనించదు. అంటే అహంకారము కలుగదు.

సాధకుడు అభిమానము అహంకారములను వదిలిన నాడే గురునికి దగ్గరయి, గురుడు జెప్పిన వాక్యములందు గురికుదురును. అతనిలో గురుసేవ, గురుభక్తి, గురునిష్ఠ కుదిరి కర్తృత్వ రహితముగా కార్యము లొనర్చుచు ఆగామిని లేకుండ జేసుకొని జన్మరాహిత్యము గావించుకొనును.

**2. భూతం భవ్యం ద్వయం నాస్తి చిజ్జడస్య కథంభవేత్ :** భూత భవిష్యత్తులు అనగా గడచిన కాలము, భవిష్యత్ కాలములు లేనప్పుడు చిజ్జడములు ఎట్లు కలుగును.

"రెండు సంఘటనల మధ్య నున్న వ్యవధి యొక్క ప్రమాణము లేక వ్యవధియే కాలము" అని శ్రీ సదానంద యిలవకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు పరిపూర్ణమును గురించి వివరిస్తు కాలమును ఈ విధముగా నిర్వచించియున్నారు. ఉ॥ సూర్యోదయ సూర్యాస్తమయముల మధ్య వ్యవధికాలము పగటి కాలము. పరిమితితో నిమిత్తము లేకుండ కాలాన్ని నిర్దేశించాలంటే ఒక సంఘటనైన యుండాలి. ఆ సంఘటనకు పూర్వము భూతకాలము, ఆ సంఘట జరుగుచున్నకాలము, వర్తమాన కాలము ఆ సంఘటనకు అనంతరకాలము భవిష్యత్ కాలము. ఏ సంఘటన జరుగ కుంటే కాలమునకు వునికి లేదు. కాలము త్రికాలములుగా మార్పుచెందుచున్నది. కాలము పరిమితి గలది కనుక కాలము మాయ, లేనిది. కావున భూత భవిష్యత్కాలములు లేవు. భూత భవిష్యత్తులు లేనప్పుడు చిజ్జడము లెట్లుండును.

కాల త్రయములందే గాక కాలమునకు పూర్వోత్తర మధ్యకాలములందును యెట్టి మార్పు లెరుంగని పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే కాలమును మీరినది, కాలనిర్ణయము లేనిదగుట చేత అది కాలతీత మని చెప్పబడినది.

చిజ్జడములు లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము. సృష్టి క్రమమునొక సారి పరిశీలించినచో మొదట సృష్టి యంతయు జడ రూపముగా నున్నట్లు గోచరమగును. అదెట్లనగా సృష్టికి పూర్వము "సదేవ సోమ్యేఽదమగ్ర అసీత్" సృష్టికి పూర్వము ఆబ్రహ్మ పదార్థము సద్పదార్థముగా నుండెను. అనంతరము తాను తానైన స్థితి నుండి చలనము లేక సృష్టి కామన కలిగి "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతి ననుసరించి ఆ బ్రహ్మము అనేకము కావలయునని కోరి "ఏకం అనేకం భవతి" తానొక్కటియే అనేక మాయెను. ఈ అనేకమైన స్థితియే జడరూపము. ఇట్టి రూపముతో నున్న నానా వస్తువులలో చలనము లేదు, ప్రాణము లేదు, శక్తి, లేదు, తెలివి జ్ఞానము లేదు. అట్టి స్థితిని అధిగమించుటకు "తత్సృష్ట్వాతదేవాఽన్ ప్రావిశత్" శ్రుతి ననుసరించి అట్టి జడరూపముగా నున్నస్థితిలో తాను వాటిలో అనుప్రవేశము గావించెను. ఈ విధముగా జడము నందు చైతన్యము కలుగుటను చిజ్జడములందురు. "యయే కోజాలవాన్ ఈశత ఈశ నీభిః సర్వాన్ లోకానీశతయా శనీభిః । య ఏవైక ఉద్భవ సంభవేచ । యయే తద్విదుర మృతాస్తే భవన్తి" ॥శ్వేతా॥ అనగా ఆ బ్రహ్మమే తన శక్తులచే సర్వమును నియమించుచున్నాడు. సృష్టి స్థితిలయములు చేయుచున్నాడు. పిదప లీల ముగించుకొని సర్వము తన లోనికి ఉపసంహరించు కొంటున్నాడు. కనుక సృష్టికి పూర్వము ఒక రీతిగా, సృష్టియనంతర మొకరీతిగా వివిధనామ రూప క్రియాత్మకముగా వుంది. అంటే కాలానుసారము మార్పులు చెందుచున్నదనాలి. కనుక మార్పు చెందేది మాయ, మాయ అంటే లేనిది కనుక ఈ చిజ్జడములు లేనివే – ఈ చిజ్జడములకు పరిపూర్ణమందు స్థానము

లేదు. అటువంటప్పుడు జడమునకు చిత్తు కలుగ జాలదు. కనుక చిజ్జడము లెట్లు కలుగునని ఈ ఉపనిషద్వాక్యము ప్రశ్నించుచున్నది.

**దృగ్ద్రష్టాచద్వయంనాస్తి నాస్తి జ్ఞప్తి కథం భవేత్**
**కర్తృకారణహీనోపి జగత్సత్యం కథం భవేత్** ॥౫౭॥

త్రిపుటిలోని దృక్కు, ద్రష్ట రెండు లేనప్పుడు జ్ఞప్తి (ఎరుక-బ్రహ్మము) యెట్లుండును - కర్తృకారణములు లేవు జగత్తెట్లు కలుగును.

**వివరములు :**

**1. దృగ్ద్రష్టాచద్వయం నాస్తి నాస్తి జ్ఞప్తికథం భవేత్ :** త్రిపుటిలోని దృక్కు ద్రష్ట రెండు లేనప్పుడు జ్ఞప్తి యెట్లుండును. ద్రష్టయనగా సమస్తమును గాంచుచుండు జీవుడు. దృక్కు అనగా జీవ సంబంధమైన జ్ఞానము. జీవుడు జీవుడెరుగు జ్ఞానము లేనప్పుడు జ్ఞప్తి యనగా ఎరుక ఎట్లుండును? అంటే లేకుండును. ద్రష్ట, దృక్కు, దృశ్యములను శబ్దములు త్రిపుటిలోనివి. త్రిపుటిలో ప్రతిదానియొక్క యునికి మిగతా రెండింటి ఉనికిపై ఆధారపడియున్నది. ద్రష్టలేనిచో దృక్, దృశ్యములు గాని, దృక్కు లేనిచో ద్రష్ట దృశ్యముగాని, దృశ్యములేనిచో ద్రష్ట దృక్కుగాని వుండుటకు అవకాశము లేదు. కనుక మూడు శబ్దములు కలసియే ప్రవర్తిల్లుచున్నది. ఒకటి లేనప్పుడు మిగిలినవి అర్థ హీనమగుచున్నవి. దృక్కే బ్రహ్మమనబడును. కేవల జ్ఞాన మార్గవస్తువగు దృక్కే సర్వదేశ సర్వవస్తువులందు పూర్ణముగా నిండి (నువ్వులలో నూనె రీతిగా) సర్వాధిష్ఠానము సర్వము తానై సర్వాధారమై వెలుగుచుండుట వల్లను మరియు దాని యందుండే ఈ చరాచర జంతుజాలము పుట్టుచు దాని నాశ్రయించుకొని జీవించుచు మరల మహాప్రళయమున దాని యందే ప్రవేశించి లయించుట వల్లను ఆ దృక్కే బ్రహ్మమనబడును. ఈ త్రిపుటిలోని ద్రష్ట, దృక్కు, దృశ్యములో దృక్కే బ్రహ్మమని కొందరు, దృశ్యమే బ్రహ్మమని కొందరు సిద్ధాంతీకరించుటలో మత భేదములు ప్రవర్తిల్లినవి. సత్యాన్వేషణ దృష్టితో విమర్శించిన వారికి నిజముగా యిందులోని భేదములేదు.

కలగనువాడు తనమనస్సు చేతనే మనోరూప ప్రపంచమొక దానిని నిర్మించుకొని మనస్సు ద్వారనే చూస్తున్నాడు. ఇందు ద్రష్ట, దృక్కు, దృశ్యములు మూడుగా ఒకే మనస్సుగా పరిణమించినట్లే ఒక పరమాత్మయే తన యందు నిగూఢమైన పరమాత్మశక్తి (పరాశక్తి) ప్రభావముచే ప్రభావితుడై "పరాశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావకే జ్ఞాన బల క్రియచ" అని చెప్పబడినరీతిగా తానే జీవేశ్వర జగత్తుగా పరిణామము చెందుచున్నాడు.

శ్లో॥ జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాత త్రివిధ కర్మ చోధనా
కరణం కర్మ కర్తేతి త్రివిధ కర్మ సంగ్రహః॥

అనగా కర్మను పోత్సహించు త్రిపుటేదనగా జ్ఞానము (దృక్కు) జ్ఞేయం (దృశ్యము) జ్ఞాత (ద్రష్ట). ఎందువలననగా గుర్తెరుగ కుండ ఎవ్వరు యే కర్మచేయరు. కర్త, కర్మ కరణమను త్రిపుటిచే కర్మ జరుగుచున్నది. జ్ఞాత లేక ద్రష్టయే కర్త. జ్ఞానము లేక దృక్కుయే కరణము, ఈ రెండు లేనే లేవని దృఢ నిశ్చయమై కర్మచేస్తే ఆ కర్మ చేసియు చేయనట్లే అగుచున్నది. ఇదియే వినకయే వినుట, చేయకనే చేయుట ఆ రెండు లేనే లేవని నిశ్చయమున్నవానికి కర్మ ప్రవృత్తి కవసరమగు కాంక్ష (ఫలాశక్తి) గాని కర్తృత్వాహంకారముగాని యుండదు. అంటే కర్తృత్వ రహితముగా నిష్కామ కర్మ జరుగుచున్నది. పై వివరములను

| వివరములు - జీవతను చతుష్టయము | | | | | ఈశ్వరతను చతుష్టయము | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| తనువులు | స్థూలము | సూక్ష్మము | కారణ | మహాకారణ | స్థూలము విరాట్ వైశ్వానరుడు | సూక్ష్మము హిరణ్య గర్భుడు | కారణ అవ్యక్తము | మహాకారణ పరమాత్మ ప్రకృతి అక్షర పురుషుడు |
| అవస్థలు | జాగ్రత | స్వప్నము | సుషుప్తి | తురీయము | ఉత్పత్తి | స్థితి | లయము | సర్వసాక్షిత్వము |
| స్థానములు | నేత్రము | కంఠము | హృదయము | మూర్ధ్ని | సూర్యుడు | చంద్రుడు | అగ్ని | బ్రహ్మాండాతీతము |
| భోగములు | యుక్తము | స్వేచ్ఛ | ఆనందము | పరమానందము | సర్వకర్తృత్వము | సర్వ పాలకత్వము | సర్వసంహార కత్వము | షడ్గుణైశ్వర్యము |
| శక్తులు | క్రియాశక్తి | ఇచ్ఛాశక్తి | ద్రవ్యశక్తి | జ్ఞానశక్తి | క్రియాశక్తి | ఇచ్ఛాశక్తి | ద్రవ్యశక్తి | జ్ఞానశక్తి |
| గుణములు | రాజసము | స్వాత్వికము | తామసము | శుద్ధతాత్వికము | రాజస అహంకారము | స్వాత్విక అహంకారము | తామస అహంకారము | శుద్ధసాత్విక అహంకారము |
| అభిమానులు | విశ్వుడు | తైజసుడు | ప్రాజ్ఞుడు | ప్రత్యగాత్మ | బ్రహ్మ | విష్ణువు | రుద్రుడు | ఈశ్వరుడు |
| మాతృకలు | అకారము | ఉకారము | మకారము | ఓంకారము | అ | ఉ | మ | ఓం |
| ఆత్మలు | జీవాత్మ | అంతరాత్మ | పరమాత్మ | నిర్మలాత్మ | భూతాత్మ | సూత్రాత్మ | శుద్ధాత్మ | మహాత్మ |
| కోశములు | అన్నమయ | (మనో+ ప్రాణా+విజ్ఞాన) | ఆనంద మయ | దహరా కోశము హిరణ్మయ కోశము | | | | |

బట్టి ద్రష్ట దృక్కు రెండు లేనప్పుడు జ్ఞప్తి యనగా ఎరుక లేక దృశ్యము కలుగజాలవు.

**2. కర్తృకారణ హీనోపి జగత్సత్యం కథం భవేత్ :** అనగా కర్తృ కారణములు లేనప్పుడు జగత్తు ఎట్లుకలుగును. మొదట కారణమంటే ఏమిటో తెలుసుకొందము. కారణమనగా యేవస్తువులేనిచో మరియొక వస్తువు తోచబడ జాలదో అది కారణవస్తువు. అట్టి కారణవస్తువు నుండి అయినవి కార్యమనబడును. ఈ సృష్టిని పరిశీలించినట్లయితే సృష్టికి కారణవస్తువు బ్రహ్మము, ఆ బ్రహ్మము నుండి అయిన ఈ జీవేశ్వర జగత్తు కార్యము. జగత్తునకు కారణం బ్రహ్మము అని సర్వాంగీకారము. కర్తృత్వమనగా ఒక పనిని చేసినందులకు బాధ్యత. కర్తృత్వ మెవరిది అనగా అంతఃకరణముతో కూడిన చైతన్యముదే. ఏలననగా జీవుడే గుర్తెరుగుచు ఆ కర్మలు వుద్దేశపూర్వకముగా చేయుచున్నాడు. మరియు బ్రహ్మాండమందెవరిది కర్తృత్వమనగా ఈశ్వరునిదని నిర్ణయించవలయును. ఇక సృష్టి కర్మకు ఆదిలో కర్తృత్వమెవరిది యనగా సృష్టి సంకల్పము చేసిన బ్రహ్మదే. అయితే జీవేశ్వరులు బ్రహ్మము కంటే భిన్నములు కారు. ఆ బ్రహ్మ చైతన్యమే ఉపాధిగతమై జీవేశ్వరులనే పేరుతో పిండాండ బ్రహ్మాండముల యందు కర్తృత్వము వహించుచున్నది. "తేన వినా తృణాగ్రమపినచలతి" అనగా దాని సత్తాలేనిచో గడ్డిపరకకూడ కదలదూ. ఆ బ్రహ్మ చైతన్యమే లేనిచో జీవేశ్వరుల వ్యాపారము లేదు. ఏది లేకుంటే అసలు కర్మ అనేది జరుగ జాలదో దానినే కర్త అనాలి. అందుచేతనే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద. 52లో "ఆటాడి ఆడకుండును। ఆటాడిన మేను బొమ్మ యాటాడకనే। ఆటాడు ఎరుక యనెడి। యాటాడించేటివాడు అతడేరా కర్త। అంతటికీ అచల మకర్తా। చేటు పాటుల రెంటిచే వొచ్చు ఫలము। ముమ్మాటి కనుభవించి మరణ జననము లొందు। నతడే రాకర్త। అంతటికి అచల మకర్తా।" అని సెలవిచ్చియున్నారు. కనుక యెరుక పురుషుడే ముమ్మాటికి కర్త మరియు భోక్తా. ఈ ఎరుక బ్రహ్మము సృష్టి జేయునపుడు ఒక విధముగా, స్థితి కాలమందొక రీతిగా ప్రళయమందొక రీతిగా మార్పు చెందుచున్నది. మార్పు చెందునది మాయ. మాయ యనగా లేనిది. ఈ కారణ కర్తృత్వములే జగత్తునకు కారణము కావున కారణమగు బ్రహ్మము కర్తృత్వము వహించునది బ్రహ్మమే. ఈ రెండు లేనప్పుడు జగము కలుగుటకు వీలులేదని ఈ ఉపనిషద్వాక్యము స్పష్టపరుచుచున్నది.

**ఉపాధి ద్వయగంనాస్తి జీవబ్రహ్మేకుతోభవేత్**
**కింబధ్నామిచ కింత్యక్త్వా కింగృహ్ణామి కరోతికిమ్** ॥26॥

ఉపాధి ద్వయంలేదు జీవబ్రహ్మలెట్లు కలుగును? దేని బంధింతుము? అనగా జీవబ్రహ్మలచే జీవబ్రహ్మలను బంధింతుము. దేనిని విడిచి దేనిని గ్రహింతుము? అనగా జీవ బ్రహ్మలను విడుతము, పరిపూర్ణపరబ్రహ్మమును గ్రహింతుము. దేనిని చేయుదుము? అనగా పరిపూర్ణబోధ బడయుటకు పూర్ణ గురువును పొందుటకు ప్రయత్నము జేయుదుము.

**1. ఉపాధి ద్వయగం నాస్తి :** ఉపాధి ద్వయం అనగా జీవోపాధి (జీవతనువు) మరియు బ్రహ్మోపాధి. జీవ బ్రహ్మోపాధులు లేనివనియర్థము. పరిపూర్ణ పరబ్రహ్మమందు జీవ బ్రహ్మోపాధులకు మూలముగాని నిలిచే యందుకుస్థానము గాని లేనందున జీవబ్రహ్మోపాధులు పరిపూర్ణమందు లేవని గ్రహించవలయును. సూది మొనమోపుటకు సందులేని పరిపూర్ణపరబ్రహ్మమందు ఇతరమునకు స్థానము లేనందున ఈ జీవబ్రహ్మోపాధులు

లేనివే. కనుక ఉపాధి ద్వయం లేనిదే. ఎప్పుడైతే పరిపూర్ణమందు ఉపాధులకు స్థానములేదో ఉపాధులతో కూడిన జీవబ్రహ్మాలకు స్థానములేదు. ఉపాధులను ప్రత్యక్షముగా చూస్తున్నాముగదా! లేవనుట ఎట్లు? అంటే, ఆ వుపాధులు పరిపూర్ణపరబ్రహ్మామందు తోచినవి. ఎట్లుతోచినవనగా ఎండమావులలో జలముగా, ముత్యపుచిప్పలోని (తెల్లని దనము) వెండిగా, రజ్జు సర్పముగా, కలలోని దృశ్యములుగా, లేకనే తోచినవి. కలలో చూచిన దృశ్యములు మేల్కొని, చూచిన కలలోని దృశ్యములన్ని లేకుండ పోవును. అట్టి ఈ జీవేశ్వర జగత్తులన్ని పరిపూర్ణ పరబ్రహ్మామందు తోచుచున్నవి. గురుని కృపవల్ల మేల్కొన్న వానికి ఈ ఉపాధి ద్వయంగాని, జీవబ్రహ్మాలుగాని లేకుండ పోవును. జీవోపాధులు, బ్రహ్మోపాధులు సత్యములే - గాని వీటికి వ్యవహారిక సత్యత్వమున్నది. గాని పారమార్థిక సత్యములేదు.

**ఈశ్వర తను చతుష్టయము :**

**(అ) విరాట్ శరీరము :** పంచభూతములు, చంద్రుడు, సూర్యుడు, ఈ ఆత్మ తొమ్మిందింటితో కూడినది విరాట్ శరీరము.

**(ఆ) హిరణ్య గర్భ శరీరము :** చతుర్దశాది దేవతలతో కూడినది హిరణ్యాగర్భ శరీరమనంబడును.

**(ఇ) అవ్యాకృత శరీరము :** విరాట్ హిరణ్యాగర్భాదులకు కారణమై స్వరూపమైనది. అవ్యాకృత శరీర మనంబడును.

**(ఈ) మూల ప్రకృతి :** ఈశ్వరోపాధి శరీరములకు అక్షరపురుషుడు సాక్షీ రూపంబగునది మూల ప్రకృతి. ఈ ఉపాధి ద్వయంగా పేరొందిన శరీరములు పరిపూర్ణ పరబ్రహ్మామందు లేవు.

**2. జీవబ్రహ్మోకుతో భవేత్ :** అనగా జీవబ్రహ్మాలెట్లు కలుగును. జీవబ్రహ్మోపాధులకు పరిపూర్ణ పరబ్రహ్మామందు మూలముగాని స్థానము లేనప్పుడు జీవ, బ్రహ్మాల పుట్టుక లెక్కడ. జీవునికి స్థానము లేదు కనుక జీవునికి పుట్టుక లేదు. పుట్టుక లేనప్పుడు జీవునికి మరణమెక్కడిదని పరిపూర్ణ ఋషుల దృఢవిశ్వాసము. అట్లే అఖండ యెరుకరూపమైన బ్రహ్మామునకు కూడ పరిపూర్ణములో మూలముగాని నిలిచేయందుకు స్థానముగాని లేనప్పుడు బ్రహ్మామునకు పుట్టుక (సృష్టి) యెక్కడ, పుట్టుక లేదు గనుక చావును (అనగా ప్రళయములు) లేదు. కనుక పరిపూర్ణ పరబ్రహ్మామందు జీవుడు మరియు బ్రహ్మాము కలిగినవనియన్న కలలోని వార్తయే. కనుక రెండు కలుగజాలవని గ్రహించవలయును.

**3. కింబధ్నామిచ :** దేనిని బంధింతుము అని అర్థము. అనగా సమాధానముగా జీవబ్రహ్మాలచే (ఎరుకచే) జీవ బ్రహ్మాములను (ఎరుకను) బంధించబడును. జీవుడు, బ్రహ్మాము లెట్లు బంధించబడిరో తెలుసుకొందము.

బంధమనగా కట్టుబడి యుండుట స్వేచ్ఛ స్వతంత్రము లేకుండా యేదో అవ్యక్త శక్తిచే సంకెళ్ళు వేయబడినట్లు వుండుటయే బంధమనబడును.

**4. బ్రహ్మాబంధము :** బ్రహ్మాబంధమెట్లునగా సృష్టికి పూర్వము తాను తానై రెండవది లేక నిర్వికారమై, అచలమై నిష్క్రియమై వున్న బ్రహ్మాపదార్థము నుండి ఈ సృష్టి కలిగినదని సర్వశాస్త్రములు ఏకాభి ప్రాయము కలిగివున్నవి. అట్లే పూర్వ సృష్టులున్ను కలిగినవి. మునుముందు కలగనై యున్నవి. ఈ విధముగా సృష్టి, స్థితి, లయములు కలుగుటకు

కారణమేమి! పరమాత్మ యొక్క స్వతంత్రము లేక స్వేచ్ఛ చేతనే (స్వ+ఇచ్ఛ) కలిగిన వంటే మరల మరల విధిగా తప్పక ఎందుకు జరుగవలయుననెడి ప్రశ్నవస్తుంది. దానికి సమాధానముగా అట్లు జరుగుటకు అతని స్వేచ్ఛచేతనే యని యనరాదు. ఏ అవ్యక్తశక్తియో తన్ను ప్రేరేపించి బంధించి సృష్టి బంధములోనికి యీడ్చుకొని వెళ్ళుచున్నదని చెప్పతగును. కనుక మనిషికి మూల కారణము నిర్గుణ రూపమగు బ్రహ్మమన్న లేక సగుణ స్వరూపుడగు ఈశ్వరురుడన్న మొత్తము మీద సృష్టి కర్తయే బద్ధుడై యున్నాడు. వేయేల తృణాది బ్రహ్మ పర్యంతము అనగా బ్రహ్మాదిస్తంభ పర్యంతము ఏదో తెలియరాని సూత్రమునకు బ్రహ్మము బద్ధమై యున్నదని తెలియుచున్నది.

**5. జీవబంధము :** పంచీకృత పంచతన్మాత్రలు విషయ రూపముగా అనగా శబ్ద, స్పర్శ, రూప, రస గంధములుగా నున్నవి, **శ్లో॥ "కురంగ, మాతంగ, పతంగ మీనాః భృంగాః పంచ భిరేవపంచా"** అని చెప్పబడినట్లు పైన జెప్పబడిన జీవులు ఒక్కొక్క తన్మాత్ర విషయముల చేత మాత్రమే ఆకర్షించబడి ప్రాణ హాని తెచ్చుకొను చున్నవి. మానవుడు మాత్రము పంచ తన్మాత్రల ఐదింటికిని దాసుడై సుఖ దుఃఖములను పొందు చున్నాడు. ప్రంచమునందు గల వస్తువులన్నియు గుణ దోషములు గలవిగా నున్నవిగాని కేవలం దోషము మాత్రమే గల వస్తువు ఏదియులేదు. ***"గుణ దోష మయంసర్వం స్రష్ట స్వజన కౌతుకి"***, అన్న న్యాయముగా అన్నియు ద్వంద్వ లక్షణాలతో కూడినవిగా నున్నవిగాని, కేవలత్వ మనునది ప్రపంచములో ఏ వస్తువునందు లేదు. దోషము తనయందే గలదుగాని వస్తువు నందు లేదు. శబ్దాది విషయములు గుర్తించునది మనస్సు. మనస్సు గుర్తించనిచో బంధమే లేదు. కనుకనే "మన ఏవమనుష్యాణాం కారణ బంధమోక్షయోః" అని చెప్పబడినది కనుక బంధము అంతర్దృష్టి.

మనస్సు ప్రతి ఒక్కరి యందు భిన్న భిన్నముగా నున్నది. ఎందుకనగా మనస్సునందు వ్యక్తిగతముగా నున్న సంస్కారములే కారణము. "మనస్సు సంస్కారములు మూట" సంస్కారములు లేనిచో మనస్సే లేదు. జీవించి యుండగనే యీ సంస్కారములు లేనిచో మనస్సే లేదు. జీవించి యుండగనే యీ సంస్కారములు తుడిచిపెట్టిన వానికి యిక బంధమే లేదు. కనుక అంతర్బంధమునకు మనస్సే కారణము. పంచతన్మాత్రలకు ప్రలోభపడి వాటి ననుభవించవలెననెడి తపనచే సంస్కారముల బలమువల్ల మనస్సు లాగబడి ఆకర్షించ బడుట వల్ల కూడ బంధమేర్పడుచున్నది. ఈ విధముగా బాహ్యమున పంచతనాత్ర విషయాదులు, మరియు అంతర సంస్కారము ఈ రెండును కలసి జీవుని బంధించుచున్నవని యనవలెను.

**6. కింత్యక్త్వా, కింగృహ్ణామి :** అనగా దేనిని విడిచి దేనిని గ్రహింతుము. అనగా జీవబ్రహ్మముల రెండింటిని విడిచి, పరిపూర్ణ పరబ్రహ్మమును గ్రహింతుము. అదెట్లనగా తృణాది బ్రహ్మ పర్యంతము బంధమున చిక్కియున్నదని తెలిసికొంటిమి. కావున బ్రహ్మమే బంధమున కత్యంత మూలకారణము. కనుక యీబంధ విముక్తి లేక మోక్షము చేకూరవలెనంటే యీ మొత్తము సృష్టి, సృష్టి కారణమగు బ్రహ్మమున అతిక్రమించి పోవుటయే నిజమగు విడుదల. కనుక సాలోక్యాది ముక్తులు నిజమగు మోక్షము కానేరవు. అవి సాలోక్యాది పదవులు మాత్రమే. అవిమోక్షమునకు ప్రాతిపదికలుకావు. శాశ్వతముగా జన్మ రాహిత్యస్థితి

పొందవలెనంటే బంధమోక్ష రూపములు గానున్న యీ బ్రహ్మము నుండియే విముక్తి కావలసియున్నది. **"కేవల మోక్షా పేక్ష సంకల్పో బంధః"** అని నిరాలంబోపనిషత్ సిద్ధాంతము. కనుక మొత్తము సృష్టి నుండియే గాక సృష్టి కారణమగు బ్రహ్మము నుండి కూడ విడుదల పొందవలె. అదియే యెన్నడు తిరిగిరాని పద్ధతి. సృష్టిలోని భాగమై తాను సృష్టిని అతిక్రమించి పోవాలంటే తానైన బ్రహ్మమును అతిక్రమించిపోవలెను. అప్పుడుతాను నిశ్శేషముగా లేకపోవును. తన యునికియే మిథ్యయగును.

**7. కరోతికిమ్ :** మానవుడై పుట్టినందులకు దేనిని చేయవలయును అనగా పైన పేర్కొన్న వివరములను బట్టి నేనే (బ్రహ్మమే) బంధమును మోక్షము నైయున్నానని తెలుసుకొన్న తర్వాత ఈ బంధమోక్షముల నుండి విడుదలకు యేకైకమార్గం పరిపూర్ణ బోధ. పరిపూర్ణ బోధ బడయుటకు పూర్ణ గురువును పొందవలయును. పూర్ణగురువును పొంది పూర్ణబోధ బడయుదును అని నిర్ణయిచు కొందును. అని సమాధానము వచ్చును.

నీవే బంధ మోక్ష రూపుడవైన బ్రహ్మ స్వరూపుడవు. అట్టి బ్రహ్మ స్వరూపుడవైన నీవు జనన మరణ భ్రాంతి యందు తగులు కొని యున్నావు. నీకన్యమైన పరిపూర్ణ మందు బ్రహ్మస్వరూపుడవైన నీవు గాని, నీ బంధమోక్షముగాని లేనే లేవు. పరిపూర్ణపరబాహ్యమును తెలిసి బ్రహ్మస్వరూపుడవైన నీవు లేనే లేవని గురుముఖతః తెలిసి లేక పోవుటయే కర్తవ్యము, నీవు మానవ జన్మమెత్తి నందులకు చేయవలసిన మొదటి పని ఇదే.

**కింశృణోమిచకింద్రుష్ట్వా క్వగచ్ఛామి త్వమస్తివా.**
**బ్రహ్మణభాసతేసర్వం బ్రహ్మమాయా ద్వయంనహి** ॥౩౯॥

దేనిని విందుము? దేనిని జూచి యెక్కడకు వెళ్ళెదము? నీవుంటివా సర్వం బ్రహ్మచే ప్రకాశించును. బ్రహ్మము మాయా రెండు లేనివే.

**వివరములు :**

**1) కింశృణోమిచ :** దేనిని వినెదము? అని ప్రశ్న. ఈ ప్రశ్నకు జవాబుగా ఆత్మనే విందుమని సూటిగా వేదములు జెప్పినవి. "ఆత్మవాఽరే ద్రష్టవ్య శ్రోతవ్యో మంతవ్యో నిధి ధ్యాసితవ్యం॥ బృహ॥ ఆత్మయే చూడదగినది, వినదగినది, మననము చేయదగినది. ధ్యానముచే పొందదగినది. అనగా మనస్సుచే తెలియదగినదిగా నున్నది. అనగా ఆత్మను గురించి విందుము.

**2) కింద్రుష్ట్వా క్వగచ్ఛామి :** దేనిని జూచి యెక్కడకు వెళ్ళెదము అని అర్థము. ఈ ప్రశ్నకు ఆత్మను జూచి ఆత్మకు పరమైన పరిపూర్ణ పరబ్రహ్మము అవలోకనము జేయుటకు వెళ్ళుదుము (ప్రయత్నింతుము) శ్లో॥ "స్వయం బ్రహ్మ మయో భూత్వా, తత్పరం చావలోకయేత్॥ పరాత్పరతరం నాన్యత్॥ సర్వగం తన్నిరామయం" ॥గురు గీత 212॥

తా॥ జనుడు తాను బ్రహ్మ స్వరూపియై ఆ పిమ్మట దాని కతీతమైన పరస్వరూపమగు కేవలాత్మను జూచును. అట్టి పరస్వరూపమగు పరిపూర్ణము కంటే అన్యమేది లేదు. అది అంతట నిండి యుండును, నిరామయమైనదియై యున్నది. అది దేనికి ఆధారముకాదు.

**3. త్వమస్తివా :** నీ వుంటివా అని అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మమందు నేనను ఎరుకకు మూలముగాని స్థానము గానిలేదు. కావున నేను (ఆత్మ) పరిపూర్ణమందు లేనివాడను. ఉన్నదెప్పుడుఅంటే పూర్ణగురువు ద్వార పరిపూర్ణబోధబడయకమునుపునేను (ఆత్మ) మేనుతో

(శరీరముతో) కూడి యుంటిని. అప్పుడు మాత్రము వున్నవా అంటే కలలోమాదిరిగా వున్నాను సద్గురువు వల్ల మేలుకొనగా లేకుండ పోయినాను. అంటే జనన మరణములు పొందుతు పునరపిజననం, పునరపిమరణం అను న్యాయంగా సంచర ప్రతి సంచర పద్ధతిలో జనన మరణ చక్రభ్రమణమున పుట్టుచు గిట్టుచు వున్నాను.

**4. బ్రహ్మేణ భాసతే సర్వం :** బ్రహ్మమువలననే అంతా ప్రకాశించుచున్నదని అర్థము. ఎందు కనగా సర్వము నందు బ్రహ్మము సూక్ష్మ రూపమున అనగా నువ్వులలో నూనె రీతిగా పూర్ణముగా నిండి యున్నాడు. సర్వము నందు బ్రహ్మము ప్రకాశించుచున్నాడు.

**5. బ్రహ్మమాయాద్వయంనహి :** బ్రహ్మము, మాయా రెండును. లేనివి. అనగా పరిపూర్ణపరబ్రహ్మమందు బ్రహ్మమునకు గాని, బ్రహ్మచే అయిన మాయా రెండింటికి మూలముగాని, నిలిచే అందుకు స్థానముగాని లేదు కావున ఆ పద్ధతిన బ్రహ్మము మరియు మాయ రెండును లేనివేనని అచల ఋషులు సిద్ధాంతము జేసి యున్నారు. బ్రహ్మము మాయల గురించి వివరములకై (6) శ్లోకమును చూడుము. బ్రహ్మ మాయ ద్వంద్వములు కావున లేనివి.

**విద్యావిద్యాద్వయంనాస్తి నాస్తి సాక్షీవిధీయతే**
**పుణ్యపాపద్వయంనాస్తి బంధమోక్షద్వయం నహి** ॥౬౦॥

విద్యా అనగా జ్ఞానము, వేదశాస్త్రములు. అవిద్యా యనగా అజ్ఞానము రెండును లేవు. సాక్షియు లేదు. పుణ్యము మరియు పాపము రెండును లేవు. బంధమోక్షములు రెండును లేవు.

**1. విద్యా విద్యాద్వయంనాస్తి :** అనగా పరిపూర్ణ పరబ్రహ్మము నందు విద్యా విద్యలు రెండును లేవు. పరిపూర్ణం దక్క యితరములన్ని ద్వంద్వ రూపములోనేవున్నవి. ద్వంద్వములన్ని అశాశ్వతములు కావున లేనివే యగును.

విద్యయనగా జ్ఞానము. వేదశాస్త్రములు. మోక్ష్యబుద్ధి, ఎరుక. అవిద్య యనగా అహంకార అభిమానములు. రెండు ఎరుకనే. విద్యవలన కలుగునవి స్వర్గాది మోక్ష పదవులు. అవిద్య వలన కామ్యకర్మాచరణ. యజ్ఞ దాన తపః క్రియలు, వీనివలన కామ్యసిద్ధి స్వర్గనరకాది లోకములు సంభవించును. సర్వమునకు యెరుకే కారణము. యెరుక నిర్మితమగు సర్వ శాస్త్రములు, కర్మరూప యోగ యోగాంగ పద్ధతులు సర్వ మశాశ్వత ఫలప్రాప్తినే కలిగించును. స్వప్నము నందు తాను నవఖండ మండలాధి పతి యైనట్లు గజారోహణ గావించి పూరేగినట్లు, గోదాన, భూదానాది ద్దానములు చేయునట్లు కలగాంచు చుండగ మెళకువ వచ్చిన యెడల, తాను తన సైన్యము అరోహించిన యేనుగు సర్వమెచ్చటికి పోయెనో తెలియనట్లుగా అచల పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలం లేక, దాని కంటక యున్న మహాకాశమగు ప్రత్యక్ష పూర్ణమగు అఖండ యెరుకను తెలుసుకొన్న వారికి విద్యా విద్యోపాధి రహితమని సిద్ధాంతము జేసియున్నారు. శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు, క.ద. 47 **"ఎరుకే విద్యా విద్యలు। యెరుకే ప్రణవంబునాద। మెరుకే కళయున్। యెరుకే బిందువు చిత్సత్తెరుకే ఆనందమివినీ । వెరుగు సద్బుద్ధీ।"** యని గానము చేసి యున్నారు. కావున విద్యా విద్యలు ఎరుక. లేనిది, లేనే లేదని నమ్మవలయును.

**2. నాస్తి సాక్షీ విధీయతే :** సాక్షియు లేదని తెలియుము. పరిపూర్ణ పరబ్రహ్మమందు

సాక్షి రూపముగానున్న ఆత్మయు లేదని తెలియుము. సాక్షియనగా చూచువాడు, చేయువాడుకాదు. సృష్టికి పూర్వమున్న పరమాత్మ కేవలం సాక్షి మాత్రుడని, యితరులందురు గాని సాక్షి మాత్రుడు గాడని పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతము. విచారించి చూడగా ఒక్కటైన ఆ పరమాత్మయే "ఏకం అనేకం భవతి" అని శ్రుతి చెప్పిన విధంగా అన్ని రూపములు తానే వహించినది. శ్రీకృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థములలో క.ప. 62. **ఆకాశాదిక భూతానీ కాత్మకమగుచు ఎరుక యీజగమయ్యేన్..."** క.ద. 50 లో "అన్నియు తానై తన కవి పన్నుగవేరగుచునోట బల్కుచు" ... అని క.ద. 105 లో **"ఎరుకొక్కటుండెనేనియు ఎరుక యీవిశ్వరూప మేర్పడదాల్చున్"** అని క.ద80 **"విను మితరులు ఎరుకను సాక్ష్యని బల్కిరి। నేను సాక్షి నహమని నీతో విననజెప్పితి। నింతియె వేరనకూడదు। రెంటినొక్కటని తెల్సుకోరా....."** అనినిర్ధారణ చేసినారు.

సాక్షియనగా చూచువాడేగాని చేయువాడుగాదు అని అందామని అనుట సరిగాదు. చూచుట అనేవ్యాపారము చేయుచున్నాదుగదా। అపుడాతడు నిష్క్రియుడని అనజెల్లునా! కండ్లతో చూచుచు చెవులతో వినుచుండునే గాని ఆ దృశ్య శ్రవికవిషయములవలన వికారము చెందదు. ఒక పక్షమూనదు. అవి తనస్మృతి యందుచేర్చుకొని జ్ఞాపక ముంచుకొనును. వానిచే ఎట్టి వుద్రేకము గాని సుఖ దుఃఖములు గాని చెందదు. ఉదాహరణకు ఇరువురు జగడమాడుచుండగ నొకదు పూరక చూచుచుండును. జగడమాడు వారు ఉద్రేకము చెంది సుఖదుఃఖము లంతఃకరణమున చేర్చి సంస్కారమేర్పరుచుకొన్న విధముగా పూరక చూచు సాక్షి యెట్టి వికారములు చెందదు. కనుక సాక్షికి ఎట్టిపాప పుణ్యము లంటవు.

సృష్టి స్థితి లయములు చెందుచుండు ఈ జగన్నాటకమునకు పరమాత్మ కర్తయు సాక్షియుగూడ నైయున్నాడు. పరమాత్మకర్తయే అయినను కర్తృత్వము వహించుట వలన వచ్చు పాప పుణ్యము నాతని నంటవు. ఏలయనగా జీవుల కర్మానుసారము వారివారి గుణ కర్మలననుసరించియే సృష్టిగావించును. **"తస్య కర్తార మపి విద్యాకర్తార మవ్యయం"**. అంటున్నాడు భగవానుడు. అతనికి కర్తృత్వాహంకారము గాని లేదు

నాటకమునకు పూర్వమునందు, నాటక కాలమందు, నాట కానంతరము నాటకశాల యందలి దీపము పూరక వెలుగుచునే యున్నట్లు పరమాత్మ జగన్నాటకమునకు కేవలం సాక్షిగా యున్నాడని చెప్పుట సరిగాదు. నాటక దీపము జడము, తెలివి లేనిది. పరమాత్మ ప్రజ్ఞాన ఘనుడు. నాటక దీపం నాటక మాడుటకు కేవలం సహాయకారణము మాత్రమే. పరమాత్మయే ప్రధాన కారణము. సహాయకారణము సర్వ కారణము తానే అయివున్నాడు. పరమాత్మ కర్తగాడనుట న్యాయముగాదు. కర్త అయ్యును కర్తృత్వాహంకారాభిమానములు లేక నిష్కామముగా, యెట్టి ప్రయోజన మున్ను ఆశింపకనే యున్నాడు కనుక అయనను సాక్షి యనిన్ని అనదగును. పరమాత్మ కర్తనే గనుక ఎరుక స్వరూపుడు. ఈ ఎరుక స్వరూపునికి పరిపూర్ణ పరబాహ్యమందు స్థానము లేనిది గనుక సాక్షిరూపములోనున్న ఎరుక లేనిదే

**3. పుణ్యాపాపద్వయం నాస్తి :** పరిపూర్ణ పరబ్రహ్మమందు ద్వంద్వరూపమునగల పాప పుణ్యములు లేవు కనుక పరిపూర్ణ భావము లోనుండువానికి పాప పుణ్యములంటవు. పాపమనగా దృష్ట సంస్కారములేకాదు. శుభసంస్కారములు కూడ హిరణ్య శృంఖలము వలె జీవుని బంధించి జన్మ కారణముగా నున్నందున శుభా శుభసంస్కారములన్నియు

పాపమను శబ్దమునకు అర్థముగా చెప్పవలసి యుండును. పుణ్య కర్మాచరణచే పూర్ధ్వ లోక ప్రాప్తియు చివరకు మోక్ష ప్రాప్తియని పాపకర్మాచరణచే అధోలోకములలో లేక భూలోకమున నీచయోని ప్రాప్తియో కలుగునను సిద్ధాంతమును నమ్మి యజ్ఞయాగాది పుణ్య కర్మలు కృచ్ఛచాంద్రాయణాది వ్రతములు, తీర్థ యాత్రాదికములు చేయుట భ్రాంతియే, ఏలయనగా ఈ కర్మలేవియు జన్మరాహిత్య రూప మోక్షమును కలిగించవు. నీచోత్కృష్ట జన్మ పరంపరలయందే త్రిప్పును. కనుక కర్మయే బంధ కారణమైతే మోక్షమెట్లు సిద్ధించును? సుకర్మవలన మంచి జన్మ దుష్కర్మ వలన నీచ జన్మ రాగలదు. మంచి జన్మలు హిరణ్య శృంఖములు (బంగారు సంకెళ్ళు) నీచ జన్మలు ఇనుప సంకెళ్ళు. ఏదైన బంధకారణమే గాని మోక్ష కారణము గానేరదు. కనుక కర్మఫల మనుభవించుటకై జన్మ ఎత్తవలసినదే. జన్మయెత్తినవాడు కర్మ చేయకతప్పదు. కర్మవల్ల జన్మ, జన్మవల్లకర్మ. కనుక కర్మ జన్మ పరంపరలకే కారణమగుచున్నది గాని జన్మరాహిత్యమునకెంత మాత్రము తోడ్పడదు.

మోక్షము కర్మవలన (పుణ్య పాపకర్మలవల్ల) సిద్ధించునంటే అట్టి మోక్షము కృతకము (తయారు చేయబడినది) కావలసివచ్చును. కర్మవలన ఐదు కార్యములు మాత్రమే సిద్ధించును. 1. ఉత్పత్తి 2. సంస్కారము 3. వికార్యము. 4. ప్రాప్తి 5. గమ్యము. 5. మోక్షము ఈ ఐదు రకముల కర్మ ఫలములలో దేని క్రిందికి రాదు. చేసిన వారికి చేసినంత మహాదేవ యనున్యాయముగా యెంతో కొంత ఫలము కలిగించి ప్రతి కర్మయు జన్మకారణమగుచున్నది. పుణ్యము జేసి అపుణ్యాను భవమునకై పుణ్యలోకములో జన్మించినను "క్షీణేపుణ్యేమర్త్య లోకవిశంతి" యను గీతావచనము ప్రకారము తిరిగి భూమి యందు 84 లక్షల రకముల జీవోపాధులలో ఏదో యొక ఉపాధిని పొందవలసినదే. ఆ పుణ్యలోకములో ఉత్తమ కర్మచేసి ఇంకను ఉత్తమ జన్మ పొందుట కూడ సాధ్యము కాదు. ఎందుకనగా స్వర్గాదిలోకములోని ప్రాణులకు కర్మ శరీరములేదు. పాపపుణ్యములు ద్వంద్వములు. ద్వంద్వములన్ని యెరుక రూపము కావున లేనివే.

**4. బ్రంధమోక్ష ద్వయంనహి :** బంధము మోక్షములు లేవంటే అవి పరిపూర్ణపరబాహ్య మందులేవని అర్థము చేసుకొనవలెను. బంధము అనగా కట్టుబడి యుండుట. అనగా తన ఇచ్ఛవచ్చిన రీతిని సంచరించుటకు, కోరిన ఫల ప్రాప్తికలుగుటకు దుష్ఫలితములు సంకెళ్ళు వేయబడినట్లుండుట బంధమనబడును. త్రికరణములను మనస్సు వాక్కు శరీరము (నానా విధ యింద్రియములతో సహా) దేనిపైన తనకెట్టి పెత్తనము లేకుండుటయు బంధమే యని పరిపూర్ణదర్శనాచార్యులు శ్రీ ఇలపకుర్తి వీరవెంకటరామచంద్రరావుగారు బంధమను వ్యాసములో నిర్వచించినారు. బ్రంహ్మాండమందలిసూర్య చంద్రాది నవగ్రహములు నక్షత్రములు పంచభూతములు, వేయేల బ్రహ్మాది స్తంభపర్యంతము ఏదో తెలియరాని ఒక సూత్రమునకు బద్ధమైయున్నది. ఇదియే బంధము ఈ బంధము సృష్టి కత్యంత మూలకారణమగు వస్తువునందుండి యుంటేనే తప్ప సృష్టియందున్న ప్రతి పదార్థమునకు ఆ బంధము సంక్రమింపజాలదు.

మోక్షము అను మాటకు కొందరు ముక్తి, కైవల్యము, నిర్వాణము, నిరతిశయ సుఖావిర్భావము అత్యంత దుఃఖ నివృత్తి యిత్యాది మాటలనుపయోగించు చున్నారు. బంధ మోక్షములు లేక బంధ విముక్తులు అనుసమాసములలో బంధమునకు వ్యతిరేకార్థ

ప్రాతిపదికముగా మోక్షము ముక్తి అనుశబ్దములు వాడబడుచున్నవి. కాని ముక్తి సాలోక్య, సామీప్య, సారూప్య, సార్ష్టిత్వ, సాయుజ్యముక్తులు అని పంచవిధ ముక్తులు చెప్పబడినవి. ఈ ముక్తులు విష్ణువు, శివుడు, మొదలగు యిష్టదైవములలోకములు, సామీప్యములు పొందుట అని అర్థము కాని మోక్ష శబ్దమునకు విడుదల, విడుపు అను అర్థములో ఈ సాలోక్యాదులు అర్థవంతములు కాజాలవు. కనుక ఈ బంధ మోక్షము చేకూరవలెనంటే ఈ మొత్తము సృష్టి, సృష్టి కారణమగు బ్రహ్మమును అతిక్రమించి పోవుటయే నిజమగు విడుదల. కనుక సాలోక్యాది ముక్తులు నిజమగు మోక్షము కానేరవు. అత్యంత దుఃఖనివృత్తి నిరతిశయానంద ప్రాప్తి తానున్న వానికే, నేను తాను అనరాని దాని యందు ఆనందములేదు దుఃఖము లేదు. ఏది వున్న అది బంధమేకాని మోక్షము (సంపూర్ణ విడుదల) కాదు.

బంధముక్తులు రెండునూ అజ్ఞానాశ్రిత జీవుని యొక్క భ్రాంతి రూపములే గాని యోచించినచో ఆత్మస్వరూపుడేయైన తనకు బంధమేమి? ముక్తి యేమి? తనస్వరూపమును విస్మరించుటచే తాను బద్ధుడైయున్నట్లు తద్విమోచనము కావలసియున్నట్లు, మోక్షమనేదికూడ యొక లోక రూపమైన స్థానమని దానిని పొందవలసి యున్నట్లు భ్రాంతిచే భావించుచున్నాడు. **తానాత్మ స్వరూపుడై యున్నాడనని మరుచుటయే బంధకారణము. తానే ఆత్మనని తెలుసుకొనుటే తద్బంధ విమోచనము, లేక మోక్షము, ముక్తి. మరుపు బంధము, ఎరుక మోక్షము.** ఈ బంధ మోక్షములు మిథ్యయని శాస్త్రములు చెప్పుచునే యున్నవి. అయినప్పటికి ఈ రెంటిలో మరుపు మాయ యని, ఎరుక సత్యమైనదని కొందరందురు. బంధ మోక్షములు, ఎరుక మరుపులు రెండు మాయ యని పరిపూర్ణ భావజ్ఞుల నిర్ణయము. 148 క.ద. ఎరుకనగా యెరిగేటిది.। మరుపనగా ఎరుక తనను మరుచుటయు,। రెంట్నెరుగనిదే బయలు అని అన్నాడు శ్రీ కృష్ణదేశికేంద్రుల వారు. కావున బంధమోక్షములు, జనన మరణములు మధ్య పారమార్థికముగా లేనివి.

**శూన్యాశూన్యద్వయంనాస్తి పూర్ణా త్పూర్ణం తథానహీ**
**పూర్ణశూన్యద్వయంనాస్తి యఃపూర్ణమచలంసదా** ॥౬౧॥

శూన్యము ( అగోచరము, అభావము) అశూన్యము (భావము లేక గోచరము) రెండును లేవు. విశ్వాకారమగు బ్రహ్మము విశ్వగతమును, విశ్వాతీతముగా నున్న పూర్ణమును ప్రత్యక్ష పూర్ణము అను పూర్ణాత్పూర్ణము కూడ లేదు. పూర్ణముగానున్నను శూన్యముగా నున్నను రెండును లేవు. అట్టి పూర్ణము లేని పూర్ణమే, సదా అచలపరిపరిపూర్ణ ముండును.

**1. శూన్యా శూన్యద్వయం నాస్తి :** శూన్యమనగా లేనిది, వుత్తది. అభావరూపమైనది. అగోచరమైనది. అశూన్యము అనగా భావము, గోచరమైనది. అట్లే ఎరుక కూడ పరిపూర్ణమందు లేనిది. 'ఆకాశం గగనం శూన్యం' అన్నట్లుగా నామమేగాని రూపములేనిది. శబ్ద స్పర్శాది గుణములు లేకపోవుట వలన యింద్రియములచే గుర్తింపరానిదయ్యును, మనస్సుచే గుర్తింప దగియున్నది. ఎట్లనగా, ఇది శూన్య గృహమన్నప్పుడు అశూన్యత్వమును (యేమి అందులేకపోవుటను) గుర్తించుచున్నాము. ఇంద్రియములు శబ్దాదులు గుర్తించినట్లే శబ్దాదుల లేమిరికమును గూడ గుర్తించుచున్నది. ఎట్లనగా శ్రోత్రేంద్రియముచే శబ్దమును గుర్తించుచున్నాము. అట్లే మిగతా స్పర్శం, రూప, రస, గంధములను అవిలేని స్థితిని గూడ ఆయా యింద్రియములచే గుర్తించుచున్నవి. వస్తువుండుట లేకుండట కూడ మన యింద్రియ

సన్నికర్షణ జ్ఞానము చేతనే గుర్తించు చున్నాము. **"శూన్యమన్యత్ స్థానం పూర్ణమన్యస్థానం"** అని చెప్పబడినది. కనుక శూన్యమునకు పూర్ణమునకు అన్యమైనది పరిపూర్ణము. శబ్దస్పర్శాదులున్నచోటు, శూన్యమైన చోటు గూడ ఎరుకే. ఏలననగా శూన్యమును గూడ గుర్తెరుగ గలుగుచున్నాము. కనుక రెండును (ద్వంద్వము) ఎరుకే. అస్తినాస్తుల కతీతమైనది, పూర్ణత్వ శూన్యత్వముల కతీతమైనది ఈ పరిపూర్ణపరబ్రహ్మమొక్కటే. కనుక ఎరుకను శూన్యమన్నారు. ఉన్న దానియందు లేనిదేదో అది శూన్యమనజెల్లును. కనుక వున్న పరిపూర్ణపరబ్రహ్మమందు లేని యెరుక శూన్యమే అనవలెను. కనుక ద్వంద్వరూపములో నున్న శూన్యా శూన్యములు లేనివి.

**2. పూర్ణా త్పూర్ణం తథానహి :** అనగా మనకు తెలియబడు విశ్వాకారమగు బ్రహ్మము, విశ్వగతమును, విశ్వాతీతమును అయి పూర్ణముగా వస్తువు యొక్క వెలుపల, లోపల ఆకాశమువలె సర్వవ్యాపకమై నిండుకొని యున్నదని యితరులందురు. దీనిని ప్రత్యక్ష పూర్ణమందురు. ఏలననగా యిది అంతట నిండుకొని యున్నట్లు గానవచ్చుచు ఎండమావులందు నీరు ఎట్లు లేదో అట్లే, పూర్ణముగా గానవచ్చునను ఎరుక (ఆత్మ) సకలదేశములందును నిండియున్నట్లుగా తోచుచు నిజముగా నిండియేలేదు. ప్రత్యక్షముగా సూర్య చంద్రనక్షత్రములు భూమికంటే ఎన్నోరెట్లు చిన్నవిగా గానవస్తున్నవి. కాని యదార్థముగా ఎన్నో రేట్లు పెద్దవై యున్నవి. శాస్త్రజ్ఞులు ప్రత్యేక ప్రమాణమును అంగీకరించలేదు, అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతటా నిండి యున్నట్లుగా కానవచ్చిన ఏకదేశీయమై యున్నది. ఇట్టి పూర్ణము లేనిది. వాక్కుకు, కంటికి, మనస్సుకు ఎంతమాత్రము గోచరించని పరిపూర్ణ పరబ్రహ్మమే సకల దేశములందు నిజముగా నిండి పూర్ణమై యున్నది. ప్రత్యక్ష పూర్ణ వస్తువైన ఎరుకకంటే పరోక్షమై యున్న (కానరాని) పరిపూర్ణ పరబ్రహ్మమే పూర్ణమైయున్నది. కనుక పూర్ణము శూన్యము రెండులేనివి.

**3. పూర్ణ శూన్య ద్వయంనాస్తి :** శూన్యము మరియు పూర్ణము రెండును లేవు. పూర్ణము గురించి, శూన్యము గురించి ఈ శ్లోకము మొదట వివరించబడినది. అయినను ఇంకా కొంత తెలుసుకొందము.

కార్యరూపముగా నున్న జగత్తు యందు కారణ రూపముగా నున్న పరమాత్మ, సువర్ణాభరణములందు సువర్ణమువలె సంపూర్ణముగా నిండియున్నది. ఈ రెంటిలో పరోక్ష రూపముగా నున్న పరిపూర్ణము అతీతమై రెండవది లేక పోవుట చేత బాహ్యాభ్యంతరములనే నిర్ణయము లేక ప్రత్యక్ష పూర్ణమును అతిక్రమించి యున్నది. విచారించి చూడగ ప్రత్యక్ష పూర్ణమగు ఈ జగత్తు (కారణంతో సహా) "యద్దృశ్యం తన్నస్యం" అనే న్యాయంగా లేని వస్తువే అయిపోవు చున్నది. పరోక్షంగా నున్న పూర్ణమే ఎప్పటికి శేషించి సత్యస్వరూపమై యున్నది. కనుక దానికి పరిపూర్ణమని వ్యవహారార్థము పేరువచ్చినది. కనుక పూర్ణము (ఎరుక) శూన్యము రెండులేనివి శూన్యం.

**4. యః పూర్ణం అచలం సదా :** ఏది పూర్ణమో అదే అచలము అని అర్థము. ఈ పూర్ణము అనగా పైన వివరించిన పరోక్షముగా నున్న పూర్ణము అచలము. అచలం యనగా చలించనిది. ఎప్పుడు ఎట్టి కదలిక లేనిదని అర్థము. పరబ్రహ్మమునకు సృష్టికి పూర్వము ఎట్టి చలనము లేదు. బాహ్యమున గానవచ్చు వస్తు స్థితి యందు గలుగు కదలిక మాత్రమే

చలనముకాదు. అంతరము నందలి మార్పు కూడ చలనమే. నిస్సంకల్ప స్థితి లోనున్న బ్రహ్మమునకు సంకల్పము గలుగుట కూడ చలనమే "కీ" లేని గడియారమందు ఎట్టి చలనములేదు. కీ ఇస్తే అంతాచలనమే. మరియు స్థితి గలిగియున్న ప్రతిదానికి గతి అంటే చలనముండును. గతిలేనప్పుడు స్థితి, స్థితి లేనప్పుడు గతి. బ్రహ్మమునకు కూడ ఈ స్థితిగతులు యనే ద్వంద్వములున్నవి. కనుక బ్రహ్మమును అచలమనివర్ణించిన కేవలాచలముగాదు. "పూర్ణమదః పూర్ణమిదం, పూర్ణాత్పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే॥ "అని శ్రుతి వర్ణించినది. దాని యందు పూర్ణమే వావశిష్యతే అని అవశిష్య రూపముగా నుండే, లేక శేషించిన పూర్ణము పరిపూర్ణ పరబ్రహ్మము గాదు. కనుక చలాచలములు రెండు ఎరుకే. సాపేక్షికమైన శబ్దములే. కనుక పరిపూర్ణమును గురించి చెప్పజాలవు. "అచలో యంసనాతనః" అని చెప్పబడిన మాట కేవలం అచల స్వరూపముగా వుండిచలనమెన్నడు యెరుగని పరిపూర్ణపరబ్రహ్మ యొక్కదానికే చెల్లును. దానియందు శక్తి రూపముగా గాని తెలివి రూపముగాగాని యెరుక యెన్నడులేదు. కనుకనే దానిని "నిశ్శక్తి నిర్మలం పూర్ణం" అని అభివర్ణించినారు. "అదే నీవు నీవే అది" అంటూ "తత్త్వమసి" మహావాక్యం యొక్క లక్ష్యార్థము గూడ వుభయాత్మక మగు అనగా చలా చలాత్మకమగు ప్రత్యగాత్మ పరమాత్మల విషయంలో మాత్రమే సత్యం. పరిపూర్ణ పరబ్రహ్మం ఏదికానిది. తన యందేమి లేనిది. అదినీవుకాదు. నీవు అదికాదు అని శ్రీ శివరామదీక్షితులవారి వాక్యము.

**సర్వాధారంచిదాకాశం సర్వప్రాణహృదిస్థితమ్**
**చిదాకాశే జగచ్చిత్రం చిదాకాశం సదానహి** ॥౬౨॥

చిదాకాశమనగా బ్రహ్మము (జ్ఞానరూపములో నున్న ఆశాకాశము, అదే పరాకాశము)- ఆత్మ సర్వమున కాధారము. ఆ చిదాఆకాశమే. సర్వప్రాణుల హృదయము లందున్నది. చిదాకాశమందే జగత్తు చిత్రితమైయున్నది. చిదాకాశమే ఎప్పుడును లేనిదే.

**1. సర్వాధారంచిదాకాశం :** చిదాకాశము సర్వమునకు ఆధారము. ఆకాశము ఐదు విధములుగా జెప్పినారు. 1. భూతాకాశము 2. సూర్యాకాశము 3. నిర్వయవాకాశము 4. దహరాకాశము 5. పరాకాశము. ఈ పరాకాశమే ఈ శ్లోకమున పేర్కొనబడిన చిదాకాశము. చిదాకాశమనగా జ్ఞానాకాశము. చిత్ = జ్ఞానము, జ్ఞానమనగా బ్రహ్మము. ఆకాశము సర్వత్రా వ్యాపించియున్నట్లు బ్రహ్మము కూడ సర్వత్ర వ్యాపించియుండుట వల్ల ఈ బ్రహ్మమునే చిదాకాశమని, పేర్కొనబడినది. ఆకాశాధికము అనగా కూటస్థుడున్ను, పంచభూతములున్ను కలిసి షట్కోశములు (లేక షడావరణములు) రూపము చెంది ఎరుకే ఈ జగమయ్యెనన్నారు. కనుక యెరుకయనగా శుద్ధజ్ఞానము యొక్క మారు రూపమే జగత్తు కనుక "సర్వంఖల్విదం బ్రహ్మ" "ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ" "ఏకమనేకం భవతి" యిత్యాది శ్రుతులలో నున్న బ్రహ్మము శబ్దమునకు పర్యాయపదముగా అచ్చ తెలుగులో ఎరుక అనే శబ్దము వాడినారు. కారణ బ్రహ్మరూపముగా నున్న యెరుకే కార్యరూపమగు ఈ జగత్తు. ఇచ్చట బ్రహ్మశబ్దమునకు (చిదాకాశను) ఎరుకగావాడబడినదని గ్రహించగలరని మనవి.

సర్వమునకు ఆధారము బ్రహ్మము లేక ఎరుక, చిదాకాశమన్నాము. సర్వము అనగా సకల చరాచరములు అదియే సృష్టిగా గమనించవలయును. అన్నిటికి ఈ ఆత్మ (బ్రహ్మము) ఎట్లు ఆధారమో తెలుసుకొందము.

**"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ్శం భూతః ఆకాశా ద్వాయుః వాయోః వాయోరగ్ని అగ్నేదాపః అద్భ్యః పృథ్వీ రాపః ..."** అను శ్రుతిని పరిపూర్ణాచల సిద్ధాంతు లంగీకరించినారు. **"ఆకాశశ్శరీరం బ్రహ్మ"** అను రీతిగా ఆకాశమే శరీరము గల ఆత్మనుంచి వాయ్వాదులు కలిగి, సమస్త పిండాండ బ్రహ్మాండములు కలగినవి. ఈ భావమునే శ్రీ కృష్ణదేశికేంద్రులవారు క.ద. 62 "ఆకాశాధిక భూతా నీ కాత్మక మగుచు ఎరుక। ఈ జగముయ్యెన్" అని అన్నారు. మరియు క.ద. 82 "ఎరుకైన భూతముల। నీవెరుగుము. ఆకసము గాడ్పు। యింగలమును। నీళ్ళ రవిందనేల యని। నేనెరిగిన పద్ధతిని నీకు నెరిగించినాను. ముజ్జగములయ్యేను వీట్లతోను" అని అన్నారు. మరియు క.ద. 73 "ఎరుకైన భూత పంచక మెరుకకు। చరణములు కటియు హృదయము గళమున్। శిరమును నయ్యేను క్రమమున। ధరణి మొదల్ చేసి యిట్లు తనయా గుర్తెరుగూ" అన్నారు. పంచభూత పరిణామము చెందిన యెరుక అనగా విశుద్ధచేతనమునకు ఆ పంచభూతములలో పృథ్వి పాదములు, జలముకటి, అగ్ని హృదయము, వాయువు కరము, ఆకాశము శిరోభాగముగా అయి విరాట్ పురుషుని స్థూల దేహమాయెను. ఈ ప్రకారముగా చిదాకాశము సర్వాధారమైనది

**2. సర్వప్రాణ హృదిస్థితమ్ :** సర్వప్రాణుల యందు ఈ చిదాకాశమే (ఆత్మయే) వ్యాపించి యున్నదని అర్థము. పంచభూతముల కంటే సూక్ష్మమగు ఆత్మ (బ్రహ్మము) ఈ పంచభూతములందు వ్యాపించియున్నది. సృష్టికి పూర్వము **"సదేవసోమ్యేఽ దమగ్ర ఆసీత్"** సృష్టికి పూర్వము ఆ బ్రహ్మము సత్పదార్థముగా నుండెను. అనంతరము **"సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయేతి"** ఆ బ్రహ్మమే అనేకము కావలెనని కోరెను. కోరి **"ఏకం అనేకం భవతి"** ఆ యొక్కటియే అనేక మాయెను. **"తత్సృష్ట్వాతదేవాఽనుప్రావిశత్"**. ఆ పిమ్మట తానే అందు అనుప్రవేశముగావించెను. అంటే ఈ బ్రహ్మము పంచభూతముల కంటే సూక్ష్మమైనది గాన ఈ పంచభూతములందు వ్యాపించి యున్నది. కనుకనే శ్రుతి **"అణోరణీయాన్, మహతోమహీయాన్"** అనగా ఆత్మ అణువు కంటే చిన్నది, మహత్తు కంటే పెద్దదయి యున్నది అనుటలో ఆ పరిమాణములోను, మహత్తునకు బయట కూడ ఆత్మ (ఆకాశమువలె) వున్నదని అర్థము. కనుక "సర్వ భూతస్థమాత్మానం, సర్వభూతాని చాత్మని" అనిగీత చెప్పుచున్నది. అనగా సర్వభూతములలోను ఆత్మ యున్నది. ఆత్మలో సర్వ భూతములున్నవి. అని అర్థము. ఆకాశముకంటే సూక్ష్మమగు ఆత్మ ఆకాశ ఆవరణ యందే వుండగలదుగాని దానిని మీరియుండ జాలదు. బెల్లమునందు తీపి బెల్లం యొక్క ఆవరణమునకు బయట యుండ జాలనట్లే అని తెలియవలయును. ఆత్మ ఆకాశములు రెండును తీపి బెల్లంవలె వున్నందుననే "ఆకాశశ్శరీం బ్రహ్మ" అని శ్రుతి చెప్పినది ఏ శరీరము చూచిన దాని తెలివి ఆ శరీర పరిమాణమునకు పరిమితమైయున్నది కాని నతిక్రమించి యుండజాలదు. తెలివి యందు దేహము, దేహమునందు తెలివి ఓత ప్రోతమై సమాన ప్రమాణములో నున్నవి. ఆ దృష్టితోనే దేహిదేహములు రెండు ఒక్కటే అని సిద్ధాంతీకరించబడినది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతి జెప్పుచున్నది. ఈ వ్యాపకతా ధర్మమునే పరిపూర్ణభావజ్ఞులు ఆవరణ లక్షణముగా చెప్పినారు. ఎట్లనగా ఈ బ్రహ్మము విశ్వగతం (Immonant) అనగా వ్యాపకత్వ లక్షణము గలిగి విశ్వాతీతంగా కూడనున్నది. కావుననే "విశ్వవ్యాపిన మాది దేవ మమలం గగన సదృశం" అని రెండు విధముల

వర్ణించబడినది. కావున చిదాకాశము (బ్రహ్మము) సర్వ ప్రాణ హృదయములలో నివాసమై యున్నది.

**3. చిదాకాశేజ్జగ చ్చిత్రం :** చిదాకాశం అనగా బ్రహ్మమని పైన వివరించుట జరిగినది. ఆ బ్రహ్మమునే ఎరుక యన్నాము. అట్టి బ్రహ్మము లేక ఎరుక చాల చిత్రమైనదని అర్థము. ఈ బ్రహ్మమే పిండ బ్రహ్మాండములుగానున్నది. దేహేంద్రియములుగా, వర్ణాశ్రమములుగా శ్రుతులుగా, నీవు నేనుగా, సతిసోదరులుగా, హరి హరబ్రహ్మాది, సుర, నరగిరిసరి తరువు ముఖచరాచరములుగా నున్నది. సర్వ ద్వంద్వం ములుగా యున్నది. ప్రణవనాదముగా బిందువుగా, సత్తు చిత్తు ఆనందములుగా నున్నది. సగుణ నిర్గుణములుగా, అష్టాంగ యోగములుగా,ఇహ పరసౌఖ్యములుగా, మహా వాక్య వార్తీక పద్ధతులుగా నున్నది. ఎరుకే. ఎరుకే ఇహ పర సౌఖ్యములుగా, జ్ఞాతృజ్ఞాన జ్ఞేయంబులుగా, భక్తి విరక్తులుగా, సంకల్ప వికల్పములుగా మన మెరుగ వలయును. సర్వమును గుర్తెరుగున దంతా ఎరుకనే బ్రహ్మమే. ఎంత చిత్రమైనదో చూడుము. ఇంకా :

మోక్షము నరకము జీవుడు ఈశ్వరుడు, జీవేశ్వరైక్యము కూడ ఎరుకనే ఈ బ్రహ్మమే తలంపులకు తోట వంటిది. వింతలకు పుట్టినిల్లు. తంతులకు పేట, పంతములకు మూల బలము వంటిది. భ్రాంతులకు పట్టణము, జగజ్జనన స్థలమన్న యెరుకే. అంతేగాక శ్రీకృష్ణదేశికేంద్రులవారు క.ద. 50 "అన్నియుతానై తనకవి పన్నుగ వేరగుచు నోట బలుకుచు। మరి తానన్నిటి యెరిగే యెరుకై। యున్నానని యెరుక నెరక। నూహింపుచుండు। తనలో తాను మోహింపు చుండూ। ఎన్నో విచిత్రా లీయెరుక సెతలు వింటె। వున్నాది లేదు। లేకున్నాది గలదని। వూహింపుచుండూ। తనలో తానే మోహింపు చుండూ"। అని శెలవిచ్చి యున్నారు. ఈ ఎరుక (చిదాకాశపు) చేష్టలు విచారించితే ఎన్నో చిత్ర విచిత్రములుగా వున్నవి. వున్నది లేదని, లేనిది వున్నదని తనలోతానే తలంచుచుండును. కారణమైన బీజము కార్యరూప వృక్షమగునట్లు కారణమైన ఎరుక కార్యరూపమైన జీవేశ్వర జగత్తుగా నగును. తనయందు గల జీవేశ్వర జగత్తుల వ్యవహారము తెలియ జేయుదును గాని చేయునది నేనుగానని నిర్ణయించుకొని తనలో తాను ఆనందించును. ఊసరవెల్లియను తొండ నిలకడలేక తనరంగులు ఎట్లు మార్పు చేయునో అట్లు జీవేశ్వర జగదోపాధిని స్థావరజంగ రూపమున మార్పుచేయు చుండును. పంచతన్మాత్ర ప్రపంచము నెరుగునటు వంటిది యెరుక. గనుక అన్నిటి యందు నేను వుండి తెలుసుకొంటు వున్నానని ఊహించి లేని తనను వున్నట్లు నిర్ణయించును. పంచతన్మాత్రలు లేనిది పరబయలు గనుక దానిని నిర్ణయించలేక అది లేదని చెప్పును. ఇన్ని చిత్రవిచిత్రములు గల ఎరుకను "ఎక్కడికౌర యెరుక సంపూర్తి" అని ప్రశ్నించినారు. ఎరుకే జీవుడు, యెరుకే ఈశ్వరుడు ఈ రెంటి ఐక్యము అనగా జీవేశ్వర ఐక్యము ఎరుక సంపూర్తి యని నిర్ణయము. గనుక ఎరుక యొక్క పూర్ణత్వమును దాని మర్మము సాధకుడు తప్పక తెలుసుకొనవలసి యున్నది. కావున బ్రహ్మమే (చిదాకాశేజ్జగచిత్రం) చిత్రం.

**4. చిదాకాశం సదానహి :** చిదాకాశమగు ఎరుక (బ్రహ్మము) ఎప్పుడును లేదు. బ్రహ్మము (ఎరుక) జ్ఞానా జ్ఞానములు, నేను మేనులు, సద సత్తులు, అధిష్ఠాన అవ్యక్తములు, యిత్యాది ద్వంద్వ స్వరూపములుగా నుండి ఆ ద్వంద్వ స్వరూపములో ఒకటి మరొక దానికి

ఆధారముగా అధిష్ఠానముగా నున్నది. ఒకటి కారణముగాను, రెండోది కార్య రూపముగాను వుంటున్నాయి. ఎరుక పుట్టనే లేదని అచల ఋషులు అన్నారు. ఎందుకన్నారంటే.

1. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుకకు ఏవిధంగానూ యుత్పత్తికి కారణం లేదు.

2. ఎరుకకు ఎరుకే మూలం గాని వేరే మూలం లేదు. కారణ రూపమగు ఎరుకకు వేరే కారణం లేదని వారి అభిప్రాయమేగాని కార్యరూపమగు జీవేశ్వర జగత్తునకు మూలం లేదనిగాని, ఈ జీవేశ్వర జగత్తు లేనే లేదని గాని వారి అభిప్రాయము గాదు. అందుకనే (ఈ జీవేశ్వర జగత్తు లేనిదే అయితే) నీ దారి కడ్డముగా గోడ యొకటున్నప్పుడు గోడ కడ్డముగా పోక ద్వారము, ~~(దర్వాజ) వుండా ఎందుకు పో~~తున్నావు? అని ప్రశ్నిస్తున్నారు.

3. ఎరుక పుట్టినదంటే దేనివల్ల? ఎవరికి? అనే ప్రశ్నలు వస్తాయి. ఎరుక తనకు తానే వచ్చింది. తన రాకకు మరేది కారణము కాదు అని అచల ఋషుల జవాబు. తనకు తానే తోచినందులకు లోకమందేమైనా దృష్టాంతములున్నవాయని అంటే, పాచితీగ అంతర తామరవంటి వాటికి ఎట్టి మూలం లేకుండా తమకు తామె అల్లుకొని పోతాయి. ఎంతవెదికిన వానికి భూమితో సంబంధము కనబడదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుకకు మూలము లేదు కనుక ఈ యెరుక తన యందే తోచి, తనయందే తాను లేక పోవుచున్నది. కనుక మూలము లేనిదానిని సత్యమనుటకు వీలులేనందున దీనికి లేనెరుకయని ప్రసిద్ధమైనది. పుట్టక లేదని కూడ ఆకారణము చేతనే అనవలసి వచ్చినది.

4. పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనెరుక రానులేదు, పోనులేదు. పరిపూర్ణములో వుండేటందుకు స్థానము లేదు. పోనీ తిరిగి పోయెటందుకు మరొక స్థానము లేదు. ఈ లేని ఎరుకనే, ఎరుక జగములుగా భాసిస్తుయున్నది. స్థూల సూక్ష్మ రూపముగా ద్వంద్వ రూపమై యుండి ఈ ద్వంద్వములలో ఒకటి మరొక దానికి కారణ రూపమై పిదప దానివల్ల తిరిగి కార్యరూపంగా తానే యుత్పత్తి అవుతుంది, వృక్ష బీజన్యాయము, కనుక దీనికి అన్యోన్యాశ్రయదోషం, అనవస్తాదోషం సంక్రమిస్తాయి. "యామాసా మాయా" అనే మాయ శబ్ద నిర్వచనానుసారం ఏది లేనిదో అదే మాయ. కనుక ఈ పరిపూర్ణపరబ్రహ్మము నందు లేదు కనుక మాయా శబ్దము దీని యెడల సార్థకమౌతుంది. "మీయతే అనేన మాయి" అనే నిర్వచనము ప్రకారము గూడ ప్రతి దానిని మితిలో చూయించి అణు ప్రయాణంగా, మహత్ ప్రమాణంగా ఏదో మితిలోగాన వచ్చేది ఎరుక. కనుక ఎరుకకు మాయా లక్షణములన్ని సరిపోవుచున్నవి. అందుచేత కూడ దీనికి లేనెరుక యని పేరు వచ్చింది. కనుక చిదాకాశం (బ్రహ్మలేక ఎరుక) ఎల్లప్పుడు పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనిదే.

**కార్యకర్తృత్వగ్ంనాస్తి నాస్తి జ్ఞప్తి స్సదానహి**
**ఇతివిజ్ఞేయయద్భావం తద్భావం తత్పరిత్యజ** ॥౬౩॥

కార్యము (జీవేశ్వరజగత్తు), కర్తృత్వము ఒక పని చేసినందులకు బాధ్యత, జ్ఞప్తి (ఎరుక) ఎల్లప్పుడును లేవు. ఇట్లు యే భావమును తెలిసికొంటివో ఆభావమును వదలి పెట్టుము.

**కార్యము** : ఏ వస్తువులేనిచో మరియొక వస్తువు తోచబడదో అది కారణ వస్తువు. అట్టి కారణ వస్తువు యొక్క నామ రూపములకంటే భిన్నమగు నామ రూపములు గలదై, కాని విచారించగా కారణవస్తువు యొక్క మూల ద్రవ్యమునకు మాత్రము భిన్నము కానిదై

యున్న వస్తువు కార్యమని చెప్పబడును. ఉదాహరణకు మట్టి లేనిచో మట్టితో చేయబడు ఘటశరావాదు ఉత్పత్తి కాజాలవు. కనుక మట్టి కారణ వస్తువు కుండలు మండిగలు మొదలగునవి కార్యరూప వస్తువులు.

**1. కర్తృత్వగ్ం నాస్తి :** కర్తృత్వము కూడలేదు. కర్తృత్వము అనగా ఒక పనిని చేసినందుకు బాధ్యత. పంచకారణములు లేనిదే పనిజరుగదు. అనగా 1) అధిష్ఠానము శరీరము (సూక్ష్మ శరీరము లేక అంతఃకరణము) 2) కర్త అంతః కరణముతో కూడిన చైతన్యం. (చిదాభాసుడు = జీవుడు) 3) ఇంద్రియములు 4) వివిధములగు ప్రాణ చలనరూపమగు క్రియలు 5) అధిష్ఠాన దేవతలు. ఈ ఐదు కారణములతో పిండాండ వ్యవహారము జరుగుచున్నది. ఇందు కర్మ కర్తృత్వమెవరిది? అంతః కరణముతో కూడిన చైతన్యము ప్రధాన కర్తయని చెప్పవలయును. ఏలననగా జీవుడే గుర్తెరుగుచు నాకర్మలను వుద్దేశపూర్వకముగా చేయుచున్నాడు. మరి బ్రహ్మాండమం దెవరిది కర్తృత్వము? అంటే ఈశ్వరుడని నిర్ణయించవలయును. ఇకపోతే సృష్టి కర్తకు ఆదిలో కర్తృత్వ మెవరిది అంటే సృష్టి సంకల్పము చేసిన బ్రహ్మముదే. అయితే జీవేశ్వరులు బ్రహ్మము కంటే భిన్నులు కారు ఆ బ్రహ్మచైతన్యమే వుపాధిగతమై జీవేశ్వరులనే పేరుతో పిండా బ్రహ్మాండములందు కర్తృత్వము వహించుచున్నది. “తేన వినా తృణాగ్రమపినచలతి” అనగా దాని సత్తాలేనిచో గడ్డిపరక కూడ కదలదు. ఆ బ్రహ్మచైతన్యమే లేనిచో జీవేశ్వరుల వ్యాపారమే లేదు. ఏది లేకుంటే అసలు కర్మ అనేది జరుగజాలదో దానినే కర్త అనాలి. అందుచేతనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు **“ఆటాడి ఆడకుందును”** అనే కందార్థములో **“చేటు పాటులచే వచ్చు ఫలము ముమ్మాటికి అనుభవించి మరణ జననము లొందునతదేరకర్తా”**, అంటూ పూర్ణ బోధ రీత్యా సిద్ధాంతము చేసి యున్నారు. ఈ కందార్థమును కేవల పిండాండ పరముగా మాత్రమే గాక బ్రహ్మాండ అధిష్ఠాన స్థానముల యందు సమన్వయము గావించు కొనవలెను.

ఇంతకు సర్వకారణమైన బ్రహ్మమే (అఖండ ఎరుకయే) కారణ కర్తృత్వములు గలదియై యున్నది. దీని రహిత విధానము పరిపూర్ణ రీత్యా ఆరాధ పరచుకొన్న వారికే కర్మకౌశలరూపమైన కర్తృత్వ రహిత విధానము తెలిసి నైష్కర్మ్యసిద్ధి రీత్యా జన్మ కర్మలు తొలగగలవు.

పై వివరణను బట్టి పరిపూర్ణ పరబ్రహ్మము అంతట నిండి యున్నది. అందు బ్రహ్మము (కారణము) ఆ బ్రహ్మముచే అయిన జగత్తు (కార్యము) కర్తృత్వము గల బ్రహ్మమునకు స్థానముగాని మూలంగాని లేదని తెలసిననాడే కర్మ, కర్తృత్వములు ఏవి లేవని తెలియవలయును.

**2. నాస్తి జ్ఞప్తి స్సదానహి:**-జ్ఞప్తి ఎల్లప్పుడును లేదు. జ్ఞప్తి యనగా తెలివి, తలంపుయని యర్థము. శ్రీకృష్ణదేకేంద్రుల వారు తమ కందార్థములలో జ్ఞప్తిని గురించి చెప్పుచు క.ద 56 “ఎరుకన్నను మరుపన్నను, ఎరుకకు ఎరుకన్నను దేహియనమాయ యనన్। గురుతన సాక్ష్యన జ్ఞప్త్యన। స్ఫురణ యన ద్రష్టయనిన। చూడు మెక్కటిగా అని సెలవిచ్చియున్నారు. ఇచ్చట జ్ఞప్తియనగా ఎరుక యని తెలియవలెను. సకలమును తలంచునది గనుక యెరుక జ్ఞప్తి యని చెప్పబడును.

సృష్టి యందున్న పదార్థజాతమంతటికి ఈ ఎరుకే ఆధారము అధిష్ఠానము అయియున్నది. ప్రళయమునందు ఈ జీవేశ్వర జగత్తు బీజరూపముగా దాల్చి తిరిగి ఈ

యెరుకయందు గర్భీ కృతమైయుండి పునః సృష్టి యందు ఆవిర్భావము చెందుతుంది. ప్రళయమనగా తిరోభావము మాత్రమే అనాలి. ఎరుకే సర్వమును ఎరిగేది. ఎరుగుదునని జెప్పేది అదే. చలాచలములు రెండు ఎరుకే. ఎరుక నిష్క్రియము గాదు. కార్యకారణములు రెండు యిదే. చివరకు అన్నీ ఎరుకే ఏది గాదు. మనోవాక్కులకు అందు సర్వము యెరుకే. అనగా యిది కాదు యిది కాదని నిషేధించ గలిగిన సమస్తము ఎరుకే. ఇన్ని లక్షణములు గల ఎరుక (జ్ఞప్తి) ఒకప్పుడుండి మరొకప్పుడు లేక పరిపూర్ణమందు మూలముగాని స్థానముగాని లేదు గనుక ఎరుక (జ్ఞప్తి) ఎల్లప్పుడు లేదు. మార్పుచెందునది మాయ గదా! లేనిది.

**3. ఇతి విజ్ఞేయ యద్భావం తద్భావం తత్పరిత్యజ :** ఇట్లేయే భావమును తెలిసికొంటివో ఆభావమును వదలి పెట్టు అని అర్థము. అంటే ఏ భావమును తెలుసుకొన్నావో ఆ భావవము అభావము కావలెను. అట్లు భావము అభావమైనప్పుడే పరిపూర్ణ పరబ్రహ్మము స్వతసిద్ధము. అభావమగుట యనగా ఆ భావమును త్యజించినట్లే. పై పేర్కొన్న ఏ భావమును తెలుసుకొంటివో అనగా ఎరుకను తెలుసుకొంటివో ఆ భావమును వదలిపెట్టుమంటుంది ఈ శ్లోకము. పరిపూర్ణమును యెరుకను ఎరిగి యెరుకను మానుము. అనువాక్యములలో పరిపూర్ణబోధంతయు యిమిడియున్నది. ఎరుకను ఎట్లు మానవలయునో యిచట పరిశీలింతము.

శ్లో॥ జ్ఞేయవస్తు పరిత్యాగే విలయాతి మానసం।
మనసేవిలయం యాతే కైవల్యమవశిష్యతే॥ (సాండిల్యోపనిషత్తు)

పరిత్యజయనగా సంపూర్ణముగా వదలవలయునని అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మమందు పంచతన్మాత్రలు గాని, విషయములు గాని లేశమైన లేవు. లేశముగా కలిగియున్నది సృష్టికారణమైన ఆత్మ కనుక పరిత్యజించుమనుటలో బంధమునకు అత్యంత మూల కారణమైన అఖండ జ్ఞాన స్వరూపమైన సృష్టికారణమైన బ్రహ్మమునే సంపూర్ణముగా విడువవలయును. ఏలననగా ఆ సృష్టి కారణమే బ్రహ్మము. సర్వసత్తాంశ, సర్వప్రకాశమునై దానికి జ్ఞానమే స్వరూపలక్షణమైననూ పరిణామములో అజ్ఞాన స్వరూపమగు ఆచరణ రూపము చెంది అనంతముగా జనన మరణములను పొందుచున్నది. కనుక జ్ఞానమే స్వరూప లక్షణముగాగల ఈ ఆత్మ యొక్క సత్యత్వదృష్టి నిశ్శేషముగా నశించిన గాని భ్రాంతి రహితముగాదు. జ్ఞానాజ్ఞానములకు సత్తానిచ్చునది ఈ అఖండ జ్ఞానమే కనుక ఈ అఖండ జ్ఞానమును విడిచిన గాని సర్వభ్రాంతి రహితము గాదు. "భ్రాంతి రహితమే మోక్షము" అట్టి భ్రాంతి రహితమందే శాశ్వతమగు జన్మ రాహిత్యము.

**తూష్ణీమేవస్థితం తూష్ణీం తూష్ణీభావం నకించన**
**బహూనాచ్ఛ బ్దాన్ ప్రవక్ష్యేణ వాగ్వ్యాపారంనిరర్థకమ్** ॥౬౪॥

అంతయు మౌనము నందే యున్నది. మౌనము యేమియు గాదు. పలువిధములు పలికెడి వాగ్వ్యాపారము వ్యర్థమయినది, పనికి రానిది.

**1. తూష్ణీమేవ స్థితం తూష్ణీం :** అంతయుమౌనము నందే యున్నది. తూష్ణీం అనగా మౌనము. ఈ మౌనమును గూర్చి ముందుగా తెలుసుకొందము.

చిన్మాత్ర వాసనాభ్యాసము (అ) మనోవాసనాసహిత (ఆ) మనోరహితమని రెండు విధములు

**అ. మనోసహితచిన్మాత్ర వాసనాభ్యాసము :** చిజ్జడములుగా ఒకే చిద్ధాతువు రెండుగా తోచబడుచున్నది. కనుక మొదట జడము (శరీరము స్థూలము) నుపేక్షించి చిత్తునందే (సూక్ష్మము) చిత్తమును చేర్చి యందు అభ్యాసము చేయవలయును. మనస్సు జ్ఞానమునకు సాధనముగా అనగా పనిముట్టగా యున్నది బుద్ధి జ్ఞానమున కాశ్రయమై యున్నది. బుద్ధియే అహమనే కర్తగూడనై యున్నది. ఏకాగ్ర చిత్తముతో ఈ మనోబుద్ధుల గూడి సర్వము చిన్మాత్రముగా ధ్యానము చేయుటయే మనోసహితచిన్మాత్ర వాసనాభ్యాసము.

**ఆ) మనో రహిత చిన్మాత్రా వాసనా భ్యాసము:** మనోబుద్ధులను త్యాగము చేసి (అనగా కర్తృత్వ కరణత్వములవీడి) చిన్మాత్రవాసనాభ్యాసము చేయునెడల రాగద్వేషములు రహితమై ఆత్మ నిష్ఠకుదురును. అపుడు శుద్ధ వాసనలు సహితము రహితమగును. అపుడే మనస్సు నిర్వాసన మగును. ఇంక యాతనికి సాధనాంతరముల తోను పనిలేదు. ఇట్టి జ్ఞాని రాగశూన్యమగుబుద్ధితో శేషజీవితమును సాగించును. కనుక ప్రారబ్ధమనుభవించు చున్నాడని యనరాదు. అతడు కృతకృత్యుడు. దేని నాశించి ఏకర్మలు చేయడు. యదృచ్ఛాలాభ సంతుష్టి గలిగి యుండునే గాని, దేనిని అతడు కోరనైన కోరడు. ఇట్టి మనోరహిత చిన్మాత్ర వాసనాభ్యాసముచే వాసనాక్షయ మగుట యేగాక అతని మనస్సు నిరింద్రియమై పోవును. అనగా మౌనము చెందుచున్నది. ఆ మౌనము మూడు విధములుగా జెప్పబడినది. 1. **కాష్టమౌనము :** స్థూలశరీరము నిశ్చలత్వము గావించిన కాష్టమౌనము 2) **వాగ్మౌనము :** వాక్కును బంధించిన వాగ్మౌనము. 3) **అక్షమౌనము:** జ్ఞానేంద్రియ కర్మేంద్రియములనరికట్టిన అక్షమౌనము. మౌనము, ఈ మూడు విధములుగా జెప్పిబడిన మౌనములోనేదియుగాదు. అది మహామౌన మనబడును. ఈ విధముగా వాసనాక్షయము గావించుకొని మనస్సు మహామౌనము గావించిన నిష్ఠకే నిర్వాసన మౌనముద్రానిష్టా స్థితి యనిపేరు.

నిర్వాసనమౌనముద్రానిష్టాస్థితి సర్వ సంపూర్ణ శబ్దచలన రహితమగు అతీతస్థితికాదు. పర, పశ్యంతి మధ్యమ, వైఖరీ రూపంగా గానవచ్చే శబ్దచలనము ప్రత్యక్షముగా పిండోపాధులందు గానవస్తున్నది.

శ్రుతి॥ యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ
మృత్యోస్సమృత్యు మాప్నోతి యయి హనానేవ పశ్యతి॥

తా॥ ఏది యిక్కడ (పిండాండమందు) ఉన్నదో అదే అక్కడ (బ్రహ్మాండమందు) వున్నది. అక్కడ నున్నదే యిక్కడ యున్నది. యిది గుర్తించనివారు జనన మరణములు పొందుచునే యుందురు. కనుక పింద బ్రహ్మాండములందు సర్వత్రా పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి వాక్కులున్నవనక తప్పదు. ఇచట నిరింద్రియ మనస్సు కావడమే మహా మౌనమని దెలుసుకొన్నాము. మనసు నిరింద్రయమైనచో బ్రహ్మము అపరోక్షము కదా. అంతా మౌన మందే యున్నది అంటే అంతా బ్రహ్మము నందే యున్నది. బ్రహ్మణోన్యం నకించిన యను శ్రుత్యానుసారము అంతా బ్రహ్మమయమే. అంతామౌనము నందే యున్నది.

**2. తూష్ణీభావం నకించన :** మౌన భావము (తూష్ణీ భావం) కూడ ఏమియు లేనిదే. పై వివరించిన దానిలో మౌన భావము కేవల నిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. అది అధిష్ఠాన బ్రహ్మము అని తేలినది. అధిష్ఠానబ్రహ్మమునకు పరిపూర్ణపరబ్రహ్మమందునిలిచే యందుకు స్థానముగాని, మరియు మూలంగాని లేనందుకు

ఆ బ్రహ్మమునే లేనెరుక యని అచ్చ తెలుగులో వాడినారు. ఈ లేనెరుక (బ్రహ్మము) లేనే లేదని ఈ శ్లోకములకు వివరణలలో పలుమార్లు వివరించబడినది. అయినను క్లుప్తంగా యిచ్చుటకూడ పొందు పరచబడినది.

కారణ స్వరూపమగు బ్రహ్మమునకు అనగా అఖండ ఎరుకకు (తూష్ణీ భావమునకు) మరి యొక కారణం గాని మూలంగాని వుండుటకు స్థానముగా లేనే లేవు. పృథివ్యాది పంచభూతములకు ఆత్మ రూపమగు బ్రహ్మము కార్యకారణ సంబంధములతో మహా కారణముగా నున్నది. దానికి కారణము ఎంతవెదకిన కానరాదు. కారణములేని కార్యము విశ్వములో ఏదియును లేదు. ఉండుట అసంభవము కూడ కనుక సృష్టికారణమైన బ్రహ్మకు ఉనికియే లేదు. ఎండమావులలో జలమున్నట్లే కానవచ్చిన అక్కడ నిజముగా నీరులేదు. కల యందు దోచిన శరీరములు వలెనే కలయందు మాత్రమే నున్నట్లు తోచబడునే గాని కలనుండి మేల్కొన్న పిదప ఈషణ్మాత్రము యెట్లు లేదో అట్లే ఏమియు లేదు. అట్లే ఈ గుర్తెరిగే శరీరమునకు "ఆకాశ్శరీరం బ్రహ్మ" అని చెప్పబడినట్లుగా మనస్సుకు గోచరించు మహా కాశమే శరీరముగా నున్నది. ఈ దేహిదేహములు రెండును ఒకదానిని ఒకటి విడువక రెండు కలసి ఏకవస్తువుగా నున్నది. దీనికి పరిపూర్ణమందు స్థానముగాని మూలముగాని యేమిలేదు.

"మనసైవాను ద్రష్టవ్యం, మనసైవాను శ్రోతవ్యం" అని చెప్పబడే రీతిగా శుద్ధ మనస్సుకే గోచరించబడుచున్నది. కాని నిజముగా జూచినచో మనో వాక్కులకు అందరాని అతీతమైన బ్రహ్మ వస్తువు గాదు "న తత్రచక్షురగచ్ఛతి, నవాఙ్గచ్ఛతి నోమనః" అనిచెప్పబడినది. కంటికి, వాక్కుకు, మనస్సుకు, గోచరించునదికాదు. అట్లు కంటికి వాక్కుకు, మనస్సుకు గోచరింపరానిది ఒక్క పరిపూర్ణ పరబ్రహ్మమే కనుకనే దానిని "అవిజ్ఞేయా పరబ్రహ్మం అన్నారు. పరిపూర్ణ పరబ్రహ్మము మౌనముకూడ కాదు. మౌనము లేనిది.

**3. బహూన్చ్ఛ బ్దాన్ ప్రవక్ష్యేణ వాగ్వ్యాపారం నిరర్థకమ్ :** పలు విధములగు శబ్దములు వచించెడి వాగ్వ్యాపారము పనికి రానిది వ్యర్థమైనది. శబ్దములెట్లు ఏర్పడినవో యించుక తెలిసికొందము. వైజ్ఞానిక దృష్టతో యోచించినచో సృష్టికొరకై బ్రహ్మమునందు కలిగిన కామనా రూపమగు స్పందనములో ఏర్పడిన చలనములో ధ్వన్యాత్మకమగు ప్రణవము "ఓం" కలిగి అందుండి వర్ణాత్మకమగు ఏబది అక్షరములు, పిదప అక్షరముల చేరికలో శబ్దము వానితో సకల వేద శాస్త్ర, పురాణేతిహాస రూపములునగు సకల వాఙ్మయము ఏర్పడినవని చెప్పవచ్చును. శ్రీకృష్ణదేశికేంద్రులవారు "క.ద. 122లో "పంచదశక్షరముల। ప్రపంచము తానుద్భవించె। ప్రణ వాక్షరమందంచు శ్రుతులెన్నె దాన్నెరుకంచని నీవెరిగి। యెరుగు మచలాము దీనన్। నిల్పకు మెరుక నచలాము లోనన్" అని శెలవిచ్చినారు. అనగా ఏబది అక్షరములచేత శబ్ద విస్తీర్ణమైన ప్రపంచము పుట్టినది. ఇందుకు కారణము ప్రణవాక్షరమని శ్రుతులు నిర్ణయించినవి. ఆ ప్రణవమును ఎరుక నిర్ణయమని తెలుసుకోమని ఈ కందార్థదర్పు ద్వారా స్పష్టముజేసి యున్నారు. అచల పరిపూర్ణ పరబయలును తెలుసుకొని ఆ పరబయలు నందు ఎరుకను నిల్పకుమని హితవు పల్కియున్నారు. ఏబది యక్షరముల చేత శబ్ద విస్తీరణ ప్రపంచ మెట్లయినది అనగా కర్మ నిర్మితమగు వేదంబులు జ్ఞాన నిర్మితములగు వేదాంతములు, వాచ్య, వాచ్యార్థ, లక్ష్యలక్ష్యార్థములతో ఊర్ధ్వ, అధోలోకంబులు నిర్ణయించి

యున్నారు. గనుక ఇది శబ్ద నిర్మిత ప్రపంచముగా యున్నందున పంచదశక్షరంబుల ప్రపంచమని నిర్ణయము.

శ్రుతి॥ ప్రణవోయీ పరంబ్రహ్మ, ప్రణవశ్చ పరస్మృతః" అనగా ఓంకార నిశ్చయముగా పరబ్రహ్మము. ప్రణవమే పరమాత్మయని చెప్పబడుచున్నది. గనుక వాచ్యమగు పరబ్రహ్మమునకు వాచకమగు ఓంకారము వేరు కానందున, ఓంకారము ఏబది యక్షరములకు మూలమని నిర్ణయము.

శ్రుతి॥ "యతోవాచ నివర్తంతే అప్రాప్య మనసాః" యను నిర్ణయానుసారము మనో వాక్కులు పరబయలును తెలియక వెనుకకు మరలినవి. కనుక వాచకమగు ఓంకారము, వాచ్యమగు బ్రహ్మము లేకపోవునని నిర్ణయము.

కావున అక్షరముల కూడికతో పదము యేర్పడును. కొన్ని పదముల కూడికతో వాక్యము లేర్పడును. ఈ వాక్యముల సమూహము వలన భావముతో కూడిన వాఙ్మయములు, వేదములు, వేదాంగములు, పురాణములు, ఇతిహాసములు కలిగినవి. ఇందులో వర్ణించబడిన దంతా ఎరుకనే. అవి భ్రాంతిని ఎక్కువ జేయునేగాని తగ్గించవు. "భ్రాంతి రహితమే జన్మరాహిత్యము" కనుక వాగ్వ్యాపారమంతము నిష్ప్రయోజనము నిరర్ధకము.

**ఏతత్సర్వార్థగ్సర్వం గురువాక్యేనబోధ్యతే**
**ఏతచ్ఛ్రవణమాత్రేణ సర్వశ్రమవినశ్యతి** ॥౬౫॥

పరమార్థమునకు సంబంధించిన సర్వము గురు వాక్యము చేత సుబోధితమగును, తెలియును. దీనిని విన్నంత మాత్రముననే అన్ని శ్రమలు తొలగును.

**వివరములు :**

**1. ఏతత్సర్వార్థగ్ సర్వం గురువాక్యేన బోధ్యతే :** అనగా ఆ పరమార్థమునకు సంబంధించిన సర్వము అని అర్థము. పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియుటయే సర్వ పరమార్థము గురు వాక్యేనబోధ్యతే అనగా ఆ పరమార్థ సర్వము గురువాక్యము చేతనే తెలియ బడునని అర్థము. ఆ పరిపూర్ణపరబ్రహ్మమును గురు ముఖతఃనే తెలుసుకొనవలసి యుండును. ఎందుకనగా ప్రత్యక్షముగా జీవ జగత్తులు తెలియబడుచున్నవి. వీని సృష్టిస్థితిలయముల కాధారమగు సగుణ నిర్గుణరూపమగు బ్రహ్మమును గూడ అనుమాన ప్రమాణములచే నూహించి, అతీంద్రియమగు బుద్ధిచే గ్రహించ వచ్చును. మనోవాక్కుల కందని, నిరపేక్షమైనది, నిష్ప్రతి యోగికమైనది, శుద్ధ నిర్గుణమైనది, ఆత్మాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియజేయుటయే వేదముల ప్రధాన ఆశయమై యున్నది. అట్లే పరిపూర్ణ భావమును బోధించుటకు పూర్ణగురువు అవసరము **"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథ కోటి భిః"** అనగా పరిపూర్ణపరబ్రహ్మము గురు వాక్యము చేతనే తెలియబడవలె గాని కోటి గ్రంథముల చేత తెలియబడదు.

మొదట పరిపూర్ణపరబ్రహ్మమును, లేనెరుక నెరిగి యెరుకను మానుట వల్ల జన్మరాహిత్య రూపమోక్షమును పొందుటయే సర్వపరమార్థమును తెలియుట. "ప్రాప్యతే తత్ప్రసాదతః" అనగా గురుని అనుగ్రహము చేతనే తెలియబడుచున్నది.

శాస్త్రముల నధ్యాయము జేసి శాస్త్ర పాండిత్యము గడించినంత మాత్రమున రక్షణ అనగా జన్మరాహిత్యము పొందుటకు వీలు లేదు. "వాగ్వైఖరీ, శబ్దఝరీ, శాస్త్రవాఖ్యానకౌశలం" మాత్ర మబ్బగలవు. ఇట్టి పాండిత్యమువలన ధన కీర్తి ప్రతిష్ఠలు మాత్రమే పొందగలరు. ఇవన్నీ భుక్తికే గాని ముక్తి కేమాత్రము పనికి రావని సురేశ్వరాచార్యులవారు శెలవిచ్చియున్నారు. "నాయ మాత్మప్రవచనేన లభ్యోనమేధయా, నబహుశ్రుతేన" అంటూ కాఠకశ్రుతి ఘోషించుచున్నది. ప్రవచనములు ఉపన్యాసములు, శ్రుతుల అధ్యయనము వలన ఆత్మోపలబ్ధికాజాలదు. ఇంతకు ఈ ఆత్మ స్వరూప జ్ఞానము వలన తానెవరో తెలుసుకోగలడు. జన్మరాహిత్యము సిద్ధించవలయు నన్న తనకు మూలమైన వస్తువేది? దేని రహితమందు జన్మరాహిత్యము సిద్ధించునో, గురుముఖతః వస్తునిశ్చయ రూపకము తెలుసుకొనవలసియుండును. శాస్త్రములు కేవలము వీటిని సూచన ప్రాయముగానే తెలియుజేయును. వస్తు నిశ్చయము, విపులంగా జెప్పజాలవు. కావున పూర్ణ సద్గురువులనాశ్రయించి, వారి కృపకు పాత్రులై ఉపదేశము పొంది, గురూపదిష్టమార్గమున పయనించి కృతార్థులు కావలసినదే అని శాస్త్రములు హెచ్చరించుచున్నవి. "**గురువులేని విద్య కూడ దెవ్వరికైన కూలికైన తమ్మి కూలికైన**" అనీ గురువులేని విద్య గుడ్డి విద్య యని నానుడి.

**2. ఏతచ్ఛ్రవణ మాత్రేణ సర్వశ్రమవినశ్యతి :** ఈ విధముగా వినినంత మాత్రముననే సర్వశ్రమలు అనగా జన్మ జన్మల నుండి వస్తున్న పుణ్య పాపముల కర్మ ఫలములైన సంచిత ప్రారబ్ద ఫలములు ననుభవించుశ్రమ యంతయు నశించును. అంతే గాక ఆగామిలేకుండ జేసుకొని పునః పునః జన్మలు కలుగకుండ జేయును. పూర్వ జన్మ సంస్కారములవల్ల సంచర ప్రతి సంచరపద్ధతిలో 'పునరపి జననం పునరపిమరణం' అనే న్యాయంగా ఈ జన్మ పరంపరలు కలుగుటయే సర్వశ్రమలు. ఈ సర్వశ్రమలు పరిపూర్ణబోధ వలన మరియు ఈ సర్వసార పూర్ణోపనిషత్ వినుటవల్ల మరియు పరిపూర్ణమును కనుటవల్ల స్వస్వరూపజ్ఞానమే గాక పరిపూర్ణ పరబ్రహ్మను తెలుసుకొని, ఎరుక భ్రాంతిని వదలిన సర్వశ్రమలు జనన మరణములనే శ్రమలు నశించునని ఈ శ్లోకము జెప్పుచున్నది.

శ్లో॥ శాస్త్ర జ్ఞానం బహుక్లేశం బుద్ధే చలన కారణం ఉపదేశాద్ధరేర్బుధ్వారమతే సర్వకర్మశు॥

తా॥ శాస్త్ర పఠనము వల్ల యేర్పడిన జ్ఞానము వలన కడతేరుట కష్టము. ఇతమిద్ధమను నిశ్చయజ్ఞానము బుద్ధికి కలుగుక పోగా సంశయాత్మకమైన మనస్సు డోలాయమానమై దుఃఖ కారణమగును. కనుక గురూపదేశము పొంది తద్వారా వస్తు నిశ్చయ జ్ఞానముతో సకల కర్మలు చేయుచు చేయనివాడై కృతార్థుడు కావలెను. గురూపదేశము ద్వారా ఈ సంత్సంఘ సభ్యులందరిని తరింపజేయుటకు పూనుకొని కృషిచేయుచున్న సద్గురువులకు శతకోటిదండ ప్రణామములు.

**బ్రాహ్మణోక్షత్రియో వైశ్య శూద్రశ్చండాల పుల్కసాః**
**తేషాం నవిద్యతేజన్మ ఇతివేదాంత నిశ్చితమ్.** ॥౬౬॥

దీనిని వినిన బ్రాహ్మణులు, క్షత్రియులు వైశ్యులు, శూద్రులు చండాల పుల్కసులకు తిరిగి జన్మ యుండదని వేదములందు నిశ్చయముగా జెప్పబడినది.

**వివరములు :**

**1.** బ్రాహ్మణోక్షత్రియో వైశ్య శూద్రశ్చండాల పుల్కసాః : వేదములందు.

"బ్రాహ్మణోఽస్యముఖమాసీత్। బాహూరాజన్యః కృతః ఊరూతదస్యయద్వైశ్యః పద్భ్యాగ్ం శుద్రో అజాయత" అనగా వేదపురుషుని అనగా సర్వేశ్వరుని ముఖము నుండి బ్రాహ్మణుడు, వక్షస్థలము నుండి క్షత్రియుడు, ఊరువుల నుండి వైశ్యుడు, పాదములనుండి శూద్రుడు బుట్టెను. ఈ శ్రుతి విరాట్ పురుషుని గురించి వర్ణనచేసినది.

మనుస్మృతిలో బా॥ లోకానాంతు వివృధ్యర్థం ముఖపాదోరూపాదతః॥ బ్రాహ్మణంక్షత్రయం వైశ్యం శూద్రంచ నివర్తయత్॥ అనగా లోకాభివృద్ధి కోరిన వాడై బ్రహ్మ తనముఖము బాహువు ఊరువు, పాదములనుండి వరుసగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను సృజించెను. బ్రహ్మ తన ముఖాదుల నుండి బ్రహ్మణులను పుట్టించెననిచెప్పినచో నాయాస్థానముల నుండి పుట్టిన వారందరు అట్టి స్వభావము కలిగి యుండవలెను. అట్లు కనిపించుట లేదు. బ్రహ్మజ్ఞానము, తపస్సు, యుద్ధమందు శూరశౌర్యములు, కృషిగోరక్షకులు, సేవకావృత్తులు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదు లందు పై జెప్పిన నాల్గు గుణములు (వృత్తులు) కనుపించుటచే గుణములనను సరించియే జాతి యొక్క నిజస్వరూపమని యెట్టివారికైనను గోచరించును.

శ్లో॥ శూద్రో బ్రహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతాం।
క్షత్రియా జ్ఞాతమేవంతు విద్యాద్వై శ్యాత్తథైవచ॥

అనగా సంస్కారములచే శూద్రుడు బ్రహ్మత్వము నొందును. సంస్కారరాహిత్యముచే బ్రాహ్మణుడు శూద్రత్వము పొందును. ఇట్లే క్షత్రియ వైశ్యులు అని గ్రహించవలయును. గుణము చేతనే జాతి యను సిద్ధాంతమైనచో నాలుగు జాతులకు నాలుగు ధర్మములు యేల ఏర్పడవలయును.

1. వేద శాస్త్రములను చదివించుట, తాము, చదువుట యజ్ఞములు చేయించుట, దానమిచ్చుటయు దానము గ్రహించుటయు ఈ ఆరు కర్మలను బ్రాహ్మణులకై ఏర్పరచబడెను.

2. ప్రజారక్షణయు, దానము, యాగముచేయుట, వేదాధ్యయనము, విషయములందాసక్తి లేకుండుట క్షత్రియ ధర్మములుగా నియమించెను.

3. గోరక్షణ, యాగంబులు చేయుట, వేదాధ్యాయనము, నీటి మార్గమున భూ మార్గమున వ్యాపారము జేయుట వడ్డీ జీవనము, వ్యవసాయము వైశ్యుల జీవన విధానముగా నియమించెను.

4. బ్రాహ్మణ శూద్రులకు ఒకే ఒక ధర్మమును నియమించెను. పై మూడు వర్ణముల వారికి అసూయ లేక సేవ జేయుట.

ఈ నాలుగు గుణములను నిరూపించుటచే గుణములచే జాతి గలదని చెప్పడానికి ఆటంకమేమియులేదు. సర్వజనులలోను ఈ నాలుగు గుణములు గలవారుండుటయే దానికి తార్కాణము.

**చండాలుడు :** శూద్రులలో ఒక తెగకు చెందినవాడు. మాలవాడు శూద్రునికి బ్రాహ్మణి యందు పుట్టినవాడు. క్రూరుడు, దుష్టుడు.

**పుల్కసుడు :** సంకరజాతివాడు, మాలవాడు, అధముడు.

**2. తేషాం నవిద్యతే ఇతి వేదాంత నిశ్చితమ్ :** ఈ సర్వసారపూర్ణోపనిషత్తునందు పరిపూర్ణమంటే ఏమిటి, అఖండ జ్ఞాన స్వరూపమైన లేనెరుకను క్షుణ్ణముగా వివరించి

జెప్పబడినది. వీటిని తెలియుటకు దృష్టద్రాష్టాంతము లివ్వబడినవి. అంతేగాక ఎరుకను వదలిఉండు విధానము పొందు పరచబడియున్నది. అంతేగాక షడూర్ములలో శోకమోహాములు, మనోధర్మములు చెప్పబడినవి. అట్టి మనోరూపమగు వ్యష్టి అంతఃకరణము, దాని కత్యంత మూలమగు పరాయెరుక యున్ను పరిపూర్ణ పరబ్రహ్మమందు లేనేలేదని ఆరూఢ పరుచుకొన్నరాజయోగి ఎల్లప్పుడు, ఎట్టి పరిస్థి తులలోను అంతఃకరణ స్థిమితమును కోల్పోడు. పారమార్థికముగా మానవుడు తన జీవితములో ఆశించతగినది మరొకటుండదు. ఈ మార్గమున నున్నవారికి ఈ లోకములో సిద్ధించగల ఉత్తమ ఫలము. అట్టి శాంతి సౌఖ్యము పొందుటయేగాక అతని వల్ల లోకమునకు శ్రేయస్సు చేకూరుతుంది. ఎట్లనగా అతడే నిజమగు స్వార్థరహితుడు. స్వ+అర్థము= స్వార్థము. తన యొక్క వస్తువు అనగా "నేను" అనువస్తువు నందు సంపూర్ణముగా సమస్తాభిమానములను వదిలినవాడు. ఈ నేననే వస్తువు వ్యష్టియందు ప్రత్యగాత్మగాను, సమష్టియందు పరమాత్మగానుయున్నది. కనుక ప్రత్యగ్బ్రహ్మైక్యరూపమగు అఖండపు టెరుకయనె వస్తువే స్వార్థము. పరిపూర్ణపరబ్రహ్మమందు యీ "స్వార్థ" సార్థకనామధేయమగు అఖండ యెరుక లేనేలేదని భావం ధృఢం అయితేనే గాని వ్యష్టిరూపమగు స్వార్థము పూర్తిగా పోనేపోదు. "ఆత్మనస్తుకామాయ సర్వం ప్రియం భవతి" అని శ్రుతి చెప్పుచున్నది. కనుక విశ్వమానవకళ్యాణము కొరకు స్వార్థరహిత కర్మజరుగవలెనంటే పరిపూర్ణబోధ యందు ఆరూఢత సాధించిన రాజయోగి వలననే కాగలదు. మరియు జీనన మరణ రహిత రూపమగు పరమ పురుషార్థమును మాత్రమే అతడు సాధించగలడు. జన్మ కారణమగు వస్తువును వస్తుతః గుర్తెరిగి దాని రహితము జేసుకొని జన్మరాహిత్యము పొందు విధానము పూర్ణబోధ స్థితి యందే గలదు. తత్ఫలితము ఆశించిన వారికి ఎప్పటికైన ఈ పరిపూర్ణబోధ అవలంభించవలసి యున్నది. ఈ విధానమంతయు ఈ సర్వసార పూర్ణోపనిషత్తు నందు విపులముగా వివరించబడినది. కావున బ్రాహ్మణులైన, క్షత్రియులైన వైశ్యులైన శూద్రులైన, చండాలురైన మరియెవరైన ఈ బోధమర్మధర్మములు గురుముఖతః ఆరూఢపరుచుకొన్నవారికి తప్పక జన్మరాహిత్యము కలుగునని, తిరిగి జన్మలేకుండునని వేదాంతములలో నిశ్చయముగా జెప్పబడినది. చదువరులకు గురుముఖతః ఆరూఢత సాధించుటకు వలయు శక్తిసామర్థ్యములు మద్గురువు ప్రసాదింతురుగాక!

**ఇతి వేదాంతసిద్ధాంతసారం వేదాంతడిండిమః**
**మృతంజన్మ ద్వయంనాస్తి భయభ్రాంతీ వినశ్యతి** ॥౬౨॥

ఈ సర్వసారపూర్ణోపనిషత్తునందు చెప్పబడినదంతా వేదములందు వేదాంతములందు సిద్ధాంతము చేయబడిన సారము మరియు వేదాంతములందు నిశ్చయముగా ఢంకావాయించి జెప్పబడినది. దీనిని విన్న వారికి రెండురూపములు గానున్న జనన మరణము లుండవు. భయము భ్రాంతి కూడ నశించును భ్రాంతిరహితమే మోక్షము అదే తిరిగి జన్మకురాని పద్ధతి.

**వివరములు**

**1. ఇతివేదాంత సిద్ధాంతసారం :** ఈ ఉపనిషత్తునందు జెప్పబడినదంత వేదములలో సిద్ధాంతము చేయబడిన సారమని అర్థము. పరిపూర్ణ బోధ ఒక సిద్ధాంతము. ఈ సిద్ధాంతము సార్వజనీనమైనది. అనగా విశ్వమంతట ఏ ప్రదేశములోనైన, ఏ కాలములోనైన, ఎట్టి

పరిస్థితులలోనైన, శోధించి, తర్కించి విశ్లేషణ జేసిన దాని ఫలితము ఏక రూపముగా సత్యమై నిత్యమై యుండును. ఈ సిద్ధాంతము విశ్వమానవ సౌభాతృత్వము, ఐహికాముష్మిక పురోభివృద్ధి, అన్యోన్యసహకారము పెంపొందించునదియేగాక జనన మరణ భ్రాంతిని తొలగించును. కావున యిట్టి మహోత్కృష్టమైన ఆశయ సిద్ధిని ప్రచారములోకి తెచ్చుటయే వేదముల యొక్క ముఖ్యాశయము. ఎందుకనగా **"వేదోఖిలో ధర్మమూలం"** అనీ **"సర్వవేదాంత్రప్రసిద్ధ్యతి"** అని చెప్పబడుతుంది. ఎందుకనగా వేదం ఒక వ్యక్తిచే వ్రాయబడినది గాదు. అనేక మంది మహర్ష్యాదులు వారి వారి అనుభవాలను, పరిశీలనా ఫలితాలను లేక విమర్శనా ఫలితాలను వెల్లడించుటలో వివిధత్వము గానవస్తున్నది. కనుక శూన్యవాదముతో సహ పరిపూర్ణబోధ సంబంధించిన అన్ని సూత్రాలు వేదములలో గానవస్తాయి. పరిపూర్ణభావము వేదములెంత సనాతనమో అంతే సనాతమే. ఈ సిద్ధాంతము యొక్క మూల బీజములు వేదములందు, వేదశిరస్సులనబడే ఉపనిషత్తులందు, ముఖ్యంగా అనన్తోపనిషత్, మరియు ఈ సర్వసారపూర్ణోపనిషత్ నందు విపులముగా జెప్పబడినది. ఈ ఉపనిషత్తు పేరులోనే "సర్వసారపూర్ణోపనిషత్" అనగా అన్ని ఉపనిషత్తులసారముతో సహా పూర్ణబోధకు సంబంధించిన విషయములు యిందు సిద్ధాంతము చేయుబడినది. కనుక యిది వేదాంత సిద్ధాంతసారము. ఈ ఉపనిషత్తు అన్ని ఉపనిషత్తుల సర్వస్వమనిన అతిశయోక్తిగాదు.

**2. మృతంజన్మద్వయం నాస్తి :** ఈ సర్వసారపూర్ణోపనిషత్తును విన్నవారికి ద్వంద్వ రూపములో నున్న జననమరణములు లేవని ఫలశ్రుతి జెప్పబడినది. జనన మరణములంటే ఏమిటో తెలుసుకొందము.

జీవోపాధులందు సర్వేంద్రియముల ద్వారా సర్వ వ్యవహారములు చేయించు శక్తికి ప్రాణశక్తి యనిపేరు. ఇదే జీవులకు జన్మమృత్యుజరావ్యాధులను పుట్టించును. శక్తియుత్పన్నము కావలయునన్నచో చలనముండక తప్పదు, చలనలక్షణము గలది ప్రాణము. చలనముంటేగాని ప్రాణము తెలియబడదు. కనుక ప్రాణ చలనములకు అవినాభావ సంబంధము గలదు. శరీర మందు ప్రాణము ప్రవేశించుటతోడనే శరీరత్వమునకు చలనత్వమేర్పడును. సజీవమనబడును. శరీరమును సంపూర్ణముగా శాశ్వతముగా ప్రాణము విడిచిపోవుట మరణం.

ఈ శరీర యంత్రము కొంత కాలమైన తర్వాత శిథిలమగుటయు, ఆ శరీరమును ప్రాణము వదలి పోవుటయు తప్పదు. కనుకనే **"జాతస్యహి ధ్రువోమృత్యుః ధ్రువం జన్మమృతస్యచ"** అనగా పుట్టినది చచ్చుటయు, చచ్చినది పుట్టుటయు తప్పదు అంటే చచ్చినదేదో అదే తిరిగి పుట్టుచున్నది. పుట్టేది చచ్చేది ప్రాణమే. కనుక దీనికి నాశనము తేలికగా సంభవించదు. కాని పరిపూర్ణబోధవలన యిది కూడ నాశనమగునని అచల ఋషులు సిద్ధాంతము జేసియున్నారు.

అమృత మృత్యువులే ప్రాణ శరీరములు లేక దేహిదేహములు అయి ప్రసరించేది ఆ పరమాత్మ స్వరూపమే. అదే ఆటాడి ఆడకుండును... ఆటాడినమేని బొమ్మ ఆటాడకనే ఆటాడు"... నతడేరాకర్తా! అన్నిటికి యీ అచల మకర్తా" అని కందార్థ దర్పు (52) లో జెప్పినారు శ్రీకృష్ణదేశికేంద్రుల వారు. ఈ ఆట శాశ్వతముగా ముగింపు అయినపుడే కేవల జన్మరాహిత్యము. ఈ అమృతమృత్యువులు ద్వంద్వ రూపములు చెందు వస్తువు యొక్క

రహిత స్థితి పరిపూర్ణ బోధవలననే చేకూరును. అట్టి బోధను క్షుణ్ణంగా ఈ వుపనిషత్తు నందు వివరించబడినది. ఇది వేదాంతములందు సిద్ధాంతము జేయబడినది. మరియు వేదములందు ఢంకా బజాయించి చెప్పినట్లుగా జెప్పబడినది. అనగా నిశ్చయము జేయబడినది. దానిని తెలసిన జనన మరణములు లేకుండ పోవునని ఈ ఉపనిషత్ నొక్కి చెప్పుచున్నది.

**3. భయ భ్రాంతి వినశ్యతి :** అనగా భయము భ్రాంతులు నాశనమగునని అర్ధము. ఆకాశార్ధములో వృష్టి నాల్గవ భాగము పృథ్వీభూతంలో చేరుట వల్ల అంతఃకరణము నందు భయము కలుగునని సాంఖ్యము జెప్పుచున్నది.

**"ద్వితీయాద్వైభయం భవతి"** అని ఉపనిషత్తులు సిద్ధాంతీకరించినవి. అనగా రెండవదంటు ఒకటి వుంటే భయము పుట్టుక వస్తుందని గొప్పగా జెప్పబడినది. తాను తప్ప రెండవది లేక పోతే ఇక దేనిని గురించి భయము కలుగును? కలుగదు. "ఏకం అనేకం భవతి" మొదట ఏకంగా నున్నది అనేకముగా మారినది. కనుక **ఆ అద్వితీయ ఏక బ్రహ్మమే భయమునకు మూల కారణమని చెప్పక తప్పదు.** కనుక ఏకానేకములుగా నుండే ఈ కారణ బ్రహ్మమే ఒకప్పుడు అభయ రూపముగా మరొకప్పుడు భయరూపమగుచు సాపేక్షికమైనది, ద్వయ దోషితమగుచున్నది. ఏకముగానున్నది పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే.

ఈ సర్వసారపూర్ణోపనిషత్తు ఆగామి, సంచిత ప్రారబ్ధములను త్రివిధకర్మ ఫలములు లేకుండచేయును. అంటే తన్ను లేకుండ చేయునది పరిపూర్ణ బోధయే. అందారూఢత సాధించినవానికి ఏలాంటి భయముండదు. భయము లేనిచో భ్రాంతి యుండదు. భ్రాంతిని గూర్చి తెలుసుకొందము.

భ్రాంతి యనగా యధార్థముగా వున్న వస్తువును అన్యవస్తువుగా గ్రహించుట భ్రాంతి. భ్రాంతి "భ్రం" అను ధాతువు నుండి వ్యుత్పత్తియైనది భ్రం అనగా తిరుగుట. గిర గిర తిరుగు వాడు వస్తువును వున్నదున్నట్లుగా గ్రహించడు. అట్లే మనోవేగముతో అనంత సంకల్పముతో తిరిగుటలో పూర్వ దృష్టవస్తు సంస్కారబలముచే అన్యధా గ్రహణము కలుగుచుండును. భ్రం అనగా చలనమే. దీనికి వ్యతిరేకార్థము (ప్రమ) అచలము. కనుక అచలపరిపూర్ణపరబ్రహ్మమునకు యెట్టి చలనము లేదన్నమాట. కనుక పరిపూర్ణపరబ్రహ్మమొక్కటియే భ్రాంతి రహిత స్థానము. **"సోఽకామయత బహుస్యాంప్రజాయేయేతి"** అను సృష్టిసంకల్పము కల్గిన వస్తు వేదో అదే జగత్కారణము. కనుక జీవేశ్వర జగత్తంత చలనమే భ్రమణమే భ్రాంతియే. ఈ భ్రాంతి ఎరుకకే కలిగినది. నేనే బ్రహ్మననుకొన్న భ్రాంతి యుడుగవలెను. అప్పుడే జన్మరాహిత్యము. అప్పుడే భయము లేదు, భయము వల్ల కలిగే భ్రాంతి లేదు. భ్రాంతి వలన కలిగే సంశయము ఉడిగి "సంశయమె జన్మహేతువు, సంశయమెడబాసితేని చాలును కుశ్లో" అనినట్లు జన్మ లేకుండును.

**ఏతచ్ఛ్రవణ మాత్రేణ సర్వ సిద్ధికరం భవేత్**
**పరమే వ్యోమం ప్రతిష్ఠితమితి వేద ప్రతిష్ఠతి.** ॥౬౮॥

దీనిని అనగా ఈ సర్వసారపూర్ణోపనిషత్తును విన్నంత మాత్రమునే సర్వసిద్ధులు కలుగును. పరమాకాశమున (బ్రహ్మాభామున) వాని జీవితము సుప్రతిష్ఠితమగును. అనగా నిలిచియుండును. అఖండ జ్ఞాన స్వరూపుడై (ఎరుకై) నిలుచును అని వేదములందు

ప్రతిపాదించబడినదని భావము.

**వివరములు :**

**1. ఏతచ్ఛ్రవణ మాత్రేణ :** ఈ సర్వసారోపనిషత్తునందు ఈశ్లోకము చివరిది. ఇది వరకు గల 67 శ్లోకములలో అఖండ ఎరుక జ్ఞాన స్వరూపమును, పరిపూర్ణ భావమును ప్రచురపరచబడినది. అంతేగాక "రోచనార్థా ఫలశ్రుతి" అనగా రుచి పుట్టించుటకు ఫలశ్రుతులు జెప్పుట జరుగుచున్నది. భక్తి కథలు పురాణములు, మతగ్రంథముల చివర ఫలశ్రుతి జెప్పి ఆ గ్రంథము చదివిన, వినిన, వెలయ పఠించిన, మోక్షము లభించునని పొందు పరిచియుండును. ఇట్టి ఫలశ్రుతుల వల్ల వారిలో నమ్మకము కలిగి కొంత మనశ్శాంతి చేకూరుననుట వాస్తవమేగాని మరియు సాలోక్యాది పంచ మోక్షములు లభించిన లభించ వచ్చు నేమోగాని జన్మ రాహిత్యము పొందలేరు. ఈ ఉనిషత్తు నందలి పరిపూర్ణ భావము కేవలం సాంప్రదాయక పూర్ణగురువులను పొంది గురుముఖంగా విని ఆరూఢత చెందినపుడే తిరిగి జన్మరాకుండ యగునునని యిందులోని ఫలశ్రుతి యొక్క అర్థము గ్రహించ వలసియుండును. **"గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంధకోటిభిః"** ఆ పరిపూర్ణపరబ్రహ్మ గురువాక్యము చేతనే తెలియబడవలెను. కోటి గ్రంథములచే గూడ తెలియబడదు. అట్లని ఈ ఉపనిషత్తు లెందుకు అనెడి అనుమానము రావచ్చును వీటివల్ల గురుడు జెప్పి చూయించిన ఆ పరిపూర్ణపరబ్రహ్మము నందు ఆరూఢత చెందుటకు తోడ్పడును. చెప్పిన విషయములందు నమ్మక మేర్పడుటకు మార్గదర్శకములగునని మరువరాదు, అట్లు వినిన వారికి సర్వసిద్ధులు కలుగునని జెప్పిన దానిని విచారింతము.

**2. సర్వసిద్ధికరంభవేత్ :** అన్ని సిద్ధులు కలుగును అని అర్థము. సిద్ధియనగా ఈడేరుట, వాంఛిత ప్రాప్తి. మానవ జన్మ అతి దుర్లభమము. అట్టి దుర్లభమైన మానవ జన్మకు వచ్చి, జన్మ సాఫల్యమైన జన్మరాహిత్యమును ఈడేరుటకు ప్రయత్నించక అష్టసిద్ధులను పొందుట వల్ల కలిగే క్షణిక సుఖముల కాశించిన, ఈ మానవ జన్మను సార్థకము జేసుకొన్నట్లుగాదు. ఐహికాముష్మిక సుఖములు అష్టసిద్ధుల వల్ల కలుగును. వాటివల్ల పేరుప్రతిష్ఠలు పెరిగి అహం అధికమై జన్మరాహిత్యమునకు చేరువగుటకు బదులు దూరమగుట జరుగును. ఇచట సర్వసిద్ధికరం అనుటలో జన్మరాహిత్యమును పొందుటయే యని అర్థము గ్రహించవలసి యుండును.

ఈ సర్వసారపూర్ణోపనిషత్తు యొక్క లక్ష్యము అణిమ, గరిమ, మహిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము చివరిది వశత్వము అను అష్టసిద్ధులను పొందుటకాదు. పరిపూర్ణ గురువుల ద్వారా శిష్యప్రశిష్యులకు పరిపూర్ణబోధను తెలిపి వారికి తిరిగి జన్మలేకుండ జేయుటయే సర్వ సిద్ధి. ఎందుకనగా పరిపూర్ణపరబ్రహ్మము సర్వజ్ఞత్వ లక్షణములు గల అధిష్ఠాన చేతన బ్రహ్మము (అఖండ యెరుక) కూడ తెలుసుకొనజాలదు. ఆ పరిపూర్ణమందు యెరుకలేదు. కనుక మనోవాక్కులకు తెలియరాని పరిపూర్ణపరబ్రహ్మమును లక్ష్యలక్ష్యార్థముగా తెలియపరుచుట ఈ ఉపనిషత్తు యొక్క పరమ లక్ష్యము. జన్మ రాహిత్యము పొందుటయే "సర్వసిద్ధికరం భవేత్". ఒక్కమాటలో జెప్పాలంటే ఈ వుపనిషత్తులలోని భావము దృఢపరుచుకొన్న వానికి జనసాఫల్యమగు జన్మరాహిత్యము కలుగునని ఈ శ్లోకము యొక్క అంతరార్థము.

**3. పరమేవ్యోమం ప్రతిష్ఠితమ్ :** వ్యోమము అనగా ఆకాశము, పరమైనది అనగా శ్రేష్ఠమైనది లేక మీరినది. ఆకాశమునకు పరమైనది ఆత్మ. పరిపూర్ణపరబ్రహ్మమును అవలోకనము జేయవలయునన్న గురుగీతలో జెప్పినట్లు "స్వయం బ్రహ్మమయోభూత్వా తత్పరం చావలోకయేత్" యను న్యాయముగా తాను బ్రహ్మ స్వరూపుడు కావలయును. అనగా సాధకుడు తాను జీవభావమును వదలి ఆత్మ భావమున నుండవలయును. అట్లుండుటయే సాధకునికి అఖండఎరుక స్వరూపము తెలిసి వచ్చును. అంటే తనను తానెరిగినవాడైనాడు. పరిపూర్ణపరబ్రహ్మము తనను మీరినది. కనుక తనకంటే అన్యముగా నున్న ఆపరిపూర్ణపరబ్రహ్మమును తెలియవలయునంటే నేను ఎరుక రూపమును వదలవలయును. మొదట తాను ఎరుకై నిలువనిదే పరిపూర్ణపరబ్రహ్మము తెలియరాదు. కనుక ఉపనిషత్తువల్ల సాధకుడు జీవభావము వదలి బ్రహ్మ భావములో వుండునట్లు జేయును. అట్లు జేయుటయే **"పరమవ్యోమ ప్రతితిష్ఠితమ్"**గా గుర్తించవలయును. అట్లు ఎరుకరూపుడై నిలుచుటేగాదు. ఆ తర్వాత తాను బ్రహ్మనైతిని యనె తొలి భ్రాంతి వదలవలయును. అప్పుడే పరిపూర్ణపరబ్రహ్మము స్వతసిద్ధము.

**ఇతి వేద ప్రతిష్ఠతి :** ఈ భావమును వేదములందు ప్రతిష్ఠింపబడియున్నదనుట నిశ్చయము. ముఖ్యముగా అనంతోపనిషత్తునందు మరియు ఈ వుపనిషత్తు నందు పరిపూర్ణపరబ్రహ్మ భావమును ప్రచురపరచబడినది. కావున పరిపూర్ణ బోధను కోరువారు ఈ వేదశిరస్సులనబడే ఉపనిషత్తులను చదివి గురుసేవ గురునిష్ఠ, గురుభక్తి కల్గియుండి యిందు వివరించబడిన విషయములను గురు వాక్యముతో సరి చూచుకొని, సదా మననం జేసి, నిధిగా దాచుకొని, త్రికరణ శుద్ధిగా కర్తృత్వరహిత కర్మాచరణగా కార్యములొనరించుచు నేను లేసనే భావమును దృఢ పరుచుకొని జన్మరాహిత్యము పొందుదురు గాక! నేను అనే భ్రాంతి రహితమైనచో పరిపూర్ణం స్వతసిద్ధం. ఈ భావము వేదప్రతిష్ఠితమై యున్నది.

శాంతి పాఠః

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమే వావశిష్యతే

ఓం శాంతిః శాంతిః శాంతిః

మహబూబ్‌నగరము జిల్లా, నవాబుపేట మండలం ఇప్పటూరు గ్రామ వాస్తవ్యులు కుసువిణశెట్టి (జేంద్ర) వంశజులు (సిద్ధాంతముని) మెణుసు గోత్రికుడు మంతచిన్నమ్మ, మంతఎల్లప్ప పుణ్యదంపతుల ద్వితీయ పుత్రుడు శ్రీ మదచలఋషి ప్రబోధానంద వెంకటార్య దేశిక ప్రభువుల ప్రియశిష్యుడైన మంత చిన్నయ్య చే 68 శ్లోకములకు అనువాదము, మరియు వివరములు కూర్పుచేయించబడిన సర్వసారపూర్ణోపనిషత్తు సమాప్తము.

శ్లో॥ పరిపూర్ణానంద సద్గురుం వర్య పాదకమల సేవకం ।
ప్రబోధానంద వెంకటార్య సద్గురుం భజామ్యహం ॥

**ఇతి సర్వం గురు చరణారవిందార్పణమస్తు.**

# శ్రీ రాజయోగి పరబ్రహ్మణేనమః

"కట్టులోనే వుండి నారండీ" (తత్వము)

రచన : కె. సుబ్బరాయుడు. (హిందూపురం)

పల్లవి : కట్టులోనే వుండినారండీ – అజ్ఞానపరులు – కట్టు [illegible]
తెలవుగనబోకా.

అను పల్లవి : కట్టులోనే వుండినారని – బట్టబయలు వునికి తెలిపిన "ఆత్మనో[illegible]
నకించని" యని ఆత్మయేమా కచలముందురు

||కట్టు||

**చరణములు :**

) "అవాగ్మానస గోచరం" బనిరీ – ఆ పరబ్రహ్మం – బందునినిరీ [illegible]
మనసు కందెడిదెట్లు బ్రహ్మము? – మనవి చేయుండనిన పలుకకే [illegible]
కూడగట్టుక – కొట్టుటకు సంసిద్ధులగుదురు

||కట్టు||

) మూడుపాదము లమృతంబనిరీ – ఆ పరబ్రహ్మం – ఒక్క పాదము [illegible]
కొంతసత్యము కొంత మిథ్యగ – అంతటంతట పరిమితంబై [illegible] బ్రహ్మ
బచల మెట్లన – వున్నశృతికి భంగమౌనని

||కట్టు||

) దీక్షితాచల సిద్ధాంత మున్నాదీ – సనాతనంబిది – దీనివిన్నను జన్మవేదండి
సర్వ భ్రాంతుల కునికియైన – సాక్షి బ్రహ్మము కవలిబోధా సత్యమిదియని [illegible]
జేసిన – చాలు మా కిది పొమ్మటందురు

||కట్టు||

) సత్య మార్గము జనవిరోధంబూ – అసత్యమార్గమె – సర్వజన సంపూజ్యమానంబూ
ఆవరణ మెరుకయని నిరా – వరణము పూర్ణమునుచూ
వున్న బయలున సున్న ఫెరుకని – ఉన్న సత్యము చెప్పనమ్మరు

||కట్టు||

) సికింద్రాపుర సీమయందునా – అనసూయనాథుడు – రాజయోగీ గురువ
రేణ్యుండూ
సాక్షి రహితంబైన బోధను – చాటి చెప్పెను వినుదురందను సుబ్బరాయుని [illegible]
వినకను – మబ్బులోనే యుండువారలు

||కట్టు||

ఓం

శ్రీ గురుభ్యోనమః



## గమనిక :

ఇది కథగాదు వేదవేదాంత సిద్ధాంత విచారణ. జనన మరణ వ్యథ మానుటకై ఆగమనిగమోపనిషత్సాగర మథితార్థము.

తర్క వితర్క పాండిత్య అభిమాన రహితులకు రత్నములు. ఇతరులకు రాళ్ళు. అందముగ ఘనులు మెచ్చెద। రెందుకు మెచ్చెదరు దీన్ని యితర జనంబుల్। చందురుడు వుదయమందిన। సింధువు రేగినట్లు। చెలగూనె చెర్లూ, కోనేర్లు నూతులు బావులేర్లూ।.

సర్వ

(శ

## కీర్తన

1. వందనంబులు జేతుగురువర్యా-ననుబ్రోవు-విమలానందమూర్తివి నీవేగదనయ
ఎందుజూచిన నీకు సరియిల - వేల్పులెవ్వరు లేరునాకిక-మందుడను నీ చర
సన్నిధి - యందు జేర్చు మానందభరిత ॥వ

2. ఘోరమగు సంసార సాగరమూ-దాటించుటకు నీభారమనీ - ధరిజే
వినుమూ-వేరు జేయకబ్రోవు నాకాధార మెవ్వరు లేరు ఇలలో-నేర మెం
రాకపోకల లేరు దెంపుము దేవాదేవా ॥

3. ఎక్కడెక్కడో యిలలోనావంటి-దీనులను - దయచె బ్రోచిన వనగ వినియుం
మిక్కిలి నాయందు కరుణ-నెక్కి మీదివ్యామృతము - గక్కున వెదజల్లి నన
గావు మా శ్రీ సద్గురేంద్రా ॥వ

4. యిట్టి జన్మము చాలుచాలయ్యా-యిక బుట్ట కుండ - గట్టిగా నన్నే
రావయ్యా-పట్టితినీ చరణకమలము-పట్టు విడవను-ఎట్టులైనను
గుట్టుదెల్పి-దరికి జెర్చుమ కుటిలదూర - గురువరేణ్య ॥వ

5. రాజయోగిని జేరి కదనయ్యా - ఇలలోన యీ మహరాజయోగము దెలిసి మీరయ
- యీ జగంబున బూర్ల లక్ష్మయ్య నేలకుండిన నెవరు దిక్కిక-ఓదయా సాగ
నీకృపా నేలు దుర్గయదేశికేంద్రా ॥వ

శ్రీ గురుభ్యోనమః

నిరాలంబోపనిషత్తు - తప్పు ఒప్పుల పట్టిక

సూచన:దయచేసి మొదట తప్పులు దిద్దుకొని చదువగలరని ప్రార్థన

| పుట సంఖ్య | | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ప్రస్తావన | 1 | 33 | నొక్క | నొక్కిచెప్పినారు |
| | 2 | 27 | ఉపని ద్రాజములు | ఉపనిషద్రాజములు |
| | 3 | 14 | ములు | మల్లు |
| | 3 | 22 | గూరుదార్థమ్ములు | గూఢార్థములు |
| 2 | | 33 | పదపశ్నుతీ | పదమశ్నుతే |
| 3 | | 10 | నివు | నీవు |
| 3 | | 18 | దోషిరహిత | దోషరహిత |
| 4 | | 27 | సర్వకాలలయందు | సర్వకాలాలయందు |
| 5 | | 13 | తగనిదికాదు | తగినది కాదు |
| 6 | | 14 | నిల్పకము | నిల్పకుము |
| 10 | | 05 | ఏకరూపరం | ఏకరూపం |
| 10 | | 11 | అపుడుతాను | అవుతావు |
| 12 | | 04 | గురుణచరణార | గురుచరణార విందార్పణమస్తు |
| 19 | | 35 | సతు | సత్తు |
| 22 | | 12 | నిరంత | నిరంతర |
| 26 | | 24 | క్షణంగా | క్షుణ్ణంగా |
| 28 | | 31 | కనకు | కనుక |
| 29 | | 8 | అవ్యక: | అవ్యక్త: |
| 39 | | 3 | పారమార్థిరంగా | పారమార్థికంగా |
| 39 | | 07 | కులముంటు | కులమంటూ |
| 39 | | 29 | జ్ఞప్తిలోని తెచ్చుకొనరాదు | జ్ఞప్తికి తెచ్చుకొనరాదు |
| 40 | | 11 | నేతదే | నేతడే |
| 40 | | 15 | వ్యాపారలము | వ్యాపారముల |
| 40 | | 34 | అంత:కరముతో | అంత:కరణముతో |
| 57 | | 26 | అందుదు | అందదు |
| 58 | | 19 | పరిత్యజింత | పరిత్యజించ |
| 58 | | 35 | విచారించము | విచారింతము |
| 59 | | 17 | కూడస్థుడు | కూటస్థుడు |
| 60 | | 3 | గ్రహించవలసి | గ్రహించవలసి |
| 60 | | 13 | వదులువలెను | వదులవలెను |
| 60 | | 14 | అభాసవహిత | అభాస సహిత |
| 61 | | 32 | సంచరినిచుచుండును | సంచరించుచుండును |
| 62 | | 5 | లేదునుట వల్ల | లేదనుటవల్ల |
| 65 | | 7 | కొనుకు | కొనకు |